## కర్నూలు డివిజన్

## నంద్యాల డివిజన్



## ఇతరములు



## తృతీయాధ్యాయము
## కర్నూలు జిల్లా వైష్ణవ క్షేత్రసాహిత్యము



## ఆదోని డివిజన్

## కర్నూలు డివిజన్

**ద్యాల డివిజన్**



**ంములు**

చతుర్థాధ్యాయము

## శ్రీవైష్ణవాలయ నిర్మాణాదిక పరమార్థము



పంచమాధ్యాయము

## వైష్ణవ క్షేత్ర సాహిత్యము - సామాజిక రసదృష్టులు

# కృతజ్ఞతాంజలి

నా యీ పరిశోధనకనుమతించిన శ్రీకృష్ణదేవరాయ విశ్వ విద్యాల యాధికారులకు – ఆంధ్రభారతి శాఖ అధ్యాపక వర్గమునకు –

పరిశోధనాంశమునకు ప్రణాళికను తయారు చేసి, చర్చలకు అవకాశమును కల్పించి, భక్తి వేదాంత సాహిత్యాది రంగములో గల సంశయములను నివృత్తి చేయుచు – నా సిద్ధాంత వ్యాసమును సకాలములో సంపూర్తి గావించుటకు సహకరించిన మేధావి డా॥ యమ్ ఖుద్దన్న గారికి–

నా సిద్ధాంత గ్రంథమును పరిశీలించి డాక్టరేట్ పట్టాను అర్హమైనదిగా ఆమోదించిన గురువర్యులు (గతములో ఓరియంటల్ కళాశాలలో అధ్యాపకులుగా 1969–73 సం॥ మధ్య) ఆచార్య సర్వోత్తమరావు గారికి, ప్రస్తుతము ద్రవిడ విశ్వవిద్యాలయము వైస్ – ఛాన్సలర్ రవ్వా శ్రీహరిగారికి, గుంటూరు నాగార్జునా విశ్వవిద్యాలయము ఆచార్యులు కృపాచారి గారికి, కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము అధ్యాపక వర్గమునకు –

డాక్టరేట్ పట్టాను ప్రదానము చేసి, సిద్ధాంత గ్రంథ ముద్రణకు నుమతించిన శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము వారికి–

కర్నూలు జిల్లా వైష్ణవక్షేత్ర సాహిత్య పరిశోధనాంశమును నా పరిశోధనకై, సూచించి, స్వీయగ్రంథాలయములోని గ్రంథములను పరిశీలనకై ఒసంగి, నన్ను ప్రోత్సహించుటయే గాక, తమ యమూల్యాభిప్రాయమును ప్రసాదించిన వైష్ణవాన్వయమణి, పరిశోధకరత్న మీదుమిక్కిలి సహృదయ బాంధవుడైన వైద్యం వేంకటేశ్వరాచార్యులు గారికి –

ఆలయ సాహిత్య కవిత్వమును ఇచ్చి సహకరించిన మా కవితా గురువు 'అవధాని భూషణ' అష్టావధాని మాచిరాజు శివరామరాజునకు, మిత్రులు దేవులపల్లి చెంచు సుబ్బయ్య మొ కవి పండిత వర్గమునకు –

ఆలయ పారమార్థిక విషయపరిజ్ఞానమును పరమానందముగా సూచించిన పండితులు, ఆధ్యాత్మోపన్యాసకులు శ్రీ జూలకంటి మల్లికార్జున రావు గారికి – ఆలయ సాహిత్య గ్రంథ సేకరణకై సహకరించిన బంధు, మిత్ర వర్గమునకు–

అడిగినదే తడవుగా తమ అభిప్రాయమొసగిన సహజ కవి పండితుడు, కర్ణాంధ్ర సంస్కృతాది భాషాపారీణుడైన గడియారం రామకృష్ణ శర్మగారికి –

కళాశాల పరిధినుండి పరిశోధన చేయుటకై అనుమతించి ప్రోత్సహించిన సహృదయులు ఎల్లగుంట్ల జూనియర్ కళాశాలాధ్యక్షులు శ్రీనివాసరెడ్డి గారికి – గ్రంథాలయ పత్రికా సాహిత్యమును సేకరించి యిచ్చిన కళాశాల గ్రంథాలయాధికారి మిత్రులు శ్రీ సాయిబాబా గారికి – నా డాక్టరేట్ అవార్డు వార్తకు స్పందించి, నా సంతోషములో పాలుపంచుకొని, అభినందించిన కళాశాల అధ్యాపక, అధ్యాపకేతర మిత్రులందరికి –

జన్మనిచ్చి, ఆంధ్ర సాహిత్యములోనికి దింపి, నా పరిశోధనకు ప్రత్యక్ష పరోక్ష రూపముగా ప్రోత్సహించిన తండ్రి కీ శే వైష్ణవ శేషయ్య గారికి – నాలోని అజ్ఞాతమైన కవితాబీజమును వెలికి దెచ్చి, అంకురింపజేసిన వాస్తు జ్యోతిష పౌరాణిక పండితులు మేనమామ శ్రీ సన్నిధి జనార్ధన స్వామిగారికి– సంస్కృత సాహిత్యములో సూచనలిచ్చిన గీర్వాణభాషోపన్యాసకులు హయగ్రీవాచారి గారికి, ప్రోత్సాహకులు మిత్రులు బి బి బి యస్ ప్రసాదు మొ మిత్ర వర్గమునకు–

గ్రంథముద్రణకు ఆర్థిక సహాయమును ప్రకటించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము – తిరుమల తిరుపతి దేవస్థానము వారికి –

నా క్షేత్ర పర్యటనలో ప్రేమాభిమానాలతో సహకరించి విషయ సేకరణలో తోడ్పడిన అహోబిల ప్రధానార్చకులు శ్రీ వేణుగోపాలాచార్యులు – కోవెలకుంట్ల వేణుగోపాలాచార్యులు – కీ॥శే॥ వేంకటగిరి వేంకట రమణయ్య గారు – ఆస్సురి సత్యనారాయణయ్య – డా శేషాచార్యులు (తురుమెళ్ల) మొ॥ ఆయా క్షేత్రార్చకులకు –

## హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు

పరిశోధనా సమయములో నాకు సమయము విశేషముగా కలిసివచ్చుటకు సహకరించిన మా శ్రీమతి శకుంతలకు – దేవాలయ పర్యటనకు సూచనలందించిన భాగవతం నరసయ్య, కేశవాచార్యులకు – ఆలయ చిత్రసేకరణకు సహకరించిన కుమారులు శ్రీధర్, విజయ మోహన్‌లకు –

ముద్రిత ప్రతికి కంప్యూటర్ సొగసులు తొడిగిన పుత్రుడు వైష్ణవ శ్రీనాథ్, చి॥ ఫిరోజ్, చి॥ రంగనాథ్‌లకు నా అమోఘాశీస్సులు

# మున్నుడి

వైష్ణవుడనుగా పుట్టిన నేను వైష్ణవాలయాలపై పరిశోధింప నెంచితిని సౌలభ్యము కొరకై కర్నూలు జిల్లా వైష్ణవాలయాలపై పరిశోధనము చేపట్టితిని అందులోను సాహిత్యము గల ఆలయములనే గ్రహించితిని ఒకటి రెండు తప్ప మిగిలిన వన్నియు సాహిత్యముగల వైష్ణవాలయాలే

క్షేత్ర పర్యటనా సమయమున ఆదివ్య క్షేత్రములందు గల పరమాత్మ దివ్య విగ్రహవములను దర్శించి, తదర్చన గావించు పూజారుల అర్చనా విధానములను వారి భక్తిని పరికించి జీవితము సార్థకమైనదిగా సంతసించితిని విష్ణుమూర్తి జగన్మోహనాకారుడనియు, భక్తసులభుడనియు గ్రహించుటకు నా పర్యటన మిక్కిలి సహకరించినది ఆపరిశీలనలో అర్చకుల జీవన స్థితిగతులు, ఆయా గ్రామ/పట్టణాల ప్రజలకు దైవముపై నున్న భక్తి విశ్వాసములలో గల తారతమ్యములను పరిశీలించితిని మార్గమధ్యములో మేధావులను, కవులను, పండితులను పౌరాణికులను గాయకులను దర్శించుట జరిగెను

ఈ సిద్ధాంత వ్యాసము ప్రథమాధ్యాయమున శ్రీవైష్ణవ మతము' లో ముఖ్యముగా ద్వైతాద్వైతముల తీరుతెన్నులను– విశిష్టాద్వైతము యొక్క విశిష్టతను వివరించుటకు ప్రయత్నించితిని

ద్వితీయాధ్యాయమైన కర్నూలు జిల్లా వైష్ణవ క్షేత్రాల ప్రశస్తి లో జిల్లాలో గల దాదాపు 30 దేవాలయాల ఉనికి – అర్చనా విధానము – ఆలయ ప్రశస్తి అకారాదిగా తాలూకా– మండలాల వారీగా తెలుపబడినది

తృతీయాధ్యాయమైన కర్నూలు జిల్లా వైష్ణవ క్షేత్ర సాహిత్యము శీర్షికలో ఆదోని, కర్నూలు నంద్యాల డివిజన్ కేంద్రాల ఆలయాలతో బాటు నాకు లభించిన సాహిత్యము గల దాదాపు 30 ఆలయాల సాహిత్యమును నాతి విస్తృతముగా పరామర్శించితిని (అకారాది క్రమముగా)

చతుర్థాధ్యాయమైన శ్రీ వైష్ణవాలయ నిర్మాణాదిక పరమార్థము లో అనుదినము దేవాలయ దర్శనములో కానవచ్చు గోపురము – ఘంట – హారతి – ధూది బత్తీలు – ప్రసాదము – భక్ష్యము – తీర్థము – బొట్టునకు గల ప్రాధాన్యత మె వానిని పామరులకు సైతము అర్థమగునట్లు వివరించుట జరిగినది

పంచమాధ్యాయములో శ్రీ వైష్ణవ క్షేత్ర సాహిత్యము – సామాజిక రసదృష్టులు లో ఆలయాలలో గల సామాజిక దృష్టిని స్పృశించుట జరిగినది సాహితీ పిపాసువులకు సమ్మోదకరముగా చివరి విభాగముగా కర్నూలు జిల్లా ఆలయ సాహిత్యములో ప్రాచీన నవీన కవులు రచించిన భక్తి కృతులను రసదృష్టితో తెలుపబడినది

ఏమైనను ఈ సిద్ధాంత గ్రంథమును గ్రంథ విస్తరభీతిచే సంగ్రహించితినని చెప్పక తప్పదు

భాగవతపాదరేణువు

డా వి డి వేంకటరమణమూర్తి,

విద్వాన్ M A M Phil Ph D

# తరగని కరదీపిక

ఆచార్య ఎం బుద్ధన్న
తెలుగు శాఖాధ్యక్షుడు
ఎస్ కె యు పి జి కేంద్రం

కర్నూలు
23-01-2002

ఉన్న సత్యాంశాన్ని కనుక్కోవటమే పరిశోధన ఇది కూడా ఒక తపస్సు వంటిదే! అనగా నిరంతర చింతన!

డా ఏ డి వేంకటరమణ మూర్తి గారు అత్యుత్తమ పరిశోధకులు 'తెలుగు సాహిత్యము – కర్నూలు జిల్లా వైష్ణవ క్షేత్రాల ప్రాశస్త్యము అనే గహనమైన అంశాన్ని పి హెచ్ డి పట్టం కోసం ఎన్నుకొని – మిక్కిలి వ్యయ ప్రయాసలకోర్చి పరిశోధన చేశారు భగవంతుడు సర్వవ్యాపి అయినప్పటికీ – స్థానమహిమ దైవానుభూతికి చక్కగా ఉపకరిస్తుంది అందుచేత క్షేత్రసాహితీ పరిశోధన చేయడం డా రమణమూర్తి గారి ఆధ్యాత్మిక సంస్కారానికి తార్కాణం!

డా రమణమూర్తిగారు చక్కని పరిశోధకులే కాక – భావుకులు కూడా! పద్యరచన అంతరించిన ఈ రోజుల్లో అందమైన పద్యరచనలు చేసి పండిత పామరులను మెప్పించిన కవి వర్యులు! ఆయన పరిశోధన గ్రంథాన్ని కూడా గ్రాంథికంలోనే రచించి, సఫలీకృతులైనారు

ఈ గ్రంథం – భావితరాలవారికి మార్గదర్శకంగా– కరదీపికగా విలసిల్లుతుందని విశ్వశిస్తున్నాను

ఎం బుద్ధన్న

SAHITYA PARISODHAKA RATHNA

**VAIDYAM VENKATESWARACHARYULU**

| | |
|---|---|
| Chairman | Vaidyamvari Aksharachana Oriental Library – KNL |
| Secretory | Sri Ramanuja Seva Samithi – KNL |
| Secretary | Kurnool Dist. Writers Association – KNL |
| Joint Secretary | KNL Dt. Telugu Writers Association – KNL |
| Executive Member | KNL Dt. History Research Association – KNL |
| Honble Adivsor | Kurnool Dt. Archaka Sangham, KNL |



Address

Res 18-4-7 Upstairs Sri Lakshmi Nagar Kurnool – 2

Off Govt. Degree College, NANDYAL KNL Dt.

# మార్గదర్శకం

దేవుడెక్కడుంటాడు? - దేహంలో వుంటాడు దేహామే దేవాలయం జీవుడే దేవుడు బ్రహ్మజ్ఞానులు దేహంలోని దేవుడిని దర్శిస్తారు వారికి దేవుడు నిరాకారుడయిన సుందరాకారుడు సాకారుడైన అర్చావతారికి బ్రహ్మాండానికే ప్రతీకమైన ఆలయాలు ఆవాసస్థానాలు

ప్రాచీనకాలంనుంచీ మనదేశంలో ఎన్నో దేవాలయాలు వెలిశాయి అవి మన సంస్కృతినీ చరిత్రను వెల్లడించే గతవైభవ చిహ్నాలు పురాతన సంప్రదాయాలను నిలబెట్టినవాటిలో మొదట గణింపదగినవి ఆలయాలే పూర్వం దేవాలయాలు నిర్వహించిన పాత్ర బహుముఖమైంది అలాంటి ఆలయాలు మన దేశంలో అసంఖ్యాలు గుళ్ళులేని వూళ్ళు లేవు అయితే ఊళ్ళులేని చోట కూడా గుళ్ళుంటాయి ప్రతి ఆలయానికీ పౌరాణికంగానో, చారిత్రాత్మకంగానో, మహాత్మ్యకంగానో లేదా రంముూడు విధాలుగా ఏదో కొంత గాథ వుండితీరుతుంది అది అక్షరబద్ధం కావటం వల్ల క్షేత్ర సాహిత్యం ఆవిర్భవిస్తుంది

కర్నూలు జిల్లాలో నంద, మౌర్య, శాతవాహన, పల్లవ, చాళుక్య, రాష్ట్రకూట, పశ్చిమ కల్యాణి, చాళుక్య, చోళ, యాదవ, కాకతీయ కొండవీటి రెడ్డి, విజయనగర, ఆరవీటి మొదలుగాగల వివిధానేక సార్వభౌమ సామంత పరంపరా పరిపాలనాకాలంలో ఎన్నో ఆలయాలు నిర్మించబడ్డాయి, జిల్లాలోని గ్రామాల సంఖ్య మజరా గ్రామాలతో కలిపి సహస్రాధికంగా వుంది ప్రతి గ్రామానికీ సగటున రెండు ఆలయాలైనా వుంటాయి ఇక అడవుల్లో, కొండల్లో ఉండే ఆలయాలూ ఉన్నాయి వీటన్నింటినీ లెక్కిస్తే జిల్లాలోని ఆలయాల సంఖ్య వేలల్లో వుంటుంది వీటిలో ప్రసిద్ధ ఆలయాలు, తిరుణాళలు జరిగేవి కలిపి శతాధికంగా వున్నాయి ఒక్కొక్క ఆలయానికి

సంబంధించిన పౌరాణికగాథలు, మాహాత్మ్యాలు, జైన - బౌద్ధ - కాపాలిక - కాలాముఖ - శాక్తీయ - శౌర - గాణాపత్య - నాథ - దత్త - వీరశైవ - వైష్ణవ ప్రభావముద్రలు, శిలాశాసనాలు, చరిత్ర, సంస్కృతాంధ్రాదిసాహిత్యం, జానపదవాఙ్మయం మొదలయిన విషయాలన్నీ గవేషణధిషణాకుశలతతో సమగ్రంగా పరిశీలించి రాస్తే ఒక్కొక్క ప్రత్యేక పుస్తకంగా వెలువరించేటంతవుంటుంది అంతటి విషయ విస్తృతిగల అంశంలో ''తెలుగుసాహిత్యము - కర్నూలు జిల్లా వైష్ణవక్షేత్రాల ప్రాశస్త్యము'' ను గురించి ప్రస్తుత సిద్ధాంత గ్రంథరచన సాగింది

డా॥ వి డి రమణమూర్తిగారు కర్నూలు జిల్లా వాసి - వైష్ణవుడు - అర్చక కుటుంబ సంభవుడు ఈ మూడు మౌలిక కారణాలవల్ల 'కర్నూలు జిల్లా వైష్ణవ - ఆలయాల' ను గురించిన పరిశోధన చేశారనిపిస్తుంది వైష్ణవంలో పాంచరాత్రాగమం ప్రముఖమైంది కర్నూలు జిల్లాలోని వైష్ణవాలయాలో చాలా వరకు పాంచరాత్రాగమానుసారమే అర్చనాదులు జరుగుతుంటాయి ఈ సిద్ధాంతగ్రంథం పంచాధ్యాయాలుగ విభజించటం పాంచరాత్ర శబ్దానికి ప్రతీకాత్మత అనిపిస్తుంది పరిశోధనకు స్వీకరించిన అంశం, స్వీకరించిన అంశాన్ని ఐదు అధ్యాయాలుగ విభజించటం గమనిస్తే పరిశోధకునిలో అంతర్లీనంగా దాగిన 'విశిష్టతత్త్వం' అవగతమౌతుంది

ఈ సిద్ధాంతగ్రంథం - ''శ్రీ వైష్ణవమతము, కర్నూలు జిల్లా వైష్ణవ క్షేత్రాలప్రశస్తి, కర్నూలు జిల్లా వైష్ణవక్షేత్ర సాహిత్యము, శ్రీ వైష్ణవాలయ నిర్మాణాదిక పరమార్థము, శ్రీ వైష్ణవక్షేత్రసాహిత్యము - సామాజిక రసదృష్టులు'' - అనే ఐదు అధ్యాయాలుగ విభజించబడింది పరిశోధనకు ఎంపిక చేసుకున్న ప్రధానాంశానికి ప్రముఖంగా కేంద్రస్థానీయమైనవి ఈ ఐదు అధ్యాయాలలో రెండు, మూడు అధ్యాయాలు మాత్రమే ఈ రెండు అధ్యాయాలు కుడా గ్రంథకర్త అటనానికీ, పఠనానికీ, పరిశోధనకీ దర్పణం పడతాయి ఏనాడో ముద్రితమై నేడు అలభ్యంగా వున్న ఆలయసాహిత్యమేగాక అముద్రితసాహిత్యాన్ని కూడా సోదాహరణంగా పరిచయం చేయటం ప్రశంసనీయం సంబంధిత ఛాయాచిత్రాలను కూడా సేకరించి గ్రంథంలో పొందు పరచటం ముదావహం

ఇది డాక్టరేట్ పట్టాకోసం సాగించిన పరిశోధన కాబట్టి కొన్ని పరిమితులు, పరిధులు అనివార్యం పరిశోధన ఎంతచేసినా ఎందరు చేసినా ఇంకా చేయవలసింది ఎంతో వుంటుందనటం నిత్యసత్యం ఏదియేమైనప్పటికీ డా॥ రమణ మూర్తిగారి ఈ గ్రంథం ఈ రంగంలో పరిశోధించే భావి పరిశోధకులకు మార్గదర్శకం

సాహిత్య సమారాధకుడు,
వైద్యం వెంకటేశ్వరాచార్యులు

గణతంత్రదినం
2002

# అభిప్రాయము

శ్రీ వి డి వి రమణమూర్తి గారి సిద్ధాంత వ్యాసము – కర్నూలు జిల్లా – వైష్ణవ క్షేత్రాల ప్రాశస్త్యము ను శ్రద్ధగా పరిశీలించితిని వ్యాసకర్త దీనిని అయిదు అధ్యాయాలుగా విభజించినారు ప్రథమాధ్యాయములో అద్వైత ద్వైతాలను సంగ్రహముగా విశిష్ట అద్వైతమును విపులముగా వివరించినాడు వైష్ణవులలోని వైఖానస – పాంచరాత్రాగమాలభేదాలను – వడగల తెంగల శాఖలను తెలిపినారు – తెలుగు దేశములోని ఆంధ్ర శాఖ, చాత్తాద వైష్ణవ తెగలను తెలిపియుండిన వైష్ణవము సమగ్రముగా చెప్పినట్లు అగును

ద్వైతము ప్రత్యక్ష ప్రమాణవాది కాదు వ్యాసరాయస్వామి 'అక్షాదిత్రితయంప్రమాణం' అన్నారు అనగా ద్వైతమునకు 'ప్రత్యక్ష– అనుమాన–శబ్ద' ప్రమాణములు మూడు అనిభావము

రెండవ అధ్యాయములో జిల్లాలోని 29 వైష్ణవ క్షేత్రాలను పరిచయము చేసినారు వ్యాసకర్త స్వయముగా ఆ క్షేత్రాలను చూచి సేకరించిన విషయాలు తెలుపబడినాయి

మొదటి హరహరరాయలు 1333 సం చాకరాజువేమలను అగ్రహారముగా దానమిచ్చినట్లు వ్రాయబడినది. ఇది చరిత్రకు విరుద్ధము విజయనగర రాజ్య స్థాపన – హరి హరుని పట్టాభిషేకము 1336 లో జరిగినట్లు శాసనాలలో ఉన్నది

మూడవ అధ్యాయములో పైన తెలిపిన క్షేత్రాలకు సంబంధించిన సాహిత్యమును చక్కగా సమీక్షించినారు అహోబల క్షేత్రమునకు మాత్రమే ఎఱ్ఱాప్రెగడ–నృసింహపురాణము స్థానిక వైష్ణవ పీఠాధిపతి వ్రాసిన వాసంతికా పరిణయము' సంస్కృతనాటకము వంటి ప్రాచీన సాహిత్యము లభించినది చాగలమఱ్ఱి – కోవెలకుంట్ల – వెలుగోడు దేవాలయాలకు అన్నమాచార్య కీర్తన సాహిత్యమున్నది తక్కిన క్షేత్రాలకు ఆధునికులు వ్రాసిన శతకాలు – పాటలు – మాహాత్మ్యములు, హరికథలు లభించినవి ఈ సాహిత్యములోని విశేషాలను, క్షేత్రవిశేషాలను చక్కగా వివరించినారు

నాలుగవ అధ్యాయము ప్రత్యేకమైనది అందులో దేవాలయ నిర్మాణంలోని ముఖ్యాంగాలు, వాని ప్రయోజనములు, విశదీకరించినారు – పూజాపరికరాలు, షోడశోపచార పూజలు వాని ఉద్దేశములు పామరునకు అర్థమగునట్లు వివరించారు

అయిదవ అధ్యాయమున క్షేత్ర సాహిత్యమునందలి సామాజిక దృష్టిని రసదృష్టిని వివేచించుట జరిగినది ఈ ప్రకరణములో గహనములైన వైష్ణవతత్త్వ, దేవాలయ తత్త్వ, విగ్రహ తత్త్వ, పూజాతత్త్వ, సాహిత్య తత్త్వములను సామాన్యుడు గూడ గ్రహించుకొనునట్లు విశదీకరించారు తమకృషిని సార్థకము చేసికొన్న శ్రీ వి డి వి రమణమూర్తిగారిని మనసారా అభినందించుచున్నాను రసజ్ఞమైన ఆంధ్రలోకము వారి పరిశ్రమను సమాదరించగలదని ఆశించుచున్నాను

కర్నూలు
23-01-2002

బుధ విధేయుడు
గడియారం - రామకృష్ణశర్మ



## వైష్ణవ మత ప్రాశస్త్యము గూర్చి అన్నమయ్య కీర్తన

వలెనను వారిదె వైష్ణవము యిది
వలపుదేనెవో వైష్ణవము॥

యెదుటను శ్రీవేంకటేశ్వరు నామము
వదనము చేర్చుట వైష్ణవము॥ (1-405)

ఇరువుగ శ్రీవేంకటేశ్వరు మతమే
సిరుల నమ్ముదురు శ్రీవైష్ణవులు॥ (1-402)

సహజ వైష్ణవాచార వర్తనుల
సహవాసమె మాసంధ్య॥ (1-10)

కోవిదు శ్రీవేంకటేశుగొలిచి పెద్దలకృప
వావివర్తనగలవాడువో వైష్ణవుడు॥ (1-59)

వైష్ణవులు గాని వారలెవ్వరు లేరు
విష్ణు ప్రభావమీ విశ్వమంతయు గాన॥ (1-36)

ఉమ్మడి మీ సేవ సేసుకుండేటి వైష్ణవుల
సమ్ముఖాన సేవించుటే చాలదా నాకు॥ (3-23)



ప్రథమాధ్యాయము

# శ్రీ వైష్ణవ మతము





# ప్రథమాధ్యాయము

# శ్రీ వైష్ణవ మతము

**మత శబ్ద నిర్వచనము** – సంస్కృత భాషలోని 'ధర్మః' అను మాటను మనము 'మతము' అను పేరుతో పిలుచుచున్నాము మతమన్నది సామాజిక చైతన్యము యొక్క ప్రత్యేక రూపవ ఙ తనకర్థము కాని ప్రకృతి శక్తులకు భయపడి పోయిన మనిషియే మతమును సృష్టించెనని సిగ్మండ్ ఫ్రాయిడ్ పేర్కొనెను [1]

మానవాభ్యుదయమునకు, మానవ పరమావధికి మార్గమును చూపుట కత్యవసర మైనది మతము జీవునకు – దేవునకు మధ్య గల సంబంధ బాంధవ్యములను చూపునది మతము మొత్తము పై మానవునిలోని మానవత్వమును ప్రేరేపించి, మంచి మార్గమును చూపు మార్గమే మతము పదిమంది సంతోషముతో సమైక్యముగా సహజీవనము చేయుటకు మార్గము మతము

''సత్య సాక్షాత్కారమే మతమను విషయము వేదాంతము నందలి ప్రథమ సూత్రము'' అని వివేకానందుల వారు మతమును గూర్చి పలికిన మాట సత్యము

ఒక్కొక్క మహాత్ముడొక్కొక్క కాలములో జన్మించి, ప్రజలను సన్మార్గగాములను గావించుటకై ఆయాకాల పరిస్థితులను – బట్టి 'మత' మను పేర ప్రబోధనలు గావించుట చారిత్రక సత్యము ఆయా కాలములలో వారు భగవత్సేవ – మత సేవలే గాక మానవ సేవ కూడ పరమ కర్తవ్యమని భావించి, మానవులు పురోగమించుటకై తమ జీవిత మంతయు ధారపోసిరి

''మానవునికి దేవుని కున్న అవినాభావ సంబంధము మతము విశాలార్థములో చెప్పిన, మానవుడు దేనిని పవిత్రముగా భావించి, దానితో సంపర్కము పెట్టుకొనునో అదియే మతము'' అని డా జి యస్ మోహన్ 'ఆంధ్ర దేశములోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రములు – ప్రధాన దేవాలయాలు' – అను గ్రంథములో తెలిపెను మతము బాహ్య కర్మ కాండలో లేదు మతము జీర్ణోద్ధరణ కన్న ముఖ్యమైనది కాదని గాంధీజీ అభిప్రాయపడెను [2]

**హిందూమతము** – హిందూమతమును ఏ ప్రవక్తయు స్థాపించలేదు పునర్జన్మము – కర్మ – ఈ రెండింటిని గురించిన సిద్ధాంతములు హిందూమతమున కాధారములు వీని ననుసరించియే కుల వ్యవస్థ ఏర్పడినది

హిందూమత సాంప్రదాయము ప్రకారము దేవతల సంఖ్యా మూడు కోట్లు హిందూ మతము మహోజ్జ్వల భారతీయ సంస్కృతికి ఆలంబనము అంతేగాక, ఈ హిందూ మతము విశిష్టమైనది, ఉదారమైనది సర్వ మత సమన్వయ రూపమిది ఐహిక సుఖాల కన్నను ఆత్మను జయించిన శాశ్వత సుఖానందము ముఖ్యమని హైందవమును విశ్వసించిన పూర్వులు తెలిపిరి

పూర్వము నుండియు భారత దేశములో దైవ మతాది విషయములకు వేదములలో తెలుపబడిన విషయములే ప్రమాణములై యున్నవి 'వేదయతీతి వేద ' - తెలియ జేయునది గాన వేదమని చెప్పబడెను 'విదన్తియతో ధర్మా ధర్మా వితి వేద ' - అనగా దీని సహాయమున ధర్మా ధర్మములు తెలియజేయబడును గనుక వేదమని భావము

మొత్తముపై హిందూ మతమును గూర్చి ప్రస్థాన త్రయము తెలుపు చున్నది వేదములు - ఉపనిషత్తులు - భగవద్గీత అనునవి ప్రస్థాన త్రయము

హిందూ మతము విశ్వ మానవ సంక్షేమమును తెలుపు చున్నదని ఉపనిషద్వాక్యము.

'అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ' -

చెడు నుండి మంచికి చేర్చుము అజ్ఞానము నుండి నన్ను జ్ఞానమునకు చేర్చుము మృత్యువు నుండి నన్ను మోక్షమునకు చేర్చుమని పై శ్లోకార్థము

ఉపనిషత్తు లిట్లు జీవుల క్షేమమును గూర్చి ప్రార్థించినవి హిందూ మతము ఇట్లు విశ్వ మానవ సంక్షేమమును కోరును అత్యున్నత పదవియైన మోక్షమును చూపించు లక్ష్యమిది (హిందూ మతము)

అనేక దృక్పథముల సమన్వయము గల్గిన జీవన విధానమును తెలుపునది ఈ మతము హిందూ మతము భారతదేశ వ్యాప్తముగా కోట్ల సంఖ్యలో నున్న వివిధ జాతుల సంధాన శక్తిగా నిలిచియున్నది హిందూ మతమునకు అనేకములైన మార్పులు, చేర్పులు తరువాతి కాలమున కలిగి, మన దేశము నందు వివిధ సంప్రదాయములు, మతములు వెలిసినవి మత వ్యాప్తి కొరకు హిందువులు దండయాత్రలు జరప లేదనుట సత్యము ఇతర మతముల వారితో యుద్ధములు చేయలేదు హిందూ మతము నేపాల్, బర్మా, థాయ్ లాండ్, కంబోడియా, ఇండోనేషియా మరికొన్ని దేశములకు వ్యాపించినది [4]

హిందూ మతమును చెప్పిన ఉపాసన, యజ్ఞాదులు క్రమక్రమముగా ప్రబలినవి బ్రాహ్మణాధిక్యము పెరిగినది గత కాలపు హైందవ మప్పుడు ప్రజల

కాదరించుటకు భారము కాగా, నూతన మతము లావిర్భవించెను

అహింసా సిద్ధాంతపు పునాదుల పైననే నిర్మింపబడి సన్న యజ్ఞాదులందు తప్పని సరిగా చేయు హింసను ఖండించిన మతములుగా జైన, బౌద్ధ, మతములు జన్మించినవి క్రీ॥ పూ 6 శ॥ ప్రాంతమున జనించిన వీనిని ప్రజలు కొంద రాదరించిరి జైనమును వర్ధమాన మహా వీరుడు నెలకొల్పగా, బౌద్ధమును గౌతమ బుద్ధుడు స్థాపించెను

జైన బౌద్ధముల తర్వాత ఆ మతములలోని స్వార్థపరులు కావించు అనుచిత ప్రవర్తనల వల్లనే ఆమతములు క్షీణింపజొచ్చెను మరొక వంక వేదములలోని మంత్రములకు అపార్థములను కల్పించి, వాని ఆధారాలతో తమ తమ విశ్వాసాలను మరికొందరు ప్రచారము చేయు చుండిరి అనగా భైరవులు, శాక్తేయులు మొ॥ వారు తమ సంకుచిత సిద్ధాంతాలను మూర్ఖముతో ప్రచారము చేయు చుండిరి అపుడు ప్రజలకు సన్మార్గమును చూపుటకై చక్కని తత్త్వమవసర మయ్యెను

**అద్వైతము** -

అద్వైతమతి ప్రాచీనము శంకరాచార్యుల కంటె ముందు మండన మిశ్రుడు, అతని కంటె ముందు గౌడ పాదుడు మొ॥ అద్వైత దార్శనికు లెందరో వెలసినారు

జీవునకు శాశ్వతమైన ప్రత్యేక ప్రతిపత్తియేమియు లేదు మరల బ్రహ్మ సంకల్పము మేరకు జీవాత్మ పరమాత్మలో లీనము కాక తప్పదు ఈ అద్వైత దర్శనము చేసిన వారిలో గౌడపాదుడు ముఖ్యుడు

ఆత్మ యొక్కటే సత్తు అది తన మాయ చేత భేదము కల్పించుకొని, వెలుగుచున్నది. మాయ అనగా 'సృజనాత్మక శక్తి మాయ యనగా బుద్ధి భ్రమము బ్రహ్మ పదార్థము యొక్క సంకల్ప వికల్పాలలోని వికల్పమే మాయ మాయ చేతనే జగత్తు పుట్టినది పుట్టిన దంతయు ననేకమైనను, మూలము మాత్రము పరమాత్మ యొక్కటే నిజమునకిది అజాయ మానము పుట్టుక లేని వాడు బహురూపాలతో పుట్టుట యద్భుతము ఇదెల్ల కేవలము మాయతోనే సాధ్యము నిజమునకు సత్తు పుట్టదు, కాని మాయ చేతనే పుట్టును స్వప్నమందొక్క మనస్సు రెండుగా ఆభాసించునట్లు జాగ్రదవస్థ యందును అది రెండుగా ఆభాసించును అనగా జీవుడు తన సంకల్పము మేరకు పుట్టలేదు జీవాత్మల అన్యత్వము నింద్యము

ఈ విషయమును వివరించుటకు గౌడ పాదుడు మృత్ - లోహ - విస్ఫులింగ దృష్టాంతములు చూపెను మృత్తిక కుండకు మూలమైనట్లు -

నానాత్వమయ జగత్తుకు మూల శక్తి యొక్కటే రకరకాల పరికరాలకు లోహము మూలమైనట్లు, జీవ జగత్తునకు బ్రహ్మ మూలము రకరకాల మంటలకు అగ్ని మూలమైనట్లు జగమున కంతయు పరబ్రహ్మమే మూలము ఈ దృష్టాంతాల ద్వారా గౌడ పాదుడు జీవాత్మ పరమాత్మల అభేదమును, అజాతిని స్పష్టము చేసినాడు అందుచేతనే 'ఏకం సత్ విప్రా బహుధావదన్తి' - సత్తు ఒక్కటే పండితులు దానిని అనేకముగా చెప్పెదరు

గౌడ పాదుని తర్వాత 'మండన మిశ్రు' డను దార్శనికుడు వచ్చి, అద్వైత సిద్ధాన్తమును ప్రబోధించినాడు మండన మిశ్రుని ప్రకారముగా నామరూప జగత్తు భ్రమకము జీవులకు గల అనేకత్వము అవిద్యాకృతమే తప్ప సత్యము గాదు అవిద్య జీవుని కంటి యున్న ఒక మహా దోషము అవిద్యయనగా ఆధ్యాత్మిక విస్మృతి మండన మిశ్రుని ప్రకారము జీవ జగత్తుకు కారణము జీవుని అవిద్య జీవుడు తదాశ్రితుడు అది మాయ చేత కలుగును బుద్ధికి విభ్రమము కలిగించునది మాయ

అట్టి అవిద్యా నిరాకరణమే ముక్తి ముక్తి యనగా చిదానంద ప్రాప్తి దానిని పొందుటకు చేయునదే 'సాధనము' ఆధ్యాత్మిక జ్ఞానము చేత 'నిష్కామ కర్మ' సాధ్యమగును ధ్యాన సాఫల్యమే బ్రహ్మాను భవ ప్రాప్తి 'ధ్యానేన ఆత్మని పశ్యన్తి' అని గీత పలుకును ఇది కల్గుటయే ముక్తి దీనిని సిద్ధింప జేసికొనుటకు జ్ఞానము పనికి వచ్చును

'అనఘ ! తిరుగటి పై శిల యాకసంబు,
క్రిందిశిల ధాత్రి, తన్మధ్య మందుఁదనరు
తండులమ్ములు ప్రాణులు - దానిఁద్రిప్పు
నెలత యముడని డెందాన తలచి తలచి' - [8]

కాశిలో నొక మహిళ విసరు రాయిలో ధాన్యము వేసి, విసరుచుండగా కబీరు చూచి దుఃఖించి నాడట ! విసరు రాయి పై రాయి ఆకాశము, క్రింది రాయి భూమియని - దాని మధ్యనున్న ధాన్యము ప్రాణులని, త్రిప్పు వ్యక్తి యముడని కబీరు భావింపగా, గురువు - నిపతి రంజనుడు శిష్యునితో భయపడవలదనియు, ప్రపంచ మంతయు తిరుగలియైన పిడి ఆధ్యాత్మిక విజ్ఞానమని పేర్కొనెను కోరికలు, మనో వికారాలు, పాపాలన్నియు ఆ తిరుగలి నుండియే పోవునని - ఆధ్యాత్మిక జ్ఞానాధారమును గురువు సూచించినాడు

మండన మిశ్రుడు తన అద్వైత సిద్ధాంతమున కుప బలకముగా శబ్దాద్వైతమును స్వీకరించినాడు శబ్దము స్వయముగా పరబ్రహ్మము కనుక సమస్త జగత్తునకు శబ్దము మూలాధారము శబ్దము శబ్దములో కలిసి పోవుటయే

శబ్దాద్వైతము ప్రపంచము కూడ అంతియే నిర్గుణ జగత్తు నుండి సగుణ జగత్తు పుట్టి, తిరిగి నిర్గుణములో కలిసి పోవుచున్నందున ఇదియు అద్వైతమే

తర్వాతి వాడైన శంకరాచార్యుడు బ్రహ్మమొక్కటే యన్నాడు నానాత్వ మన్నది మిథ్య యన్నాడు జీవేశ్వరుల భేదము ప్రత్యక్ష జ్ఞానము చేత మాత్రమే నిజమన్నాడు ఏకత్వము లోనికి నానాత్వము పునర్లయ మందుటయే జీవేశ్వరుల అభేదమనియు అద్వైత సారమనియు శంకరులు విశదీకరించి చెప్పెను

ఒక మారు ఆదిశంకరులు చండాల వేషమున సమీపించగా శిష్యులు చీదరించినను, సర్వులలోని ఆత్మ యొక్కటే యని వారి కనులను తెరిపించిన సమదృష్టి గలవాడు శంకరాచార్యులు

'చండాలోస్తు సతు ద్విజోస్తుగురురి త్యేషా మనీషామమ' అని తన 'మనీషా పంచకము' లో చండాలుడు గాని బ్రాహ్మణుడు గాని జ్ఞానియైన వాడు, వినయ సంపన్నుడు తనకు గురువగునని నమ్రముగా పలికినాడు

'ఉదార చరితానాంతు వసుధైక కుటుంబకమ్' - అని విశాల దృష్టి గల మహనీయుడు శంకరాచార్యుడు (ఉదార భావములు గల వానికి ప్రపంచమే కుటుంబ మని పై పాదార్థము)

ఈయన షణ్మతముల నుద్ధరించి, షణ్మతోద్ధారకుడుగా విఖ్యాతి నందినాడు

'అలింగక, మ చక్రాంక, మజటాస్థ్యసురామిషమ్ అరక్తక, మనుచ్ఛిష్టం, షడస్మాభి రనుష్ఠితమ్' - లింగ ధారణము లేని శైవము, చక్రాంకితము కాని వైష్ణవము, జటాస్థిమాలాక పాల ధారణము కాని కాపాలికము, మద్య మాంసములు లేని శాక్తేయము అంగుష్ఠ రక్తాభిషేకము లేని సౌరము, ఉచ్ఛిష్టము లేని గాణా పత్యము తానంగీకరించు చున్నాననెను

ఇట్లు షణ్మతాలంగీకరించి, ఉద్ధరించి, అద్వైత సిద్ధాంతమును ప్రతి పాదించినాడాయన గీతోపనిషద్బ్రహ్మ సూత్రాలను అద్వైత పరముగా వ్యాఖ్యానించిన జగద్గురువు శంకరాచార్యులు

**ద్వైతము -**

అద్వైతము తరువాత విశిష్టాద్వైతము దీని తర్వాత ద్వైతము పుట్టినది సిద్ధాంత వ్యాస సౌలభ్యార్థమై అద్వైతము తర్వాత ద్వైతము చెప్పి, చివరగా విశిష్టాద్వైతము చెప్పబడుచున్నది

అద్వైత, విశిష్టాద్వైతములు జీవైశ్వరైక్యమును బోధింపగా ద్వైతము ఈ రెండింటి నొక దశలో తృణీకరించును అద్వైత విశిష్టాద్వైతాలు పరోక్ష

అనుమాన ప్రమాణముల ద్వారా జీవేశ్వరైక్యమును - అద్వైతమును ప్రతిపాదించినవి కాగా ద్వైతము ప్రత్యక్ష ప్రమాణమును అంగీకరించినది ఈ సిద్ధాంతమును ప్రతిపాదించినవాడు మధ్వాచార్యులు

ఈ ప్రత్యక్ష ప్రమాణ సిద్ధాంతము సత్యము కాదనిపించును ఎందుకనగా అనుభవాని కంటె సత్యము చాల తక్కువ, అందనిదే చాల యెక్కువ ఐనను కనబడనంత మాత్రాన సత్యమును కొట్టి వేయలేము అద్వైత విశిష్టాద్వైతాలు చెప్పిన 'తత్త్వమసి' సిద్ధాంతమును ద్వైతము ఖండించినది

మధ్వాచార్యులు అద్వైత, విశిష్టాద్వైతాలు నొక్కి చెప్పిన అవిద్యను జీవునికి అనుకూలముగా పేర్కొనకపోగా, అసలు అవిద్య లేదనెను 'అతత్వమసి' అని ద్వైతము పేర్కొను చున్నది జీవుడు జీవుని గానే, దేవుడు దేవునిగానే ఉండుచునే ప్రపంచగతిని సత్యముగా సమ్మతించుచునే ద్వైతము సాగినది

జీవాత్మ - పరమాత్మ వేరని చెప్పు ద్వైతమునకు ఋగ్వేదము, అధ్వణ వేదములలోని మంత్రములు సాక్ష్యమిచ్చుచున్నవి ఇదే మతము మరొక ఉపనిషత్తులోను చెప్పబడెను

'ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయోర న్య పిప్పలం స్వాద్వత్త్య
నశ్నన్నన్యో అభిచాక శాతి ॥ [8]

పై మంత్రము నందు ప్రాణ స్నేహితులై, నిరంతరము కలిసియుండు రెండు పకులు ఒకే చెట్టుపై కూర్చొని యున్నవి వాటిలో నొకటి జీవాత్మ చెట్లు పండ్లను ఆసక్తితో తినుచుండగా - మరొకటి పరమాత్మ ఏమియు తినకుండ చూచు చున్నది కనుక యిచట జీవుడు కర్మఫల భోక్తయని, ఈశ్వరుడు కాదని చెప్పుచున్నది

విష్ణు సర్వోత్తమత్త్వము జీవ బ్రహ్మాదులకు గల పారమార్థిక భేదాలు మొ ॥ తత్త్వాలను మధ్వాచార్యులు విశదీకరించిరని మున్నే తెల్పబడెను వారి సమకాలికులు, శిష్యులు త్రివిక్రమ పండితాచార్యులు 'వాయు స్తుతి' అను స్తోత్రగ్రంథము నందును 'మధ్వవిజయ' మను 16 సర్గలు గల మహా కావ్యము నందును ద్వైత సిద్ధాంతము మనోహరముగా నిరూపించబడినది మంత్రాలయమున తర్వాతి కాలమున వెలసిన రాఘవేంద్ర స్వామి ద్వైతమునకు నిలయమై, బృందావన వాసియై నేటికి భక్తుల సేవలందు కొనుచున్నాడు

అద్వైతుల మతములో జ్ఞానము వలన ముక్తి కలుగును, జీవాత్మ పరమాత్మల యైక్యమే ముక్తి పరమేశ్వరానుగ్రహము వల్లనే ఈ ముక్తి కల్గును ఈ అనుగ్రహము కొఱకు నిష్కామ కర్మ నాచరించవలెను ముక్తుడైన వానికి జన్మలేదు సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మ కంటె నితరమేదియు సత్యము కాదు

ద్వైతుల మతములో భక్తి వలన ముక్తి కలుగును భక్తిని దృఢ పరచునది జ్ఞానము ఇచ్చుటు సైతము కర్మాచరణము ఈశ్వరానుగ్రహ సంపాదన కవసరమే వీరి ముక్తిలో జీవుడు పరమేశ్వరునితో నైక్యమొందడు, నిరంతర దైవ సేవలో జీవుడానందమును బొందుచు, పరమేశ్వర సన్నిధిలో నుండును ద్వైతుల మతములో కూడ ముక్తుడు జనన మరణముల కతీతుడు

ఏది యేమైనను అద్వైత విశిష్టాద్వైతముల వలె భారత దేశములో ద్వైతము బహుళ వ్యాప్తము, ప్రచారమునంద లేదు

అద్వైత విశిష్టాద్వైతములను, ద్వైతమునకు పోల్చి చూచినచో ద్వైతము కొంత పాక్షిముగనే కన్పించును ప్రత్యక్ష ప్రమాణము నాధారముగ స్వీకరించుట లోపము నిరాకారము ననుమానించుట మరొక లోపము జీవేశ్వర భేదమును బహుధా నొక్కి చెప్పుచునే ఒక్క దశలో మోక్షము నంగీకరించుట కొంత అసమంజసమనుట సారాంశము ఇట్లు భౌతిక జగత్తు - పరమాత్మ విడి గానే యుండునని ద్వైతము చెప్పినది కనుక అద్వైతమువలె దీనికి చిరాయుత్వము లభింపలేదు

**విశిష్టాద్వైతము -**

ఇది అద్వైతమునకు పూర్తి విరుద్ధము కాదు అద్వైత సిద్ధాంతమే మరికొంత విశిష్టముగా చెప్పబడుటచే నిది విశిష్టాద్వైతమైనది అద్వైతములో భగవంతునికి పేరు లేదు, చిత్, శక్తి, బ్రహ్మ అన్నారు విశిష్టాద్వైతములో ప్రత్యేకముగా శక్తికి నారాయణుడు, విష్ణువు అని పేరు పెట్టినారు

**విశిష్టాద్వైతము నామసార్థకము -**

తత్త్వమసి - అను సిద్ధాంతము ప్రకారము నారాయణునితో పొందు అభేద భావమే విశిష్టాద్వైతము ఈ చిద చిత్తులచే సూక్ష్మస్థూలావస్థలందును ఈశ్వరుడు విశిష్టుడు కనుక ఈ మతము విశిష్టాద్వైతమైనది

అపవర్గ ప్రదుడు నారాయణుడే (విష్ణువే) గాని బ్రహ్మేంద్రా దులు గారు, సకల శక్తులు, లీలలు గల నారాయణుడు సకల దేవతల కంటె విశిష్టుడు అట్టి విశిష్టునిచే పొందు అద్వైతము విశిష్టాద్వైతము

విశిష్టాద్వైతములో ఆత్మయోగము ముఖ్యమైనది యోగ మనగా కలయిక ఇతర చింత లేవియు లేక బ్రహ్మమునే చింతించుట యందున్న నేర్పు యోగమనబడును అట్టి విశిష్టయోగమే విశిష్టా ద్వైతము బ్రహ్మము లేక విష్ణు వొక ఆకర్షకము అయస్కాంతము - సూదంటు రాయి జీవుడు వికార రూపమైన ఇనుము వంటి వాడు అయస్కాంతము తన దగ్గరి ఇనుము నెట్లు త్వరితముగా నాకర్షించునో, అట్లు జీవుని ఆత్మ సంస్కారమును బట్టి - వానిని విష్ణువు తనలో కలుపుకొనును జీవుడు పరమాత్మను చేరుకొనుట కు కొంత సాధన చేయవలెను

విశిష్టాద్వైతములోని యోగము - తత్కారణమైన సాధన అద్వైతమున కుపకరించునవే ఇట్లు విశిష్టా ద్వైతము అద్వైతము మీద 'సంస్కార సిద్ధాంత' మనవచ్చును జీవేశ్వర విశిష్టైక్యమే విశిష్టా ద్వైతము

## పన్నిద్దరాళ్వారులు

విశిష్టా ద్వైతమునకు సంబంధించి అత్యంత ప్రాచీనులు పన్నిద్దరాళ్వారులు

శ్రీ వైష్ణవమును జన సామాన్యమునకు అందుబాటులోనికి తెచ్చిన పన్నెండు మంది ఆళ్వారులనే 'పన్నిద్దరాళ్వారులు' - అందురు వీరిని స్తుతించిన శ్లోకము -

'భూతం సరస్య మహదాహ్వాయ భట్టనాథ !
శ్రీ భక్తి సార కుల శేఖర యోగి వాహన్ !
భక్తాంఘ్రి రేణు పరకాల యతీంద్ర మిశ్రాన్,
శ్రీ మత్పరాంకుశ మునిం ప్రణతో స్మినిత్యమ్'

(ఆళ్వారుల దివ్యచరిత్రము)

1 భూతం = భూతాళ్వారు, పూదత్తాళ్వారు, 2 సరస్య = పొయిగై అళ్వారు, 3 మహదాహ్వాయ = పేయాళ్వారు, 4 భట్టనాథ = మధురకవి ఆళ్వారు 5 శ్రీ భక్తి సార = తిరుమళిశై ఆళ్వారు , 6 కుల శేఖర = కుల శేఖరాళ్వారు 7 యోగి వాహన్ = తిరుప్పాణి ఆళ్వారు, 8 భక్తాంఘ్రిరేణు = తొండరడిప్పొడి ఆళ్వారు, 9 పరకాల = తిరుమంగై ఆళ్వారు, 10 యతీంద్ర మిశ్రాన్, శ్రీమత్ పరమాంకుశముని = నమ్మాళ్వారులు , ఈ శ్లోకము నందు చెప్పబడని 11 పెరియాళ్వారు ( విష్ణుచిత్తుడు) 12 ఆయన కుమార్తె ఆండాళ్( గోదాదేవి) ఇద్దరిని కలిపి పన్నిద్దరాళ్వార్లని యందురు

**పన్నిద్దరాళ్వారుల జీవితము నుండి గ్రహింప వలసిన ధర్మ సూక్ష్మము -**

వర్ణజాతి, భాషా భేదములకు వహానవుడ తీతుడై, కళ్యాణగుణ ప్రపూర్ణుడై వెలగి, ఆనందమున నుండవలెననుట వీరు సంస్కృత పండితులయ్యును, దయాహృదయులును, వివేక వంతులును అగుటచే వేద, బ్రహ్మసూత్రాల ఉపనిషత్తుల, పురాణేతిహాస సారమును వాడుక భాషయైన తమిళములో ప్రజా సామాన్యుల కర్థమైన విధమున కీర్తనలు రచించి, గానము చేసిరి

ఆళ్వారులు భావించి, స్వీకరించిన అర్చావతారము శ్రీ రంగనాథుని దివ్య విగ్రహము భగవచ్ఛక్తియైన వైష్ణవ శక్తి సర్వ జీవమున కాధారము జీవము మొదట నీటి నాధారముగా చేసికొన్నది కనుక నారమనగా నీరని భావ ముండుటచే నారాయణ శబ్దము సకల జీవ కోటికి మూలమైన పరమాత్మగా నిర్ణయింపబడెను 'భగవత్కృప శరణాగతులకే గాని, వేదాధ్యయనము చేయు వారికి గాదు' అని ఆళ్వారులు నిరూపించినారు

ముందుగా పుట్టిన ముగ్గురు ఆళ్వారులను 'ముదలాళ్వారులు' అనియందురు వీరు

**01 పొయిగై ఆళ్వారు**

**02 పూదత్తాళ్వారు**

**03 పేయాళ్వారు** వీరు ముగ్గురు వరుసగా విష్ణువు పాంచజన్య - కౌమోదకి - నందకాంశములుగా జన్మించినారు వీరు ఒక్కొక్కరు వంద పాశురములు రచించినారు

పొయిగై ఆళ్వారు ''మొదల్ తిరువందాది'' అను దివ్య ప్రబంధమును రచించగా తరువాతి యిర్వురు వరుసగా ఇరండాం తిరువందాది - మూన్రాం తిరువందాది అను దివ్య ప్రబంధములను రచించిరి

**04 తిరుమళిశై ఆళ్వారు** - ఇతడు ''నాన్ముగన్'' అను **96** పాశురాల ప్రబంధమును తిరుచ్ఛంద విరుత్తం అను **120** పాశురాల దివ్య ప్రబంధమును రచించెను ఇతడు విష్ణువు సుదర్శనాంశలో జన్మించినాడు

**05 నమ్మాళ్వారు** - ఆళ్వారులందరి కంటె ప్రతిభావంతుడు నమ్మాళ్వారు మధురకవి బ్రాహ్మణుడు కాగా, నమ్మాళ్వారు గాండ్ల కులము వాడు సేనానాథాంశమున ఈయన జన్మించెను వరుసగా **100,07,87,1102** పాశురములు గల తిరువిరుత్తం - తిరువాశిరియం - పెరియతిరువందాది - తిరువాయ్ మొళి అను దివ్య ప్రబంధములను రచించిన ఆళ్వారు ఈయన

వారి తరువాత రామానుజీయ మతమునకు మూల పురుషుడు శ్రీమన్నాథ మునులు ఆళ్వారులు ప్రబోధించిన భక్తి గీతములు 'నాలాయిరం' అను (నాలుగు వేల సంఖ్య) ద్రావిడ దివ్య ప్రబంధములుగా ప్రసిద్ధి పొందెను నాథముని పౌత్రుడు యామునా చార్యులు వీరు ప్రాచీన విశిష్టాద్వైతము యొక్క విశిష్టతను శిష్యులకు బోధించిరి వైష్ణవాచార్యులలో అఖండ కీర్తి ప్రతిష్ఠల నార్జించిన వాడు యామునా చార్య (ఆళవందారు) వీరి శిష్యులకు శిష్యులే రామానుజా చార్యులు

**06 మధుర కవి ఆళ్వారు** - నమ్మాళ్వారు ప్రతిభకొక ప్రచారకుని వలె గానము చేసినాడు కుముదగణాంశమున జన్మించిన ఆళ్వారు ఇతడు కణ్ణినుణ్ శిరుత్తాంబు - అను 11 పాశురములు గల దివ్య ప్రబంధ రచయిత ఈయన

**07 కుల శేఖరాళ్వారు** - ఇతడు రాజర్షి ''ముకుందమాల'' అను 40 శ్లోకముల గ్రంథమును రచించెను 'పెరుమాళ్ తిరుమొళి' అను 105 పాశురములు గల దివ్య ప్రబంధమును కూడ రచించెను విష్ణువు కౌస్తుభాంశమున జన్మించినాడితడు

**08 పెరియాళ్వారు** - ఇతడే విష్ణుచిత్తుడు గరుడాంశలో జన్మించిన ఆళ్వారు 12 పాశురాలు గల తిరుప్పల్లాండు 461 పాశురములు గల పెరియాళ్వార్ తిరుమొళి అను దివ్య ప్రబంధమును రచించిన ఆళ్వారు ఇతడు

**09 ఆండాల్** - ఈమె గోదాదేవి రంగనాథుని అనురాగమును పొందిన ప్రేమ మయి భూదేవ్యంశమున జన్మించిన ఈమె 30 పాశురములు గల 'తిరుప్పావై' ని, 143 పాశురములు గల నాచ్చియార్ తిరుమొళిని రచించినది

**10 తొండర డిప్పొడి ఆళ్వారు** - ఇతనికి విప్ర నారాయణుడని పేరు తిరుమాలై - తిరుప్పళ్ళి యెళుచ్చి అను స్తోత్ర గ్రంథముల నీతడు రచించెను అవి వరుసగా 45-10 పాశురాలు గలవి ఇతడు విష్ణువు 'వైజయంతి' అంశమున జన్మించినాడు

**11 తిరుప్పాణి ఆళ్వారు** - ఇతడు పంచమ కులజుడు చేతిలో వీణను ధరించి, శ్రీ రంగనాథుని గూర్చి గానము చేసినాడు 10 పాశురాలు గల 'అమల నాదిప్పిరాన్' - అను ద్రవిడ వేద ప్రబంధమును రచించినాడు ఇతనిది విష్ణువు శ్రీవత్సాంశ

**12 తిరుమంగై ఆళ్వారు** - ఇతడొక విధమైన క్షత్రియుడు జీర్ణావస్థలో నున్న రంగనాథాలయ నిర్మాణమునకు కారకుడైనాడు విష్ణువు శార్ఙ్గాంశలో జన్మించిన

ఈ ఆళ్వారు 1084 పాశురాలు గల పెరియ తిరుమొళి, 20 పాశురాలు గల తిరుక్కురుందాండకం అను దివ్య ప్రబంధములను రచించినాడు

ఇట్లు ఆళ్వారులు అర్చామూర్తి ప్రభావమును తమిళ పాశురములవల్ల, దేశములో అనేక ప్రాంతములలో ప్రచారము చేసి భక్తితత్త్వమును, సిద్ధాంతము నాచరించుచు అనుకరించు చుండిరే గాని ప్రజలలో వ్యాప్తి చేయలేదు కాగా, విశిష్టాద్వైత తత్వమును, విశాల భావ యుతమైన వైష్ణవ సిద్ధాంతమును అవిరళ ప్రచారము చేసిన మహాత్ముడు రామానుజాచార్యుడే తన కాలములో మహమ్మదీయులుగా మారు హిందువులను నివ్వారించి హిందూమత సంఘము లోని ఐకమత్యమునకు, వర్ణకుల భేదములు లేకుండా విశిష్టాద్వైతులుగా చేర్చుకొనుటకు జంకని విశిష్ట తత్త్వవేత్త అతడు

**విశిష్టాద్వైత పదవ్యుత్పత్తి -**

'విశిష్టస్య విశిష్టరూపేణ అద్వైతం' - అని వేదాంత దేశికులు న్యాయ సిద్ధాంత జనమందు విశిష్టాద్వైత వ్యుత్పత్తిని పలికిరి

'విశిష్టస్య అద్వైతమ్ అస్మిన్' - అని ఆంధ్ర శబ్ద రత్నాకరమందు బహువ్రీహి సమాస వ్యుత్పత్తి చెప్పబడెను విశిష్టమైన అద్వైతము విశిష్టాద్వైతమనుట,

న + ద్వైతం    అద్వైతం    విశిష్ట + అద్వైతమ్    విశిష్టాద్వైతమ్

విశిష్టంచ విశిష్టే    విశిష్టయోః అద్వైతమ్ -

**రామానుజాచార్య ప్రతిపాదిత విశిష్టాద్వైతము -**

జీవాత్మవేరు, పరమాత్మవేరు జ్ఞానానంద స్వరూపుడు, వేదవేద్యుడు, పరమపురుషుడు పరమాత్మకాగా, అనేక కర్మలననుభవించునది జీవాత్మ కనుక జీవాత్మ, పరమాత్మ యొక్కటి కానేరవు అయినచో రామానుజుని దృష్టిలో జీవాత్మ వాస్తవికమైనది, నిత్యమైనది, ప్రత్యేకత కలది, ఆత్మ జ్ఞానము గలది ఆత్మలకు స్వాతంత్ర్య శక్తి యున్నప్పటికిని, భగవత్సహాయమున్నపుడే అది లభించును జీవాత్మకు స్వాతంత్ర్య శక్తిని వీరంగీకరించిరి జీవాత్మ నిజమునకు పరమాత్మయే ఈ సత్యమునే చిదానంద రూపం శివోఽహం శివోఽహం అను శంకరుల వాక్యము బలపరచుచున్నది కనుక పరమాత్మ, జీవాత్మ వేరుకాదని యర్థము మరి, జీవాత్మ వేరగుటకు కారణమేమి? అనగా ''లోకవత్తు లీలా కైవల్యం'' - అది పరమేశ్వరునికి లీలావిలాసము మరల పరమాత్మలోనికి చేరిపోవుట అంతవరకు జీవాత్మకు స్వతంత్రశక్తి లేదు రామానుజాచార్యులవారు

ఆత్మసహాయమున్నప్పుడే జీవాత్మకు స్వాతంత్రము లభించునని అనవలసివచ్చెను ఇది యొక రకముగా జడ చైతన్య న్యాయము వంటిది చైతన్య స్పర్శ కలుగగానే జడపదార్థము సైతము చైతన్యవంతమగును అటులనే ఆత్మస్పర్శ సోకగానే జీవాత్మకూడ పరమాత్మగా పరిణమించును

విశిష్టాద్వైతములో అయస్కాంత దృష్టాంతము విశేషముగా ప్రస్తావింపబడుచున్నది సూదంటురాయి చుట్టు ఇనుపముక్కలు ఉన్నప్పుడవి ఆకర్షింపబడును అట్లే సద్భక్తులు కూడ విష్ణువు చేత ఆకర్షింపబడి, తాదాత్మ్యము చెందెదరనుట ఇందలిసారాంశము

విష్ణువే నిత్యుడు - సత్యవస్తువు - మోక్షప్రదాత ఈ యోగ్యత మరొకరికి లేదు హిరణ్యా గర్భాదులు సైతము పునరావృత్తి గలవారే కనుక మోక్షమన్నది వారికే గతిలేదు ఇంక ప్రాణులకు వారు ఎట్లు ముక్తి ప్రదాతలు కాగలరు? మీదు మిక్కిలి విష్ణువే వారికి కూడ మోక్షప్రదాత కాగలడు అందుచేతనే సకలదేవతలలో శ్రీమహావిష్ణువే విశిష్టుడు అతనిలో లీనమగుటయే జీవుని పరమావధి ఇదే విశిష్టాద్వైత ప్రత్యేకత

## రామానుజాచార్య గురువుల నుండి గ్రహించిన విషయాలు:-

రామానుజాచార్యులకు ప్రథమగురువైన యాదవ ప్రకాశకులు అద్వైతి వేదములకు వక్రార్థములను చెప్పు ఈ గురువు ను మేధావియైన రామానుజాచార్య వ్యతిరేకించెను తిరుక్కచ్చి నంబియను గురువు మొదటి గురువు కడనుండి బయటికి వచ్చిన రామానుజులకు వేదాంతసందేహములను తీర్చినాడు రామానుజుల మేనమామ తిరుమల నంబి విశిష్టాద్వైత మతానుసారముగ శ్రీరామాయణార్థమును రామానుజులకు తెలియజేసెను పెరియనంబి పంచ సంస్కారములను గావించి, రామానుజునికి సకల శాస్త్రముల ను పదేశించెను తిరుక్కోటియూర్ నంబి రామానుజులకు తిరుమంత్రార్థములుపదేశించి, విశేషార్థములను తెలిపెను మానసేర్ నంబియను గురువు భక్తికి - శీలములకు కులముతో నిమిత్తము లేదని నిరూపించిన ఆదర్శగురువు తద్భృత్య - పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య - అని కులశేఖరాళ్వారు చెప్పిన భక్తిమార్గమును బోధించిన గురువర్యుడీతడు పంచమ కులస్థుడైనను పరమ భాగవతోత్తముడీతడు

సాధారణముగా విశిష్టాద్వైత మతము నందలి గురువులు మిక్కిలి యాదర్శముగా కనిపింతురు కాని రామనుజాచార్య గురువుగారు అట్లు గాక మంత్రమును గోప్యముగా నుంచుమని శిష్యునికి చెప్పుట అంత సమంజసముగా

కనిపించదు పైగా మంత్రము అధికారికే ఉపదేశించవలెనని శాస్త్రనియమము రామానుజుల వారు అన్ని విధముల నిందుకర్షులు అందుకే మంత్రోపదేశము తీసుకొన్నారు ఇంతవరకే గురువుగారి యుద్దేశ్యము ఇది చాలా పరిమితమైనది రామానుజులవారు తదితర భక్తులను సైతము మంత్రోపదేశమునకు యోగ్యులను గావించి, వారికి కూడా మోక్షార్హతను ప్రసాదించినారు అందుచేత మంత్రము, ఉత్తమమోక్షము ఒకరి సొత్తుగాదని, అందరిందుకు అర్హులగు అవకాశమున్నదని తాత్పర్యము ఆధ్యాత్మిక శాస్త్రము వాచా వేదాంతము గాదు అది అనుష్ఠాన సంబంధి పంచములను స్వాములవారు శిష్యులుగా చేర్చుకొనుట యొకయుదార దృక్పథము స్వాములవారు విశ్వజనతా దృష్టిగల పరిణతమూర్తి పల్నాటి కాలములోని చాపకూటి మహోదంతము ఇందుకు నిదర్శనము

**వైఖానస - పాంచరాత్ర సమన్వయకర్త రామానుజాచార్యులు -**

రామానుజాచార్యులు త్రిదండ సన్యాసము నందభిలాష కలవాడై, ఆదివైష్ణవ సంప్రదాయమైన వైఖానస పద్ధతిని సన్యాస స్వీకారముగావించెను మూడు వెదురు కఱ్ఱలను కలిపి కట్టిన దండమును కాషాయవస్త్రముచే నలంకరించి, దండ ధారణ శాస్త్రవిధిననుసరించి ధరించుటయే త్రిదండధారణమందురు దీనినే త్రిదండ సన్యాసమందురు ఆ మూడు వెదురు కఱ్ఱలే మనగా చిత్ (జీవుడు) అచిత్ (ప్రకృతి), ఈశ్వరుడు ఈ మూడును పరబ్రహ్మయందలి భాగము లనియు, ఈ మూడు ఒకే తత్త్వమును వెల్లడించుననుట

అర్చామూర్తి యైన శ్రీమన్నారాయణుని పూజించుటకు పాంచరాత్ర సిద్ధాంతమనుష్ఠించెను శ్రీ మహావిష్ణు ప్రతిష్ఠార్చనోత్సవాది విషయాలను, అర్చావతార వైభవాలను, భక్తి ప్రపత్తులలో గూడిన భగవదారాధనమే మోక్ష సాధనమను సిద్ధాంతమును నిరూపించునదే పాంచరాత్రము

ఇట్లు రామానుజాచార్యులు వైఖానస పాంచరాత్రములను విభేదించక, సమన్వయ కర్తగనే నిలబడెను

**రామానుజుల విశిష్టత -**

'తిరుక్కోటి యూర్ నంబి' రామానుజ స్వామికి తిరుమంత్రము నుపదేశించెనని మున్నే పేర్కొనబడెను గదా! గురువు శిష్యునకు ఆ మంత్రమును గోప్యముగా నుంచుమనియు, బహిర్గతమొనర్చిన నరకము తప్పదనియు చెప్పియుండెను బినను రామానుజులు గుర్వాజ్ఞను ధిక్కరించి, - తిరుక్కోటి యూర్ నందుగల శ్రీ లక్ష్మీనృసింహస్వామి దేవాలయము గాలిగోపురము నెక్కి,

బ్రహ్మోత్సవాలలో కులమత భేదములను పాటింపక సమస్తజనులకు, నారాయణ మంత్రమును బహిరంగ పరచి, మోక్షమార్గమును చూపించిన ఉదారశీలి తనకు నరకము ప్రాప్తించినను సకలజనులకు మోక్షము లభించుటయే ముఖ్యమని భావించిన పరోపకారి ఈయన

ఇతడు పంచములను సైతము శిష్యకోటిలో చేర్చుకొనెను మానవ సేవయే గొప్పదని, కులము కన్న శీలము గొప్పదని నిరూపించెను దీనిని తన జీవితములో ఆచరించి, ఆదర్శవాది యైనాడు

20వ శతాబ్దమున మహాత్మాగాంధి ప్రతిపాదించిన అస్పృస్యతానివారణ, హరిజనోద్ధరణ, మానవ సేవ మొ ॥ వానిని తొమ్మిది శతాబ్దాల కంటె ముందే రామానుజ స్వామి నిర్వర్తించి, తన జీవితమును ధన్యముగావించు కొనెను రామానుజు లిట్లు వైష్ణవమును ప్రచారము చేసి, తన నూట ఇరువదవ ఏట పూర్ణాయుష్కుడై, దేహత్యాగము గావించిన ధన్యజీవి

అతనిని గురించి ఒక మహనీయుడిట్లు ఆంగ్లములో ధ్రువ పత్రము నిచ్చెను **Ramanuja has combined in himself the profundity of a thinker, the humanity of a saint, the heart of Buddha, the head of Sankara and a very great religious, spritual fervour Any mention of Ramanuja without Sankara and vice - versa will be incomplete'**

రామానుజులు యోచనాపరుడు, మానవత్వము గల యోగి, బుద్ధుని హృదయమును, శంకరుని మేధస్సును, గొప్ప మత సంబంధమైన, ఆధ్యాత్మికమైన (ఆత్మ సంబంధమైన) ఔత్సుక్యమును తనంతకు తానుగా సమ్మిళితము చేసికొన్నాడు ఎన్ని గుణాలను, లక్షణాలను తనలో నిమిడించుకొన్నాడో పై వాక్యమును బట్టి తెలియును ఇతడు విజ్ఞాన సర్వస్వము వలె మనకు గోచరించు చున్నాడు కాగా శంకరుడు లేని రామానుజుడు సైతము లేడనియు, ఒకవేళ యట్లు చెప్పినను అది అసంబద్ధమనియు పై పేరా చెప్పుచున్నది

విశిష్టాద్వైతమునందు ప్రముఖముగా వినబడు శబ్దములు చిత్ - అచిత్ - ఈశ్వరుడు, వీటిని గురించి కొంత వివరించుట అసంబద్ధము గాదు

చిత్ - అచిత్ - ఈశ్వరుడు నిత్యులు

'జీవుడు భగవంతునకు శరీరము

జీవునకు ప్రకృతి శరీరము

రెండిండికి ఆత్మ శ్రీమన్నారాయణుడు

ఈ సంబంధము శరీరాత్మ సంబంధము
ఆత్మ లేనిదే శరీరము లేదు
ఈ రెండు పరమేశ్వరుని నుండి వేరు పడవు
వీటిని గురించి ఇంక కొంత లోతునకు వెళ్ళినచో -

**చిత్తు** - అనగా జీవాత్మ - పరమాత్మ స్వరూపము శరీరేంద్రియాదుల కన్న విలక్షణము, నిత్యము, జ్ఞానానందమయము, అణు పరిమాణము, ఈశ్వరునకు నియామ్యము, శేషము, మోక్షసమయమందీశ్వర సాన్నిధ్యమును చేరును

**అచిత్తు** - ప్రకృతి లేక జగత్తు దీనికి మాయ - అవిద్య అని పేర్లు ఇది జడము, వికారాస్పదము భగవదిచ్ఛచే నానావిధములుగా పరిణమించును భగవంతునకు క్రీడాపరికరము, సంసారమున కిదియే మూలము

**ఈశ్వరుడు** - పరమాత్మ లేక శ్రీమన్నారాయణుడు అదే సత్ - బ్రహ్మ ఇతడు శేషి సకల కళ్యాణ గుణాకరుడు జగత్సర్గ స్థితి సంహారవములకు కర్త చేతనాచేతనముల కంతర్యామి ఇతనికి చిత్ - అచిత్తులు విడదీయరాని సంబంధము గలవి ఈ జీవ జగత్తులు పరమాత్మ నుండి పుట్టి, అతనియందే పరిణతి చెంది, లయమగును

భిన్న స్వరూప స్వభావములు గల చిత్ - అచిత్ - ఈశ్వర తత్త్వములు ఈశ్వరునకు శరీర భూతములై పరతంత్రములై అతనితో సర్వదా అవినాభావ సంబంధము కలిగియుండుననియు, వానితో విశిష్టమగు బ్రహ్మతత్వము ఏకము అనియు- విశిష్టాద్వైతము నిరూపించుచున్నది

**వైష్ణవ తత్త్వము** -

శ్రీ వైష్ణవ తత్వము నందు చిత్తు - అచిత్తు - పరమేశ్వరుడు మూడును ప్రధానాంశములని మున్నే పేర్కొంటిమి గదా! చిత్తు - భగవత్సంబంధి కాగా, అచిత్తు జీవ సంబంధి ప్రకృతి, జీవుడు, పరమేశ్వరుడు ఉత్తరోత్కృష్టము లనుట 'ప్రకృతి కంటెంబరుండగు తన్నును తనకంటెం బరుండగు పరమేశ్వరుని' -[7] విష్ణు చిత్తుఁడెఱింగిన జ్ఞానియని సాహితీ సమరాంగణ సార్వభౌముడు తన గ్రంథములో తెలిపియున్నాడు

**జీవేశ్వర సాధారణ లక్షణములు (చిత్తు)**

| | |
|---|---|
| ప్రత్యక్త్వము | - స్వయముగ తనకు తానై ప్రకాశించుట |
| చేతనత్వము | - జ్ఞానాశ్రయత్వము |
| ఆత్మత్వము | - శరీర ప్రతి సంబంధిత్వము |
| కర్తృత్వము | - సంకల్ప జ్ఞానాశ్రయత్వము - అనునవి |

జీవులు 4 రకములుగా చెప్పబడిరి

**నిత్యులు** - ఈ తెగ జీవులకు సంసారమను బంధము లేదు దేవుని దయ చేత నిత్యైశ్వర్యము నంది, సర్వ శక్తిమంతులుగా ఈ జీవులుందురు భగవంతునకు నిత్యము సన్నిహితులై కైంకర్యము చేయు చుందురు ఆదిశేషుడు, విష్వక్సేనుడు, గరుత్మంతుడు మున్నగువారు ఈ నిత్యజీవుల విభాగమునకు చెందినవారు

**ముక్తులు** - భాగవత సేవయం దాసక్తి కలవారై, శరణాగతి మార్గాను యాయులై, భగవత్ సాన్నిధ్యము నందినవారు ఈ ముక్తులు రామానుజ స్వామి, పన్నిద్దరాళ్వారులు ఇట్టి ముక్తుల తెగవారు

**బద్ధులు** - దేహములపై భ్రాంతి కలిగి, భక్తిలేనివారై, ఇహలోక సంబంధ వ్యాపారమున మునిగి తేలువారు బద్ధులు క్రిమి కీటకాదులు మరియు మానవులు బద్ధులు

**కేవలులు** - సంసార ప్రాప్తియు, భగవత్ప్రాప్తియు నొందని వారు కేవలులు వీరు ప్రత్యేక దృష్టితో మనకు గోచరింతురు వీరు సంసారమును నీచమని భావించి, ప్రకృతి కంటె పరుడైన ఆత్మ స్వరూపుడనని జ్ఞానియై, ఆత్మ సాక్షాత్కారము నంది వీరు చరింతురు

**అచిత్తు** - సత్త్వ, రజస్తమోగుణములకు పాదు అచిత్తు జ్ఞానము లేక మాయాభరితమైనది అచిత్తు ఈ అచిత్తు నుండియే అహంకార పూరితమైన సత్త్వాది త్రిగుణములు పుట్టుచున్నవి

అచిత్తునే ప్రకృతి లేక జగత్తు అనియు నందురు ప్రకృతి జీవేశ్వరులకు భోగ స్థానము ఈశ్వరుని తెలిసి సేవించుట ముక్తికి హేతువు తెలియక సౌందర్యమునకు భౌతికముగా నారాధించుట బంధ కారణము

**ఈశ్వరుడు** - చిత్తు - అచిత్తులకు ఆత్మ ఈ ఈశ్వరుడు ఆ రెండును ఇతనిచే నియమితములు ఇతని కవి శేషములు ఈశ్వరుడు నియంత, శేషి ఈ సకల కార్యములకు ముఖ్యహేతువు ఫలము నొసంగువాడు

శరత్కాల చంద్రుని ధావళధళ్యము నణంచు ప్రసన్న వదనుడుగను, రత్నఖచిత మకర కుండలములు గలవాడును, శంఖ సమ సౌందర్య గ్రీవుడును, శంఖ చక్రాద్యాయుధ ధరుఁడును, ఇత్యాది సాకార రూపుడుగా - భువనైక సుందర మూర్తిగా విష్ణువు వర్ణించ బడినాడు ఈశ్వరుడు ప్రళయ కాలమున సూక్ష్మ చిదచిత్తులకు నిలయమగుటచే ఉపాదాన కారణమును, సృష్టికి సత్య సంకల్పుడగు చున్నందున నిమిత్త కారణమును , కాలాదు లందుండి సృష్టికి సహకరించు చున్నందున సహకారి కారణమును అగుచున్నాడు

బాల్య యౌవనావస్థలు శరీరమునకే గాని ఆత్మకు లేనట్లు లోకమందలి వికారములు ఆత్మరూపుడగు ఈశ్వరునకు లేవు

**పరమాత్మ లక్షణాలు -**

పరమాత్మ లక్షణాలు ఈ క్రింది విధముగా చెప్పబడినది

-(ఆచార్య సూక్తి ముక్తావళి - 402 పేజి)

అ) జగజ్జన్మాది కారణత్వము ఆ) సర్వాంతర్యామిత్వము
ఇ) సర్వ నియంతృత్వము ఈ) సర్వ రక్షకత్వము
ఉ) సర్వ శక్తిమత్వము ఊ) సర్వజ్ఞత్వము
ఋ) సత్సంకల్పత్వము ౠ) శుద్ధ సత్త్వమయత్వము
ఌ) నిఖిలహేయ ప్రత్యనీక కళ్యాణైక తానత్వము
ౡ) నిరుపాధిక నిఖిల బంధుత్వము
ఎ) నిస్సమాభ్యధికత్వాది శుభ లక్షణోప లక్షితుండు

**శ్రీవైష్ణవుల లక్షణము -**

వైష్ణవుడెట్లుండవలెనో సాత్వికునకు తిరుమల నంబి వివరించెను 'సాత్వికుడు సైంధవము (ఉప్పు) వలె మనోవాక్కాయ కర్మలలో దయారస పూర్ణుడుగా నుండవలెను సైంధవమనగా గుఱ్ఱమనియు అర్థము కలదు లక్ష్యశుద్ధికి చిహ్నమైన గుఱ్ఱమువలె సాత్వికుడు త్రికరణ శుద్ధిగా దయా విషయమున ప్రవర్తింప వలెననియు అర్థము సజ్జనుడు సరస్సులోని కొంగవలె దివ్య దేశములో నుజ్జీవింప వలెను

కోడివలె సారవంతములైన పదార్థములను మాత్రమే గ్రహించవలెను వైష్ణవుడు దురభిమానాలకు దూరముగా నుండవలెను - ఈ విషయము 'ఆచార్య సూక్తిముక్తావళి - ఒక పరిశీలనము' నందు చెప్పబడెను (రచయిత తిరువాయిపాటి శ్రీనివాస్)

**వైష్ణవులు - విష్ణువునకు గల సంబంధము -**

విష్ణువునకు వైష్ణవులకు గల సంబంధమును గూర్చి ఆచార్య సూక్తి ముక్తావళి యందు చెప్పబడి నది

సీ॥ పంచపాండవులట్లు భగవంతునకు నిజ
ప్రాణ సమానులు భాగవతులు
సౌమిత్రి పగిది కోసల రాజు సుతునకు
బాహు సమానులు భాగవతులు
జానకి గతి రామ చంద్ర పదచ్ఛాయ

బట్టి చరింతురు భాగవతులు
నారాయణుని కాత్మనయన జిహ్వా కల్ప
పాదాబ్జ సదృశులు భాగవతులు
పద్మ నాంభాంఘ్రి రేఖలు భాగవతులు
పరుని కాయుధ తుల్యులు భాగవతులు

(ఆచార్య సూక్తి ముక్తావళి - పరిశీలనము పుట411)

భాగవతులు అనగా వైష్ణవులు విష్ణువునకు గల సన్నిహిత సంబంధ మీ పద్యమున వర్ణించ బడినది ధర్మ రాజాది పాండవ పంచకము శ్రీకృష్ణునకు ప్రాణసమానమెట్లో - శ్రీరామునకు బాహు సమానముగా లక్ష్మణు c డెట్లుండెనో - రామచంద్రుని అడుగులో నడుగుగా చరించు సీతాదేవి చరించునెట్లో - విష్ణువునకు కనులు, నాలుక, పాదాలు మొ ॥ అవయవములు సన్నిహితముగా నెట్లుండునో - విష్ణువు పాద రేఖలెట్లో - శత్రువున కాయుధ సమానమెట్లో - అట్లు భాగవతులకు (వైష్ణవులకు) విష్ణువునకు సంబంధ ముండునని సారాంశము

## వైష్ణవుడెట్లుండవలెను ?

ఆచార్య సూక్తి ముక్తావళి - పరిశీలనము అను గ్రంథమున - (**395** వ పేజి) నంబిళ్ళ ప్రశ్నకు నంజీయరు ఇట్లు సమాధానమిచ్చెను విష్ణువు యొక్క అర్చావతారమందు ప్రతి వైష్ణవుడు గొప్ప భక్తిని కలిగియుండవలయును వైష్ణవుడు తన భార్యా పుత్ర పౌత్రులపై నెట్టి ప్రీతి కలిగి యుండునో అట్టి ప్రీతిని తోటి వైష్ణవులపై చూపవలెను భాగవతులు తనను పరుష వాక్యాలతో దూషించినను, సహించి వారి పాదాలకు నమస్కరించ వలెనే గాని కోపించరాదు'

**సాకార నిరాకారోపాసన** - నిర్దిష్టమైన ఆకారముగల వానిగా, వివిధాలంకార యుక్తునిగా దైవమును భావించి, పూజించుట సాకార పూజ యందురు

ఆకారమేమియు లేక, జ్యోతి స్వరూపునిగా భగవంతుని భావించి, పూజించుట నిరాకార పూజ యందురు నిరాకార పూజకు సాకార పూజ సోపానమని విజ్ఞులందురు

సాకార నిరాకారోపాసకులలో శ్రేష్ఠులెవ్వరని అర్జునుడు భగవద్గీత ద్వాదశాధ్యాయము భక్తి యోగా రంభమున భగవానుడు శ్రీకృష్ణుని ప్రశ్నించినాడు కృష్ణ పరమాత్మ భక్తికి, శ్రద్ధకు, ఏకాగ్రతకు ప్రాధాన్యమిచ్చెనే గాని, యే మార్గమునకు, సంప్రదాయమునకు ప్రాధాన్యమీయలేదు మనస్సును పరమాత్మ యందు నిలుపుచు, సతతము దైవ చింతనా పరులై, మిక్కిలి శ్రద్ధతో తన నుపాసించు వాడే యుత్తమ యోగి యని పలికెను [8] నిర్గుణ

(నిరాకార) పరబ్రహ్మము నందాసక్తి గల మనస్సు గల వారికి బ్రహ్మ నిష్ఠను పొందుటలో సగుణోపాసకుల (సాకారోపాసకుల) కంటె ప్రయాస మిక్కిలి యధికము దేహాభిమానము గల వారి చేత నిర్గుణోపాసనా మార్గము కడు కష్టముగా పొందబడుచున్నది [9]

సారాంశమేమనగా నిర్గుణ, నిరాకార పూజ కష్టతరమే యైనను, ప్రతి మనుజుడు ఆ స్థాయికి చేరుకొనుటకు అవశ్యము ప్రయత్నము చేయవలెననుట

మూర్తి పంచక వర్ణనము మరియు అర్చామూర్తి వైభవము

విష్ణువు లోకములను లీలామాత్రముగా సృష్టి చేయుచున్నాడు జీవులను ముక్తులను చేయుటకే యతడు సృష్టించు చున్నాడు కృపామూర్తియైన అతని దయయే అతనిని ఐదు విధాలుగా చీల్చినది

అవి - పర - వ్యూహ- విభవ -అంతర్యామి - అర్చావతారములు

1 పరము - శ్రీమన్నారాయణుడు , శ్రీ భూ నీళాది దేవీ సహాయుడు

2 వ్యూహములు - ఇవి నాలుగు (4) కలవు

I) **వాసుదేవ వ్యూహము** - చక్రవాక పర్వతమున కావల అంధతమః పరంబై, యమృత ప్రవాహ పరివేష్టిమై, యనేక దివ్య రత్నమయగోపుర ప్రాకార సౌధ ప్రాసాద మాలికాలంకృతము నైన దివ్యలోకము నందు నిత్య నివాసంబొనర్చి, మునుపు కృష్ణార్జునులకు విప్ర కుమారుల నొసంగిన భగవంతుడు వ్యూహ వాసుదేవుడని పెద్దలందురు

II) **ప్రద్యుమ్న వ్యూహము** - సత్యలోకమున నారాయణాశ్రమమున నివసించు హరి ప్రద్యుమ్నుడు అతడు ద్వారకా సృష్టికి కారకుడు

III) **అనిరుద్ధ వ్యూహము** - పాలకడలి యందు సర్వావతార కారణ భూతుడైన అనిరుద్ధుడుండును

IV) **సంకర్షణ వ్యూహము** - పాతాళ లోకమున సంహార కర్తయైన సంకర్షణుడుండును అతడు నాగ కన్యల చేతను, సిద్ధ ఋషి బృందము చేతను సేవింప బడుచుండును

V) **విభవము** - విభవము వలన రామకృష్ణా ద్యవతారము లుండును

VI) **అంతర్యామి** - యమ, నియమా ద్యష్టాంగాది యోగములచే సాక్షాత్కరింపబడువాడును, హృత్పుండరీక వర్తియగు పుణ్య విశిష్టుడైన మహాదేవుడు అంతర్యామి

VII) **అర్చారూపము** - (అర్చావతారము) సకల మానవులకు గోచరించు వాడును - దాసచేతనుల కభిమతమగు ద్రవ్యమునందు జగన్మోహన దివ్యమంగళ విగ్రహ విశిష్టుడును - అయి భగవత్, భాగవతా చార్య మందిరంబుల నివసించు శ్రీ మహావిష్ణువు అర్చారూపి యనబడును

విష్ణుదేవుని అర్చామూర్తిని పరతత్త్వముగా భావింపకున్నచో ముక్తి లేదు. శ్రీ వైష్ణవము శ్రీ రంగనాథుని, శ్రీ వేంకటేశ్వర స్వామిని పర స్వరూపములుగా నంగీకరించినది. [10]

**ఈ అర్చామూర్తులు 4 రకాలు**

**ఎ) స్వయం వ్యక్తములు :-** స్వయముగా విగ్రహరూపముగా భగవంతుడే ఆవిర్భవించుట.

**బి) దైవ ప్రతిష్ఠితములు :-** విష్ణువును బ్రహ్మాది దేవతలు ప్రతిష్ఠించగా నెలకొన్న అర్చాది మూర్తులు.

**సి) సిద్ధ పురుష స్థాపితములు :-** శక్తి సంపన్నులైన సిద్ధ పురుషులు నెలకొల్పిన విగ్రహాలు.

**డి) మానుష ప్రతిష్ఠితములు :-** మానవులు ప్రతిష్ఠ చేసిన విగ్రహములు.

ఆముక్త మాల్యద యందు శ్రీరంగ పతి ఇక్ష్వాకు వంశకుల దైవము. ఆ విగ్రహము శ్రీరామునిచే విభీషణున కొసగ బడెను. విభీషణుడా దైవమున తన నివాసము లంకకు కొని పోవు చుండగా వారించి, ఉభయ కావేరీ మధ్యమున తానుండదలచితినని అచటనే నిలిచెనని కథ కలదు. కనుక , శ్రీ రంగనాథ విగ్రహము స్వయం వ్యక్తము. ఐనచో శ్రీరంగ మాహాత్మ్యము కావ్యమున హరి యాజ్ఞచే బ్రహ్మ శ్రీరంగనాథుని స్థాపించెనని కలదు. అట్లయిన ఈ విగ్రహము దైవ ప్రతిష్ఠితమగును. స్వయం వ్యక్త మనునదే చాల వరకు సమంజసమని చెప్పవచ్చును. కనుక శ్రీరంగము సాక్షాత్తు వైకుంఠము. దీనిని యామునా చార్యులు భూలోక వైకుంఠముగా చేసెను.

**"He (Yamuna charya) made Sri Rangam a varitable vaikuntha on Earth"**

తర్వాత రామానుజాచార్యులు, వేదాంతదేశికులు మొ ॥ గురుపరంపర - విప్రనారాయణ మొ ॥ వారు తమ పవిత్ర జీవితము లిచ్చటనే గడిపిరి.

పెరియాళ్వారు ( విష్ణు చిత్తుడు) తన కూతురు గోదాదేవిని శ్రీరంగమునకుం గొనిపోయి రంగని దర్శింప c జేసెను.

**వైష్ణవ మత సంప్రదాయాల ప్రత్యేకత :-**

**అ) అవిద్యా విధానము :-** దేహమే తాననియు, బంధు మిత్ర కళత్ర పుత్రాదులు తనవనియు తలంచుటయే అజ్ఞాన మహావృక్షమునకు ఆదిమ బీజమగును. పంచ భూతాత్మకమైన శరీరమందలి జీవాత్మ అవిద్య వలన

ఆవరించబడి, అహంకార మమకారములను భ్రాంతిలోఁ బడి సంచరించును దేహమున కంటె ఆత్మ భిన్నము జ్ఞాని పంచకోశాంతర్గతమగు (పంచ భూతాత్మకమైన) ఆత్మను దేహము నుండి విడదీసి చూచును అజ్ఞాని కలిపి చూచును కలిపి చూచినచో దు ఖము, విడదీసి చూచిన శాంతి

**ఆ) ఆత్మ తాటస్థ్యము** - అశాశ్వతమైన కాయము వల్ల జనించిన పుత్ర పౌత్రాదులు ఆ శరీరమునకే చెందును కాని ఆత్మకు కాదు దేహము ఆత్మ కాదు కనుక దేహ సంబంధితమైన భౌతిక కష్టములు ఆత్మకంటుట లేదు కనుక ఆత్మ తటస్థమైనది

**ఇ) కర్మ నశించు వరకు జీవుడు నిరంతర సాధకుడే** - అనాది కర్మ వాసన ఁ జేసి, అవిద్యావశు ఁ డై అసంఖ్యాక జన్మలందు జీవుడు బ్రహ్మావిద్యచే, ఆ వాసనను జయించి నిరతి శయానందము ననుభవించును అవిద్యాశ్రమ నశింపగనే, జీవుడు తొల్లింటి వలె స్వస్థు ఁ డై, మోక్ష సామ్రాజ్య మనుభవించును

**ఈ) బంధ మోక్షము - యోగము** - 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' - అను ఆర్యోక్తి రీత్యా ప్రాణుల బంధ మోక్షములకు మనస్సే కారణము విషయాసక్తమైన మనస్సు బంధింప బడును విషయ విముక్తమైన మోక్షము నందును

యమ నియమాదులచే పరిశుద్ధమైన సాత్త్విక చిత్తవృత్తిని బ్రహ్మము మీదికి నడుపుటయే యోగము దానిని చేయువాడే యోగి

**విష్ణు సర్వాంతర్యామిత్వము** -

విష్ణువు క్షేత్రజ్ఞ శక్తి స్థావరములు - సర్పములు - పక్షులు - మృగములు - మనుష్యులు - యక్ష గంధర్వులు - దేవతలు - దేవేంద్రుడు - దక్షుడు - బ్రహ్మయందు ఉత్తరోత్తర బలీయముగా నిబిడీకృతమై యుండునను సారాంశమేమనగా విష్ణువు సర్వాంతర్యామి

**విష్ణువు - అవతారములు** -

'యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానమ్ సృజామ్యహమ్'
'పరిత్రాణాయ సాధూనామ్, వినాశాయచ దుష్కృతామ్
ధర్మ సంస్థాప నార్థాయ, సంభవామి యుగే యుగే' [11]

అని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో పేర్కొనినాడు ధర్మమునకు గ్లాని సంభవించునపుడు, తనను సృష్టిచేసి కొందునని తన అవతార కారణమును,

సాధు రక్షణ, దుష్ట నాశనముల నాచరించుటకై - ధర్మమును స్థాపించుటకై ప్రతియుగము నందును తాను జన్మింతునని తన అవతార ఫలితమును స్వామి వివరించినాడు దేవమానవాది రూపములందు విష్ణువు జన్మించినను, అతనికి కర్మలంటవు రావణాసురాది బలవంతుల పైనను అతనికి విజయమే కల్గెను అనగా దైవము మానవాది రూపధారణము చేసినపుడు, తనకు కర్మ ఫలము లేకున్నను ఉన్నట్లుగా నటించుటకై కొంత కర్మ కలాపమును కల్పించుకొనుట కలదు

**తెంగలులు - వడగలులు** - రామానుజాచార్యుల తదనంతరము 14 వ శతాబ్దమున విష్ణువునకు - భక్తునకు మధ్య గల సంబంధమును వైష్ణవులలో రెండు వర్గముల వారు ద్వివిధములుగా వర్గీకరించిరి

**తెంగలులు (తెంగలై)** - ఇది దాక్షిణాత్య సంప్రదాయము **(తెన్ + కలై)** - తెన్ అనగా దక్షిణపు దిక్కని అర్థము కాగా, దక్షిణ దేశ సంప్రదాయ విధానమని వ్యుత్పత్త్యర్థము వీరికి ద్రావిడ దివ్య ప్రబంధము లందు ప్రామాణ్యమెక్కువ వీరు 'నాసి కస్య త్రయో భాగఃనాసిక మూల ముచ్యతే' -అను ప్రమాణమును బట్టి ముక్కు సగభాగము నుండి ఆరంభమగునట్లు ' Y ' ఆకారముతో నామమును ధరింతురు శ్రీ చూర్ణ రేఖను లక్ష్మీ స్వరూపముగా భావించి, పద్మాకారముతో నుండవలెనందురు రక్త వర్ణ మిశ్రితమైన దానినే నామముగ ధరింతురు వీరు భాగవతులకు నమస్కరించునపుడు - 'నమో నమో భాగవత ప్రణాయ' ఇత్యాది సూక్తులతో పునః పునః ప్రణామములు చేయుదురు

స్వామి నిర్హేతుక జాయమాన కటాక్షమే మోక్షహేతువు మానవ ప్రయత్నమక్కర లేదు ఈశ్వర కృప మాతృస్తన్య సదృశము శ్రీదేవియు స్వామి భక్తురాలే ఆమెకు ఈశ్వరత్వము నాపాదింపరాదు - అనునవి వీరి సిద్ధాంతములు

**ప్రపత్తి** -

వైష్ణవ మత సిద్ధాంతాలలో ప్రముఖమైనది ప్రపత్తీమార్గము 'ప్ర' అను ఉపసర్గతోడి, సద్ నుధాతువు చే పత్తి అని రూపమేర్పడినది పత్తి = గతి అనగా జ్ఞానమని యర్థము ప్రకృష్టమైన పత్తి ప్రపత్తి ప్రపత్తి = శ్రేష్ఠమైన జ్ఞానము 'పద్యతే అనేన ఇతి ప్రపత్తిః' - అనియు వ్యుత్పత్తి కలదు ముక్తి ప్రాప్తి సాధన ప్రపత్తి యని పై వాక్యార్థము శ్రీరామానుజమతానుసారము ప్రపత్తికి పర్యాయపదాలు న్యాసము - శరణాగతి - ప్రపదనము ప్రపత్తియనగా శరణాగతి పత్ = పడుట, ప్రపత్తి = చిత్త శుద్ధితో దేవుని పాదాల నాశ్రయించుటను

ప్రపత్తియందుదు అహంభావమును చంపుట దీని యుద్దేశము అందుకే ఇది యోగముగా ప్రశంసింపబడినది

భక్తుడు ప్రపత్తితో భగవంతునికి తన సమస్తమును సమర్పించుకొక్కటే చేయవలెను ఆత్మ నివేదనము చేసికొనవలెను అప్పుడు భగవంతుడు తనంతట తాను భక్తునికి సాయుజ్యము ప్రసాదించును దీనిని 'మార్జాల కిశోర న్యాయము' అని యందురు పిల్లి తన పిల్లలను వలె దైవము భక్తుని యోగక్షేమములను చూచుట వలననే ఈ న్యాయము సమన్వయింప బడుచున్నది తెంగల్ వారు పాల ముంచినను నీటముంచినను నీదే భారమని పిల్లి పిల్లలు తమ తల్లి పిల్లిపై భారము వేసినట్లు భగవంతుని పై భారము వేసి, నిశ్చింతగా నున్నచో వారి క్షేమములు భగవంతుడు చూచుకొనునని భావింతురు

**వడగలై (వడ + కలై)** - ఔత్తరాహిక సంప్రదాయ విధానమిది సంస్కృత వేదములందు ప్రమాణమెక్కువ కల వడగలై వారు శ్రీ భాష్యము మొదలగు ఉత్తర దేశ సంప్రదాయాలను అనుసరింతురు

వీరు ఊర్ధ్వపుండ్ర ధారణలో 'నాసికామూల మారభ' అను ప్రమాణమును బట్టి **'U'** కనుబొమల మధ్య నుండి నామము ధరింతురు వీరు శ్రీ చూర్ణమును పీత వర్ణము గల దానినే ధరింతురు వీరు ప్రపత్తి ననుసరించి, ఒక మారే దండప్రణామము గావింతురు

భగవత్కృపకు మానవ ప్రయత్నమవసరము ప్రయత్నపూర్వకముగ భక్తుడు భగవంతుని అత్యంత శ్రద్ధాభక్తులతో ఆరాధింప వలెను అప్పుడు భగవంతుడు భక్తునను గ్రహించును ఇది **'మర్కట కిశోర న్యాయము'** తల్లి కోతిని పిల్లకోతి పొట్టకడ గట్టిగా అంటి పెట్టుకొనును దానిని తల్లి కోతి సురక్షితముగ గమ్యస్థానమునకు చేర్చును ప్రపత్తి మార్గమే మోక్షసాధనము

లక్ష్మీ విశిష్టుడైన శ్రీమన్నారాయణుఁడే ముక్తి ప్రదుడు శ్రీదేవి సహితమైన ఈశ్వర తత్వమే శ్రీమన్నారాయణ తత్వము

వేదోప నిషత్తులు - దివ్యప్రబంధములు ఈ శాఖీయులకు మూలము స్వామి సహేతుక కటాక్షము అంగడిలోని పాలు

**వైఖానస పాంచరాత్ర భేదాలు** - వైష్ణవము నందు వైఖానసమని పాంచరాత్రమని ప్రధానముగ రెండు భేదములు గలవు వీని ననుసరించు వారిని వైఖానసులని, పాంచ రాత్రులని యందురు

**1 వైఖానసము**- శ్రీ మహావిష్ణు మానసపుత్రుడు విఖనసుడు ఈ విఖనసుడు రచించి, బోధించిన సూత్రమే వైఖానస సూత్రము వీరి ముఖ్య శిష్యులు అత్రి

భృగు - కాశ్యప - మరీచ్యాది మహర్షులు వీరనేక శ్లోకములు గల సంహితలు వ్రాసిరి

"శ్రీనివాస స్మృతి" అను ధర్మశాస్త్రములో "అహమేవ గురుస్తేషాం గర్భ వైష్ణవ జన్మనామ్" - అని భగవంతుడు చెప్పిన ప్రకారము సృష్ట్యాది నుండియు వైఖానసులు ఏ ఇతర గురు పీఠాశ్రయము లేకయే స్వయమాచార్యులై, విశిష్టాద్వైత మతము ననుసరించు చున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది విఖనస మహాముని సూత్రముల ననుసరించు వారు వైఖానసులు

శ్రీరామ చంద్ర మూర్తి వనవాసము చేయునపుడు విఖనస మహామునిచే చెప్పబడిన వాన ప్రస్థాశ్రమ ధర్మము ననుసరించెనని రామాయణము నందున్నట్లు శ్రీ వి టి శేషాచార్యులు తన "దేవాలయములు - తత్త్వ వేత్తలు" గ్రంథమున (పుట 39) పేర్కొనెను

"తతో వైఖానసం మార్గ మాస్థిత స్సహ లక్ష్మణః"

విఖనసా ప్రోక్తం వైఖానసం మార్గం వాన ప్రస్థ ధర్మం"

రామాయణ భారతాది గ్రంథములలో పెక్కుచోట్ల వైఖానసుల ప్రస్తావన కలదు త్రిదండ సన్యాసము స్వీకరించదలచిన వారికి వైఖానస సూత్రమే ముఖ్యాధారము కనుకనే శేషాంశ సంభూతుడైన రామానుజస్వామి విశాల దృక్పథముతో వైఖానస పద్ధతినే త్రిదండ సన్యాసమును స్వీకరించెను

చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రిగారు 'వైఖానసులు వైష్ణవులు' అనెడి శీర్షికతో ఆంధ్ర వారపత్రికలో వైఖానస ప్రాచీనత చెప్పలేమనియు, వారి సూత్రముతో పని లేకుండగనే సొంత సూత్రము గలవారనియు,

ఆగర్భ - అతి ప్రాచీన వైష్ణవులనియు గొప్పగా వ్రాసి యుండిరి

తిరుమల వేంకటేశ్వర స్వామి సహస్రనామ స్తోత్రమునందు "వైఖానస మఖారంభో వృషజ్ఞేయో వృషాచలః వైఖానస ముని శ్రేష్ఠ పూజితాయ నమో నమః" - అని వేంకటేశ్వర స్వామి వైఖానస పరతంత్రుడని చెప్పబడినది నేటికిని తిరుమలలో స్వామి అర్చకులు వైఖానసులు

కాగా, కర్నూలు జిల్లాలోని వైష్ణవాలయాలలో పాంచరాత్రాగమ పద్ధతి ప్రకారమే పూజలు జరుగుచున్నవి

దేవాలయములలో విగ్రహముల ద్వారా భగవంతుని ఆరాధించుట విఖనసుని ప్రతిభ వలననే జరిగినది ఆ పద్ధతిని పాంచరాత్రులు సైతము పిదప ననుసరించిరి విఖనసుని ఆరాధనా విధానములో అవైదికము లెక్కడను లేవు

అనాది నుండియు ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రములలో ప్రసిద్ధ విష్ణ్వాలయాలలో వైఖానసులే అర్చకులుగా గలరు చోళరాజులు, విష్ణుపూజానిమిత్తము వైఖానసులను తమ దేశమునకు పిలిపించుకొన్నారు ఈ నాటికిని వైఖానస సూత్ర ప్రకారవము విష్ణ్వారాధనవము గావించు ప్రముఖాలయాలలో తిరుమల, తిరుపతి, శ్రీ వైకుంఠము, వానమామలై, మహాబలిపురము శ్రీ పెరంబుదూరు, మంగళగిరి, వేదాద్రి మొ॥ క్షేత్రములు కలవు

ఆంధ్ర దేశమున గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలలో వీరి సంఖ్య విశేషముగను, ఇతరములైన జిల్లాలో స్వల్పముగః గన్పట్టును వీరి గృహములు గ్రామవమున నొకటి రెండు తప్పయుండవు వీరి కిష్యులు ఆళ్వారులు - మఠాధిపతులు

శ్రీ రామనుజాచార్యులకు పూర్వము వైష్ణవ సనాతన దేవాలయ మైన శ్రీరంగవములో వైఖానసార్చకులే యుండిరి ఆ రంగనాథాలయవములో వైఖానసులను తర్వాత తొలగించి, పాంచరాత్రులను నియమించినట్లు తమిళ శ్రీరంగమాహాత్మ్యము సాక్ష్యమిచ్చు చున్నది

శ్రీ రామానుజాచార్యులు దేహత్యాగము చేయనెంచి మూడహో రాత్రులు భగవంతుని ప్రార్థించుచు, తన నిర్యాణానంతరము తన భక్తులర్చించు కొనుటకై శిలావిగ్రహమును చేయించి, తన పదునారు కళలను ఆశిలా విగ్రహము నందుంచ వలెనని భావించి, పాంచరాత్ర విధానమున ప్రయత్నించి విఫలుడ య్యెను పిదప విఖనస శాస్త్ర ప్రకారముగ బింబ శుద్ధి చేయించి, దినముకొక కళచొప్పున షోడశకళల నావిగ్రహమునందు న్యాసము చేయించెను ఆ మహాకార్యమునకు మోదమంది, ఇట్లు ప్రస్తుతించినాడు

'' అనిందితా చార మనన్య భాజనం, దాస్యైక నిష్ఠం కరణత్రయేణ
అనారతం శ్రీపతి పాద పద్మయోః, భజామి వైఖానస మాదివైష్ణవమ్''

**౨) పాంచరాత్రము:-**

పాంచరాత్రమును గూర్చి విభిన్న వ్యుత్పత్తులు కలవు

1) ''పంచసు రాత్రిషు యత్రోక్తం తత్ పంచరాత్రమ్,
పంచరాత్రమేన పాంచరాత్రమ్'' - అను నిర్వచనమునుబట్టి అయిదు రాత్రులందు చెప్పబడినది పాంచరాత్రమే, అనగా విష్ణువుచే ఐదు రాత్రులందు చెప్పబడిన వైష్ణవము పాంచరాత్రము

2) విష్ణువు బ్రహ్మకు ఐదురాత్రులు పదేశించినది పాంచరాత్రము

3) విష్ణువు ఇంద్రాది దేవతలకు ఐదు రాత్రులుపదేశించినది

4) విష్ణువు శ్రీదేవి - బ్రహ్మ - అనంత - గరుడ - విష్వక్సేనులు అను ఐదు గురికి ఐదురాత్రులుదేశించినది పాంచరాత్రము

5) శాండిల్య - ఔపగాయన - మౌంజాయన - కౌశిక - భారద్వాజ మహర్షులకు (ఐదుగురికి) ఐదురాత్రులు విష్ణువుపదేశించినది పాంచరాత్రము

6) విష్ణువు చెప్పగా - చివరి అంచెగా పాంచరాత్రులు పాంచరాత్రమును గ్రహించిరనుట మరొక మతము (విష్ణువు - బ్రహ్మ - దేవగణము - సప్తర్షులు - పాంచ రాత్రులు)

7) పరమ తత్వము - ముక్తి - భుక్తి - యోగము - విషయము (సంసారము) అను ఐదు విషయాల జ్ఞానము నిరూపించుట చే దీనికి పాంచరాత్రమని అందురు

ఆగమము - తంత్రము - సాత్వతము - భగవచ్ఛాస్త్రము అని పంచరాత్రమునకు పర్యాయ పదములు గలవు

శ్రీమహావిష్ణు ప్రతిష్ఠార్చనోత్సవాది విషయములను, అర్చావతార వైభవములను, భక్తి ప్రపత్తులలో గూడిన భగవదారాధనమే మోక్షసాధనమను సిద్ధాంతమును చక్కగా నిరూపించు తాత్విక విషయములీ శాస్త్రములందు చెప్పబడినవి

పాంచరాత్రు లొకే సూత్రము గలవారుగాక, అనేక సూత్రములు గలవారై యున్నారు

ఇందు శుక్లయజుశ్శాఖీయులగు కాత్యాయన సూత్రులు,

కృష్ణయజు శ్శాఖీయులగు ఆపస్తంబ సూత్రులు మొ॥ వారు గలరు

తమిళనాడు శ్రీ రంగములోని శ్రీ రంగనాథార్చకులు, కాత్యాయన సూత్రీయులు పాంచరాత్రులు ఆంధ్రదేశ భద్రాచలసీతారామ ప్రధానార్చకులు ఆపస్తంబ సూత్రీయులగు పాంచరాత్రులు

పాంచరాత్రులకు దీక్ష. - ఏ సూత్రీయులైనను పాంచరాత్రాచార్యుల వలన పాంచరాత్రాగ మోక్త రీత్యా గృహదేవతార్చనాధికార మొసగుపంచ సంస్కార దీక్షను, ఆలయార్చనాధికారము నిచ్చు చక్రాబ్జమండల దీక్షను గైకొని, విష్ణ్వర్చనాధికారమును సంపాదించుకొని వంశపరంపరగా భగవంతుని పూజించువారు పాంచరాత్రులు

పంచ సంస్కార దీక్షయనగా - తప్త శంఖ చక్రాంకనము - ఊర్ధ్వపుండ్ర ధారణము - భగవన్నామ ధారణము - వైష్ణవ మంత్రానుష్ఠానము -

విష్ణుపూజనము అనునని పంచ సంస్కారములు

**పాంచరాత్ర ప్రసిద్ధి** - ప్రపంచములో పాంచరాత్రము సజీవమై, మనోహరమై, ఆస్తిక మతములలో నొకటై, పరిపూర్ణమతముగా ప్రసిద్ధినొందినది మహాభారత శాంతి పర్వము పాంచరాత్రమును గురించి వివరించినది

వైకుంఠపురమున దేవతలు విష్ణుస్తోత్రమును గావించుచు పాంచరాత్రులు విష్ణువును భజించుటను పేర్కొనిరి ఈ పాంచరాత్రులు దాస్యభక్తితో సేవించిరని యిట్లు చెప్పబడినది

ఉ॥ ''దాస్యమొకండునుం బరమధర్మముగాఁగొని యన్యధర్మమా
శాస్యముగా గణింపక, యసంశయ నిశ్చల భక్తి సంతతో
పాస్యు నశేష భవ్యపురుషార్థ భవైక విధాయి నిన్న నా
లస్యతఁ బాంచరాత్రులు దలంచి భజింతురు భక్తవత్సలా ''

(ఎజ్ఞన నృ పు 3-27)

వైష్ణవాచార్యులలో ప్రసిద్ధుడైన యామునాచార్యుడు పాంచరాత్రమునసీ విష్ణువును ప్రశంసించినాడు పాంచరాత్రులలో వడగలై, తెంగలై తెగల వారున్నారు బనను భేదాభిప్రాయములు లేక పంక్తిభోజనాలు చేయుచు, ఆచార భేదము లేకుండిరి

**పాంచరాత్రాగమ ప్రకారము అర్చన జరుగుచున్న ప్రసిద్ధాలయాలు-**

శ్రీరంగము, కంచి, తిరువళ్ళూరు, అహోబిలము, సింహాచలము మొ॥

ఈ వైఖానస పాంచరాత్రులు భేదాభిప్రాయాలు కల్గియున్నను, భగవంతుని దృష్టిలో భేదము లేదు

''వైఖానసం పంచరాత్రం నేత్రయుగ్మ సమం మమ'' - అనగా వైఖానస పంచరాత్రములు రెండు నాకు నేత్రముల వంటివని భగవానువాచ

శ్రీ వేంకటేశ ఘంటాంశగా ప్రస్తుతింపబడిన వేదాంత దేశిక స్వామి తన 'శరణాగత దీపిక' యందిట్లు ఇర్వురి ని ధన్యులుగా కీర్తించెను

''త్వాం పాంచరాత్రిక నయేన పృథగ్విధేన
వైఖానసేనచ పథానియతాధి కారాః
సంజ్ఞా విశేష నియమేన సమర్చ్య యంతః
ప్రీత్యా నయంతి ఫలవంతి దినాని ధన్యాః''

శ్రీ మన్నారాయణునుద్దేశించి - తమ శాస్త్ర నియమితాధికారము గలవారై వైఖానస పాంచరాత్రులు తమ విధిననుసరించి, భగవత్పాదములను

ప్రతిదిన మర్చించుచు, వానిని ఫలవంతములను గావించుకొని, మహానంద ముగా కాలము గడుపుకొనుచు ధన్యులైరి గదా! యని పై శ్లోకార్థము

ఏ ఆగమమునకు చెందిన వారైనను, విష్ణువును పూజించు వారు భాగ్యవంతులనుట సారాంశము

**మోక్షసాధనకు మార్గాలు 4 -** 1 కర్మ 2 జ్ఞానము 3 భక్తి 4 ప్రపత్తి

**సద్వారకములు** మొదట రెండైన కర్మ జ్ఞానములు, మూడవదైన భక్తి ద్వారా మోక్షప్రదములు మొదటి రెండు సద్వారకములు

**అద్వారకములు** భక్తి సాక్షాత్తుగా మోక్షమును ప్రసాదించు నదగుటచే అద్వారకము కనుక, సద్వారకము + అద్వారకము = ప్రపత్తి

ఇది స్వయముగాను, పై యోగముల ద్వారాను ఫలము నొసంగును చేయు వారి అర్హతలను బట్టి ప్రపత్తి 3 విధములు

**1 స్వనిష్ఠ -** తత్త్వ మెరిగినవాడు స్వయముగా చేయునది స్వనిష్ఠ

ఉదా॥ ద్రౌపతి శరణాగతి

**2 ఉక్తినిష్ఠ -** దైవము నందు విశ్వాసముంచుట, గురువు చెప్పినట్లు అర్థముతో నిమిత్తము లేకుండ అనుష్ఠించుట

ఉదా॥ బ్రహ్మచారి 'భిక్షాందేహి'' అనినపుడు గృహిణి వానికర్థము తెలియునా? తెలియదా? యని ప్రశ్నింపక భిక్షనిడుట

**3) ఆచార్యనిష్ఠ-** భగవంతుని శరణుకోరునపుడు గురువు - తన నాశ్రయించిన వారిని వారి ప్రమేయము లేకుండ రక్షించుమని దైవమును ప్రార్థించుట యిట్టిది

సంస్కృతములో ఆది కావ్యము రామాయణము అట్లే వైష్ణవులు శరణాగతిని నిరూపించు మొదటి నిదర్శనములను రామాయణము నందే చూపుచున్నారు భగవాన్ శ్రీరామ చంద్రుడు ప్రసన్నులైన (శరణు కోరిన) జనుల నుద్ధరించుటయే యిందలి కాండలన్నిట నిండియున్నది

శ్రీ రాముడు శరణ మర్థించిన వారి నుద్ధరించుటకే అవతరించినాడు

1 శిలామూర్తి అహల్యనుద్ధరించినాడు
2 కాకాసురుని కాపాడినాడు
3 సుగ్రీవునకు రాజ్యమిప్పించినాడు
4 శత్రుపక్షము వాడైన విభీషణునకు శరణమిచ్చినాడు

ఇటనొక విచిత్రము కలదు రామాయణము నందలి ప్రతి వ్యక్తియు భగవంతుని శ్రీ పాదపద్మముల కడకు వచ్చి నమస్కరించినపుడే వారి నుద్ధరించినాడు ఇది వడగలై సంప్రదాయము వంటిది అనగా ఔత్తరాహ (ఉత్తరాది) సంప్రదాయమిదే

కాగా, ఆముక్తమాల్యద యందలి భక్తరక్షణము తెంగలై సంప్రదాయము వంటిది అందు శ్రీ రంగనాథుడు భక్తులను తానే వెదకికొనుచు వచ్చి, రక్షించెను ఇది దాక్షిణాత్య (తెంగలై) సంప్రదాయము, ద్రావిడ వేదమిది

రామాయణ నాయకుడు శ్రీరామ చంద్రమూర్తి అవతారమూర్తి ఆముక్తమాల్యదా నాయకుడు రంగనాథుడు అర్చావమూర్తి ప్రహ్లాద, విభీషణాదులు అవతార శరణాగతిచే ముక్తి నందినారు

**ఉపసంహారము:-**

శంకరాచార్యులు ప్రతిపాదించిన కఠోరమైన అద్వైత మార్గమునకు ప్రత్యామ్నాయముగా సకల ప్రజానీకమునకు ఆచరణ సులభమైన భక్తి మార్గమును భారతదేశములో సుప్రతిష్ఠితము చేసిన ఘనత తక్కిన వారందరి కంటె ఎక్కువగా 'విశిష్టాద్వైతమును' ప్రతిపాదించిన రామానుజాచార్యులకే దక్కినది

శంకరాచార్యులు సైతము దేవతారాధనను, భక్తిని అంగీకరించి, ప్రబోధించినను భక్తిమార్గమునకు శంకరుడు ద్వితీయస్థానము మాత్ర మిచ్చెను జ్ఞాన ప్రధానమైన కఠోర సన్యాస మార్గము నవలంబించ లేనివారి సౌకర్యార్థము మాత్రమే ఆయన భక్తి నంగీకరించినట్లు తెలియ చున్నది

ఇట్లు విశిష్టాద్వైతము నందు దైవభక్తి చే మోక్షము కలుగుచున్నది విశిష్టాద్వైతములో ప్రపత్తి యను భక్తి విశేషముగానున్నట్లు చెప్పబడినది ప్రపత్తి యనగా భగవంతున కాత్మార్పణము గావించు కొనుట, ద్వైతము వలెనే విశిష్టాద్వైతము సైతము జీవుడు పరమాత్మ కంటె భిన్నుడనియే పలుకును కాగా, గుణములలో జీవుడును పరమాత్మ వంటివాడే యని ఈ విశిష్టా ద్వైతము పలుకుచున్నది

12 వ శతాబ్దము నాటికే వైష్ణవము తెలుగునాట ప్రవేశించి, మొదట జైనులతో, తర్వాత శైవము తోడను పోరాడినది లింగము కట్టిన వారందరిది ఒకే లింగవంతకులమని వీరశైవులన్నట్లు వైష్ణవులు కూడ ముద్రలువేయించుకొని, ఊర్ధ్వపుండ్ర ధారులైన వారందరును ఒకే కులము వారని, పలనాటి వీరచరిత్రకాలము నాటి బ్రహ్మనాయుడు నిరూపించినాడు అతడు చాపకూడు సిద్ధాంతమును ప్రచారము చేసెను కులమత భేదము లేక అందరిని ఒకే బంతిలో కూర్చుండ బెట్టి, భోజనము చేయించిన విధానమిది

ఆంధ్ర దేశమున 12 వ శతాబ్ది నాటికి ఆంధ్ర సాగర తీరములో శ్రీ కాకుళము జిల్లాలోని శ్రీకూర్మము, విశాఖ జిల్లాలోని సింహాచలము, గోదావరి జిల్లాలోని సర్పవరము, గుంటూరు జిల్లాలోని బాపట్ల అను వైష్ణవ క్షేత్రము లేర్పడినవి

11వ శతాబ్ది నుండి వైష్ణవ ప్రధాన దేవతలకే కాక, పరివార దేవతలకు సైతము గుడులేర్పడినవి ఉదా పన్నిద్దరాళ్వారులకు గల మందిరములు

## అధస్సూచికలు - ప్రథమాధ్యాయము

1 విశ్వ విజ్ఞాన దర్శిని సంకలన రచనలు, జె నరేంద్రదేవ్, పేజీలు 222 – 223 ప్రచరణ ఫోనిక్స్ పబ్లికేషన్స్, విజయవాడ 1987 ఏప్రిల్

2 విశ్వ విజ్ఞాన దర్శిని సంకలన రచనలు, జె నరేంద్రదేవ్, పేజి 223

3 విశ్వ విజ్ఞాన దర్శిని సంకలన రచనలు, జె నరేంద్రదేవ్, పేజి 224

4 విశ్వ విజ్ఞాన దర్శిని సంకలన రచనలు, జె నరేంద్రదేవ్, పేజి 224

5 శ్రీ నిర్వచన మహా భక్తవిజయాను శీలనము,ఎం ఫిల్ గ్రంథము, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము, వేంకటరమణమూర్తి పేజి 53 అముద్రితము

6 ముండకోపనిషత్తు – తృతీయ ముండకము – ప్రథమ ఖండము (శర్వానంద స్వామి ఆంగ్లమూలమునకు బ్రహ్మచారి చిన్మయచైతన్య తెలుగుసేత రామకృష్ణమఠము – మైలాపూరు – మద్రాసు 1986 పేజి 58,

7 అముక్తమాల్యద – శ్రీకృష్ణదేవరాయలు, వావిళ్ళరామస్వామి శాస్త్రులు, మద్రాసు 1969 1వ ఆశ్వాసము-78వ పద్యము - 65వపేజి

8 బగవద్గీత, అధ్యాయము 12, శ్లోకము 2

9 భగవద్గీత, అధ్యాయము 12, శ్లోకము 5

10 అముక్త మాల్యదా దర్శనము, ఆచార్య తుమ్మపూడి కోటీశ్వర రావు

11 భగవద్గీత, అధ్యాయము 4 – శ్లోకాలు 7,8 పేజి 278 – 279 శ్రీ శ్రీశ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వామి (స్థూలాక్షరి తాత్పర్యము) – శుక బ్రహ్మాశ్రమము, కాళహస్తి 1986

# ద్వితీయాధ్యాయము
# కర్నూలు జిల్లా వైష్ణవ క్షేత్రాల ప్రశస్తి

## ఉపోద్ఘాతము

### కర్నూలు జిల్లా భౌగోళిక స్వరూపము:-

చారిత్రక, సాంస్కృతిక, రాజకీయ రంగములందు కర్నూలు పట్టణము విశేష ప్రాముఖ్యమును సంతరించుకొన్నది ఒకప్పటి ఆంధ్ర రాష్ట్ర రాజధానిగా, రాయలసీమకు ముఖద్వారముగా ( **The Gate way of Rayalaseema**) కర్నూలు జిల్లాకు ప్రాముఖ్యము కలదు

**నామౌచిత్యము**[1] ముందుగా కర్నూలునకు ఆపేరెందుకు వచ్చెనో సంగ్రహాముగా తెలిసికొందము

1 ఇక్ష్వాకు వంశ రాజులలో ఆద్యుడైన బహుబల శాంతమూలుని కాలములో మహాతలవరస్కంద నాగుడు దీనిని నిర్మించెననియు, అతని పేరు మీద ఈ పట్టణమునకు 'స్కందనప్రోలు' అనునామమేర్పడెనందురు ఆపేరే కాలక్రమమున ప్రజావ్యవహారములో 'స్కందనప్రోలు' (కందనవోలు) - కందనపోలు - కందనవోలు ఇట్లు రూపాంతర మంది చివర కర్నూలుగా మారెనంట! స్కందన - అను సంస్కృత శబ్దము 'కందన' గా మారినది మహబూబ్‌నగర్ జిల్లా నాగర్ కర్నూలు ను సైతము స్కందనాగుడే నిర్మించినట్లు చరిత్ర సాక్ష్యమిచ్చుచున్నది

2 మరొకవాదన 11 వ శతాబ్దములో పశ్చిమచాళుక్యుల పాలనా కాలములో తుంగభద్ర కావలి తీరమున నున్న అలంపూరు దేవాలయ నిర్మాణమున కవసరమైన రాళ్లను కర్నూలు పట్టణ సమీపములోని జగన్నాథ గట్టు నుండి తోలిరంట! జగన్నాథ గట్టు నుండి అలంపూర్ వెళ్లుటకు కర్నూలు మీదుగా తుంగభద్రను దాటి వెళ్లవలసియున్నది నదిని సులభముగా దాటుటకు బండ్లకు దట్టముగా కందెన పట్టించ వలసియుండెను కర్నూలులో తుంగభద్రా నదీ సమీపమున 'బండ్లమెట్ట' అను వీధి నేటికిని కలదు ఆనాటి బండ్లు ఇచట నిలిపి యుండుట చేతనే దీనికి పేరు వచ్చిననియు, ఇచటనే కందెన దట్టముగా బండ్లకు వేసిరనియు జనులందరు కర్నూలు సంతలో కందెన చౌకగా లభించెడి దంట!

3 మరొకయంశము ద్వాదశ జ్యోతిర్లింగములలో శ్రీశైల మొకటి శైవ క్షేత్రము ముందు నంది అవశ్యముండును శ్రీ శైలము వెళ్లుదారిలో నందికొట్కూరు కలదు శైవ బ్రాహ్మణులకు నిలయమైన బ్రాహ్మణకొట్కూరు, శివుని పుత్రుడైన

వెనకయ్య (వినాయకుని) పేరు పై వెంకాయపల్లె స్కందుడు - కందుడు (కుమారస్వామి) పేరు పై కందనవోలు - కర్నూలు ఏర్పడి యుండునని చారిత్రకులు తలంచు చున్నారు రెండవ వాదనయే శబ్దోత్పత్తి దృష్ట్యా సంఘటన దృష్ట్యాను సమంజసముగా తోచుచున్నది

**కర్నూలు జిల్లా ఉనికి (భౌగోళిక స్వరూపము) - ఎల్లలు:**

కర్నూలు జిల్లా నడిబొడ్డునకు తూర్పున ప్రహ్లాద వరదుండు లక్ష్మీనరసింహ స్వామి వెలసిన అహోబిలము పడమర వైపు భక్తుడు సైతము భగవంతుండుగా మన్నన లందు కొన సమర్థుడని నిరూపించు రణమండల ఆంజనేయస్వామిగల ఆదోని, ఉత్తర దిక్కున - తెనాలి రామకృష్ణుని ప్రశంస లందుకొన్న సాగర పత్ని తుంగభద్రానది నది కావల భక్త పరిపాలకురాలు, జోగులాంబ వెలసిన అలంపురము, దక్షిణమున పరమశివుడు వెలసిన నయనాలప్ప క్షేత్రము, (కోవెలకుంట్ల తాలుకా) ఈశాన్య దిశలో ఆ దిగధిపతి మల్లికార్జునుడు వెలసిన శ్రీశైలము నైరృతి దిశను హనుమద్భక్తుండై అపూర్వ శక్తులను మానవుడు సైతము గ్రహించి ప్రజారక్షకుండు కాగలడని నిరూపించు తుంగభద్రా తీరమున రాఘవేంద్రస్వామి వెలసిన మంత్రాలయము, ఆగ్నేయమున జాతీయ రహదారి నానుకొని కర్నూలు - కడప జిల్లా సరిహద్దులందు వెలసిన చాగలమ్మ మాత వసించిన చాగలమర్రి - వాయవ్యదిశన రామలింగేశ్వర స్వామి వెలసిన గురుజాల కలవు

**కర్నూలు జిల్లా ప్రాశస్త్యము**

1 రాజకీయము - **1953** సం॥ ఏర్పడిన ఆంధ్రరాష్ట్రమునకు కర్నూలు రాజధానిగా కొన్నేండ్లు వెలసినది నేటి రాయలసీమ జిల్లాలకు ముఖద్వారము నందులు, మౌర్యులు, శాతావాహనులు, పల్లవులు, పశ్చిమ చాళుక్యులు, రేనాటి చోళులు, కాకతీయులు, వివిధ తురుష్క పాలకులు కర్నూలు జిల్లాను పరిపాలించిరి, చివరగా బ్రిటిషు పాలనను సైతము చవిచూచి, స్వతంత్ర ప్రాంతమైనది

నీలం సంజీవరెడ్డి ఈ జిల్లాలోని నంద్యాల పార్లమెంటు మెంబర్‌గా ఎన్నికై, రాష్ట్రపతి పదవి నధివసించెను అట్లే యిటనుండియే పి వి నరసింహారావు ప్రధానామాత్య పదవిని చేపట్టుట గమనార్హము దామోదరం సంజీవయ్య, కోట్ల విజయభాస్కర రెడ్డి ఈ జిల్లానుండి ప్రాతినిధ్యము వహించియే ఆంధ్ర ప్రదేశ్ ముఖ్య మంత్రులైనారు రాజకీయ తారగా మెరసిన పెండేకంటి వెంకట సుబ్బయ్య, కె ఇ వారి కుటుంబ సభ్యులు మొ॥ వారు ఈ జిల్లావారే ఎందరో గవర్నర్లు ఈ జిల్లావారుండిరి

పుణ్యక్షేత్రాలు - వైష్ణవక్షేత్రాలైన అహోబిలము, పెరవలి, గోరంట్ల - తర్నూరు వెలుగోడు మొ॥ ప్రదేశాలు, శైవక్షేత్రాలగు శ్రీశైలము - యాగంటి - మహానంది మొ॥ ప్రదేశాలు, మానవుడే దైవమైన రాఘవేంద్రుడు వెలసిన మంత్రాలయము, శక్తిదేవత చౌడేశ్వరి వెలసిన నందవరము మొ॥ పుణ్యక్షేత్రాలు ఈ జిల్లాలోనివే

మహావీరుడు - మహాదాత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామము కన్న ముస్నే బ్రిటిషు వారిపై నెదురు తిరిగి వీరమరణము నందిన నరసింహారెడ్డి, అడిగిన వారికి లేదనక అవిరళ దానము చేసిన ఉయ్యాలవాడ బుడ్డావెంగళరెడ్డి ఈ జిల్లాకు చెందినవారే

**కవులు - కావ్యాలు**

ఎఱ్ఱాప్రెగ్గడ 'నృసింహ పురాణము' ను రచించి, అహోబల నరసింహ స్వామి కంకిత మిచ్చినాడు అష్టదిగ్గజ కవులలో నొకడుగా ప్రసిద్ధి కెక్కిన పింగళి సూరన నంద్యాల సమీపములోని కానాల నివాసి, అతడు నంద్యాల నేలిన కృష్ణభూపతికి ''కళాపూర్ణోదయము'' అను ప్రథమ పద్య నవలగా ప్రసిద్ధి చెందిన ప్రబంధము నంకితమిచ్చినాడు ఈ జిల్లాలోని బనగానపల్లె ప్రాంతమునసే నివసించుచు, పోతులూరి వీరబ్రహ్మంగారు 'కాలజ్ఞానము' ను రచించినారు నందికొట్కూరు సమీపమున తరిగోపుల గ్రామమునకు చెందిన తరిగోపుల మల్లన్న కర్నూలు జిల్లా కవియే

అహోబలము తిరునాళ్లలోని జనవ్యవహార శైలిలో చమత్కారముగా చుక్కోరి నరసింహశాస్త్రి రచన గావించినారు కర్నూలు డిప్యూటీ కలెక్టర్‌గా పని చేసిన నరహరి గోపాలకృష్ణమ శెట్టి రచించిన ''రంగరాజు చరిత్ర'' తెలుగులో ప్రథమ నవల

*20* వ శతాబ్దిలో అనుముల వేంకటశేషకవి, మద్దుల పల్లి సుబ్రమణ్యశాస్త్రి నంద్యాల వాసులైన మహాపండిత కవులు యూనివర్సిటీ డిగ్రీలు లేకపోయినను సంస్కృతాంధ్రములలోను, ఇంగ్లీషు, కన్నడ, ఉర్దూ భాషలలోను విశేష పాండిత్య మార్జించి చారిత్రక- సన- ఆలయ సాహిత్యముపైపట్టు సాధించి, సర్వమర్మకుడుగా ఖ్యాతి గన్న గడియారం రామకృష్ణ శర్మ, ఎందరో విద్యాలయ పరిశోధకులను నావికులకు చుక్కానియై, చాత్తాద శ్రీవైష్ణవ సాహిత్యమునపారముగా ఆంధ్రదేశమున సమకూర్చిన ఏకైక వ్యక్తియైన పరిశోధక వైద్యం వేంకటేశ్వరాచార్యులు (పండిత కవి) ఈ కర్నూలు జిల్లా వారగుట జిల్లా చేసుకొన్న అదృష్టమే ఉప్పులూరి విశ్వేశ్వరయ్య వ్యాకరణ పండితులైన నంద్యాలు నివాసి మాచిరాజు శివరామరాజు, కప్పా వేంకట రామరాజు, గండ్లూరి ఆత్రేయ శర్మ మొదలైన వారు కర్నూలు జిల్లాలో నేటి ప్రసిద్ధావధానులు

2 క్షేత్ర ప్రస్తావన -

క్షేత్ర - దైవ - తీర్థముల వివరములు

క్షేత్రవము - క్షేత్ర శబ్దమునకు భూమి, ప్రదేశము అను అర్థములున్నవి 'క్షేత్రస్యపతి' - అను పదమునకు ఋగ్వేదము, అథర్వణ వేదములోను, దీనికి రూపాంతరమైన 'క్షేత్రాణాంపతి' అను శబ్దమునకు **'Tutelary Deity'** అను నర్థము చెప్పబడెను

క్షేత్రశబ్దమునకు బ్రహ్మ పురాణవములో[1] **'A Sacred spot, or district, a place of pilgrimage'** అను నర్థములున్నవి

సి పి బ్రౌను సైతము క్షేత్ర శబ్దమునకు **A Sacred spot, a place of pilgrimage** అను నర్థము లున్నట్లు తెలిపినాడు మామిడిపేంకటాచార్యులు 'ఆంధ్రదీపిక' యందు క్షేత్రమునకు పుణ్యభూమి, సిద్ధస్థానము, అను విశేషార్థములు కూడ నున్నట్లు తెలిపెను

ఏదియేమైనను క్షేత్ర శబ్దమునకు తొలుత 'ప్రదేశము' అని అర్థము న్నట్లును - కాలక్రమమున 'పుణ్యస్థలము' గా అర్థ గౌరవము కలిగినట్లు నిఘంటువులను బట్టి తెలియుచున్నది

క్షేత్ర ప్రశంస భగవద్గీత యందును కలదు

'ఇదంశరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభి ధీయతే।

ఏతద్యోవేత్తి తం ప్రాహుః । క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥[2]

అని శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన శ్లోకమును బట్టి ఈ శరీరము క్షేత్రమని చెప్పబడును దీనిని తెలియువాడు క్షేత్రజ్ఞుఁడని చెప్పబడును క్షేత్రమనగా పొలము - అనియు అర్థము కలదు మనసును క్షేత్రముగా వేదాంతు లభివర్ణింతురు పొలమున కృషి సలిపి - ధాన్యాది ఫలములను పొందినట్లే - మానసిక క్షేత్రమున కృషి సలిపి, ఈశ్వర ప్రాప్తియను ఫలమును పొందగల్గుటచే కాబోలు పెద్దలు ఈ శరీరమును క్షేత్రము అనిరి ఈ క్షేత్ర మందుండి, దీని నెరుగువాడు క్షేత్రజ్ఞుఁడనబడును అనగా లోపల నున్న చైతన్యాంశ క్షేత్రజ్ఞుఁడని యర్థము ఈ దృష్టితో చూచినచో పుణ్యక్షేత్రము లన్నియు, దేహములనియు, అక్కడ వెలసిన దేవతా విగ్రహములే దేవతలనియు చెప్పవచ్చును

దైవము -దేవ శబ్ద భవము దైవము **Daiva = Belonging to coming from the God, Devine celestial** అని అథర్వణ వేద, మార్కండేయ పురాణ, మహాభారతములు అర్థమును చెప్పుచున్నవి ఋగ్వేదము, అథర్వణవేదము దేవ శబ్దమునకు **Heavenly devine A deity, God** అని అర్థమ విచ్చుచున్నవి [3]

మామిడి వేంకటాచార్యులు తన గ్రంథమునందు దృగ్గోచరముగాని అదృష్టమగు శక్తియనియు, కాలవశమున కలుగు మేలునకు మూలముగా చెప్పబడు శక్తి దైవము, అని అర్థము చెప్పెను

సి పి బ్రౌను Telugu - English Dictionary (P481) యందు దైవముగా chance accident అనియు, దైవకృతముగా caused by chance or fortune అనియు తెలిపెను

ఏమైనప్పటికిని సమస్త జీవులను పరిపాలించు మహాశక్తి ఒకటి ఉన్నదనియు - దానికి దేవుడనెడి పేరు రూఢికెక్కినదనియు చెప్పవలసియున్నది

తీర్థము

**"A Passage, road, stairs for leading or for descent in to a river, bathing place of piligrimage on the banks of sacred streams, piece of water '** అని తీర్థ శబ్దమునకు ఋగ్వేదము, మోనియర్ విలియమ్ నిఘంటువు నందు అర్థములు చెప్పబడినవి

ఆంధ్ర దీపిక " మహర్షులు స్నానము చేసిన పుణ్యోదకము, పుణ్యనది, రేవు, నూదియొద్ది తొట్టిజలము, పుణ్యక్షేత్రము పుణ్యస్థలము, యజ్ఞము, శాస్త్రము ఉపాయము, పాత్రము, స్త్రీరజస్సు, మంత్రి అని అర్థముల నిచ్చినది

బ్రౌను నిఘంటువులో **water, Holy water**

తీర్థమాడుట, తీర్థమిప్పించుట తీర్థయాత్ర పోవుట అని తీర్థశబ్దము క్రింద అర్థములనిచ్చెను తీర్థము - మోక్షము కు తీర్థము = **false doctrine** అనియు చెప్పెను

ప్రాచీనులు తీర్థము నిట్లు నిర్వచించిరి క్షమాతీర్థం, తపఃతీర్థం, తీర్థమింద్రియ నిగ్రహః, సర్వభూత దయా తీర్థం'' మానవులకు ప్రతిదినము సంక్రమించు సంసార దుఃఖము నేది పోగొట్టు నో అదియే తీర్థము క్షమ, తపస్సు, ఇంద్రియ నిగ్రహము, అన్ని ప్రాణులయందు చూపు భూతదయ తీర్థము'' అని వీరరాఘవులు తీర్థము గురించి తెలిపెను

తీర్థప్రాముఖ్యము దుష్ట శిక్షణ - శిష్టరక్షణ కావించుటకై దైవ మేదేని ప్రదేశమున నెలకొనును సాధారణముగా నీపుణ్యక్షేత్రములు ఏదేని నది తీరమునగాని, జలాశయము ప్రక్కనగాని యుండును స్వామిని సేవింపబోవు వారు మనసు తోబాటు శరీరము గూడ నిర్మల మగుట కీ తీర్థజలము సాయమగును ఉదా - భవనాశనీ నదితీరమున ఎగువ అహోబలము కలదు కుముద్వతీ (కుందూ) నది తీరమున రామాలయము, సుంకేసుల, (మిడ్తూరు మండలము), మధురా నదీ తీరమున ఖాను మండలస్థ లక్ష్మీ నారాయణాలయము, గని (గడివేముల

మండలం) కలవు ఎంతోదూరము నుండి ప్రవహించు నది ఆయాభూముల ఔషధ గుణాలను పుణికి పుచ్చుకొని, తనయందు మునుగు జనులను రోగ రహితులుగా చేయును కనుక తీర్థమహిమ భౌతికాధ్యాత్మికములుగా అసాధారణమనుట అసంశయము

## దేవాలయము

**నిర్వచనము - పర్యాయ పదాలు**

మానవుని జ్ఞాన సంపన్నులను గావించి తరింప జేయునవి దేవాలయములు, విద్యాలయములు దేవ + ఆలయము = దేవాలయము దేవుడు నివసించియుండు ఆలయములు దేవాలయములు, దేవాలయమునకు పర్యాయపదములు దివ్యస్థలము, దివ్యదేశము అప్రాకృత స్థలము, మహాస్థలము మొ॥ దివ్య, అప్రాకృత మహత్ అను పదములకు భగవానుడని యర్థము దివ్యుడు వేంచేసి యుండు స్థలము దివ్యస్థలము, అదే దేవాలయము భక్తోద్ధరణకై భక్తసంరక్షణకై అర్చారూపధారియైన భగవానుడు భక్తసులభుడై భక్తనిర్దిష్టములగు బింబముల యందు సన్నిహితుడై, వేంచేసి యుండు స్థలములు దివ్యములైన దేవాలయములు

**ప్రాచీనత - మాహాత్మ్యము**

భారతదేశమున ప్రాచీన కాలమునుండి దేవాలయములు అరణ్య నదీతీర పర్వత ప్రదేశములందు ప్రకాశించు చున్నవి గ్రామముల యందు గల అర్చామూర్తుల కన్న మహాక్షేత్రము లందు వేంచేసియున్న అర్చామూర్తుల మహామహిమలు మిక్కిలి గొప్పవనియు అటనున్న దేవుని మహిమతో బాటు, అరణ్య నదీ పర్వత మాహాత్మ్యములు గూడ కలిసి యున్నందున మాహాత్మ్య మధికముగా నుండునని పెద్దలందురు

ప్రతి వ్యక్తియు భగవంతుని సేవించుట కొఱకై భారతదేశములో ప్రతిగ్రామము నందును ఆగమశాస్త్రాలు చెప్పినట్లుగా పెద్దలు దేవాలయాలను ప్రతిష్ఠించిరి

వీటిని సంస్కృతములో దేవాయతన, దేవాలయ - భగవన్మందిర దివ్యస్థలములందురు - తమిళములో 'కోయిల్' అనియు తెలుగులో 'కోవెల' యనియు నందురు

దేవాలయములు నిర్మించునపుడు వానికి సంబంధించి ముఖ్యముగా నిర్మింపవలసిన భాగములు -

1 గర్భాలయము (వ్యవహారములో గర్భగుడి) 2 అంతరాలయము 3 ముఖమండపము 4 ఆలయ విమానము 5 విమానకలశము 6 ధ్వజస్తంభము 7 ఆలయప్రాకారము 8 గాలిగోపురము 9 కల్యాణమండపము 10 వాహన శాల (ఉత్సవ సమయాలలో స్వామి నూరేగించు వాహనాల నుంచునది) 11 యజ్ఞశాల 12 ఆలయము లోపల బావి ముఖ్యమైనవి

దేవాలయాంతర్భాగములు - స్వామి అవయవాలు

'' శిఖరం శీర్షమిత్యాహుః , గర్భగేహం గళం తథా
మంటపం కుక్షి రిత్యాహుః ప్రాకారంజాను జంఘ యోః
గోపురం పాద మిత్యాహుః , ధ్వజో జీవస్స ముచ్యతే''

దేవాలయ శిఖరము మూల విరాట్టు శిరముగను గర్భాలయము స్వామి కంఠముగను, మంటపము స్వామి కడుపుగను ప్రాకారము స్వామి మోకాళ్ళు, పిక్కలుగను గోపురము స్వామి పాదములుగను, ధ్వజము స్వామి వారి జీవస్థానమని పై శ్లోకార్థము

ఆలయములో 5 బేరములుండును, బేరమనగా విగ్రహము

1 ధ్రువబేరము ఆలయాలలో (గర్భాలయములో) ప్రతిష్ఠింపబడిన మూల విరాట్టు

2 కౌతుక బేరము ధ్రువ బేరమునకు సమీపాన నుండునది తామ్రాది లోహములతో చేయబడిన విగ్రహములను కౌతుక బేరములందురు

3 ఉత్సవ బేరము ఉత్సవ విగ్రహాలను ఉత్సవబేరములందురు ఉత్సవ విగ్రహాలను ఆలయోత్సవ, గ్రామోత్సవ, కల్యాణోత్సవాలలో వినియోగింతురు

4 స్నపన బేరము నిత్య నైమిత్తికాభిషేకములను చేయుబేరము

5 బలిబేరము ఈ బేరమును పురస్కరించుకొని ఆలయ, గ్రామబలులను వేయుదురు

## భగవదర్శనకు కావలసిన పరికరములు:

1 గంట 2 దీపారాధన చేయుటకు ప్రమిదలు 3 తీర్థపాత్రలు 4 ఉద్ధరిణి 5 శఠారి 6 తులసి, కర్పూరముల నుంచుటకు పళ్లెరము వింజామరలు, వాహనాదులు

**ఉత్సవము** ''ఉత్సూతే హర్షం ఇతి ఉత్సవః'' - ఆనందము నధికముగా నిచ్చునది ఉత్సవము ఈ ఉత్సవాలు జరుపుటకు కారణాలు

1 భగవంతు డేరూపములో నెందుల కవతరించునో దానిని స్మరించుట కొఱకు

2 కనీసము తిరునాళ్ల సమయము నందైనను భగవద్దర్శనమునకు వీలుగా

నుండుట కొఱకు ఇవి సంవత్సరానికొకమారు జరుగు బ్రహ్మోత్సవాలు

ఆయా పర్వదిన (పండుగ) సందర్భములుగా జరుగు ఉత్సవాలు - అని వివిధములుగా నుండును బ్రహ్మోత్సవాలకు, తిరునాళ్లకు చివరి రోజులలో రథోత్సవము జరుగును ''రథస్థం కేశవందృష్ట్వా పునర్జన్మ నవిద్యతే'' అని చెప్పబడినది

అర్చన - అర్చకులు భగవంతు నర్చించు వారు అర్చకులు,

'' యాజకా ఏవ మద్భక్తాః - మచ్ఛరీరం హి యాజకాః,

యేజనాస్తాన్ వినిందంతి భవంతి మమ నిందకాః'' - అని భగవానువాచ నన్ను పూజించు వారే నాభక్తులు, వారు నాశరీరము ఎవరు వారిని నిందింతురో - నన్ను నిందించిన వారగుదురని పై శ్లోకార్థము కనుక భగవదర్చకులే భగవద్భక్తులు [6]

''అర్చకస్యహరిః సాక్షాత్ చరరూపీ నసంశయః'' -

విష్ణుర్లకో విష్ణు సదృశః'' - ''నా విష్ణుః విష్ణు మర్చయేత్'' -

అని హరినర్చించు నర్చకులు హరి సమానులని చెప్పబడినది ఇట్లు భగవదర్చకులకు సమాజములో నాడు సముచిత స్థానమీయ బడినట్లు తెలియుచున్నది అర్చకుడు నిజమునకు దైవ ప్రతినిధిగా భావింపబడు చున్నాడు భక్తులకు - భగవంతునకు చక్కని వారధి అర్చకుడు అక్కడి అర్చా విధానములను బట్టి ఆభక్తులు కూడ పరమ భక్తులై తరించెడి సదవకాశమును అర్చకుడు కల్పించ గలడు పేయేల! భగవంతుని బహిః స్వరూపమే అర్చకుడు

అర్చకుడు - సంఘసంక్షేమాకాంక్షి స్వామి వారిని సేవించు సమయమున అర్చకుడు కావించు సంకల్పమునందు తనకు, తనకుటుంబమునకు మాత్రమే కాక ప్రజలందరికి సౌఖ్యము గలుగవలెనని కాంక్షించును ''రాజరాష్ట్రగ్రామ యజమానాచార్యార్చక పాచకపరిచారి కాభివృద్ధ్యర్థం, అస్మిన్గ్రామే స్థితానాం, ప్రజానాం, బ్రాహ్మణాది సర్వవర్ణానాం సర్వేషాం భక్తజనానాంచ వ్యాధి చోర దుర్భిక్షానాం వృష్టిరాజ బాధాది సర్వోపద్రవ శాంత్యర్థం సమస్త సన్మంగళావాప్త్యర్థం పూజాం కరిష్యామి''

ఇట్లు అర్చకులు అనుదినము దేవాలయములలో సమస్త ప్రజలు యోగక్షేమాలు కలిగి, వ్యాధి చోరభయము లేక, శత్రుదండయాత్రలనుండి, అగ్నిక్షామాది సంకటముల నుండి ప్రజలను రక్షింపవలెనని స్వామిని ప్రార్థించును ప్రతిఫలాపేక్ష లేక దేశక్షేమమును కోరువాడు సంఘమున అర్చకుడొక్కడేయ నుట సారాంశము

**దేవాలయాలలో ఇతరులు** - అర్చకుడు స్వామినర్చించుచుండ, స్వామికి నైవేద్యము తయారుచేయుటకు పాచకులును, స్వామిని మేల్కొల్పుటకు, తిరునాళ్ల మొ॥ కాలాలలో వాద్యములను వాయించు నాయీబ్రాహ్మలును, దేవాలయాలను పరిశుభ్రముచేయు పరిచారకాదులు సైతము దేవాలయము లందుందురు

**వైష్ణవాలయాల ప్రశస్తి** - దేవాలయంవముల స్థితి, సమృద్ధి దేశమందలి మతపరాయణము దృఢత్వమునకు చిహ్నములు మతమునకు ప్రధాన నివాసస్థానాలు దేవాలయాలు హైందవ దేవాలయాలు భక్తులకు సమ్మోద, వినోద దాయకములు ఇవి తత్త్వజిజ్ఞాసనం కలిగించుటయేం కాక, సౌందర్యభరితములై, కవిత్వ, శిల్పాది లలిత కళలకు సమావేశ స్థానములుగా గోచరించుచున్నవి

''దేహోదేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః'' అని దేహమే దేవాలయమనియు, ఆదేహగుహలోని జీవుడే పరమాత్మయని పైపాదార్థము

పుణ్య క్షేత్రాలకు నెలవు భారతదేశము ఆంధ్రదేశమునందు దేవాలయాలు విశేషముగా కలవు కర్నూలుజిల్లాలో మొత్తము మూడువేల యెనిమిది వందల యిరువది మూడు (3,823) ఆలయములున్నట్లు సహాయక కమీషనరు, దేవాదాయశాఖ, కర్నూలువారి రికార్డులనుబట్టి తెలియుచున్నది అందులో వైష్ణవాలయాలు దాదాపు రెండువేల (2000) వరకుండవచ్చును కేశవాంజనేయస్వామి ఆలయాలు లేని జనపదములుండవని విజ్ఞులయభిప్రాయము కర్నూలు జిల్లాలో శ్రీశైలము - మహానంది - యాగంటి - ఓంకారము - కాల్వబుగ్గ, బ్రహ్మగుండము వంటి శైవక్షేత్రములున్నవి, కాని వైష్ణవ క్షేత్రముల కెంత మాత్రము కొఱత లేదు

**విష్ణు ప్రాధాన్యము:-** ఆకారనివాసములచేత శివునికంటె విష్ణువు సుందరుడుగా కనిపించుచున్నాడు ''సర్వదేవ నమస్కార కేశవం ప్రతిగచ్ఛతి'' - అని మంత్రములందు చెప్పబడినది ఏదైవమునకు నమస్కరించినను, అది విష్ణువునకే చెందునని యర్థము

''విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్।
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్॥
నారాయణం పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః''॥-
శాశ్వతుఁడు, విశ్వమునకు ప్రభువు, తత్త్వరూపుడు, పరబ్రహ్మ స్వరూపుడు, ధ్యానము చేయదగినవాడు, ధ్యానగోచరుడు -

ఇత్యాదిగా మంత్రపుష్పమునందు విష్ణువు ప్రస్తుతించబడినాడు

''జ్యోతీంషి విష్ణుః భువనాని విష్ణుః
వనాని విష్ణుః గిరయో దిశశ్చ

నద్యస్సముద్రాణి సఏవ సర్వం'' అని విష్ణుపురాణము విష్ణువ్యాపిత్వమును తెలుపుచున్నది సూర్యచంద్రాదులలోని తేజస్సు, చతుర్దశ భువనాలు, వనాలు, పర్వతాలు, దశదిశలు, నదులు, సముద్రాలు – సకలము విష్ణుమయమే

కం॥ ''పురుషుండాద్యుఁడు ప్రకృతికిఁ
బరుఁడవ్యయుఁడఖిల భూత బహిరంతర్భా
సురుఁడును, లోక నియంతయు
బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగు హరీ''! [7]

అని కుంతి శ్రీకృష్ణుని ప్రస్తుతించినది ప్రకృతి కతీతుడు, అవ్యయుడు సకల ప్రాణులలో లోన బయట నుండువాడు, సర్వవ్యాపి, లోకమును నియంత్రించువాడు, పరమేశ్వరుడు బన కృష్ణునకు నమస్కారమని యర్థము

''సర్వస్యచాహం హృది సన్ని విష్టో'' అని కృష్ణుఁడర్జుననితో సర్వప్రాణుల యందు తానే నివసింతునన్నాడు ఇట్లు విష్ణుప్రాధాన్యము చెప్పబడినది

**ఉపసంహారము** కర్నూలు జిల్లాలోని వైష్ణవ క్షేత్రములన్నియు ఇంచుమించు ఒకే పద్ధతిలోనే విలసిల్లుచున్నవి అర్చనాదికములు గూడ నిత్యో యగుపించుచున్నవి ఇవన్నియు మానవునిలోని నిద్రాణమై యున్న భక్తి ప్రపత్తులను సముద్ధరించి వానిని తరింపజేయుటకై ఉపయోగపడుచున్నవి కొందరు తీర్థయాత్రలేల? యందురు లోపలి దశలో (తత్వదశలో) ఇది సైతము నిజమే కాని, అందరు నిత్యముక్త స్థితిలో నుండరు అట్టి ముక్తస్థితిని చేరెడిదాక తీర్థయాత్రలేకాదు క్షేత్ర సందర్శనము, దైవసందర్శనము – ఇవన్నియు అవసరములే అటుపై అంతర్ముఖత్వము, అంతవరకు మానవులను చేర్చెడి సోపానములుగా ఈ క్షేత్రములను, తీర్థములను, దైవతములను పేర్కొనవచ్చును

ఆధ్యాత్మిక జ్ఞానమనునది జీవునిలో స్థిరముగా నున్నదే ఈ ప్రయత్నమంతయు దాని నుద్ధరించుటకే

## పూర్వపు తాలుకా కేంద్రము - నేటి మండలాలు

### నంద్యాల డివిజన్

| | |
|---|---|
| నంద్యాల | నంద్యాల, మహానంది, బండి ఆత్మకూరు, గడివేముల |
| ఆళ్ళగడ్డ | ఆళ్ళగడ్డ, రుద్రవరం, శిరివెళ్ల, చాగలమర్రి, గోస్పాడు |
| కోయిలకుంట్ల | కోయిలకుంట్ల, దొర్నిపాడు, ఉయ్యాలవాడ, సంజామల, కొలిమిగుండ్ల |
| బనగానపల్లె | బనగానపల్లె, ఔకు |

### కర్నూలు డివిజన్.

| | |
|---|---|
| ఆత్మకూరు | ఆత్మకూరు, వెలుగోడు, పాములపాడు, కొత్తపల్లె, శ్రీశైలం (సున్నిపెంట) |
| నందికొట్కూరు | నందికొట్కూరు, మిడుతూరు, పగిడ్యాల, జూపాడుబంగ్లా |
| కోడుమూరు | కోడుమూరు, గూడూరు, సోలకల్ |
| డోన్ | డోన్, బేతంచెర్ల, వెల్దుర్తి, కృష్ణగిరి, ప్యాపిలి |
| కర్నూలు | కర్నూలు, కల్లూరు, ఓర్వకల్ |

### ఆదోని డివిజన్

| | |
|---|---|
| ఆదోని | ఆదోని, కోసిగి, కౌతాళం, పెద్దకడుబూరు |
| ఎమ్మిగనూరు | ఎమ్మిగనూరు, నాగలదిన్నె, మంత్రాలయం |
| ఆలూరు | ఆలూరు, చిప్పగిరి, ఆస్పరి, హొళగుంద, చింతకుంట |
| పత్తికొండ | పత్తికొండ, దేవనకొండ, తుగ్గలి, మద్దికెర, గోనెగండ్ల |

**Acording to Gazettee Extradinary of Kurnool Dt Gazettee, 1984 July 30th**

# ఆదోని డివిజన్ - ఆలయాలు

### ఆదోని తాలుకా ఆదోని మండలం

## రణమండల ఆంజనేయ స్వామి, యాదవగిరి

ఆదోని పట్టణము నడిబొడ్డునకు దాదాపు 5కి మీ దూరమున మహోన్నత గిరిపై రణమండల ఆంజనేయస్వామి 10 అడుగుల ఎత్తుతో భక్తజన మందారుడై దర్శన మిచ్చుచున్నాడు

**కొండకునామసార్థక్యము -** శత్రు దుర్భేద్యమైన ఈగిరి దుర్గమును మొదట దేవగిరి నేలిన యాదవరాజులు నిర్మించినారు యాదవరాజులు నిర్మించిన గిరిదుర్గమగుటచే దీనిని యాదవాద్రి యందురు అదియే యాదవావని యాదవేని - యాదవోని - ఆదవోని - ఆదోని యని క్రమ పరిణామ మొందినట్లు తెలియుచున్నది ఆ పిదప కాకతీయ రుద్రమ్మ సేనాని 'గోన గన్నారెడ్డి' 13శతాబ్దిలో దీనినాక్రమించెను

**హనుమత్ ప్రతిష్ఠ:-** శ్రీకృష్ణదేవరాయల మేనల్లుడైన అళియరామరాయలు ఆదోనిలో చాలాకాలము నివసించినట్లు తెలియుచున్నది అతఁడిక్కడ నొక దుర్గము నిర్మించినాడు ఆకోటను నేటి రణమండల ఆంజనేయస్వామి కభిముఖముగా చూడవచ్చును విజయనగరరాజుల కాలములో హనుమత్ప్రతిష్ఠలు విశేషముగా జరిగినవి వ్యాసరాయలు రాయలసీమ వ్యాప్తముగా ఎన్నో ఆంజనేయాలయాలు నిర్మించినాడు వ్యాసరాయలు ప్రతిష్ఠించినదే ఈ రణమండల ఆంజనేయస్వామి విగ్రహమని అనుశ్రుతి ఈ కొండపైన కోటలో తొమ్మిది తీర్థాలు, 109 ఆంజనేయ విగ్రహాలు వ్యాసరాయ ప్రతిష్ఠితములే

**స్వామి నామ సార్థక్యము·** రణరంగములో రాక్షసులను మట్టుపెట్టుటకై అజేయుడై శత్రుసమూహమును నిరీక్షించుచున్నాడో యన్నట్లు ఎండలకెండుచు, వర్షమునకు తడియుచు స్వామి నిలిచియున్నాడు కనుకనే రణమండల ఆంజనేయస్వామి యను పేరు సార్థకమయినది ఆయన తూర్పున కభిముఖుడు తన మిత్రుడు ఆదోని పరిపాలకుడైన అళియ రామరాయల ఆస్థాన వైభవము - రణమండలక్షేత్రా ధ్యాత్మికతను గురించి భట్టుమూర్తి వర్ణించినాడు ఈస్టిండియా కంపెనీ పాలనలో విజయనగర చరిత్ర పై పరిశోధన చేసిన ఆంగ్లేయుడు సెలిట్యూర్ తన **Forgetten history of Vijiyanagara Empire** అను రచనలలో రణమండల ప్రాధాన్యతను వర్ణించినాడు యుద్ధభూమి లో ప్రతి

సైనికుడు 'జై రణమండల భైరవ' అనుచు ముందుకురుకు వాడని ఆ గ్రంథములో చెప్పబడినది

మెట్లు కొండ పాదమునుండి స్వామిని చేరుటకు దాదాపు వెయ్యి మెట్లు గలవు మహాద్వారము వరకు వాహనములు వెళ్లుటకు సౌకర్యము కలదు అటనుండి స్వామి వరకు 524 మెట్లు కలవు స్వామి పరిసరాలలో చల్లని వాతావరణము హాయి గొలుపును

పరిసరాలలో దేవతలు స్వామి వెనుక సీతారామ లక్ష్మణులతోటాటు ఆంజనేయస్వామి కల చిన్నగుడి కలదు ప్రక్కన శివాలయమున్నది ఆవెనుక భాగమున అయ్యప్పస్వామి గుడి కలదు స్వామి కెడమ వైపున చేరువలో అంబా భవాని దర్శనమిచ్చును స్వామి కెడమ వైపున గల కొండలో రాఘవేంద్రాలయము కలదు స్వామి కెదురు వైపున గల కొండలో పూర్వము అళియరామరాయలు నిర్మించిన దుర్గము శిథిలమైనది

చెఱువు రణమండల క్షేత్రము క్రిందగల 'మురళికేరి' చెఱువు పూర్వము కోటలోని కవసరమైన నీరందించెడిది ఏనుగుల సాయముతో పైకి నీటిని ఏతమెత్తువారని తెలియుచున్నది నేడు ఆ చెఱువు దుఃస్థితిలో నున్నది

కొండ క్రింద నుండి పైకి గల వివరాలు కొండనెక్కునపుడు మహాద్వారము కంటె ముందు బాలాంజనేయస్వామి గుడి కలదు మహాద్వారము వద్ద ఆంజనేయస్వామి పాదాలు గలవు మహాద్వారము దాటిన తర్వాత సంతాన ఆంజనేయస్వామి ఆలయము కలదు సంతానార్థమై భక్తులిచటకు వచ్చి, స్వామిని పూజింతురు

ఎల్లమ్మజాతర మహాద్వారము కంటె ముందు చక్కని రహదారిలో వెళ్లిన ఎల్లమ్మ కనిపించును ఆమెను శ్రావణ మంగళ వారాలలో అసంఖ్యాక భక్తులు దర్శింతురు ఇక్కడ జరుగు జాతర ప్రసిద్ధమైనది

శ్రావణ శనివారాలు - హనుమత్ పూజ ప్రతి రోజు స్వామి కడ ఉదయము 6 గం॥ ల నుండి 8 గం॥ ల వరకు పూజారి యుండును శనివార మెక్కువ సమయముండును శ్రావణ శనివారాలలో జన సంఖ్య అధికము ఆదోని పట్టణము షరాఫ్ బజారులో గల ఆంజనేయాలయములోని ఉత్సవ విగ్రహమును నెలరోజులిచటనుంతురు ఆదోని నగరములో చివరి శనివారము స్వామి వారికి గ్రామోత్సవముండును

హనుమత్ విశిష్టత లంకా రణమును స్ఫురణకు తెచ్చు ఘట్టమంతయు ఈ స్వామి వారి పేరుతో నిమిడి యున్నది నిజమునకు హనుమంతుడు

ఉగ్రాంశ, రణస్ఫురణ సమంజసమే ఆంజనేయుడు శివాంశ యైనప్పటికిని, విష్ణుదేవునకు (శ్రీరామునకు) పరమభక్తుడు కనుక వైష్ణవ కోటి లోనే పరిగణింప వలసి వచ్చినది అంతేగాక అచ్చమైన భక్తులకు - భగవంతునకు భేదము లేదన్నది ఆర్ష ధర్మసూత్రము కూడ

హనుమంత్ర్రభావము - ఫలాపేక్ష రహితముగా స్వామియైన శ్రీరామచంద్రునకు హనుమంతుడు సేవ సేసినాడు హనుమంతుడు చిరంజీవి భవిష్యత్తులో సైతము శ్రీరామనామమును స్మరించుచునే యుండును అందరికి దేవతలైన రామలక్ష్మణులకు హనుమంతుడే ప్రాణభిక్ష పెట్టినాడు స్వామి స్వరూపము హనుమ హృదయములో శాశ్వతముగ నుండునట్లు శ్రీరాముడు వరమిచ్చినాడు భక్తుడే స్వామిగ మారిన హనుమ భక్త వత్సలుడు, స్మరించిన మాత్రముననే భక్తులకు దర్శనమిచ్చును భూత, పిశాచ, శాకినీ, ఢాకినీ, గణమంతయు హనుమంతుని స్మరించిన పారిపోవునని భక్తుల విశ్వాసము హనుమత్ ప్రభావము రామాయణ సుందర కాండలో సుందరముగా రూపొందించబడినది శాంతి మంగళ సౌభాగ్యాదులు స్వామిని స్మరించిన లభించును మారుతిని పూజించినచో శ్రీరాముని సైతము పూజించిన ఫలము లభించును

## ఆలూరు తాలుకా ॥ ఆస్పరి మండలము

## ఆస్పరి జనార్దన స్వామి - ఆస్పరి

**నామౌచిత్యము** జనానర్దయతి సుఖయతి - జనులను సుఖపెట్టువాడు జనార్దనుడని యొక వ్యుత్పత్తి సముద్ర మధ్యవర్తినో జననామ్నోఽసురా నర్దిత వానితి జనార్దనః - సముద్ర మధ్య మందుండెడి జనులను రాక్షసులను పీడించిన వాడనియు,

ప్రళయకాలే జనాన్సర్వానపి అర్దయతీతి వా జనార్దనః -

ప్రళయకాల మందెల్ల జనులను పీడించు వాడు అనియు గురుబాలప్రబోధిక తెలుపుచున్నది

**ఉనికి** ఆదోని - ఆలూరు తాలూకాకేంద్రములకు మధ్యన, ఆస్పరి మండల కేంద్రమున గ్రామము చివర వెలసిన విష్ణుమూర్తి జనార్దన స్వామి

**స్వామి ఆకారము** మూలవిరాట్టు 4½ అడుగుల ఎత్తుతో చతుర్భుజాలు కలిగియున్నాడు ఊర్ధ్వహస్తములందు శంఖచక్రములు, తక్కిన హస్తములలో నొక చోట గద, మరొక వైపు అభయహస్తములున్నవి స్వామి

శిలచుట్టు దశావతారములు చెక్కబడియున్నవి స్వామికెడమ వైపు గోడకు ముగ్గురు ఆళ్వారులు కలరు వీరిని పరివారదేవతలని చెప్పవచ్చును

**అర్చావిధానము** పాంచరాత్ర పద్ధతితో పూజలు చేయుచున్నారు అనుదినము దీపము అఖండము అర్చకుడు స్నానము చేయనిదే గర్భాలయములోనికి వెళ్లడు ఈ వైష్ణవార్చకుడు తప్ప తక్కిన యే శాఖీయులు లోనికి వెళ్లరు ఒక విచిత్రమేమనగా ఆలయము లోపల బండపరుపు వేయుటకై అర్చకుని బంధువును బెంగుళూరు నుండి పిలిపించి వేయించినారు అఖండ దీపమెగద్రోయుటకును అర్చకుడు స్నానము చేసి యే లోనికేగును కార్తీక మాసము మొత్తము ప్రతిదినము భజంత్రీలతో అర్చకుడు బిందెసేవ చేయును

**ఉత్సవాలు** ప్రతి యుగాదికి ఉత్సవము నిర్వహింతురు ప్రభలాగుట - కుందేలు పారువేట - ఉట్ల ఉత్సవమును కావింతురు నాలుగు చక్రాలతో ఉత్సవమును చేయునది ప్రభోత్సవము మధ్యలో తాత్కాలికముగా వెదురు కఱ్ఱలతో నున్నతముగా నిర్మాణము చేయబడునది ప్రభ కొన్నిచోట్ల ఈ ఉత్సవము జరిగిన తర్వాతనే రథోత్సవము జరుగును దసరా నవరాత్రులంతయు, కార్తీక మాసము నెలరోజులును స్వామిని పల్లకీలో నుంచి గ్రామోత్సవము చేయుదురు

**ప్రసాదము:** ప్రతి శనివారము - అర్చకుడు రవ్వకేసరిని స్వయముగా పాకము చేసి స్వామికి నైవేద్యమిచ్చును ప్రతి శనివారము మధ్యాహ్నము 12 గం॥ ల వరకు భక్తులు యాభైమంది వరకు స్వామి దర్శనమునకు వత్తురు వారికర్చకుడు స్వామి నైవేద్యమును ప్రసాదముగా నొసంగును పచ్చకర్పూరము, తులసీదళములను కలిపి అర్చకుడు తీర్థమొసగును

**ప్రదక్షిణ - హారతి** ఆలయము ప్రదక్షిణ కనుకూలముగా నున్నది ప్రతిశనివారము స్వామి కభిషేకము గావింతురు కర్పూరముతో హారతినిత్తురు ఆలయము తూర్పున కభిముఖముగానున్నది

**ఉత్సవ విగ్రహాలు:** శ్రీదేవి, భూదేవీ సహిత వేంకటేశ్వర స్వామి వారల ఉత్సవ విగ్రహాలు సుమారు $11/2$ అడుగుల ఎత్తుగలవి ఇచటకలవు ఆస్పరి ప్రధాన వీధులలో పర్వదినములందు గంటన్నర సేపు ఈ ఉత్సవ విగ్రహములకు గ్రామోత్సవముండును

**ప్రశస్తి** ప్రజలలో దైవము పై విశ్వాసము కలదు మొక్కుబడులు చెల్లింపని ప్రజలపై స్వామి మహిమతో ఏదో విధముగా అనర్థమును చూపునని స్థానికుల విశ్వాసము బత్తెప్రసవానంతరము గ్రామస్థులు మీదు పట్టి, స్వామికి

సమర్పించుటు, ఇత్యాదులిచట కలవు గత 10 సం॥ల నుండి స్వామిని దర్శించు భక్తుల సంఖ్య విశేషముగానున్నది ప్రతి శనివారము రాత్రి 8 గం॥ ల నుండి 12 గం॥ల వరకు భక్తులు భజన చేతురు ఆలయమునకు నీటి సౌకర్యము కలదు

## ఎమ్మిగనూరు తాలూకా - ఎమ్మిగనూరు మం॥

# వేంకటేశ్వర స్వామి, దైవందిన్నె

**ఉనికి** ఎమ్మిగనూరు మండలకేంద్రమునకు సుమారు 15 కి మీ దూరమున గల దైవందిన్నె గ్రామ మధ్యమున వేంకటేశ్వర స్వామి దర్శన మిచ్చును స్వామి ఉభయ దేవేరులతో కూడియున్నాడు స్వామి 2 అడుగుల యెత్తుండగా, దేవేరులు 11/4 అడుగుల ఎత్తున్నారు స్వామి తూర్పున కభిముఖము

**ఆలయవిశేషాలు** స్వామి గర్భాలయమునకు ముందు భాగమున జయ విజయ ద్వారపాలకులు గలరు గర్భాలయమువు ముందుగల హాలులో పరివారదేవతగా ఆంజనేయస్వామి దక్షిణాభిముఖముగా దర్శనమిచ్చును ఆలయము దగ్గర నీటి సౌకర్యము లేదు స్వామి కెదురుగా ఆలయము బయట 12 అడుగుల యెత్తు ధ్వజస్తంభము కలదు ఆలయమున ఉత్సవ విగ్రహాలు సైతము కలవు అమ్మవార్ల లక్ష్మీదేవి, అలవేలు మంగమ్మయను పేర్లతో పిల్వబడుచున్నారు

**తిరునాళ్ల/ ఉత్సవము:** చైత్ర శుద్ధషష్ఠి మొదలుకొని దశమి వరకు తిరునాళ్ల జరుగును శ్రీరామనవమి నాడు స్వామి వారికి కల్యాణము, మరునాడు దశమిరోజు తేరులాగుదురు ఆలయము నుండి సమీపమున నున్న ఎదురు మండపము వరకు తేరులాగుదురు

నేడు నామమాత్రముగా జరుగు ఉత్సవాలు / తిరునాళ్ల పూర్వము వైభవముగా జరిగెడివని ఒక శతకము సాక్ష్యమిచ్చుచున్నది



## పత్తికొండ తాలూకా - దేవనకొండ మండలము
## కౌలుట్ల చెన్నకేశవ స్వామి, పెద్దకోటకొండ

ఉనికి దేవనకొండ మండలములో పెద్దకోటకొండ గ్రామమునకు నాలుగు కి మీ దూరములో ఎత్తైన కొండలలో ప్రశాంత వాతావరణములో కౌలుట్ల చెన్నకేశవ స్వామి దర్శన మిచ్చుచున్నాడు కర్నూలు నగరమునకు **47** కి మీ దూరమున గుడి కలదు దక్షిణాభిముఖుడు స్వామి

కౌండిన్యాశ్రమమని పురాణప్రసిద్ధమైన ప్రాంతమిది
''ఈ పూజ్యా క్షేత్రమునం , దాపసి కౌండిన్యులుండి తపమొనరింపన్
నీపద దర్శన మిచ్చితి , కాపాడుము మమ్ముశౌరి ! కౌలుట్లహరీ!''
(కౌలుట్ల శతక పద్యము)

పాండవరాజైన జనమేజయుడు (పరీక్షిన్మహారాజు పుత్రుడు) సర్పయాగానంతరము దక్షిణ దేశయాత్ర చేయుచు, కౌండిన్యాశ్రమమునకు చేరెను అచట విశ్రమించిన రాజునకు స్వప్నమున చెన్నకేశవస్వామి ప్రత్యక్షమై తనకిట దేవాలయమును నిర్మించుమని పలికెను రాజు కౌండిన్య మహర్షి కావిషయ మెఱిగించి, అతని యంగీకారముతో చెన్నకేశవ విగ్రహ ప్రతిష్ఠం గావించి, యాలయమును నిర్మించెను ఈ ఆలయము ఐదు వేల సంవత్సరాల ప్రాచీనమైనది

**కౌలుట్ల చెన్నకేశవ నామ సార్థక్యము** క్రమేపి ఈ ఆలయము శిథిలావస్థకు చేరుకున్నది ఆలయము చుట్టున్న గోపాలురు గోవులను మేపుట కీవైపునకు వచ్చెడివారు ఒకనాడు సమీపమున గొల్లపల్లెలో నున్న గొల్ల కౌలుట్ల అను బాలుడు తనగోవులలో మేటి గోవు ప్రతిదిన మింటికడ క్షీరమీయక పోవుట గమనించి, దానిని వెన్నంటి వెళ్లెను ఆయావు తన పాలను ఆలయమునకు సమీపమున నున్న పుట్టలోనికి పిండుట, ఆపుట్ట నుండి 'ఓం' అను శబ్దము వచ్చుట కౌలుట్ల గమనించెను ఆ వింతకు చకితుడై, అట నివసించిన కౌలుట్లకు ఒకనాటి రాత్రి చెన్నకేశవ స్వామి సాక్షాత్కరించి, శిథిలాలయమును పునర్నిర్మించి తనలో నైక్యముకమ్మని తెలిపెను పిదప, చుట్టు ప్రక్క ప్రజల సహకారముతో కౌలుట్ల దేవాలయ పునరుద్ధరణ కావించినాడు నాటి నుండి ఈ క్షేత్రమునకు కౌలుట్ల చెన్నకేశవ స్వామి క్షేత్రముగా ప్రసిద్ధికి వచ్చినది దిగువ తిరుపతులలో ఒక దిగువ తిరుపతిగా ఈ క్షేత్రము ప్రఖ్యాతి వహించినట్లు శాసనములను బట్టి తెలియుచున్నది ఈ కౌలుట్ల - స్వామి దయవల్ల స్వామిలో లీనమయ్యెను

**స్వామి దేవాలయ పునర్నిర్మాణము** ఈ ఆలయము శిథిలావస్థకు చేరుకొనగ అగ్రహారము జమీందారు విగ్రహమును పున ప్రతిష్ఠ కావించినాడు ఆ పిదప శుభకృతునామ సంవత్సర కార్తీక పౌర్ణమి తర్వాత కృష్ణరాయల సంతతి గుడిని మరల నిర్మించినారు ఇందులకు నిదర్శనము దేవాలయపు గోడలపై కృష్ణరాయల వంశానికి చెందిన వారి వివరాలు నేటికిని కనిపించును

ఈ స్వామికి దేవగిరి యాదవుల కాలమున క్రీ శ 1254 సం॥ విక్రుతినామ సంవత్సర మాఘశుద్ధపాడ్యమీ తిథిరోజు రథోత్సవమునకు చేయించిన కలశము నేటికిని కలదు

**స్వామి స్వరూపము** స్వామి చతుర్భుజుడు, రెండడుగుల ఎత్తు కలిగియున్నాడు ఎడమ చేతులలో శంఖమును, గదయును, కుడిచేతులలో చక్రమును, అభయ హస్తమును కలిగియున్నాడు ఈ విగ్రహమునకు మకరతోరణమును కలదు స్వామి విగ్రహమునకు ముందున్న శిలను కౌలుట్లయందురు

స్వామి కెడమ వైపు లక్ష్మీదేవి గుడికలదు స్వామి ముందు ఆళ్వారులు కలరు స్వామి ప్రక్కన ముకుళిత హస్తుడై జనమేజయుడు కనిపించును

**నీరు** ఇచట రెండు కోనేరులు కలవు దేవునికి క్రిందగల కోనేరు ఒకటి దీనిని దేవుడు పుట్టిన కోనేరందురు ఇక్కడనే తిరునాళ్లయప్పుడుత్సవము చేయుదురు దేవుని పైన మరొక కోనేరు కలదు

**భక్తులసంఖ్య** శనివార పర్వదినాలలో తిరునాళ్లలో భక్తుల సంఖ్య విశేషముగా నుండును శ్రావణ శనివారాలలో వందమంది భక్తులు వత్తురు సంక్రాంతి, ఉగాది, విజయదశమి వంటి పండుగ దినాలలో శ్రీదేవి, భూదేవీ సహిత చెన్నకేశవ స్వామి వారి ఉత్సవ విగ్రహాలను కోటకొండ గ్రామములో నూరేగింతురు

ప్రజలు విశేషముగా తమ మొక్కుబళ్లను చెల్లించుకొందురు ఇచట వివాహములను చేసికొందురు

**ఇతర విశేషాలు** స్వామి ఆలయానికి క్రిందగల ఆంజనేయస్వామిని భక్తులర్చింతురు ఇక్కడనే చింతలాముని నల్లారెడ్డి అను అవధూత గుడి కలదు స్వామి కెదురుగా ఏడు అడుగుల ధ్వజస్తంభము కలదు, హుండి కలదు, తేరుకలదు స్వామి ప్రదక్షిణ కనుకూలముగా నున్నాడు

**తిరునాళ్ల** మాఘశుద్ధ ద్వాదశికి దైవము పర్వతారోహణ చేయును మరురోజు తెల్లవారు జామున స్వామికి కల్యాణము, చతుర్దశి రోజున

గరుడోత్సవము, మరురోజు రథోత్సవము జరుగును బహుళ పాడ్యమి దినమున పారువేట, చక్రస్నానము, స్వామి పర్వతావరోహణము, స్వామికి గ్రామోత్సవము జరుగును

**మహిమలు** 1910 సంవత్సర ప్రాంతములో ఒక గుంటూరు బ్రాహ్మణుడు స్వామి బ్రహ్మోత్సవములను చూచి, పర్వతమును దిగుచు స్వామి పాదములను దాటెను. చెప్పులు విడిచి వెళ్లకున్న కాళ్లు జారునని అతనికెవరో చెప్పగా తిరస్కరించెను ఫలితముగా కాళ్లుజారి అడుగడుగు దొర్లుచు మోకాటి చిప్పలు విరిగెను అచటి సమీపమున నున్న చల్లావారింటిలో వసించుచు, అతడు బాగుచేయించుకొని, స్వామి వారికి కర్పూర నీరాజనమిచ్చి తనదేశమునకేగెను

ఒకశెట్టి తన మ్రొక్కుబడిని చెల్లించకున్నందున తనకుమారుని అడవిలో పోగొట్టుకొనెను మరల మ్రొక్కుబడిని చెల్లించుకొందుననని ప్రార్థించగ, అతని పుత్రుడు లభించెను

## పత్తికొండ తాలుకా - మద్దికెర మండలము

## రంగనాథ స్వామి, పెరవలి

మద్దికెర మండల కేంద్రమునకు నాలుగు కి మీ దూరమున పెరవలి పుణ్యక్షేత్రము కలదు ఆ గ్రామమున వెలసిన దైవము రంగనాథ స్వామి

**రంగనాథ మూలవిరాట్టు** రంగనాథ స్వామి సాలగ్రామమును కపిల మహర్షి ఆశ్రమ యోగ్య స్థానమున శుద్ధ ఏకాదశి చిత్తా నక్షత్ర యుక్త బ్రహ్మ ముహూర్తమున ప్రతిష్ఠించినాడు కోవెలకుంట్లలో వెలసిన పాండురంగ స్వామియు సాలగ్రామమే యగుట గమనార్హము పరిమాణమున పెద్దదియు, దైవకృపాలబ్ధమైన ఇట్టి సాలగ్రామము శ్రీరంగమునందును బదరీ క్షేత్రమునందును తక్క ఎచ్చటను లేదని విజ్ఞులందురు

రంగనాథుడు = పక్షి, గమన, అధికారి సర్పకాలముబడు పక్షిగమనము కోరువాడు - పక్షినెక్కి తిరుగువాడు శ్రీమహావిష్ణువు. కనుక శ్రీరంగనాథుడనగా శ్రీమహావిష్ణువేయని అర్థము విశ్వమే భగవంతునకు ఒక రంగస్థలము దాని కధిపతి ఆయనే అందుకే ఆయనకు రంగనాథుడను పేరు సార్థకమైనది

**అర్చనావిధానము** అర్చకులైన శ్రీ వైష్ణవులు పాంచరాత్రాగమ పద్ధతి ప్రకారము పూజలు గావించుచున్నారు

**ప్రసాద తీర్థములు** ఉదయ సాయంత్రములందు స్వామికి నైవేద్యము కలదు చక్కెర పొంగలి నైవేద్యమిచ్చి, భక్తులకు ప్రసాద వితరణ చేతురు

# కర్నూలు డివిజన్

## 1 ఆత్మకూరు తాలూకా ॥ వెలుగోడు మండలము

## శ్రీ లక్ష్మీచెన్నకేశవస్వామి, వెలుగోడు

**ఉనికి** నంద్యాల పట్టణమునకు దాదాపు 30 కి మీ దూరములో వెలుగోడు మండలకేంద్రమున లక్ష్మీచెన్నకేశవ స్వామి వేంచేసియున్నాడు

మూలవిరాట్టు గర్భాలయములో దాదాపు 6 అడుగుల ఎత్తుతో నాకర్షణీయ ముఖ వర్చస్సుతో లక్ష్మీ చెన్నకేశవస్వామి విరాజిల్లుచున్నాడు స్వామి పడమర కభిముఖమై యున్నాడు స్వామి చతుర్భుజములందు శంఖచక్ర గదాయుధములు, అభయ హస్తము కలదు

పరివారదేవతాది విశేషాలు గర్భాలయము ముందరి భాగమున లక్ష్మీదేవి ఉత్తరాభిముఖముగా కలదు ఆమె కెదురుగా పూర్వము భూదేవి విగ్రహ ముండెడిదట! ఆభాగము పై కప్పున అష్టదిక్పాలకులు చెక్కబడియున్నారు మధ్యలో శివ పార్వతుల విగ్రహాలు కలవు విష్ణ్వాలయములో శివ పార్వతులుండుట విశేషము సాధారణముగా విష్ణ్వాలయము లున్నచోట శివాలయములుండవు పార్వతీదేవి విగ్రహ మసలుండదు కాని, యిచ్చటి చెన్నకేశవాలయము లో శివపార్వతుల మూర్తులుండుట హర్షింపదగినదే నేటి మతకలహాల సమాజములో ఇట్టి దైవప్రతిష్ఠలు అత్యంత సామరస్యముగాను, ఏకేశ్వరోపాసన భావముతోను విలసిల్లుట ఆక్షేత్రమునందలి ఆధ్యాత్మిక వైశాల్యమును - ప్రత్యేకతను నిరూపించును శ్రీదేవి, భూదేవీ సహిత చెన్నకేశవస్వాముల వారి ఉత్సవ విగ్రహాలు మూలవిరాట్టుకడ నమర్చబడియున్నవి దేవాలయ ప్రాంగణమున పన్నిద్దరాళ్వారులు కలరు

**ఆలయస్తంభాల సంఖ్య** ఆలయము చుట్టు ఇరువదినాల్గు స్తంభములు కలవు కేశవనామాలు సైతము ఇరువది నాలు గగుట విశేషము సంఖ్యావాస్తువు పాటించబడినది నాలుగు స్తంభాలు మూలవిరాట్టు కెదురుగా లక్ష్మీదేవి ముందున్న మధ్యరంగమున వాస్తుసిద్ధముగా కూర్చబడినది

**నైవేద్యము** ప్రతిదినము మధ్యాహ్నము స్వామి వారికి నైవేద్యము సమర్పింపబడుచున్నది బియ్యపుపాయసము కేసరి - దధ్యోదనము మొదలగు వాటిలో నొకటి అఖండ దీపారాధన సైతము ఇచట కలదు

**ప్రతిష్ఠ.** చెన్నకేశవాలయము లన్నియు జనమేజయ మహారాజు

ప్రతిష్ఠించెనని అర్చకోవాచ తన పూర్వీకులు పాండవుల యభ్యుదయమునకు కారణమైన శ్రీకృష్ణుని దృష్టిలో నుంచుకొని కేశవాలయములు వివిధ ప్రదేశాలలో నిర్మించియుండునేమో యనిపించుచున్నది

**స్థానికచరిత్ర** ఈ ఆలయము పూర్వము వెంకటగిరి రాజాయాచేంద్ర భూపతిగారిది ఈ రాజావారు ఈ గ్రామమును వదలివెళ్లుచు గడిపేముల వారికి ఆలయమును తీసికొనిపొమ్మని యర్పించినారు వారు వెళ్లిన తరువాత స్వామిని కోట నుండి తెచ్చి, గ్రామమధ్యమునకు తీసికొని వచ్చి కట్టిరి వారు వంద యెడ్లబండ్లమీద ఐదేసి మంది వంతున వచ్చినారఁట! ఆజనసందోహము చూచి, వెలుగోడు ప్రజలు అవమాన భరితులై, వారి నాపని నుండి విరమింపజేసి, భోజన మర్యాదలు గావించిరఁట! ఐనను, గడిపేముల ప్రజలు వెళ్లుచు, కొన్నిరాళ్లను, సప్తర్షుల విగ్రహాలను, భూదేవి నపహరించుకొని వెళ్లి వారిగ్రామమున చెన్నకేశవాలయమున నిర్మించినారఁట ! వెలుగోడు ఆలయ పూర్వధర్మకర్త వెంకయ్య యీ కథనము గావించినాడని నేటి ఆలయార్చకులు రామేశ్వర సోమయాజులు చెప్పినారు

**వెలుగోడు నామసార్థక్యము** 1 పూర్వము వెలుగోడు అడవి ప్రదేశము ఇక్కడ ఎలుగుబంట్లు ఎక్కువగా నుండుట వల్ల దీనికి ఎలుగువాడయని పేరు పెట్టిరి అప్పటి నుండి క్రమముగా వెలుగోడుగా మారినది

2 బ్రిటీషువారి పరిపాలనా కాలములో పూర్వమిచ్చట నొకకోట యుండెడిది ఆ కోటలో నివసించు ప్రజలను బ్రిటీషువారు వెలవేసినారు వారిని వెలివేయుట తోనిది వెలివాడ య్యైనది, క్రమముగా వెలివాడ - వెలిగోడు - వెలుగోడు గా మారినది

**చెన్నకేశవ నామసార్థక్యము** నేను క్షేత్రపర్యటన కై వెళ్లినపుడొక యూరిలో కేశవనామమునకు ముందుగల 'చెన్న' అనుటలో నంతరార్థమేమని నన్నొక వ్యక్తి ప్రశ్నించుట జరిగినది చెన్ను శబ్దము వ్యుత్పత్తిని శోణార్థకము విష్ణువు దివ్యసౌందర్యమునకు ఈ అర్థము పోషకము 'చెన్ను' మాటకు ఎఱ్ఱని యని యర్థము కన్నడములో 'చెన్నాగీదె' అనగా బాగున్నదని యర్థము కేశవస్వామి వివిధ భంగిమలలో ఆకర్షణీయముగా, అందముగా నుండుట వల్లనే ఆ స్వామి చెన్నకేశవుడైనాడని అవగత మగుచున్నది

**ఉత్సవాలు** నేడు ప్రతి సం॥ము వైశాఖశుద్ధ ద్వాదశి మొదలు - వైశాఖ బహుళ విదియ వరకు ఆరుదినములు స్వామివారి కళ్యాణోత్సవము వైభవముగా జరుగుచున్నది ఉత్సవ కార్యక్రమము లిట్లుండును

వైశాఖ శుద్ధ ద్వాదశి-
ఋత్విగ్వరణము , వరివట్టం ఆళ్వార్ల పూజా ధ్వజారోహణము

| | | |
|---|---|---|
| త్రయోదశి | - | కళ్యాణోత్సవము |
| చతుర్దశి | - | హనుమదుత్సవము |
| పౌర్ణమి | - | రథోత్సవము, ప్రభోత్స |
| వైశాఖ బహుళపాడ్యమి | - | పూర్ణాహుతి - పారువేట |
| విదియ | - | వసంతోత్సవము, తీర్థావ |

ధనుర్మాసము నెలమొత్తము నిత్యపూజలు జరుగును మకర సంక్ర (జనవరి 14 వ తేది) తో ముగియునట్టి నెలరోజులను ధనుర్మాసము అండి ఉగాది (తెలుగు సంవత్సరాది) విజయదశమి (దసరా) సంక్రాంతి, వై ఏకాదశి దినములలో ఉత్సవ విగ్రహాల తో గ్రామోత్సవములు జరుగుచు

**ధ్వజస్తంభము - దీప స్తంభము** దేవాలయ ప్రాంగణములో ఇ పునర్నిర్మితమైన ధ్వజస్తంభము సుమారు 25 అడుగుల యెత్తున్నది దాని ప్ర గల దీపస్తంభమునకు కార్తీకమాసమంతయు దీపము వెలిగించుచున్నా పాంచరాత్రాగమ ప్రకారము ఇటు ఆర్చనజరుగుచున్నది

**ప్రశస్తి** మొత్తము పై ఈ పెద్దగ్రామములో ప్రజలకు దైవవ విశ్వాసమధికము వివాహాదులందును, ప్రతి సాయంత్రము నంద భక్తులీదైవమును దర్శించుచున్నారు

## కర్నూలు తాలూకా కర్నూలు మండలము

# సత్యనారాయణ స్వామి (బిర్లామందిర్)

## కర్నూలు నగరము

**ఉనికి.** కర్నూలు నగరము ప్రభుత్వ సర్వజన - వైద్యశాలకు సమీపమ కర్నూలు కడప కెనాల్ (కె సి కెనాల్) తీరమున ప్రధాన రహదారి ప్రక్క వృక్షచ్ఛాయాసహిత ప్రకృతి మధ్యమున శ్రీ సత్యనారాయణ స్వామి లక్ష్మీ సహితముగ వెలసియున్నాడు

**స్వరూపము** స్వామి చతుర్భుజుడు స్వామి కెడమ చేతులలో పై శంఖము, క్రిందపద్మము కుడిచేతులలో పైన చక్రము, క్రింద గదకలవు లక్ష్మీ వామహస్తమున పద్మము, కుడిచేయి అభయహస్తముగా గలదు ఈ విగ్రహా ఆకర్షణీయములై, చూపరులను ముకుళిత హస్తులను గావించుచున్నవి

వీరికి ముందుగ పర్వతహస్తుడై గదాధారియై హనుమద్విగ్రహ దర్శనమిచ్చు చున్నది

**అర్చకులు** స్మార్తులు పాంచరాత్రాగమవిధానమే ఇక్కడి అర్చన

**పరిసరాలయాలు** స్వామికి ఎడమవైపున పార్వతీ పరమేశ్వరులు గణపతి, కుమారస్వామి కలరు స్వామికి కుడివైపు ప్రత్యేకాలయమున సూర్యనారాయణస్వామి వెలసియున్నాడు సంగమేశ్వరము వీటిముంపు నుండి తెచ్చిన ఈ ప్రాచీన విగ్రహము 600 సంవత్సరాల ప్రాచీనమైనది

**భక్తుల సంఖ్య** రహదారి ప్రక్కనే యుండుటచేతను, విగ్రహాలు పాలరాతితో నిర్మితమై ఆకర్షణీయమైయుండుట చేతను స్వామిని దర్శించు భక్తుల సంఖ్య గణనీయముగానే యున్నది అనుదినము 50 మంది, శనివారము 300 మందివరకు భక్తులు స్వామిని దర్శించు చున్నారు

**ఉత్సవాలు / తిరునాళ్ల** ప్రత్యేకోత్సవాలు, తిరునాళ్ల లేవు జనను ధనుర్మాసము నెలరోజులు భక్తులు ప్రత్యేకముగా ఉదయము మొదలుకొని ప్రత్యేక పూజలు చేయించు కొందురు మాఘ శు॥ ౧౦ దశమి రోజు మూల విరాట్టులకే కళ్యాణము జరిపింతురు

**ఇతరాంశాలు:** ఉత్సవ విగ్రహాలు లేవు ధ్వజస్తంభము స్వామి కెదురుగా 20 అడుగుల ఎత్తుదికలదు నైవేద్యము ప్రతిదినము ఉదయము అన్నము, నెయ్యి బెల్లము సమర్పించుచున్నారు ఆలయము ప్రదక్షిణ కనుకూలము

## కోడుమూరు తాలూకా-కోడుమూరు మండలము
## మాధవస్వామి, గోరంట్ల,

**ఉనికి** జిల్లాకేంద్రము కర్నూలుకు సుమారు 30 కి మీ దూరము లోను, మండల కేంద్రము కోడుమూరు నకు 10 కి మీ దూరములోను గోరంట్ల క్షేత్రము కలదు లద్దగిరికి 3 కి మీ దూరమున, హంద్రీ నదీతీరమున గల ఈ గ్రామములో మాధవస్వామి వెలసియున్నాడు

**గోరంట్ల క్షేత్రనామౌచిత్యము** పూర్వము గోరింటాకు చెట్లు ఎక్కువుగా నుండుటచే ఈ గ్రామమున కీపేరు వచ్చెనని కొందరు పల్కుచున్నారు గోరువంక మహాముని నివసించుటచే ఈ గ్రామమునకు గోరంట్ల అని పేరు వచ్చినదని మరికొందరు చెప్పుచున్నారు

**ఆలయప్రాచీనత** ఆలయములోని ఆళ్వారుల మందిర సమీపమున గల శాసనము చోళమహారాజులు వేయించినది అది క్రీ శ 1105 సం॥ మునాటిది కన్నడ లిపిలో గలదు 17 వ శతాబ్దికి చెందిన అరవీటి రాజుల శిలాశాసనాలు ఆలయ ప్రాంగణమున లభించు చున్నది ఇవి ఆలయ ప్రాచీనతను చాటుచున్నవి

క్రీ శ 1105 సం॥ నాటి శాసనములో మాధవాలయ నిర్మాణమును గురించిన వివరములు కలవు మాధవాలయము ప్రధానద్వారము దాటిన వెంటనే పై రెండవ శాసనము కన్పించును ఆరవీటి వేంకటాద్రయ్యగారి పుత్రుడైన శ్రీరంగప్ప, రాజయ్య అను ఆరవీటి వంశ మహారాజుచే శ్రీ మాధవునకు వతుస్సీమలలోని భూమిని సమర్పించిన వివరములు ఈ శాసనమున గలవు

**మూలవిరాట్టులు** గర్భాలయములో రాతితో చెక్కిన మాధవ స్వామి వారి విగ్రహము కలదు అది పురాతనమైభిన్నమగుటచే ఆవిగ్రహమునకు ప్రక్కనే 1961 సం॥మున నూతన మాధవ విగ్రహము ప్రతిష్ఠింపబడినది కనుక నేటికిని గర్భాలయమున తూర్పున కభిముఖముగా మూలవిరాట్టు లిద్దరు దర్శనమిచ్చుచున్నారు

**ఉత్సవవిగ్రహాదులు** ఈ మూలవిరాట్టుల కు ముందు భాగాన శ్రీదేవి భూదేవీ సహిత వసంత మాధవుల ఉత్సవ విగ్రహములు దర్శనమిచ్చును విశిష్ట దినములలో వీరికి గ్రామోత్సవము జరుగును ఈ మూలవిరాట్టులకు ప్రక్కనే ఎడమవైపున లక్ష్మీదేవి అమ్మవారి కోవెల కలదు మూలవిరాట్టులకు ముందు భాగమున జయవిజయ ద్వార పాలకులు కలరు

**మాధవ గోపురము** మాధవాలయమునకు ఎదురుగా తూర్పు ముఖద్వారముగా ఏడంతస్తుల ద్వారములతో సుమారు వంద అడుగులకు పైబడి మాధవగోపురము నయనపర్వము గావించుచున్నది ఈ గోపుర నిర్మాణము సుమారు క్రీ శ 1920 సం॥ ప్రాంతమున నిర్మింపబడియుండును

**మాధవ రథము - రథశాల** మాధవాలయసమీపమున దక్షిణపు ప్రక్కన రథశాలభవనము సుమారు 60 అడుగుల ఎత్తు కలిగియున్నది మాధవ రథోత్సవ సమయమున అమ్మవారితో కలిపి మాధవస్వామిని ఊరేగింతురు పన్నిద్దరాళ్వారులు ప్రాకారమున కుత్తర దిశలో గల గుడిలో దర్శనమిచ్చు చున్నారు

**ధ్వజస్తంభములు** ఆలయము మొదటి ముఖద్వారమును దాటగనే బలాంజనము, దానిని దాటగనే సుమారు 25 అడుగుల యెత్తుగల ధ్వజస్తంభమున్నది ప్రాచీన ధ్వజస్తంభ స్థానమున దీనిని 1986 సం॥న ప్రతిష్ఠించినారు గోపురమునకు ముందు భాగమున దాదాపు 30 అడుగుల ఎత్తుగల రాతి ధ్వజస్తంభము సైతము కలదు

**పెరుమాళ్ల (విష్వక్సేన) ఆలయము** మాధవ స్వామికి సేనాధిపతియైన విష్వక్సేనుడు పెరుమాళ్లని పిలువబడుచు, మాధవాలయమునకు 1 కి మీ

ంన తూర్పుదిశలో లద్దగిరి వైపున వెలసి యున్నాడు వైష్ణవాలయములలో
› పూజకు ప్రాధాన్యము కలదు ఇతని నర్చించిన పిమ్మటనే విష్ణువును
ంట సాంప్రదాయము

**తిరునాళ్ల / ఉత్సవములు** ఈ స్వామి వారి ఉత్సవాలలో ముఖ్యమైనవి
త్సవాలు ప్రతి సంవత్సరవము పాల్గుణ శుద్ధత్రయోదశి మొదలు
ంహుళ అష్టమి వరకు జరుగు ఈ ఉత్సవాలను గోరంట్ల తిరునాళ్ల అని
ంల్కుచు, స్వామిని సేవింతురు

| | | |
|---|---|---|
| ల్గుణ శుద్ధత్రయోదశి | - | అంకురార్పణ, రక్షాబంధనము |
| ంర్దశి | - | ధ్వజారోహణము (ఉదయము)<br>సింహోత్సవము (రాత్రి) |
| ్టమి | - | హనుమంతోత్సవము |
| ల్గుణ బహుళ పాడ్యమి | - | కల్యాణోత్సవము, గరుడసేవ |
| యు | - | గజోత్సవము |
| యు | - | రథారోహణము |
| | - | శ్రీవారి రథోత్సవము |
| మి | - | పారువేట (అశ్వవాహనము) |
| మి | - | హంసవాహనము, వసంతోత్సవము<br>కంకణ విసర్జన (రాత్రి) |

ఇందులో చిత్తా నక్షత్రవందు స్వామివారి కల్యాణోత్సవము,
్సవము మిక్కిలి వైభవముగా జరుగును ఈ ఉత్సవములను తిలకించుటకు
పె భక్తులు పరిసర ప్రాంతాల నుండి యేకాక, పేరు జిల్లాలనుండియు
ందురు

**ధనుర్మాసము** ప్రతి సంవత్సరము జనవరి 14 వ తేది ధనుర్మాసమునకు
జు ఆ నెలదినములలో అర్చకులు ప్రాతఃకాలముననే స్వామి వారిని
ంపి వైవేద్యమును సమర్పింతురు

**కృష్ణాష్టమి** శ్రావణ బహుళాష్టమి దినమున కృష్ణుడు జన్మించెను ఆ
వ అర్చకులు ఆలయమునకు వాయవ్యమందున్న నాగదేవతలకు
కముగావింతురు అది మొదలుగా నెలరోజుల పాటు తొట్లసేవలలో
ం పాడుచు అర్చకులు, భక్తులు స్వాములవారిని సేవింతురు

**విశేషాంశములు** వైష్ణవులు 25 కుటుంబములవారు పాంచరాత్ర ప్రకారము అనువంశీకముగా స్వామినర్చించుచున్నారు తులసీ, సుగంధ, ద్రవ్యయుతమైన తీర్థమును, శఠగోపమును అర్చకులు వాడుచున్నారు

స్వామి వారికి నిత్య నైవేద్యము కలదు భజంత్రీ తో హంద్రీనది నుండి అర్చకులు ఉదయ సాయంత్రములందు బిందెసేవచేయుచున్నారు మధ్యాహ్నము 12 గంటలకు చెక్కర పొంగలిని, రాత్రి 8 గం॥లకు బెల్లమును స్వామికి నైవేద్యమిత్తురు

భక్తుల సంఖ్య నేడు పెరిగినది శ్రావణ, కార్తీక మాసాలలో స్థానికేతర భక్తులును స్వామిని దర్శించు చున్నారు

ప్రశస్తి స్వామివారిని దర్శించి, తమ కోర్కెలను నివేదించుకొన్న భక్తులకు స్వామి కొంగుబంగారమై, అభయమొసఁగి కాపాడుచున్నాడు స్వామి నిలవేల్పుగా స్థానికేతరులును ఆరాధించుచున్నారు మాధవ స్వామికి ఇనాము పొలాలు గ్రామాంతరములలో కూడ కలవు

''సర్వదేవ నమస్కారః కేశవం (మాధవం) ప్రతిగచ్ఛతి''

## కోడుమూరు తాలుకా కోడుమూరు మండలము
## గిడ్డాంజనేయస్వామి - వెంకటగిరి

**ఉనికి** కోడుమూరు మండల కేంద్రమునకు 6 కి మీ దూరమున గల వెంకటగిరిలో గిడ్డాంజనేయస్వామి వెలసియున్నాడు నాలుగడుగుల యెత్తుగల్గి, దక్షిణాభిముఖముగానున్న ప్రసన్నాంజనేయస్వామి ఈయన, మహబూబ్‌నగర్ జిల్లా బీచుపల్లె హనుమద్విగ్రహముతో ఈ మూల విరాట్టుకు పోలిక కలదు



గిడ్డాంజనేయస్వామి – వెంకటగిరి

**అర్చన ప్రసాదాదులు** అర్చకులు పాంచరాత్ర పద్ధతి ప్రకారము స్వామి నర్చించుచున్నారు ప్రతి ఉదయము 9 గంటలకు చెక్కర పొంగలి రాత్రి 8 గం॥లకు చెక్కర నైవేద్యముగా సమర్పింపబడును ఈ ఆలయమున ప్రదక్షిణ కవకాశము లేదు ఈ గుడికి ఎడమ వైపున శివాలయము - క్షుద్రదేవత సుంకులమ్మ ఆలయములు ఆనుకొనియున్నవి ప్రదక్షిణ చేసిన మూడు ఆలయాలకు కలిపియే చేయవలసియుండును అఖండ దీపారాధన కలదు స్వామి వారికి గ్రామసేవ విశేషముగా గావింతురు

**తిరునాళ్ల/ఉత్సవము** ప్రతి ఉగాదికి నాలుగు రోజులు స్వామికి ఉత్సవములు జరుగును 1982 సంవత్సరము నుండి ఇచట హనుమజ్జయంతి వైభవముగా జరుగుచున్నది ఫాల్గుణ బహుళ అమావాస్యనాడు (ఉగాదికి ముందురోజు) గరుడోత్సవము జరుగును ఉగాది రోజు ప్రాత కాలము నుండి రాత్రి 10 గంటల వరకు అవిరామముగ భక్తులు స్వామివారికి నారికేళములు సమర్పించు చుందురు

**ఆలయాభివృద్ధి** ఈ ఆలయము ప్రాచీనమైనను స్వయంపోషకమైనది ఈ గుడి పెద్దగా అభివృద్ధికి నోచుకొనకపోయినను అక్కడ మహిమలు అనేకములు కలవు అదే ఆక్షేత్ర ప్రశస్తి ప్రజలకు దైవము పై గల విశ్వాసమపారము ప్రతి శనివారము 4 వందల మొదలుకొని, 500 మంది భక్తులు స్వామి దర్శనార్థమై అరుదెంతురు కర్నూలు, అనంతపురము, బళ్ళారి, రాయచూరు, మహబూబ్ నగర్ జిల్లాల నుండి స్వామిదర్శనానికై భక్తులు వచ్చుచున్నారు

**గంటల దేవుడు** స్వామికెదురుగా వేయి చిన్న, పెద్ద గంటలుండుట విశేషము గంటలను సమర్పింతుమని భక్తులు తమకోరికలు నెరవేరినంతనే స్వామికి మ్రొక్కుబడులు చెల్లించు కొనుచున్నారు గంటలు జీవుని దేహమునందలి అంతర్నాదమునకు, ఓం కారమునకు ప్రేరణలు ఇట్లు ఇదొక ప్రత్యేక క్షేత్రముగ పరిగణింపబడినది

**త్రిభిస్సాన్నిహిత్యము** 1 స్థాపకుని తపశ్శక్తి, 2 అర్చకుని ఆత్మనిష్ఠ, 3 బింబ (విగ్రహ) కళాభివృద్ధులు ఎచటనుండునో తానచ్చట నుందునని శ్రీకృష్ణుడు చెప్పినట్లు పెద్దలందురు పై మూడు నిచ్చట కలిసియుండుటచే హనుమంతుడు సాకారముగా ఇచట దర్శనమిచ్చు చున్నాడని అర్చకుడు కీ శే॥ వేంకటరమణయ్య పలికెను దాదాపు ఇరువది వర్షములనుండి అర్చకుడు ఆలయాభివృద్ధికై కృషిచేయుచుండెను నేడు వారి కుమారు లిర్వురు అర్చన చేయుచున్నారు

# డోన్ తాలూకా - డోన్ మండలం

## చెన్నకేశవ స్వామి, గుండాల

డోన్ మండల సరిహద్దులో వెలసిన గుండాల గ్రామమున చెన్నకే
స్వామి దర్శనమిచ్చుచున్నాడు

**ఆలయచరిత్ర** కొత్రాయి గ్రామ పంచాయతీ మజరా గ్రామ
గుండాల చెన్నకేశవ స్వామికి ప్రాచీన చరిత్ర కలదు

ఈ దేవాలయమును విజయనగరరాజు తిరుమల రాయలు నిర్మించి
దేవాలయ ప్రాంగణములోని శిలాశాసనాలను బట్టి తెలియుచున్న
రాజ్యవిస్తరణలో భాగముగా తిరుమలరాయలు ఈ ప్రాంతము ద్వార వెళ్లు
నిచ్చట విడిది చేయగా, చెన్నకేశవస్వామి రాత్రికలలో కన్పించి, త
దేవాలయము కట్టించుమని కోరగా రాజు శిల్పసుందరమయమైన దేవాలయమ
కట్టించెనని తెలియుచున్నది ఈ దేవాలయమునకు చాల ఎకరాల మాన్య
కలదు

**ప్రజల విశ్వాసములు** 1 ఈ గుండాల చెన్నకేశవాలయమును, కృ
మండలము చుంచు ఎఱ్ఱగుడి ఈశ్వరాలయమును, గుంటూరు ప్రాంతము
మరొక ఆలయమును ఒక్క రోజులో దర్శించిన పాపాలు హరించి మోక్ష
లభించునని ప్రజల విశ్వాసము 2 ఈ ఆలయములోని గర్భాలయము లో దే
కెదురుగా నున్న పచ్చబండపై నిలబడి, అబద్ధమెవ్వరు చెప్పరని ప్రజల విశ్వాస
3 దేవాలయ ప్రవేశ వేళ గోపురమును దాటిన తర్వాత ఒక కట్టపై తిరుగు
గుండు సేర్పాటు చేసినారు మనసు లో దేవుని ధ్యానించి, ఈ గుండును
చేతులతో పట్టుకొని కొంత సేపున్నచో, గుండు తిరిగిన మనసులోని కో
నెరవేరునని, తిరుగక పోయిన కోరికలు నెరవేరవని ఇచట ప్రజల నమ్మక

**తిరునాళ్ల** ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ పౌర్ణమి కిచట తిరు
జరుగును చైత్ర శుద్ధ దశమి సింహ వాహనోత్సవము, ఏకాదశి - చిలుక వా
సేవ, ద్వాదశి - శేషవాహన సేవ, త్రయోదశి - గరుడవాహనసేవ, చ
నాడు ప్రదోషపూజ, దీక్షాహోమము, పౌర్ణమి నాడు ఉదయమ
కల్యాణోత్సవము, సాయంత్రము రథోత్సవము జరుగును కృష్ణపాడ్యమికి
లాగు పందెములు ఇత్యాది కార్యక్రమాలు నిర్వహింపబడును పా
కృష్ణపాడ్యమికి ఆలయ నిర్వాహకులు సందర్శకులకు ఉచిత భోజన వ
కల్పింతురు పరిసర గ్రామవాసులు స్వామిని దర్శించి, తమ కోర్కె
విన్నవించుకొందురు

# డోన్ తాలూకా డోన్ మండలము

## ఆంజనేయస్వామి, ద్రోణాచలము

ద్రోణాచలము మండలకేంద్రములో గ్రామమునకు చివర 10 అడుగుల ఎత్తుతో ఆంజనేయస్వామి దర్శన మిచ్చును స్వామి గంభీరముగా, సమున్నత దేహుడై, దక్షిణ ముఖద్వారమున నున్నాడు

**అర్చన/నైవేద్యము** అనుదినము శుద్ధోదకాభిషేకము - మంగళ శనివారాలు నైవేద్యమును స్వామికి అర్చకుడు సమకూర్చుచున్నాడు పొంగలి రవ్వకేసరి / పులిహోర ఏ దేనొకటి నైవేద్యముగా సమర్పింపబడుచున్నది ఆ నైవేద్యమునే వచ్చిన భక్తులకు ప్రసాదముగా పంచబడుచున్నది పాంచరాత్రాగమ పద్ధతిలో అర్చన జరుగుచున్నది

**ఉత్సవాదులు:** ప్రత్యేకించి స్వామికి తిరునాళ్ల ఉత్సవాలు లేకపోయినను, వైశాఖ బహుళదశమి - హనుమజ్జయంతి, మార్గశీర్ష బహుళత్రయోదశి - హనుమద్వ్రతము వైభవముగా జరుగును

**భక్తుల విశ్వాసములు 1** వణిక్ప్రముఖులు, తదితర పట్టణవాసులు స్వామిని విశ్వాసముతో సేవింతురు ప్రతి శనివారము నందు వంద మంది భక్తులరుదెంతురు కోర్కెలను తీర్చుకొనిన భక్తులు ఆకుపూజ కట్టించుటయు, పూజచేయించుటయు కలదు

ఈ స్వామి పై స్థానిక న్యాయవాది రామచంద్ర రావు శతకమును రచించినాడు

# డోన్ తాలూకా, బేతంచెర్ల మండలము.

## వేణుగోపాలస్వామి, భోగేశ్వరము, ఎంబాయి,

**ఉనికి.** బేతంచెర్ల మండలకేంద్రమునకు దాదాపు 21 కి మీ దూరమున, 'ఎంబాయి' గ్రామమునకు 1 కి మీ దూరమున వేణుగోపాల స్వామి వెలసియున్నాడు ఈ క్షేత్రమును భోగేశ్వరమని యందురు ఈశ్వరుడు ప్రధాన దైవమగుటచే ఈ క్షేత్రమునకు భోగేశ్వరమని పేరువచ్చినది

**స్వరూపము** స్వామి రమణీయ రూపముతో మందహాసము గావించుచు వేణువును చేతబట్టుకొని దర్శనమిచ్చును ఈ స్వామి కర్చకులు ఈ గ్రంథకర్త కుటుంబీకులు

ఇచట వేణు గోపాలస్వామికి రెండు పార్శ్వముల ఇద్దరు దేవేరులు కలరు స్వామి కెదురుగా ధ్వజస్తంభము కలదు

స్వామికి వెనుక, రెండు వైపుల మామిడితోటలు గలవు స్వామి తూర్పున కభిముఖముగా నున్నాడు స్వామికి పాదోద్భవగా క్రింది నుండి జలప్రవాహము సన్నగా పారుచున్నది

**ఉత్సవము:** స్వామికుత్సవ విగ్రహాలు లేవు ప్రతి శనివారము స్వామికి నైవేద్యము, పూజ సమర్పించబడుచు కీ శే శేషయ్యగారు పరమ పదించువరకు స్వామిని భక్తితో నర్చించు చుండెను ప్రస్తుతము వీరి కుమారులు అర్చకులు

శివరాత్రి పర్వదినమున ఎంబాయి గ్రామప్రజలు శివునారాధించుటకై యిటకు వత్తురు శివాలయమము ఈ ఆలయమునకు ప్రక్కనే కలదు ఆసమయమున ఈస్వామిని సైతము భక్తులు దర్శింతురు

## డోన్ తాలూకా, బేతంచెర్ల మండలము.

## శ్రీ మద్దులేటి నరసింహస్వామి రంగాపురము

**ఉనికి.** బేతంచెర్ల మండలము, రంగాపురము రైల్వేస్టేషనుకు 5 కి మీ దూరమున ఈ క్షేత్రము వెలసియున్నది ఇచట వెలసిన దైవము శ్రీమద్దులేటి నరసింహస్వామి బేతంచెర్ల నుండి డోన్‌కు వెళ్లు మార్గమధ్యమున బస్సు-రైలు మార్గములందు రంగాపురం కనిపించును

గుండ్ల మల్లప్ప - యాగంటి - ముచ్చట్లు అనుశైవక్షేత్రములకు సమీపమున ఈ వైష్ణవ క్షేత్రము కలదు

**మూలవిరాట్టు** చదరపు శిలమాత్రము త్రిపుండ్ర ధారిత్వముతో నిరాకారముగా మూలవిరాట్టు కనిపించును శుక్ర - శని ఆదివారాలలో నరసింహస్వామి కవచమును అర్చకులు ఈ మూల విరాట్టునకు ధరింపజేతురు

స్వామి వారి ప్రక్కన గర్భాలయములోగల చిన్నశిల సాసోలి చిన్నమ్మ దట! ఆమె స్వామి భక్తురాలు

**భక్తులసంఖ్య** శనివారము నాడు భక్తులు అశేషముగా స్వామిని దర్శింతురు ప్రక్క జిల్లాలనుండియు భక్తులరుదెంతురు శుక్ర - శని - ఆది వారాలలో భక్తుల సంఖ్య యెక్కువగును తక్కిన దినములలో వందవరకు భక్తుల ఆగమన ముండును

స్వామి వారి కెడమ వైపున ఇటీవల నిర్మించిన లక్ష్మీదేవి విగ్రహము కలదు

**క్షేత్ర పురాణము**

1 శ్రీ మద్దులేటి నరసింహ స్వామి కదిరిలో వెలసిన నరసింహస్వామి అంశతో వెలసెనందురు కదిరి నరసింహస్వామి తన దేవేరితో ఆడిన పాచికలాటలోనోడి, పరిహసింపబడి, అలిగి తనయునికిని యాగంటి క్షేత్రమునకు మార్చినాడంట! ఆపిదప యాగంటి సమీపములోని, మద్దులేరు సమీపమున గల ప్రస్తుతము స్వామి వెలసిన చోట నిల్చినాడంట!

2 వైకుంఠ వాసి యైన శ్రీమహావిష్ణువొకనాడు లక్ష్మితో నీచజలచరములున్న సముద్ర, మామె పుట్టినిల్లగుటచే తన కొసహ్యమనియు, ఆమె సోదరుఁడు చంద్రుడు గురుద్రోహి యనియు పరిహసించినాడు అందుల కామె సహించక, విష్ణువును దరిద్ర నారాయణుఁడని యు దాసులు పెట్టు పిండమును స్వీకరించు వాడనియు కోపగించెను

లక్ష్మీదేవిని శాంతింపచేయుటకు దేవతలు మునులు ప్రత్నించినను లాభము లేక పోయెను విష్ణువు అపుడు ఉగ్రమూర్తియై మిత్రుడైన యాగంటీశ్వరుని చేరి తానెందుకు వచ్చెనో తెలిపెను పరమశివుడప్పుడు 'మన మిరువుర మొకచోట నుండనేల? ఇటు పడమటి దిక్కున దగ్గరలో మద్దులేటి తీరమున నీవు వసించినచో నీ దర్శనమునకై వచ్చిన వారు నాకడకు వత్తు' రని చెప్పిపంపెను

అపుడు శ్రీహరి ఉడుము రూపములో మద్దులేరు కడకు వెళ్లు చుండగా రంగాపురపాలకుడైన బోయదొరసైన్య సమేతముగా వేటకు వెళ్లి, జంతువులు లభించక ఆ ఉడుమునే పట్టి కొట్టి చంపవలెనని పరుగిడి వెంటనంటెను శ్రీహరి వానికి చిక్కక, ఒక గుహలో దూరెను బోయదొర వెన్నంటి వెళ్లి, యుడుము తోక పట్టుకొనగా, వానికి కన్నులు కనిపించక పోయెను అతడు తనకు దేవాలయము కట్టించి, ఆలయార్చకుడుగా నుండిన వంశవృద్ధి యగునని ప్రక్కనున్న యొక భక్తునావేశించి, స్వామి పలికెను

బోయదొర అట్లే చేతుననగా కన్నులు వచ్చెను అతడు పూజారిగా నుండెను ఆవంశము వారే నేటికిని అర్చకులుగానున్నారు

# నందికొట్కూరు తాలుకా జూపాడుబంగ్లా మండలము.
# రంగస్వామి, తర్తూరు

నందికొట్కూరు తాలుకా కేంద్రమునకు దాదాపు 15 కి మీ దూరమున బంగ్లామండల కేంద్రమునకు 4 కి మీ దూరములో తర్తూరు గ్రామమున రంగస్వామి వెలసియున్నాడు

స్వామి ఆకారము స్వామి స్వరూపము ఒక చెక్కబొమ్మ స్వామి శయనించి యుండును నెల్లూరి లోని రంగస్వామి, శ్రీరంగములోని రంగనాథస్వామి, తెలంగాణాశ్రీరంగాపురములోను రంగనాథస్వామి యిట్లే యుండును 6 తులముల బంగారు, వెండియాభరణములున్నను తిరునాళ్లలో మాత్రము స్వామికి వాటిని ధరింపజేతురు దేవుని పై పాముపడగయున్నది అటవీశాఖవారు స్వామి వారికి 1996 లో విశాలమైన మందహాసమం చేసి యిచ్చినారు

రంగనాథస్వామి క్షేత్ర చరిత్ర నాలుగు శతాబ్దాల క్రితము తర్తూరు గ్రామమునకు చెందిన లక్ష్మిరెడ్డి, రాజిరెడ్డి అను అన్నదమ్ములు తమ కుమారునికి శ్రీరంగాపురము గ్రామమునకు చెందిన ఒకమహిళతో వివాహము జరిపించినారు సమకాలీన సంప్రదాయము ప్రకారము పెళ్లి కూతురు మెట్టినింటికి వెళ్లు సమయములో ఒక చెక్కబొమ్మ, ఒక దువ్వెన, అద్దము, కుంకుమలతో 'వాయనము' ను పుట్టింటివారు పెట్టి పంపిరి తమకోడలు తెచ్చినచెక్కబొమ్మను లక్ష్మిరెడ్డి పశువుల గాటి వద్ద గూటిలో పారవేసెను నాటినుండి లక్ష్మిరెడ్డి కుటుంబమునకు అరిష్టము కల్గినది విపరీతముగా ఆస్తినష్టము సంభవించి, పశుసంపద అంతరించి పోయినది ఈ విషయమును ఎరుకలగద్దె ద్వార విన్నలక్ష్మిరెడ్డి నమ్మలేదు

ఇంతలో ఒకనాటి రాత్రి లక్ష్మిరెడ్డికి రంగస్వామి కలలో దర్శనమిచ్చి తనను సేవించిన కష్టాలు తీరునని చెప్పుటతో లక్ష్మిరెడ్డి భక్తితో రంగస్వామిని తీసికొని పరిశుద్ధ ప్రదేశమున నుంచి సేవించగా తత్కుటుంబము సంపదలతో తులతూగినదని ఆ గ్రామ ప్రజలు చెప్పుచున్నారు నాటి నుండి, క్రమక్రమముగా ఆయిల్లే క్షేత్రమైనది

అర్చకులు ఇక్కడి అర్చకులు దృఢనిష్ఠగల వారు, ప్రస్తుతమునకు 24 మంది 5 కుటుంబములకు చెందియున్నారు

• నైవేద్యము ప్రతి రోజు మధ్యాహ్నము 1 గంటలోపల పులగము, నెయ్యి స్వామికి నైవేద్యము కొనసాగుచున్నది రెండు రోజులు మాత్రము అర్చకులు

నైవేద్యము పెట్టరు తేరురోజు, తిరునాళ్ల అనంతరము పారువేట రోజు దేవునికి భక్తులే నైవేద్యము వండిపెట్టుదురు

తిరునాళ్లవిశేషాలు తర్తూరు తిరునాళ్ల కర్నూలు జిల్లాకే తలమానికము చైత్ర శుద్ధ అష్టమి మొదలు చైత్రబహుళ విదియ వరకు ఇచట స్వామికి తిరునాళ్ల జరుగును చైత్రశుద్ధ అష్టమి రోజున శ్రీరంగస్వామిని పెళ్లికుమారుని చేయుదురు కల్యాణము మాత్రము చేయరు చైత్ర శుద్ధ ఏకాదశి రోజున శేష వాహన సేవ, చైత్ర శుద్ధ చతుర్దశి - గజవాహన సేవ చైత్ర శుద్ధ పౌర్ణమి - రథోత్సవము (తేరు), బహుళ పాడ్యమి - అశ్వవాహన సేవ (పారువేట), బహుళ విదియ - వసంతోత్సవము - తీర్థావళి

తొలిరోజు 100 కేజీ మూలెబియ్యము, బేడలువేసి భక్ష్యాలు చేసి, భక్తులకు అర్చకులు ఉచితముగా ప్రసాదము పెట్టెదరు

ఇతరాంశాలు ఇంత ప్రసిద్ధ క్షేత్రమైన తర్తూరు ఒకప్పటి యింటిదైవము నేడు, ఆగ్రామానికి, పరిసర గ్రామాలకు విస్తృతముగా దైవమగుట విశేషము ప్రతి శనివారము రాత్రి 8 గం॥ల నుండి 12 గం॥ల వరకు భజన చేయుచున్నారు

ఇక్కడ వెండి శఠగోపము, వెండి పాదుకలు స్వామికి కలవు తిరునాళ్లలో మాత్రము వెండి శఠగోపముపయోగింతురు అనుదినము రాగి శఠగోపము పయోగింతురు టెంకాయ కొట్టిన నీరము తీర్థముగా నుపయో గింతురు ప్రత్యేకించి నీటి సౌకర్యము ఏర్పడవలసియున్నది

భక్తుల సంఖ్య స్వామి పై భక్తులకు విశ్వాసము కలదు స్వామికి మ్రొక్కుబళ్లు చెల్లించు కొందురు ప్రతి శనివారము 20 మంది వరకు భక్తులు స్వామిని దర్శింతురు తిరునాళ్లలో జనసంఖ్యయధికము గత 8 ఏళ్లనుండి భక్తులధికము

ఆలయము స్వామి కొలువున్న ఇంటి స్థానము లో బైరెడ్డి శేషశయనారెడ్డి గారి ఆధ్వర్యములో భక్తుల చందాలతో నేడు ఆలయము వెలసినది మునుపటి చెక్క విగ్రహముతోబాటు అర్చనకై పెద్ద విగ్రహము స్థాపింపబడినది నేటి అర్చకులు బ్రాహ్మణులు

# నందికొట్కూరు తాలూకా నందికొట్కూరు మండలము
# సూర్యనారాయణ స్వామి ఆలయము
# నందికొట్కూరు

**ఉనికి** జగత్ప్రకాశకుడు జీవాధారకుఁగు, కులమతాల కతీతుఁడైన నవగ్రహాధిపతి సూర్యనారాయణ స్వామి నందికొట్కూరు పట్టణమున కొలువుదీరి యున్నాడు మూలవిరాట్ ఛాయా ఉషాసమేత సూర్యనారాయణ స్వామి

**అర్చావిధానము** వైదిక విధానముగా స్వామి కర్చనలు జరుగుచున్నవి సర్కారు ప్రాంతములోని 'అరసవెల్లి' సూర్యనారాయణ స్వామి ఆలయములో వలె అర్చన చేయుటకై ప్రయత్నములు జరుగుచున్నవి

**ఉత్సవములు** మాఘమాసము శుక్లపక్షము సప్తమీ తిథిని 'రథసప్తమి' యందురు ఆరోజు దేవేరీ సహిత సూర్యనారాయణ స్వామి ఉత్సవ విగ్రహాలను ఊరేగింతురు సంవత్సరానికి రెండు మారులు ఆదివారము సప్తమీ తిథివచ్చును దీనిని 'అర్కసప్తమి' యందురు ఇది పవిత్రదినము, శనివారము వచ్చిన త్రయోదశి శనిత్రయోదశిగా శనిగ్రహమున కేవిధముగా పవిత్రమైనదో - సూర్యునకు 'అర్కసప్తమి' సైతమిట్లు పవిత్రమైనది

**సూర్యజయంతి విశేషాలు.** వైజ్ఞానిక రీత్యా సూర్యభగవానుని రథము దక్షిణము నుండి ఉత్తర దిశకు మరలుదినము ''రథసప్తమి'' అదే సూర్యజయన్తి ఈ దినమున మానవులు, దేవతలు సూర్య భగవానుని పూజింతురు సూర్యుడు సప్తాశ్వయుతుడు సూర్యునికి ఏడు గుఱ్ఱములుండుటచే ఈ పేరు సార్థకమనికొందరందురు, కాగా, సుర్యుని కొకే గుఱ్ఱమున్నదనియు, దాని పేరే 'సప్త' యనియు కొందరను చున్నారు ఈ 'రథసప్తమి' నివైష్ణవాలయాలలో విశేషదినముగా పరిగణింతురు

**ఆలయ పునరుద్ధరణ 1996** డిశంబరులో ప్రస్తుతమున్న ఆలయము పునరుద్ధరణ చేయబడినది పూర్వమున్న పీఠము, అంతరాళము మార్చలేదు ముఖమండపము మార్చబడినది పూర్వము ఆలయమున్న స్థానములోని శాసనము పునరుద్ధరణ సమయమున యువశక్తి శిథిలము చేసినది

**మహోదయపర్వము** అమావాస్య - ఆదివారము ఇది సంవత్సరానికి రెండు మారులు వచ్చును ఈ రోజు చేయుసూర్యోపాసన గ్రహణ దినములలో వెయ్యి పుణ్యక్షేత్రముల దర్శనము చేసిన దానితో సమానము ఈనాడు సూర్యస్తోత్రాలు నందికొట్కూరులో వందలమంది పఠింతురు

**భక్తుల సంఖ్య** గతములో ఆలయమునకు భక్తుల సంఖ్య పరిమితముగానుండెను అనుదినము ఉదయము స్వామివారికి అర్చన జరుగును ప్రతి ఆదివారము స్వామివారికి ఆకుపూజ కల్పింతురు ఇప్పుడు ప్రతి ఆదివారము 200 మంది వరకు భక్తులు స్వామిని దర్శించుటకై వచ్చుచున్నారు ఆలయములో ఉపన్యాసకార్యక్రమములు జరుగునప్పుడును భక్తులు విశేషముగా వత్తురు

1996 సంవత్సరము ఆలయ పునరుద్ధరణ దినమున పదివేల మందికి అన్నదానము చేయుట జరిగినది

**ప్రశస్తి** ఆలయమున్న వీధిలో ప్రజలు ఆదివారమును స్వామి విశేషార్చన దినముగా భావించి, ఆరోజు మాంసాహారమును ముట్టుటలేదు మొత్తము పై ఈ స్వామి పై భక్తిప్రపత్తులీవీధి వారికెక్కువ కర్నూలు పరిసరాల నుండి సైతము ఈ ఆలయమునకు వచ్చుచుందురు

## నందికొట్కూరు తాలూకా - మిడుతూరు మండలము

## చెన్నకేశవస్వామి, మిడుతూరు

ఉనికి గడివేముల - నందికొట్కూరు మండలకేంద్రములకు మధ్యగల మిడుతూరు మండలకేంద్రమున గ్రామములో వెలసిన దైవము చెన్నకేశవస్వామి

**స్వామి స్వరూపము** పశ్చిమాభిముఖముగా చెన్నకేశవస్వామి చతుర్భుజుడై మనోహరాకృతి తో దర్శన మిచ్చుచున్నాడు

**ఆలయప్రాచీనత** ఆలయమును జనమేజయ మహారాజు నిర్మించినట్లు భావింపబడుచున్నప్పటికిని, విజయనగర రాజైన సదాశివ రాయలు 1466 సం॥ ఆలయప్రాకారమును నిర్మించినట్లు శాసనాధారము వల్లతెలియును ఆలయము ఉత్తర వాయవ్యము నందు గల పుష్కరిణి విశాలముగా నుండి, నలువైపుల సోపానములతో, మనోహర శిలాయుక్తమైయున్నను, వాడుకలో లేని కారణముగా శిథిలావస్థకు చేరుకొన్నది ఆలయము చుట్టు పెద్దప్రహరిగోడ, ఎత్తైన ముఖద్వారము కలవు ఆలయములో ప్రవేశించగనే ఎత్తైన ధ్వజస్తంభము కలదు కేశవస్వామి లక్ష్మీదేవి విగ్రహాలు ప్రాతవైనందువల్లను, విగ్రహాలను దొంగలు పెకలించి వేసినందువల్లను విగ్రహాలను పునఃప్రతిష్ఠ గావించుట జరిగినది 1971 సం॥ నూతన విగ్రహాలు ప్రతిష్ఠ గావించబడినవి

**అర్చన - అర్చకుడు:** నూటొక్క తిరుపతులలో నొకటిగా ప్రఖ్యాతి గాంచినది మిడుతూరు చెన్నకేశవాలయము ఈ ఆలయమున పాంచరాత్రాగమ ప్రకారము అర్చన జరుగుచున్నది అర్చకుడు నరసయ్య స్వామికమిత విశ్వాసము గల భక్తుడు

**ఆలయవిశేషాలు** ఆలయము ప్రారంభములో ధ్వజస్తంభము, ధ్వజస్తంభము తర్వాత రంగుల మండపము దాని ప్రాంగణములో గర్భాలయము కలదు ప్రహరికి ఆగ్నేయములో పల్లకి ప్రభ మొ॥ చెక్కసామగ్రి గదికలదు నైరృతిలో కల్యాణ మండపము ఎదురుగా హోమగుండము కలదు వాయవ్యములో స్వామి వాహనాలు కలవు మూలవిరాట్టు కెడమవైపున్న గదిలో సన్నిద్ధరాళ్వారుల విగ్రహాలు పూర్వముండెడివి నేడు మూడు, నాల్గు విగ్రహాలు మాత్రము కలవు

మూలవిరాట్టు కేశవస్వామి కెడమ వైపు దక్షిణాభిముఖముగా విష్వక్సేనుడున్నాడు తత్పూజానంతరమే కేశవస్వామికి అర్చకుడు పూజగావించును ఇది విశేషాంశము శివాలయాలలో నందీశ్వరుని వలె విష్ణాలయములలో విష్వక్సేనునకు ప్రాధాన్యముండును

**గ్రామోత్సవము** శ్రీదేవి, భూదేవీ సహిత కేశవస్వామి విగ్రహాలను ఉగాది - విజయదశమి - సంక్రాంతి - దీపావళి - కృష్ణాష్టమి - చిలుకద్వాదశి ప్రతినెల శు ౧౦ - బ ౧౦ (దశమి) - కార్తీక మాసమంతయు, తిరునాళ్ల ఐదురోజులు - ధనుర్మాసము గ్రామోత్సవము జరుగును ఉత్సవ విగ్రహాలలో ఒక అమ్మవారి విగ్రహమును చోరులెత్తుకొని పోగా, అర్చకుడు నరసయ్య 40 రోజుల తర్వాత పసిగట్టి ధైర్యముతో దానిని వెనుకకు తెచ్చినాడు

**తిరునాళ్ల** వైశాఖ శుద్ధ ౧౨ ద్వాదశి మొదలు కొని బహుళ ౧ పాడ్యమివరకు ప్రతియేట స్వామివారికి తిరునాళ్ల జరుగుచున్నది వైశాఖ శుద్ధ పౌర్ణమి తెల్లవారు జామున స్వామికి కల్యాణోత్సవము, రథోత్సవము వైభవముగా జరుగును, వందల యేండ్లముందు కొయ్యతో నిర్మించిన రథము పై స్వామినుంచి, గ్రామ ప్రధాన వీధుల గుండా వేలాది భక్తుల హర్షధ్వానాలమధ్య ఊరేగింతురు రెండవరోజు శేష వాహనము పై, మూడవరోజు ఉదయము సింహవాహనము పై స్వామి నూరేగింతురు అదే రోజు సాయంత్రము రథోత్సవము, బహుళపాడ్యమి - చివరి రోజు పారుపేట ఉత్సవము జరుగును

బుక్కరాయల మనుమడు, సింగరాజు పుత్రుడైన కోనయ్యదేవ మహారాజు స్వామి నిత్యపూజకై పల్లకీ సేవకై, భూదానాలు చేసినట్లు శాసనము తెలుపుచున్నది

**కోతులబిడుతూరు:** పూర్వము విశేషముగా నున్న కోతులకై 18 ఎకరాల మాన్యమును కేటాయించియుండిరి ఈ పొలము పై వచ్చు ఆదాయ ముతో ప్రతిదినము ఆలయ ప్రాంగణములో కోతులకు అన్న సంతర్పణ చేసెడి వారు నేడు సంవత్సరానికొకమారు సైతమిట్టి అన్నసంతర్పణలేదు ఏమైనప్పటికి

పాతవాసన ప్రకారము ఈ గ్రామమునకు 'కోతుల మిడుతూరు' అని పిల్చుచున్నారు

**శిల్పనైపుణ్యము** ప్రతి సంవత్సరము ఉగాదినాడు సాయంత్రము సూర్యకిరణాలు దేవాలయ ముఖద్వారము, రంగులమండపము, మధ్య మండపము, దాటి గర్భాలయము లోని స్వామి పాదాలను స్పృశించుట నేటికిని కలదు భక్తులు దీని నాసక్తితో నేటికిని తిలకించుచున్నారు

# నంద్యాల డివిజన్

## ఆళ్లగడ్డ తాలూకా, ఆళ్లగడ్డ మండలము

## అహోబలము

ఉనికి కర్నూలు జిల్లాలోని వైష్ణవ క్షేత్రాలలో మిక్కిలి ప్రసిద్ధి వహించినది అహోబలము ఆళ్లగడ్డ మండల కేంద్రమునకు 28 కి మీ దూర మున ఈ క్షేత్రము కలదు అతి దీర్ఘముగా వ్యాపించిన యొక పర్వత శ్రేణిలో గహనమైన కాంతారము మధ్య ప్రకృతి సౌందర్య భరిత ప్రదేశమున ఈ పవిత్ర క్షేత్రము నెలకొని యున్నది

ఈ పర్వత శ్రేణికి శిరోభాగముగా పరిగణింపబడు శేషాద్రిలో వేంకటేశ్వర స్వామి, మధ్యభాగమున అహోబల నరసింహస్వామి, చివరి (పృష్ఠ) భాగమున శ్రీశైల మల్లికార్జునస్వామి వెలసియున్నారు

క్షేత్రవిశేషాలు ఇచట దిగువ అహోబలము, ఎగువ అహోబలము అని రెండు స్థలములు గలవు సమతల ప్రదేశమును దిగువ అహోబలమనియు, కొండ పై భాగమును ఎగువ అహోబలమనియు నందురు ఈ రెండు అహోబలములందు కలిసి నరసింహస్వామి తొమ్మిది రూపాలతో దర్శన మిచ్చుచున్నాడు

''జ్వాలా ఽహోబిల మాలోల క్రోడా కారంజభార్గవాః
యోగానంద ఛ్ఛత్రవట పావనా నవమూర్తయః'' -
అని నవనారసింహులను గూర్చి చెప్పబడినది

ఇందులో దిగువ అహోబిలమున వెలసిన నారసింహమూర్తులు ముగ్గురు వారి వివరములు

1 **భార్గవ నరసింహస్వామి** దిగువ అహోబలమునకు మూడు కి మీ దూరమున గల భార్గవ తీర్థమునకు సమీపమున భార్గవ క్షేత్రము కలదు అచటి

పర్వత సమీపవములోని దేవాలయవములో నివసించిన మూర్తియే భార్గవ నరసింహస్వామి

**౨ యోగానంద నరసింహస్వామి**

దిగువ అహోబలమునకు ఆగ్నేయమున రెండు కి మీ దూరమున యోగానంద నరసింహస్వామి వెలసియున్నాడు ప్రహ్లాదునకు యోగాభ్యాసమును నేర్పిన మూర్తి యైన ఈ యోగానందుడు యోగపట్టము తో భక్తులకు దర్శనమిచ్చు చున్నాడు

డిశంబరు 95 సం॥లో పరమపదించిన ప్రముఖావధూత శ్రీశ్రీశ్రీ కాశిరెడ్డి నాయన గారి ఆశ్రమము సైతము ఈ యోగానంద నరసింహస్వామి పరిసరాలలోనేయున్నది ఇక్కడ నిప్పటికిని సందర్శించు భక్తులకు నిరతాన్న దానమును అచట నిర్వాహకులు నిర్వహించుచునేయున్నారు

**౩ ఛత్రవట నరసింహస్వామి**

దిగువ అహోబలమునకు మూడు కి మీ దూరమున ఛత్రవట నరసింహస్వామి వేంచేసియున్నాడు ఈ యాకృతి పద్మాసనస్థుడైయుండి, కుడిచేయి అభయముద్రను సూచించుచున్నది ఒక వటవృక్షచ్ఛాయలో ముళ్లపొదల మధ్యలో నీస్వామి నెలకొనియున్నాడు

## ఎగువ అహోబలములోని సన్నిధులు

**4 కారంజ నరసింహస్వామి**

దిగువ అహోబలము నుండి యెగువ అహోబలమునకు వెళ్లెడు మార్గమున ఈ స్వామి దర్శనమిచ్చు చున్నాడు ఇచట దైవము శార్ఙ్గము అను వింటితోను, చక్రముతోను, కూర్చుని దర్శనమిచ్చుచున్నాడు జలపాతముగా ప్రవహించు భవనాశిని యిచ్చట భైరవకుండమని పిలువ బడుచున్నది కరంజమను వృక్షము క్రింద వసించుటచేత ఈ దైవమునకు 'కారంజ నరసింహస్వామి' అను నామౌచిత్యము కలిగినది

దుర్వాస శాప ప్రభావముచే నున్మత్తుడైన గోభిల మహర్షి యీస్వామి సన్నిధిలో నరసింహ మంత్రమును జపించి, స్వామి యనుగ్రహముచే జ్ఞానార్థి తుడయ్యెను కనుక, యిట స్వామినుపాసించు వారికి సుజ్ఞానము లభించునని పెద్దలందురు

5 అహోబిలనరసింహస్వామి

ఎగువ అహోబిలమున వెలసిన ప్రధాన దైవ మీయనయే ఒక గుహలో అరుగు మీద దశభుజముల తో హిరణ్యకశిపుని సంహరించు సంహారమూర్తి గా స్వామి కనిపించు చున్నాడు ఆ స్వామి క్రింది భాగమున కొండ నీటి ధార గలదు

స్వామికి గల దశ బాహువులిట్లున్నవి 1 ఒక హస్తము తనయొడిపై పారవేసికొన్న హిరణ్య కశిపుని శిరము నదిమి పట్టుకొనియున్నది 2 మరొక హస్తము అసురుని పాదముల నదిమి పట్టుకొని యున్నది 3,4 మరి రెండు చేతులు రక్కసుని యుదరమును చీల్చుచున్నవి 5,6 ఇక రెండు చేతులు దనుజ రక్తమును తీసి, త్రాగుచున్నవి 7,8 మఱి రెండు చేతులు శంఖ చక్ర ధారులై యున్నవి 9, 10 సాధురక్షణ, దుష్టనాశనార్థమై రెండు చేతులు దివ్యా యుధములను ధరించియున్నవి

స్వామి పాదపద్మముల చెంత ప్రహ్లాదుడు కరకమలములను జోడించి యున్నాడు

ఈ స్వామిని తిరుమంగైయాళ్వారు, వైష్ణవ సాంప్రదాయ స్థాపకులైన శ్రీరామానుజాచార్యాదులును దర్శించినట్లు తెలియు చున్నది

ఈ యాలయమునకు కొలది దూరమున గల యాలయములో పరమేశ్వర లింగమును, ఉగ్ర నరసింహమూర్తియు దృగ్గోచరమగుచున్నారు ఇచట పరమశివునికి నృసింహస్వామి వరము లొసంగెనని చెప్పుదురు

అహోబల నరసింహాలయము ఆకారములో పెద్దదిగను, బహుమండప విస్తృతముగను కన్పించును భవనాశనీ తీర్థమిట ప్రక్కనే కలదు ఈ తీర్థతటముపై నూరుకాళ్ల మండపము అతిసుందరముగా నిర్మింపడినది

6 క్రోడాకార (వరహ) నరసింహస్వామి

ఎగువ అహోబిలములో అహోబిల నృసింహస్వామి నుండి మాలోల (లక్ష్మీ) నరసింహస్వామి దేవస్థానమునకు వెళ్లెడి దారిలో భవనాశినీ తీర్థ తీరమున ఈ స్వామి దర్శన మిచ్చుచున్నాడు ఇచ్చట దైవము వరాహ రూపముతో శ్రీ లక్ష్మీ నృసింహస్వామితో బాటు దర్శన మిచ్చు చున్నాడు నామమునకు దగిన రూపమిది

**7 మాలోల (లక్ష్మీ) నరసింహస్వామి**

వరాహ నరసింహ స్వామి నుండి పై భాగమున 1 ½ కి మీ దూరమున మాలోల నృసింహస్వామి విడిదిచేసియున్నాడు

లక్ష్మీదేవికి ప్రియుడై (మాలోల) అమ్మవారితోఁగూడి దర్శనమిచ్చుటచే ఈ స్వామి సార్థక నామధేయుడైనాడు లక్ష్మీ క్షేత్రముగా ప్రసిద్ధమైన యిచట అష్టాక్షర యుక్తమైన శ్రీ లక్ష్మీ నృసింహ మంత్రమునను జపించువారికి ఇహపరసుఖములు సమకూరునని విజ్ఞులందురు

**8 జ్వాలా నరసింహస్వామి**

ఎగువ అహోబిలము నుండి పై భాగమున 5 కి మీ దూరమున ఈ స్వామి దర్శనమిచ్చుచున్నాడు ఇక్కడ జ్వాలా రూపమున కోటి సూర్య తేజస్సుతో స్వామి గోచరించుచు, గరుడాచల, వేదాచల పర్వతములకు మధ్య అచలచ్ఛాయ మేరువనెడి కొండ మధ్య ప్రదేశమున ఈ క్షేత్రమున్నది మొత్తము పై ఈ క్షేత్రమునకు వెళ్లివచ్చుట కష్టతరమే

**9 పావన నరసింహస్వామి**

ఎగువ అహోబిలమునకు 6 కి మీ దూరమున గరుడాచలమునకు దక్షిణమున పావన నదీ తీరమున పావన నృసింహస్వామి వెలసియున్నాడు భక్తపాపహారియై, పావనమునను కలిగించుటచే ఈ స్వామిని పావన నరసింహస్వామి యని యందురు ఇచట చైత్రమాస శనివారములు ప్రత్యేక పూజలు జరుగును ఈ స్వామిని 'పాములేటయ్య' అనియు వ్యవహరింతురు

**10 దిగువ అహోబిలము – ప్రహ్లాద వరద నరసింహస్వామి**

అహోబిలక్షేత్రమునకు వచ్చిన యాత్రికులు ప్రప్రథమమున దర్శించున దీమూర్తినే, కొందఱు యాత్రికులు ఈ స్వామిని మాత్రమే దర్శించి వెనుదిరుగు వారునునేడున్నారు స్వామి ఆరడుగుల యెత్తుండును

చండ ద్వారము
ముఖద్వారము
మహాద్వారము

ఈ మహాద్వారము లోపల ప్రహ్లాద వరదుఁడు వేంచేసియున్నాడు

మూలవిరాట్ ఈ స్వామినిట్లు వర్ణించుట జరిగినది

'అహోబిలే గారుడ శైలమధ్యే, కృపావశాత్ కల్పితసన్నిధానమ్,
లక్ష్మ్యాసమాలింగిత వామభాగమ్, లక్ష్మీ నృసింహ శరణం ప్రపద్యే'' –

స్వామికి చతుర్భుజములు కలవు, స్వామికి పై కుడిచేతి యందు చక్రము కలదు క్రింది కుడి చేయి యందు అభయ హస్తము, పై యెడమ చేతి యందు శంఖము కలదు క్రింది వామ హస్తము లక్ష్మీదేవి నాలింగనము చేయుచు, ఎడమవైపు తొడపై కూర్చొన్న బెట్టుకొన్నది మూలవిరాట్టు గల రాతి కిరువైపుల దశావ తారవములు చెక్కబడియున్నవి మకర తోరణవము సైతవము కలదు ఈ అర్చామూర్తి, తక్కిన నవవిధ నారసింహులు స్వయం భువులనియందురు మూలవిరాట్టు పాదాలదగ్గర వినమ్రుడైన గరుత్మంతుడు కలడు గరుడాచలమనుటకు చిహ్నమిది విశిష్టాద్వైతము విష్ణుస్వరూపమును దివ్యమంగళముగా వర్ణించును ఇక్కడి నరసింహ స్వరూపము కూడ అట్టిదే, కనుక విశిష్టాద్వైతమునకు ఇది చక్కని లగింపుగా ఉన్నది

**ఉత్సవ విగ్రహాలు** ఈ మూల విరాట్ కడ అశేషముగా ఉత్సవ విగ్రహాలు కలవు

**ప్రహ్లాద వరదుని ముందుగల ఉత్సవ విగ్రహాల వివరాలు:**

1 పావన (పాములేటి) నరసింహ స్వామి ఉత్సవ విగ్రహము
2 అహోబల నరసింహస్వామి ఉత్సవ విగ్రహము
3 శ్రీ దేవి భూదేవీ సహిత ప్రహ్లాద వరదుడు
4 శ్రీ దేవి భూదేవీ సహిత జ్వాలా నరసింహస్వామి

మకర సంక్రాంతి దినమునుండి ఫాల్గుణమాస ప్రారంభము వరకు పారువేటకై ప్రహ్లాద వరదుడు మరియు జ్వాలా నరసింహస్వామి ఉత్సవ విగ్రహాలు వెళ్లును ఏకాంత సేవకు నిత్యాభిషేక భోగమూర్తి చిన్న విగ్రహము కలదు పంచబేరములలో

బలిబేరమగు చక్రత్తాళ్వారు
కౌతుకబేరమగు శంఖచక్రధారిస్వామి
స్నపన బేరమగు భోగమూర్తి
యాగ బేరమగు ప్రహ్లాదుడు

అను విగ్రహములును మూలవిరాట్ ముందు కలవు గోదాదేవి విగ్రహమును, శఠగోపయ తీంద్ర విగ్రహమును ఇచటకలవు పై వన్నియు గర్భాలయ విశేషాలు

గర్భాలయము ముందున్న గదిలో భక్తులకు కుడివైపు గల గదిలో విష్వక్సేనుడు వేంచేసియున్నాడు విష్ణ్వాలయాలలో గల విష్వక్సేనుడు ఈశ్వరాలయాలలో గల నందీశ్వరుని వంటివాడు ఈ గదిలో పన్నిద్ద ళ్వార్వారు

లలో కొందఱు కలరు ఇచటి శఠగోప యతీంద్రుడు పద కవితా పితామహుడైన అన్నమాచార్యుని గురువు అన్నమాచార్యులు శఠగోప యతీంద్రుని పైన కీర్తన సైతము పాడినాడు

భక్తుల కెడమవైపు గదిలో ఆభరణములను నిలువ యుంచి యుందురు

**ముఖమండపము** అగది తర్వాత కలది ముఖమండపము లేక అర్ధమండపము ఇక్కడ స్వామి వారి విశేష ఆస్థానాలు జరుగును స్వామివారికి ప్రత్యేకాభిషేకాలు (ఉత్సవ విగ్రహానికి) ఇక్కడ జరుగును

శ్రీదేవి భూదేవీ సహితముగా ప్రహ్లాద వరదోత్సవ విగ్రహమునకు ఇచ్చట మనోహరముగా అలంకరింపబడి, ఉత్తర ద్వారమున కెదురుగా వైకుంఠ ఏకాదశినాడు స్వామిని కూర్చొన బెట్టెదరు ఆ రోజున ప్రభాతవేళ స్వామి వారిని దర్శించిన వారి నేత్రములనుండి ఆనంద బాష్పములు రాలును

అదే రోజు ఉదయము 10 గం॥ లకు ప్రహ్లాద వరదోత్సవ విగ్రహమును గరుడ వాహనము పై నూరేగింతురు అదియును భక్తులకు నయానానందకర దృశ్యమే

**నరసింహస్వామి ప్రాచీనత** నరసింహస్వామి ప్రాచీనుడు కృతయుగములో - పరమేశ్వరుడు స్తుతించినది మంత్రరాజ పదస్తోత్రము త్రేతాయుగములో శ్రీరాముడు స్తుతించినది - నృసింహ పంచామృత స్తోత్రము ద్వాపర యుగములో పంచపాండవులు స్తుతించినారు కలియుగము లో వేంకటేశ్వరస్వామి స్తుతించినాడు శ్రీ రాముడు అహోబిల సమీపములోని రామతీర్థక్షేత్రములోని నృసింహ స్వామిని తీర్థముతో ననుష్ఠించినాడు

ఆది శంకర యతీంద్రులు నృసింహకరావలంబ స్తోత్రముతో నరసింహ స్వామిని స్తుతించినాడు

తిరుమల తిరుపతి దేవస్థానమువారు వేంకటేశ్వర స్వామి వారి సమర్పణగా ప్రతి సంవత్సరము అహోబిల నరసింహస్వామికి కళ్యాణోత్సవము నాడు 50 వేల రూపాయల విలువగల వస్త్రాలను, ధనమును అర్పించుచున్నారు ఆలయాభివృద్ధి కై ధనము వినియోగింపబడుచున్న కారణముగా అయ్యది సర్వాంగ సుందరముగా విలసిల్లు చున్నది

## ముఖమండపము ముందున్న విశేషాలు

| | | |
|---|---|---|
| జయుడు ద్వారపాలకుడు | మహామండపము | విజయుడు ద్వారపాలకుడు |
| రామ మండపము | రంగ మండపము | నృసింహ మండపము |
| రామాయణ విశేషాలు గల మందిరము | మధ్యగల దారి | నృసింహస్వామి లీలలు గల మండపము |

ముఖమండపము ముందు ద్వారపాలకుల ప్రక్కన తగ్గులో రెండు ఆలయాలు గలవు

**అమృతవల్లీ ఆలయము:**

విష్ణువు అవతారములలో ఒక్కొక్క ఆలయమున అమ్మవారిని ఒక్కొక్క పేరుతో పిలుతురు ఇక్కడ లక్ష్మీదేవిని అమృత వల్లి యందురు ఇక్కడ అమ్మవారి విగ్రహమును బయటకు ఊరేగింపుగా తీసికొని పోరు

**అమ్మవారి మూలవిరాట్**

అమృతవల్లిమూల విరాట్‌కు చతుర్భుజములు కలవు అందురెండు చేతులలో పద్మాలు కలవు తక్కిన రెండు చేతులు వరదహస్తము, అభయ హస్తము చతుర్భుజములు శక్తికి, పద్మములక్ష్మీదేవి ఆసనానికి, వరద అభయ హస్తాలు అమ్మవారి కారుణ్యానికి, వాత్సల్యానికి సంకేతాలుగా చెప్పవచ్చును

**గోదా ఆలయము**

ఈ ఆలయమునకు ప్రక్కనే గోదాదేవి ఆలయము కలదు శ్రీరంగనాథుని సేవించి, ఆస్వామిలో నైక్యమైన మహనీయురాలీమె, ఈమె సన్నిద్దరాళ్వారులలో నొకతె ఈమె వ్రాసిన 'తిరుప్పావై' ద్రావిడ పాశురాలు వైష్ణవులకు పరమ పవిత్రమైనవి

**రామతీర్థము**

త్రేతాయుగమున శ్రీరామచంద్రుడు సీతాన్వేషణకై వెళ్లుచు, తీర్థములో ననుష్ఠించిన ప్రదేశమే 'రామతీర్థము' అందురు అన్వేషణానంతరము శ్రీ రాముడు తిరిగి వచ్చుచు, అహోబిల నరసింహస్వామిని దర్శించెను ( ఈ విషయము 'శేషధర్మము' 70 వ అధ్యాయము లోనిదని అహోబిల ప్రధానార్చకులు శ్రీ వేణుగోపాలాచార్యులు చెప్పియున్నారు )

**ముఖమండపమునందలి సహస్రస్తంభ మండపము:**

ఈ మండపము మూడుగా విభజింపబడినట్లు తెలుపబడినది

1 రామమండపము 2 రంగమండపము 3 నృసింహ మండపము అందులో ఈ మండపములోని స్తంభములను విజయనగర రాజులు నిర్మించినారు పేపరు మిల్లుల యజమాని కలకత్తా మార్వాడి 'మహనీరామ్ రామ్‌కుమార్ బామ్‌గడ్' - అను వ్యక్తి 1833 సంగలో ఈ స్తంభాలకు పై కప్పు వేయించినాడు అతడు రాజస్థాన్ నివాసి - తలమంచి పట్నమునుండి ఈ రాళ్లను తోలించినాడు

1980 సంగలో ఈ దిగువ అహోబలమునకు విద్యుత్తు పంపిణీ కావించినారు

**అహోబలక్షేత్ర నామౌచిత్యము:** నరసింహస్వామి అవిర్భవించినపుడు దేవతలు, మునీంద్రులు తత్స్వరూపమును గాంచిరి దివిజులు ''హేనృసింహ! భవదీయమిదంనవయంచు నంచిత స్తవములొనర్ప సన్మునులు '' సత్యమహోబల రుద్రరూప! మాధవ! భవతేనమో యన నుదగ్ర నిజాంక తలంబు నందు దైత్యవిభుని నున్చి విశ్వజనతాభయకారణ ఘోరవీరతన్''

దేవతలబ్బురముతో స్వామిని సంస్తుతించిరి, మహామునులు 'అహోబల' అనినమస్కరించిరి, వారట్లు పల్కుట చేతనే ఈ క్షేత్రమునకు అహోబలమని పేరు వచ్చిన దందురు పరమాశ్చర్యకరమైన, అద్భుతమైన శక్తి ఒక్క భగవంతునికే - విష్ణువునకే ఉండును రాక్షససంహార క్రియలో దేవుడు తన అమోఘ శక్తిని ప్రదర్శించిన కారణముగ ఆక్షేత్రమునకు అహో! బలమని - అనగా దైవశక్తి అని పేరు సమంజసముగా వచ్చినది

ఈ క్షేత్రమునకు అహోబిల మనియు నామాంతరము కలదు ఇక్కడ గల పెద్ద బిలమును బట్టి దీని కీ పేరు వచ్చినది ఈ క్షేత్ర ము పేర్లు వాడుకలో ''ఓబులం'' గా వ్యావహారికమై - 'ఓలం' గా ను పరిణామము చెందినది తమ యిల వేల్పు పేరిట భక్తులు తమ సంతానమునకు 'ఓబులేసు', 'ఓలమ్మ' యని పేరు పెట్టు కొను చున్నారు

**కోనేరు** చండ ద్వారమునకు బయట నొక్క పెద్ద కోనేరు కలదు ఈ కోనేటిని ఇటీవల అహోబలం పీఠాధిపతి మరమ్మత్తులు చేయించినారు

ప్రహ్లాద వరద నరసింహాలయము ముఖద్వారము - లోపలి విశేషాలు

నైరృతి దిక్కున కళ్యాణమండపము కలదు వేంకటేశ్వరస్వామి, పద్మావతి అమ్మవారు, పాండురంగనవనీత కృష్ణులున్నారు పడమర దిక్కున వాహన మండపము నిర్మాణములో కలదు వాయవ్య దిక్కున రామానుజులు, వేదాంత దేశికులు, ఆదివన్ శఠగోప యతీంద్ర సన్నిధి కలవు దానిముందు బావి కలదు ఈశాన్యమున పట్టాభిరామాలయము కలదు నూతనమైన అద్దాలమండపము కలదు ఆగ్నేయమున వంటశాల కలదు

మహాద్వారము ముందు ధ్వజస్తంభము కలదు ముందు గరుత్మంతుడు హస్తములు ముకుళించి, ప్రహ్లాద వరుదున కెదురుగా నున్నాడు వెనుక బలిపీఠము కూడ కలదు

చండ ద్వారము కడ శ్రీకృష్ణరాయలు విజయ సూచకముగా స్థాపించిన 'విజయస్తంభము' కలదు

**ఉత్సవాలు - నైవేద్యము** అహోబిలము నరసింహస్వామికి ప్రతి సంవత్సరము బ్రహ్మోత్సవములు నిర్వహింపబడుచున్నవి కడప, హైదరాబాద్, కోస్తాజిల్లాలు, తెలంగాణా జిల్లాల నుండి విశేషముగా స్వామి దర్శనమునకై ప్రజలరుదెంచు చున్నారు

ప్రతి సంవత్సరము జనవరి 15 వ తేది మకర సంక్రాంతి మరుసటి రోజు కనుమరోజు స్వామివారి ఉత్సవ విగ్రహాలు అహోబిల పరిసరాలకు ఊరేగింపుగా వెళ్లను ఆ ఉత్సవ విగ్రహాలు తిరిగివచ్చిన తరువాత బ్రహ్మోత్సవములు జరుగును గరుడోత్సవము, రథోత్సవము దినములలో భక్తులరద్దీ యెక్కువ ఎగువ, దిగువ అహోబిలములలో ఈ తిరునాళ్ల జరుగును

## తక్కిన ఉత్సవ విశేషాలు

1 తెలుగు సంవత్సరాది - ఉగాది - రాత్రి ప్రహ్లాదవరదుని వీధి ఉత్సవ ముండును

2 మేష సంక్రమణము - అరవవారికి సంవత్సరాది

3 శ్రీ నృసింహ జయంతి - నృసింహస్వామి జన్మించిన దినముగా వైశాఖ శుద్ధ త్రయోదశి ముగియునట్లు 10 రోజులుత్సవము జరుగును

4 తొలిఏకాదశి - ఆషాఢ శుద్ధ ఏకాదశి

5 ఆషాఢపౌర్ణమి - దీనికి మరొకపేరు గురు పౌర్ణమి

6 దక్షిణాయన పుణ్యకాలము - సూర్యుడు దక్షిణాయనములో ప్రవేశించిన దినము

7 తిరువాడి పూర్ణమ్ - గోదాదేవి తిరునక్షత్రము
8 వరలక్ష్మి వ్రతము - శ్రావణ శుద్ధ పక్ష ద్వితీయ శుక్రవారము
9 శ్రీకృష్ణాష్టమి - శ్రావణ బహుళాష్టమి
10 విజయదశమి - ఆశ్వయుజ శుద్ధ దశమి
11 పవిత్రోత్సవము - విజయదశమి మొదలుకొని పదిరోజుల వరకు ఆశ్వయుజ శుద్ధ దశమి నుండి ఆశ్వయుజ బహుళ చవితివరకు
12 దీపావళి ఆస్థానము - పదిరోజులు
13 ధనుర్మాస పూజ - డిశంబర్ 15 వ తేది నుండి జనవరి 13 వ తేది వరకు గోదాదేవి రచించిన 'తిరుప్పావై' స్తోత్రముతో అర్చించు పవిత్ర దినములు, ఆమెసన్నిద్ద రాళ్వారులలో నొకతె
14 వైకుంఠ ఏకాదశి - ఉత్తర ద్వార దర్శనము (పుణ్యప్రదమని భక్తుల విశ్వాసము) స్వామి వారి నలంకరించి, ఉత్సవ విగ్రహాలను ఉత్తర ద్వారమున నుంచి దర్శింపజేతురు ఉదయము 5 గం॥ల నుండి ఉదయము 9 గం॥ ల వరకు మాత్రమే ఈ దర్శనము లభించును వైష్ణవ క్షేత్రాలలో ఈ వైకుంఠ ఏకాదశినాడు ఉత్తర ద్వార దర్శనము పుణ్యప్రదముగా భక్తులు భావింతురు
15 మకర సంక్రాంతి - 14 జనవరి
కనుమ పండుగ - 15 జనవరి పారువేట ఉత్సవము

ఇత్యాది పండుగలు/ఉత్సవాలు అహోబల దేవస్థానములో దేవస్థానము నిర్వహించును కుంభకోణము పీఠము ఆధ్వర్యములో దేవస్థానము నిర్వహింపబడుతున్నది కనుక తమిళ సంప్రదాయములు విశేషముగా ఈ దేవస్థానమున చోటుచేసికొన్నవి అర్చకులు సైతము తమిళులే

చెక్కెర పొంగలి, పులిహోర ప్రతిరోజు స్వామి వారికి నైవేద్యముగా సమర్పింతురు

ఉపసంహారము - నరసింహదేవాలయాలు సాధారణముగా పర్వతములలో నుండును కారణము స్వామి సింహాకృతిని కలిగి యుండుటయే అనికొందరు పండితుల యభిప్రాయము అహోబలము, పెన్నహోబలము, సింహాచలము, మంగళగిరి, కొలిమిగుండ్ల, మెట్టుపల్లె, కదిరి నరసింహస్వామి క్షేత్రములట్టివే తప్పనిసరిగా ఈ క్షేత్రములనంటికొని ఒక ప్రవాహముగాని, పుష్కరిణిగాని విలసిల్లును అంతేగాక వైష్ణవ విధానములన్ని కూడ ఈ క్షేత్రములలో పాటింపబడును

అహోబల క్షేత్రము పురాణకాలమునుండి ప్రశస్తి వహించినది స్వామి చరిత్రను చాటు రకరకాల దృశ్యములతో, స్థల వైవిధ్యముతో విలసిల్లుచు, భక్తులను దివ్య భూమికలకు తీసికొని పోవుచున్నది ఎఱ్ఱనాదులు ఈ క్షేత్రమును మిగుల ప్రశంసించుటయిందుచేతనే

# చాగలమఱ్ఱి మండలము
## లక్ష్మీచెన్నకేశవ స్వామి, చాగలమఱ్ఱి

ఉనికి - కర్నూలు జిల్లా చివరలో కడప జిల్లా సరిహద్దున గల మండలకేంద్రము చాగలమఱ్ఱి ఇక్కడ లక్ష్మీచెన్నకేశవ స్వామి వెలసియున్నాడు

గ్రామనామసార్థక్యము - చాగలమ్మ అను గ్రామదేవత పేర ఈ గ్రామమునకు ఈ పేరు వచ్చినది ఆ దేవత గ్రామ ప్రజలను క్షామవ్యాధి పీడలనుండి కాపాడుచున్నది ఊరికి దక్షిణముగా ఈ గ్రామదేవత వెలుగొందుచున్నది

మూలవిరాట్టు - ఇంచుమించు 3 అడుగుల ఎత్తుతో చెన్నకేశవ స్వామి కన్పించును శంఖ చక్రగదాయుధములతో, అభయహస్తముతో చతుర్భుజుడైన స్వామి తూర్పున కభిముఖముగానున్నాడు మూలవిరాట్టు చుట్టుగల శిలపై దశావతారములు చెక్కబడియున్నవి ఆలయము గ్రామము పొలిమేరలోనే కలదు స్వామి కెడమవైపున లక్ష్మీదేవి విగ్రహముగలదు

తిరునాళ్ల/ఉత్సవము - విజయదశమీదినమున స్వామి ఉత్సవ విగ్రహములనూరేగింతురు వైకుంఠఏకాదశి-ఆంగ్ల సంవత్సరాది - జనవరి 1వతేది - ధనుర్మాసనమున భక్తులు స్వామి దర్శనమునకై అరుదెంతురు శ్రీదేవి, భూదేవీ సహిత చెన్నకేశవ స్వాముల వారి ఉత్సవ విగ్రహాలు 1½ అడుగుల ఎత్తున్నవి గతములో పెద్ద విగ్రహములు అపహరింపబడినవి కోవెలకుంట్ల పాండురంగస్వామివారి ఉత్సవ విగ్రహాలనపహరించిన ఘనత ఈ గ్రామస్థులదేయగుట గమనార్హము

నైవేద్యము - ఉదయము పాలు, చెక్కర, అన్నము, ప్రతిదినము నైవేద్యము ఐతే శుక్రవారము అమ్మవారికి దధ్యోదనము, శనివారము చెన్నకేశవస్వామికి దధ్యోదనము నైవేద్యము తప్పనిసరి

మండపాదులు - గర్భాలయమునకు ముందుగల మండపము చతుర్దశ (14) స్తంభములు గలది చతుర్దశభువనాధీశుడు విష్ణువని కొందఱు దీని పరమార్థమును పలుకుచున్నారు

స్వామికెదురుగా నున్న ధ్వజస్తంభము దాదాపు 20 అడుగుల ఎత్తున్నది ధ్వజస్తంభమెదుట గరుత్మంతుడు స్వామి కభిముఖముగా హస్తములు జోడించియున్నాడు

చతుర్దశ స్తంభ మండపము దాటి, లోపలికి వెళ్ళుచో గోడలపై శేష శయానుడై, నాభికమలమున బ్రహ్మనుకల్గి, లక్ష్మీదేవి పాదములొత్తుచుండగ చిరునవ్వులు చిందించు నారాయణమూర్తి కన్పించును మరొకవైపు లక్ష్మీనృసింహస్వామి కలడు శంఖచక్రాలు ద్వారబంధములకు కలవు ఒక స్తంభముపై బాలకృష్ణుడు కలడు

ఆలయము ప్రదక్షిణ కనుకూలముగా కలదు శఠగోపమును అర్చకులు వాడుచున్నారు

అర్చక-ధర్మకర్తలు - అర్చకులు వంశపారం పర్యముగానున్నవారులేరు

శాసనములు - 1 ఇక్కడ చతుర్దశస్తంభమండపమున కెడమవైపున గల శాసనము అస్పష్టముగానున్నది దాదాపు క్రీ॥శ॥ 1440 సం॥న ఆశ్వయుజ శుద్ధదశమి తిథియందు మహారాజసింగభూపాలుడు (ఉదయగిరి రాజు) దేవాలయానికి పూజానిర్వహణకు దానమిచ్చినట్లున్నది కనుక ఈ ఆలయము అంతకంటె ప్రాచీన కాలమున నిర్మించబడెనని చెప్పవచ్చును

2 ఈ మండపము ముందు భాగమున గల మరొక శాసనము సైత మస్పష్టముగా నున్నది దాదాపు క్రీ॥శ॥1958సం॥ ప్రాతమున గుంటూరు జిల్లాకు చెందిన డా॥ గంగరాజు వెంకటరామయ్య ఆలయమునకు కొంత జీర్ణోద్ధరణ కావించినట్లు తెలియుచున్నది అతడు వైద్యవృత్తిలో నార్జించిన మొత్తమును ఆలయమునకే ఖర్చు పెట్టినాడట! దేవాలయములో చప్పట, బావికి గిలక, బయటిగదులు అతడే నిర్మించెనట!

## కోవెలకుంట్ల తాలూకా
## ఉయ్యాలవాడ మండలము
## కంబగిరి స్వామి, సుద్దమళ్ల

ఉయ్యాలవాడ మండల కేంద్రమునకు సుమారు 5కి మీ దూరమున భక్తుల పాలి కొంగు బంగారమై, సుద్దమళ్ల గ్రామమున కంబగిరి స్వామి కొలువు దీరియున్నాడు

**పురాణగాథలు.** రాక్షసరాజు హిరణ్యకశిపుని కోరిక మేరకు పుత్రుడు ప్రహ్లాదుడు విష్ణువును ప్రార్థించగా కంబమునందు నరసింహస్వామి ఆవిర్భవించెను కంబమున పుట్టుటచే స్వామికి కంబగిరి స్వామి అని పేరు వచ్చెనందురు

పూర్వము సుద్దమళ్లలో నరహరియను విష్ణుభక్తుడు చేసిన తీవ్రతపస్సుకు మెచ్చి, అతని కోరిక మేరకు దశావతారాలతో ఆర్చి కలిగి చతుర్భుజములతో స్వామి దర్శన మిచ్చెనందురు ఆ స్వరూపమే నేటి సుద్దమళ్ల కంబగిరిస్వామి

**స్వామి ఆకారము** స్వామి చతుర్భుజుడు స్వామి చుట్టు పైనచెప్పినట్లు దశావతారములున్నవి ఎడమచేతులలో పైన శంఖము క్రింద వరద హస్తమున్నవి కుడి చేతులలో పైన చక్రముండగా, క్రింద అభయహస్తము కలదు ఈ అభయ ముద్ర క్రింద శివలింగము ప్రతిష్ఠింపబడినది స్వామికి నిర్వహించు అభిషేక కార్యక్రమాలు స్వామి చేతుల మీదుగనే శివునకు కూడ అభిషేకము జరుగుట విశేషము

**పరిసరాలు** ఆలయమునకు ఉత్తర దక్షిణములుగా కుందూనది, పడమర శ్మశానవాటిక కలవు శివకేశవాభేదము పాటించుటకై స్వామికి ఎడమవైపున కాశీవిశ్వేశ్వర లింగము ప్రతిష్ఠింపబడినది మరొకవైపు లక్ష్మీదేవి చతుర్భుజములతో దర్శనమిచ్చును పై హస్తాలలో శంఖములు, ఎడమవైపు క్రింద వరదహస్తము, కుడివైపు అభయ హస్తము కలదు కంబగిరి స్వామి 4 అడుగుల యెత్తుండగా, అమ్మవారు మూడడగుల యెత్తుండును ఆలయమునకు దక్షిణమున పరివార దేవతయైన ఆంజనేయస్వామి ఆలయము కలదు ఆలయము ఆవరణలో పన్నిద్దరాళ్వార్లు కన్పింతురు స్వామికెదురుగా 20 అడుగుల ధ్వజస్తంభము - ప్రక్కన దీపస్తంభము కలదు స్వామికెదురుగా వరదహస్తముతో గరుత్మంతుడు కనిపించును ఆలయము ప్రాచీనమైననూ, కల్యాణమండపము నూతన నిర్మితము

**ఉత్సవాలు** సంక్రాంతి, విజయదశమి పండుగలలో ఉత్సవ విగ్రహాల నూరేగింతురు శనివారము భక్తులు స్వామినశేషముగా దర్శింతురు ప్రతి నూతన సంవత్సరాది ఉగాదినాడు ప్రాతఃకాలమున 6 గంటలకు పంచామృతాభిషేకము, 9 గంటలకు నైవేద్యము సమర్పింపబడును ఆనాడు సాయంత్రము 3 గంటలకు స్వామి నలంకరించి పూజలు నిర్వహింతురు

**భక్తుల విశ్వాసము** స్థానికులకు స్వామి పై విశ్వాసము కలదు సుద్దమళ్ళ, నర్సిపల్లె, ఉయ్యాలవాడ, మాయలూరు మొ॥ గ్రామప్రజ ఎడ్లబండ్ల పై వచ్చి, స్వామి ఆలయానికి ప్రదక్షిణలు చేయుచు పానకము, వేడలు, ఎంచి పెడుదురు కోవెలకుంట్ల, ఆళ్లగడ్డ, నంద్యాల, డోన్, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు నుండియు కూ ఉగాది ఉత్సవమును దర్శింప భక్తులరుదెంతురు

## కోవెలకుంట్ల తాలుకా ॥ కొలిమిగుండ్ల మండలము

## లక్ష్మీనరసింహస్వామి,

## కొలిమిగుండ్ల

**ఉనికి** కోవెలకుంట్ల తాలూకా కొలిమిగుండ్ల మండల కేంద్రములో గ్రామం సమీపమున 750 అడుగుల ఎత్తులో భూమికి 235 మెట్లపైన కొండయందు లక్ష్మీనరసింహస్వామి వెలసియున్నాడు

**స్థానిక చరిత్ర** 16 వ శతాబ్దములో శ్రీ కృష్ణ దేవరాయల సామ్రాజ్యములో అవుకు హనుమంత గుండంలో సామంతరాజు లుండెడివారు హనుమంతగుండం పరిపాలించు నాయక రాజుకు విష్ణువు కలలో కనిపించి, తానుకొండపై అవతరించుచున్నట్లు తెలుపగా నతడు కొండపైనే గుడిని నిర్మించినాడు బోయదొర శ్రీరాజునాయుడు ఈ గుడి నిర్మాణమును పూర్తిచేసినాడు ఈ ఆలయ నిర్మాణములో కృష్ణదేవరాయలు సైతము ప్రధాన పాత్ర వహించినట్లున్నది గర్భాలయము నానుకొనియున్న దక్షిణపు గోడకు తిరుమలదేవి, చిన్నాదేవి - శ్రీకృష్ణరాయల శిల్పములువినమ్రతతోనున్నట్లు కనిపించును

మూడు కొండలు నరసింహస్వామి వెలసిన కొండ కెదురుగా భైరవకొండ - కంబగిరి కొండ కలవు ఈ మూడును 'పిరమిడ్' ఆకారములో కనిపించును ఆలయము కడ నిలబడి చూచిన వింతగా ఈ శైలములు గోచరించును

శిల్పకళ ఈ ఆలయ నిర్మాణములో లోపలి గోడలు గాంధార శిల్పకళా భరితముగా నున్నది ప్రహరీ వైపు గోడపై అష్టదిక్పాలకులు, నవగ్రహాలు, దశావతారాలతో కూడిన శిల్పసంపద కనిపించుచున్నది అష్టదిక్పాలకులు గల దేవాలయాలరుదుగా కర్నూలు జిల్లాలో కనిపించుచున్నవి గడివేముల మండలము గనిఖానుమండలాంతర్గత లక్ష్మీనారాయణ దేవాలయములో అష్టదిక్పాలకుల విగ్రహాలు ఇంకను స్పష్టముగా కనిపించును

ఇక్కడ దీపస్తంభము, ధ్వజస్తంభము ఎత్తైనవి కలవు

అర్చావిధానము - తీర్థ - నైవేద్యాదులు ఇక్కడ అర్చావిధానము పాంచరాత్ర విధానమున జరుగుచున్నది అర్చకుడు రాఘవయ్య భక్తిపరుడు అతని స్థితిగతులు మాధ్యమికము తీర్థము - తులసిదళము - కర్పూరము -

పుష్కరిణి నీరుకలిపి తయారు చేయబడును నైవేద్యము నిత్యము రెండు పూటల చేయబడును రెండు పూటల టెంకాయ, కలకండ, ఫలములు నైవేద్యముగా స్వామికి సమర్పింపబడును

ప్రజలలో దైవము పై విశ్వాసము పెరుగుచున్నది శుక్ర, శనివారాలలో ప్రతిదినము 30 మంది వరకు భక్తులు స్వామిని దర్శించుచున్నారు పర్వదినాలలో వందమందికి పైగా దర్శింతురు

**నీరు** కొండక్రింది భాగమున రెండు కోనేరులు కలవు చిన్నకోనేటిలో వేసవిలో సైతము స్వామి అర్చాకార్యక్రమమునకు తప్పని సరిగా నీరవు లభించును కాని ఈ కుంటలలో నీరము పెద్దగా పాన యోగ్యము కాదు నీరున్నను పైకి తెచ్చుకొనుట భక్తులకు కష్టము గుడి క్రింద ఒక బోరువేసి, పైపుల ద్వారా గుడి పరిసరాలకు నీటిని సరఫరా చేయుట అత్యవసరమని భక్తులు కోరుచున్నారు, సత్రవులు సైతము పునర్నిర్మాణమును కోరుచున్నవి ఆలయమును కూడ పునరుద్ధరింపవలసి యున్నది రెండు పుష్కరిణులు ఇక్కడి ప్రత్యేకతలు

**తిరునాళ్ల** వైశాఖ శుద్ధ త్రయోదశి మొదలు తొమ్మిది రోజులు ఇక్కడ నరసింహాస్వామికి తిరునాళ్ల జరుగుచున్నది

## కోవెలకుంట్ల తాలూకా కొలిమిగుండ్ల మండలము

## చెన్నకేశవస్వామి,

### నందిపాడు

**ఉనికి** కొలిమిగుండ్ల మండలకేంద్రమునకు దాదాపు 8 కి మీ దూరమున నందిపాడు గ్రామములో చెన్నకేశవస్వామి వెలసియున్నాడు

**స్వామిస్వరూపము** స్వామి చతుర్భుజాలతో దర్శనమిచ్చును ఎడమవైపు పైచేయి చక్రము, క్రిందగద, కుడివైపు పై చేయి శంఖము, క్రింద అభయహస్తము గలవు లక్ష్మీదేవి విగ్రహము స్వామి కెడమవైపున నున్నది

**ఇతరములు** ఆళ్వారు లిద్దరు గర్భాలయము వెలుపల కలరు ఆ బయట జయ, విజయ ద్వారపాలకులు గలరు ప్రస్తుత చెన్నకేశవ స్వామి విగ్రహమెంత ప్రాచీనమైనదో తెలియదు మునుపటి ప్రాచీన విగ్రహము మురళీకృష్ణునిగా రమణీయముగా నున్నది ఆ విగ్రహము ఆలయము బయటనున్నది

**నైవేద్యము** పర్వదినములందు - అనగా విజయదశమి, ఉగాది, శ్రీరామనవమి ఇత్యాది దినములలో మాత్రమే భక్ష్యాదులతో స్వామికి నైవేద్యము

సమర్పింపబడుచున్నది అనుదినము దీపారాధన మాత్రము కావింప బడుచున్నది

**భక్తులు** స్వామిని భక్తి ప్రపత్తులతో అనుదినము సేవించు వారులేరు చాల పల్లెటూళ్ళ వలె నిచటను పర్వదినాలలో మాత్రము స్వామిని దర్శించుటకు కొందరు వత్తురు

**నందిపాటి శేషమాంబ:** ఈమె నందిపాటి స్వగ్రామస్థురాలు ఆమె బాల్యముననే వైధవ్యమంది ఈ స్వామిని అనుదినము సేవించు చుండినదని ఆ గ్రామస్థులు చెప్పుదురు ఆమె గొప్పగా చదవక పోయినప్పటికిని, సహజ పాండిత్యముతో కవిత్వము చెప్పినది ''నందిపాటిముకుందశతకము'' అను పేరుతో శతకమునుచెప్పినది

## కోవెలకుంట్ల తాలుకా కోవెలకుంట్ల మం॥
## పాండురంగ విఠలేశ్వరస్వామి,
## కోవెలకుంట్ల

**ఉనికి** నంద్యాల రెవిన్యూ డివిజన్ కేంద్రమునకు దాదాపు 40 కి మీ దూరములో కోవెల కుంట్ల మండలకేంద్రమున గ్రామము చివర పాండు రంగ విఠలేశ్వర స్వామి కూర్మావతార సాలగ్రామరూపమున సాక్షాత్కరించు చున్నాడు

**కోవెలకుంట్ల అనుపేరు వచ్చుటకు గల స్థలపురాణ గాథలు:**

1 నేడు కోవెలకుంట్లగా పిలువబడు ప్రాంతము పూర్వము దండకారణ్యము అపుడచట చింతకుంట్ల యను గ్రామముండెడిది ఆ గ్రామమునకు తూర్పున నొకకోట, కోటచుట్టు అగడ్త ఉండెడిది ఈ గ్రామమునకు 1½ కి మీ దూరమున అభివృద్ధి చెందిన ఒక కోవెల యుండెడిది దిగ్విజయ యాత్ర ముగించుకొని, ఆవైపు వెళ్లుచున్న కృష్ణదేవరాయలు దేవాలయ దర్శనముగావించి, జీర్ణోద్ధరణమొనర్చినాడు ఈ పునర్నిర్మాణమునకు పరవశించిన పరిసరములందున్న మీరాపురము - కనుమలపాడు - గుండ్లమళ్ల ప్రజలు అచటకు వచ్చి స్థిరనివాసమేర్పరచుకొన్నారు ఇట్లచట అనేకులు స్థిరపడుట వల్లను, కోవెలకు దగ్గరగా చింతకుంట్ల యుండుట వల్ల నది 'కోవెల కుంట్ల' గా స్థిరపడినది

2 పూర్వ మీ ప్రాంతములో నొక కోవెల ప్రక్కన కుంటయుండెడిది అది జనము వాడుకలో క్రమముగా కోవెలకుంట్లగా మారియుండును

3 పూర్వ మీ ప్రాంతమును కాకతీయులు పరిపాలించు నపుడు కంఠధ్వని మాధుర్యముగల కోయిల అను నాట్యకత్తెయుండెడిది ఒకనాడు పాండురంగస్వామి ఆమెకు కలలో కనిపించినాడు పూర్వము వనవాసమున నున్న ధర్మరాజు ఆ ప్రాంతమున కొన్నాళ్లుండినట్లును, అచటి ప్రజల మంచి తనమునకు ముగ్ధుడై సాలగ్రామమును బహూకరించి వెళ్లినట్లును, ప్రజలు భక్తితో ప్రతిష్ఠించి సేవించినట్లును, కలియుగారంభములో నచటి ప్రజలు నిర్లక్ష్యముతో సాలగ్రామమును కుంటలో వేసినట్లును ఆమెకు చెప్పి ఆ సాలగ్రామమును కుంట నుండి తీసి, పునః ప్రతిష్ఠించుమనియు స్వామి పలికెను

పాండురంగని పల్కులను శిరసావహించిన కోయిల గర్భగృహమును నిర్మించి, యట పాండురంగ సాలగ్రామమును ప్రతిష్ఠించెను స్వామికి వామభాగమున లక్ష్మీదేవియు, కొంత దూరమున హనుమదాలయమును కోయిలయే నిర్మించినది కొన్ని ఎకరాల భూమిని స్వామి పూజలకు, దీపారాధనకు, నాట్య సంగీతాలకు దానము చేసినది ఇట్లు ఆలయాభివృద్ధికి దోహదము చేయుటతో ఆమె పేరు తోనే ఆయూరిని 'కోవెలకుంట్ల' గా పిలిచినారు

**శాసనత్రయ విశేషాలు** ఈ ఆలయ ప్రాంగణమున మూడ శాసనములు కలవు [9]

**1,2** శాసనాలను తిమ్మదేవమహారాజు వేయించినాడు మొదటిది పూర్తి గాను, రెండవది అసంపూర్ణముగా నున్నది

1 శ్రీ శ **1571** సం॥ ము పెనుగొండను తిరుమల దేవమహారాయలు పాలించెను అతని పాలనలో తిమ్మయ్య రాజపుత్రుడు నరసింగరాజు మొదటి శాసనము వేసినాడు ఈ దానశాసనములో కోగిల కుంట్లకు చెందిన చిన్నకొప్పిరాల గ్రామమును విఠలేశ్వరునకు సమర్పించినట్లున్నది **2 1573** సం॥ము తిరుమలదేవ మహారాయల కాలములో నరసింగరాజు వేయించిన దానశాసనమిది **3 1584** సం॥ ము పెనుగొండను శ్రీ రంగదేవమహారాయలు పాలించెడివారు ఇతని పాలనలో కృష్ణంరాజపుత్రుడు వేంకటాద్రిరాజు విఠలపాద పద్మాలకు కోగిలకుంట్ల సీమకు చెందు దేవాలయ భూములైన చింతలకుంట, విఠలాపురం , చిన్నకొప్పిరాల, సవదరదిన్నె మొదలగు గ్రామాలను సమర్పించినాడు ఈ గ్రామాలనుండి వచ్చు ఆదాయముతో విఠలునికి అమృతపడి, అంతరంగభోగాలు, రామానుజ కూటములోని పల్లకి సేవ, తిరునాళ్ల, మహోత్సవము మొదలగునవి నిర్వహించవలెనని శాసించినాడు

**మూలవిరాట్టు - తదితరస్వాములు** తూర్పున కభిముఖముగా సాలగ్రామ రూపమున మూలవిరాట్టు దర్శనమిచ్చు చున్నాడు ఆ మూల విరాట్టుకు వెనుక భాగమున చతుర్భుజములు గల విష్ణువు దర్శనమిచ్చుచున్నాడు ఈయన శంఖ, చక్ర, గదాయుధములతో, అభయ హస్తమును కలిగియున్నాడు ముందు భాగమున పన్నిద్దరాళ్వారులును గలరు స్వామికి వామ భాగమున వాయవ్యమున గర్భాలయమునకు బయట లక్ష్మీదేవి దక్షిణాభిముఖముగానున్నది స్వామికి ఈశాన్యమున దక్షిణాభి ముఖముగా హనుమంతుడున్నాడు కొంత ముందు భాగమున నవగ్రహములున్నవి జలసౌకర్యమున్నది

**నైవేద్యము - ప్రసాదము - తీర్థము** ముప్పూటుల స్వామికి నైవేద్యమున్నది ఉదయము పాలు, మధ్యాహ్నము బియ్యపు పాయసము లేక పులిహోర ఇత్యాదులు సాయంత్రము పప్పులపొడి లేక గుగ్గిళ్ల నైవేద్యముగా సమర్పింపబడును భక్తులకు మధ్యాహ్న సాయంత్రములందు నైవేద్యమే ప్రసాదముగా లభించును పచ్చకర్పూరము, సుగంధ ద్రవ్యములు, తులసీ దళములతో కలిపి తీర్థము తయారు చేయబడును

**తిరునాళ్ల/ఉత్సవము** వైశాఖ శుద్ధదశమి నుండి 11 రోజులపాటు స్వామికి తిరునాళ్ల జరుగును మొదటి మూడు రోజులలో కోట తిరునాళ్ల, పేట తిరునాళ్ల, కోనేటి తిరునాళ్ల, కల్యాణోత్సవము జరుగును నాలుగు నుండి ఎనిమిది రోజుల వరకు ఆంజనేయ, సింహ, శేష, గరుడ, గజ వాహనసేవలు స్వామికి జరుగును తొమ్మిదివరోజు ఉదయము పూర్ణాహుతి, రథోత్సవము సాయంత్రము జరుగును పదవరోజు మైల తిరునాళ్ల, పదకొండవరోజు వసంతోత్సవము జరుగును సంక్రాంతి మరియు విజయదశమి దినములలో ఉత్సవ విగ్రహాల తో గ్రామోత్సవము జరుగును

**ఇతరాంశాలు** అఖండ దీపారాధనతో పాంచరాత్రాగమ పద్ధతిలో స్వామి కర్చన జరుగుచున్నది ఆలయమునకెదురుగ 25 అడుగుల ఎత్తుగల ధ్వజస్తంభము కలదు వైకుంఠ ఏకాదశినాడు ఉత్తర ద్వార దర్శనముండును శఠగోపము కలదు స్వామికి ప్రతిదినము భక్తులు పూజలు చేయించుచున్నారు

## కోవెలకుంట్ల తాలూకా - దొర్నిపాడు మం॥

# లక్ష్మీచెన్నకేశవ స్వామి

### చాకరాజు వేముల గ్రామము

ఉనికి దొర్నిపాడు మండల కేంద్రమునకు 3 కి మీ దూరమున గల చాకరాజుల వేముల గ్రామ మధ్యమున లక్ష్మీ చెన్నకేశవ స్వామి వారు వేంచేసి యున్నారు

మూలవిరాట్టు సుమారు 4 అడుగుల ఎత్తుతో శంఖ, చక్ర గదాయుధ ములతోఁ బాటు అభయహస్తముగల చతుర్భుజములు మూలవిరాట్టుకున్నవి మూలవిరాట్టు శిలపై దశావతారములు సైతము చెక్కబడినవి ఆస్పరిలో వెలసిన జనార్దన స్వామివారి విగ్రహము నందు నిట్లే దశావతారములు గలవు

తీర్థప్రసాద నైవేద్యములు ప్రతి శనివారము స్వామికి స్నానము నైవేద్యము సమకూరుచున్నవి ప్రతిశనివారము పొంగలి లేక శనిగబేడల పాయసము స్వామికి నైవేద్యము నర్చకుడు సమర్పించుచున్నాడు పర్వదినాలలో మాత్రము భక్ష్యనైవేద్యముకలదు కర్పూర గంధ శర్కరాజల మిశ్రిత తీర్థమును వినియోగింతురు

అర్చకుడు గ్రామస్థులలో చెన్నకేశవుని పై భక్తిని ప్రతిష్ఠించుటకై పూజారి ప్రయత్నించుట ప్రస్తుతింపదగినది

ఆలయప్రాచీనత - ధ్వజస్తంభము ఆలయము ప్రాచీనము, మూలవిరాట్టు శోభాయమానముగానున్నాడు ఆలయమును జనమేజయుడు ప్రతిష్ఠచేసెనందురు ఆలయమునకు ముందు భాగమున 25 అడుగుల యెత్తుగల దారునిర్మితమైన ధ్వజస్తంభము కలదు అధునాతననిర్మితమిది

భక్తుల సంఖ్య అనుదినము ఇద్దరు ముగ్గురు భక్తులు మాత్రము దైవదర్శనము గావింతురు వైకుంఠ ఏకాదశి - శ్రీరామనవమి పర్వదినములందు మాత్రము వందమంది భక్తులు భక్తిప్రపత్తులతో స్వామిదర్శనమున కరుదెంతురు

ద్వారదర్శనము వైకుంఠ ఏకాదశిదినమున నీయాలయమున నుత్తరద్వార దర్శనము కలదు ఆ ఏకాదశి యుదయము ద్వారము బయట 'సొప్పతో' మంటవేసి, ద్వారము తీయవలెను అట్లు ఒక సంవత్సరము

చేయనందు వల్ల కొన్నికొట్టాలు పరశురామ ప్రీతియైనవి చొప్పయనగా సజ్జ జొన్న కాండమని యర్థము

ఆళ్వారులు - ఉత్సవ విగ్రహాలు స్వామి గర్భాలయము ముందు భాగమున పన్నిద్దరాళ్వారులున్నారు లక్ష్మీ పద్మావతీ వేంకటేశ్వర స్వాములవారి కాంస్యవిగ్రహాలు గ్రామోత్సవమున కుపయోగింతురు వైకుంఠ ఏకాదశి రోజు మాత్రము విగ్రహాలకు గ్రామోత్సవము కలదు గ్రామోత్సవము రోజు గరుడ వాహనము వాడుచున్నారు ఆరోజు రాత్రియంతయు భక్తులు భజనలు కావింతురు

స్థానికచరిత్ర ఇచట నొక విచిత్ర కథనము జనముచే వినిపింపబడినది మనుపు గుడిలో వెలసిన పన్నిద్దరాళ్వారులు రాత్రి సమయమున గోవింద నామ స్మరణ చేయుచు, భజన పాటలు పాడినట్లు బయట విన్నభక్తులు తెలిపిరి నలుబది సంవత్సరాల ముందు పై విధముగా జరుగుచుండ ప్రత్యక్షముగా తిలకించుటకై గుడి తలుపులను తీసిరి భజనతో పరవశించుచు, నూగుచున్న యొక యాళ్వారును పట్టుకోగా, ఆవిగ్రహము విరిగిపోయినది అప్పటి నుండి యా భజన శబ్దము రాలేదట! వృద్ధ భక్తులు నేడీ విషయము తెల్పుచున్నారు

## నంద్యాల తాలుక - గడివేముల మండలము, భానుమండలాంతర్గత లక్ష్మీనారాయణస్వామి, గని

భానుమండలములో వామాంకమున లక్ష్మీదేవిగల నారాయణస్వామి తూర్పు కభిముఖుడై గని గ్రామమున ఆహ్లాదముగా దర్శనమిచ్చును గడివేముల మండలమునకు 16 కి మీ దూరమున ఆలయము కలదు విగ్రహము ఎత్తు 2½ అడుగులు స్వామి కెడమవైపున గిరి అయ్యప్ప సమాధి, ఆ ప్రక్కన శివాలయము ( వీరబ్రహ్మేశ్వర స్వామి) కలదు గిరి అయ్యప్ప సమాధికెదురుగా విష్ణుదశావతారములు గల నవగ్రహ యంత్రము గలదు

అష్ట దిక్పాలకులు:- ఈ ఆలయ ప్రహారీగోడ లోపలనే అష్టదిక్పాలకులుండుట విశేషము తూర్పుదిశన దేవేంద్రుడు, పడమర దిక్కులో వరుణుడు, ఉత్తరమున కుబేరుడు, దక్షిణమున యముడు, ఈశాన్యమున ఈశ్వరుడు ఆగ్నేయమున అగ్నిదేవుడు నైర్ఋతి మూలలో నైఋతి, వాయవ్యమున వాయుదేవుడు తమ తమ వాహనాలతో దర్శనమిచ్చుచున్నారు

**ఇతరులు:** ఈశాన్యోత్తరాలకు మధ్య షడ్భుజుండైన దత్తాత్రేయుడు వాయవ్యము పడమరకు మధ్య వ్యాసమహర్షి, పడమర - నైఋతి మధ్య కపిలమహర్షి దక్షిణము-నైఋతి మధ్య వశిష్ఠుడు, దక్షిణాగ్నేయాలకు మధ్య చతుర్భుజ బ్రహ్మ, సప్తర్షులు, వాయవ్యోత్తరాలకు మధ్య విదురవిభీషణ, అక్రూరాదులు 16మంది మహాపురుషుల విగ్రహాలు తూర్పు-ఈశాన్యము మధ్య గరుత్మంతుడు సూర్యనారాయణస్వామి తూర్పు ఆగ్నేయము మధ్య నారద ఋష్యశృంగులు దర్శనమిత్తురు

**ధ్వజస్తంభము:** ప్రధాన దైవము భాను మండలాంతర్గత లక్ష్మీనారాయణ స్వామి కెదురుగా ప్రహరికి బయట ధ్వజస్తంభము 12 అడుగులతో నున్నది దాని వెనుక కల్యాణమండపము కలదు గిరి అయ్యప్ప సమాధి కెదురుగా ప్రహరిలోపల ధ్వజస్తంభము కలదు

**నీరు:** ఆలయమునకు ఇరువైపుల బయట సూర్యకోనేరు, చంద్రకోనేరు కలవు, ఉత్తరద్వారమునకు బయట అశ్వత్థవృక్షము కలదు

**అవధూత ఆలయము** నారాయణస్వామి ఆలయానికి బయట కుడివైపున అవధూత కాశిరెడ్డి నాయన నిలువెత్తు విగ్రహము కలదు ఈ ఆలయము బయట తులసిబృందావనము కలదు

**నదీతీరమున.** ఈ ఆలయము ( లక్ష్మీ నారాయణస్వామి) మధురానదీ తీరమునఁగలదు ఇది దక్షిణము నుండి ఉత్తరమునకు పారుచున్నది

**శాసనము:** ఆలయ శేషములన్నియు క్రీ శ 1625 నాటి శాసనమున వివరించబడుచున్నవి ప్రహరీ గోడలోనే శాసనము కలదు

**నిరతాన్నదానము** దాదాపు 1990 సం॥ నుండి ఈ ఆలయ ప్రాంగణమున నిరతాన్నదాన సత్రము నిర్వహింపబడుచున్నది ఈ ఆలయ పునరుద్ధరణ కార్యక్రమములన్నియు ఆ అవధూత పుణ్యమే

**తిరునాళ్ల** ప్రతి సంవత్సరము ఇచట తిరునాళ్ల జరుగుచున్నది వైశాఖశుద్ధ త్రయోదశి ఉదయము భాను మండల నారాయణస్వామి, వీరబ్రహ్మేశ్వర స్వామి, గిరి అయ్యప్పస్వామి వారికి పంచామృతాభిషేకము, సహస్ర నామార్చనాది హోమ, జప, పుణ్యాహవాచనాది కార్యక్రమములు జరుగును

వైశాఖ శుద్ధ చతుర్దశి ఉదయము స్వాముల వారికభిషేకము, సహస్ర నామార్చన, జప, హోమ పుణ్యాహవాచనాదికములైన ప్రభాతసేవా, పూజావిధులు నిర్వహింపబడును

వైశాఖ శుద్ధ పౌర్ణమి ఉదయము ప్రభాత పూజాదికములు ఖానుమండలాతర్గత లక్ష్మీనారాయణస్వాముల వారి కల్యాణోత్సవము జరుగును

పై మూడు దినములందు పగలు కార్యక్రమము జరుగును రాత్రులలో వేదాంతోపన్యాసాలు , హరికథలు, పౌరాణిక నాటకాదులు సైతముండును

**వండుట్ల రంగస్వామి** గని గని గ్రామమునకు **5** కి మీ దూరమున కొండలో రంగస్వామి ఆలయము కలదు చతుర్భుజాలతో స్వామి తూర్పు ఈశాన్యమున కభిముఖముగా దర్శనమిచ్చును **1998** సం॥లో రంగస్వామిని పునఃప్రతిష్ఠచేసినారు రంగస్వామికి క్రింద యెడమ భాగాన లక్ష్మీదేవికలదు ఇచట ఆళ్వారుల గుడి సైతము కలదు

**అర్చన - తిరునాళ్ల ఇత్యాదులు** వారానికొకమారు స్వామి కర్చన జరుగుచున్నది ఆలయము ప్రదక్షిణయోగ్యము పులగము మొ॥ స్వామికి నైవేద్యము ఇచట మూడు కోనేర్లలో సంతతము మధుర సలిలము లభించును

ప్రతి సంవత్సరము ఫాల్గుణ శుద్ధ పౌర్ణమికి తిరునాళ్ల జరుగును తిరునాళ్లకు గడివేముల, పాణ్యము, గాజులపల్లె, కోడుమూరు, పరమటూరు మొ॥ ప్రాంతాలనుండి భక్తులరుదెంతురు కోరిన కోర్కెల దీర్చుకొంగు బంగారము రంగస్వామియని భక్తజనుల సంపూర్ణ విశ్వాసము

## బనగానపల్లె తాలూకా - ఔకు మండలము

## కదిరి లక్ష్మీనరసింహస్వామి, మెట్టు పల్లె

**ఉనికి.** అవుకు మండలకేంద్రమునకు **10** కి మీ దూరమున, మెట్టుపల్లె గ్రామమునకు **6** కి మీ దూరమున కదిరి లక్ష్మీ నరసింహస్వామి వెలసియున్నాడు

**స్వరూపము** ఒక్క అడుగు ఎత్తుతో స్వామి శాంతస్వరూపమున దర్శనమిచ్చును స్వామికి ఎడమ చేతి పై భాగమున శంఖమును, క్రింది భాగమున గదయును కుడి చేతి పై భాగమున చక్రమును, క్రింది చేత నభయహస్తమును గలవు స్వామి కెడమవైపున చెంచులక్ష్మియు గలదు ప్రహ్లాదునకు చతుర్భుజాలు గలవు ఈ మూడు విగ్రహాల చుట్టు దారునిర్మితమైన సింహతలాటము గలదు స్వామి విగ్రహము స్వయంభువని తలంచుటచే, ఎంతప్రాచీనమో తెలియదు గుహలో ఒక ఫర్లాంగు దూరము వెళ్లగా చీకటిలో

సోపానముల పైన నరసింహస్వామి కనిపించును స్వామికి కొంత వెనుక చతుర్భుజములతో లక్ష్మీదేవి దర్శనమిచ్చును

ఇతరాలయాలు స్వామి దర్శనమునకు పూర్వము మెట్లకు దిగువ భాగమున లక్ష్మీ నారాయణ విగ్రహ ప్రతిష్ఠ కావించి, ఆలయమును నిర్మించినది కీ శే అందలం జీవయ్యగారు వీరు పూర్వము అర్చకులు వీరు ఈ నృసింహస్వామి చరిత్రమును తాళపత్రస్థమైన దానిని వ్రాత ప్రతిగా తీర్చిదిద్దినారు వీరు సహజ కవులు ఈ గుడికి ½ కి మీ దూరమున బహిరంగముగా నున్న హనుమంతునికి గుడిని ప్రస్తుతార్చకులు అందలం కృష్ణమూర్తిగారు నిర్మించినారు వీరు అందలం జీవయ్యగారి కుమారులు

లక్ష్మీనారాయణాలయమునకు ప్రక్కన రామకోటి స్తంభము కలదు 1968 సంవత్సర ప్రాంతమున వచ్చిన సుబ్బయ్య అనుభక్తుడు దాదాపు 8 ఏండ్లు ఇచట వసించి, రామకోటి వ్రాసినాడు ఆ పుస్తకాల పైన రామకోటి స్తంభము ఇచట నిర్మించబడినది

వెండినరసింహకవచము తనకోరిక నెరవేరగా కోనాపురం మూగిరెడ్డి నరసింహస్వామికి భక్తితో వెండి నరసింహ కవచము చేయించినాడు

మహిమ స్వామిగుహలోనే కల కందిరీగలు బహిష్టయినవారు, అశుచియైన వారు వచ్చిన, వారికిబ్బంది కల్గించును కనుక భక్తులు శుచితో నరుదెంతురు

నైవేద్యము ప్రతి శనివారము స్వామికి బియ్యపు పాయసముగాని, పులగముగాని నైవేద్యముగా సమర్పింపబడును ఆరోజు మాత్రమే వారములో పూజ

దైవము పై విశ్వాసము ప్రజలకు దైవముపై విశ్వాసము కలదు ఈ స్వామి యిలవేలుపుగా గలభక్తులు ఔకు వైశ్యులు, కోనాపురం, మెట్టుపల్లె, రుద్రవరం ( ఆళ్లగడ్డ తాలుకా) కర్నూలు, చిదంబరం నుండి వత్తురు ప్రతిశనివారము పరిమిత సంఖ్యలో వత్తురు

వైకుంఠ ఏకాదశినాడు స్వామి దర్శనమునకై వందమంది భక్తులు వత్తురు రాత్రి జాగరణ ద్వాదశి ఉదయము భోజనానంతరము భక్తులు తిరిగివత్తురు

ఇతరాలు శఠగోపము కలదు స్వామి ప్రదక్షిణ కనుకూలుడుగాడు నీటివసతికలదు

# ఇతరములు
# పూర్వపు కర్నూలు జిల్లా ప్రాంతము
# నేటి ప్రకాశం జిల్లా గిద్దలూరు తాలూకా
# మాధవస్వామి,
# తురిమెళ్ళ.

గిద్దలూరు తాలూకాలోని తురిమెళ్ళగ్రామ మధ్యమున మాధవస్వామి పశ్చిమాభిముఖుడుగా దర్శనమిచ్చును స్వామి ప్రక్కన శ్రీదేవి, భూదేవి కలరు

మాధవస్వామి అస్తిత్వమును గూర్చిన విభిన్న కథనములు

1 జమ్మలమడుగు సమీపములోని గండికోట నుండి మాధవస్వామి విగ్రహము తురిమెళ్ళకు కొనిరాబడినదని యందురు తురిమెళ్ళ వైశ్యులు వ్యాపార నిమిత్తము వెళ్లి, తురుష్కులు బావిలో పడవేసిన మాధవస్వామి విగ్రహమును తెచ్చి, తురిమెళ్ళలో ప్రతిష్ఠించినారు ఇది దాదాపు 250 సం॥ ల ముందు జరిగిన ఇతివృత్తమని ఆలయార్చకుని కథనము

2 తురిమెళ్ళలోని బెల్లం కొండ వంశమువారు దొంగతనమునకు వెళ్లి, గండికోట గ్రామములో నొక పెట్టెలో పెట్టిన విగ్రహము నెత్తికొని వచ్చి, దానిని కొంతదూరము వచ్చిన తరువాత మాధవస్వామి విగ్రహముగ తెలిసికొని ఆగ్రామమునకు వెలుపల బావిలో పడవేసినారు ఆవిగ్రహము ప్రతిరోజూ తురిమెళ్ళ చోరులకు కలలో కనిపించుచు, తనను ప్రతిష్ఠించుమని కోరుచుండెను తత్ప్రేరణకు ఫలితముగ వారు విగ్రహమును తెచ్చి నేడు వెలసిన చోటు మాధవుని ప్రతిష్ఠించినారు ఈ విషయమును ఆ చోరుల సన్నిహిత బంధువు చెప్పిన ప్రత్యక్ష కథనము ఆ చోరులు స్వామిని తమ ఇలవేల్పుగా ''మాధవరాయుడు'' అను పేర ఈనాడు పిలుచుచున్నారు మాధవ స్వామి 2½ అడుగుల ఎత్తుతో మోహనాకారముగా కనిపించుచున్నాడు

ఇతరఅంశములు స్వామి కెదురుగా ఎత్తైన ధ్వజస్తంభము కలదు ఇచట క్షేత్రపాలకుడు హనుమంతుడు స్వామికి వెనుక పన్నిద్దరాళ్వారులు కలరు ఇచట నిత్యము మధ్యాహ్న కాలమున స్వామికి నైవేద్యము సమర్పింపబడును గజాశ్వ గరుడ హనుమద్వాహనాలు ఇచట గలవు చైత్రశుద్ధ పంచమి మొదలు నవమి వరకు స్వామికి తిరునాళ్ల జరుగును పాంచరాత్ర పద్ధతిలో పూజలు జరుగుచున్నవి ఈ ఆలయములో దేవేరుల తోకూడిన వేంకటేశ్వర స్వామియు దర్శనమిచ్చును

# గిద్దలూరు తాలుకా
# నెమలిగుండ్ల గంగనాయక స్వామి,
# జెల్లి వారి పుల్లల చెర్వు.

పూర్వపు కర్నూలు జిల్లా పరిధిలో గిద్దలూరు తాలూకా లోని జెల్లివారి పుల్లల చెర్వు గ్రామమునకు పడమటి దిక్కున నెమలి గుండ్ల రంగనాయక స్వామి మహిమాన్వితుడై వేంచేసి యున్నాడు

స్వామి వెలయుటకు కారణమైన కథ పూర్వము మయూర మహర్షి మహావిష్ణువును గురించి, గుండమునందు స్నానమొనరించి, ఘోరముగా తపము చేయుచుండెను మయూర మహర్షి నెమలి ఆకారముతో గుండమునందు స్నానము చేయుటచే దీనికి నెమలిగుండమని పేరు వచ్చెను

శ్రీరంగము కొండకు ఎగువన నల్లమలకొండలలో నున్న చెంచు గూడెములో గల ఐయ్యన్న, ఐయ్యక్క అను దంపతులకు అనేక వత్సరాలకు ఆడపిల్ల జన్మించినది వారామెకు చెంచులక్ష్మియని నామకరణము చేసిరి అహరహము హరినామ స్మరణము చేయు ''చెంచులక్ష్మి'' – తాను శ్రీమన్నారాయణునే వివాహ మాడుదునని చెప్పెను తల్లి దండ్రులను ధిక్కరించి ఆమె నారాయణ సాక్షాత్కారమునకై శ్రీరంగము కొండను చేరినది మయూర మహర్షి సలహా మేరకు చెంచులక్ష్మి అతని ప్రక్కనే కూర్చొని తపమొనరించెను

వారి తపమునకు మెచ్చి విష్ణువు ప్రత్యక్షమాయెను వారి కోరికను మన్నించి స్వామి చెంచులక్ష్మిని పరిణయమాడెను తన కడకరుదెంచిన లక్ష్మీదేవిని స్వామి అనునయించగ, ఆమె చెంచులక్ష్మిని చెల్లెలుగా స్వీకరించెను లక్ష్మీ దేవి ప్రక్కనున్న వనములో కొంత కాలము నివసించుటచే దానికి లక్ష్మీవనమని పేరు వచ్చెను

కొంతకాలము చెంచులక్ష్మితో విహరించిన పిదపస్వామి మహర్షికి ప్రత్యక్షమై, ''మునీంద్రా! నీ పేరు, గుండము పేరు, చిరస్థాయిగ నిలుచునట్లు కలియుగము లో ఈ ప్రాంతము నెమలి గుండ్ల రంగనాయక క్షేత్ర మనుపేర పుణ్యక్షేత్రమగును'' అని అదృశ్యమయ్యెను స్వామి నిలబడిన చోట ఒక శిల స్వామి ఆకారము లో కనిపించెను ఆశిలను రంగనాయక రూపముగా భావించి మయూరుడను దినము పూజించుచుండెను

ఆపిదప భక్తులు రంగనాయకునికి ఆలయమును నిర్మించిరి మయూరుడు కొంతకాలము తరువాత స్వామిలో లీనమాయెను ఆదైవమే నెమలిగుండ్ల రంగనాయకస్వామి గా పిలువబడుచున్నాడు

**స్వామి మహిమలు:**

1 ఒకనాడు మందుపేసవిలో కట్టెలు కొట్టి జీవించు రంగన్న తన 10 యేండ్ల కుమారునితో కట్టెలు కొట్టుటకై అడవికి వెళ్లెను

తండ్రి శ్రమించి నిద్రించెను జీలుగు పండ్లను కోయుటకై వెళ్లిన పిల్లవాడెక్కిన చెట్టును దావాగ్ని చుట్టుముట్టెను కేకలు వేసిన కుమారుని రక్షించుటకై మేల్కాంచి రంగన్న విఫలుడాయెను తనకుమారుని రక్షించు బాధ్యతను రంగన్న రంగనాథునిపై మోపెను వాతావరణము పరిణామము చెంది, కుంభవృష్టి కురిసెను సురక్షితముగ దిగివచ్చిన కుమారుని చూచి, తండ్రి సంతసించి స్వామి సేవకు అంకితమయ్యెను

2 వజ్రపురి పట్టణమున ధర్మయ్య, లక్ష్మమ్మ అను దంపతులకు సంతానము లేమిచే రంగనాయక స్వామి బ్రాహ్మణ వేషమున వచ్చి, నెమలి గుండ్ల రంగనాయకుని సేవించిన సంతాన ప్రాప్తి కల్గునని సూచించి వెళ్లెను వారట్లు స్వామిని సేవించి, కలిగిన సంతానమునకు రంగయ్య అను నామకరణమొనరించిరి పంచవర్ష ప్రాయుడైన పిల్లవానితో ఆదంపతులు క్షేత్రమున స్వామిని దర్శించి మ్రొక్కులు చెల్లించి సుఖించిరి

3 నరసాపురములో రంగారావు అను ధనవంతుడుండెను అతడు పిల్లికి భిక్షము వేయని పిసినారి పేదసాదలను పీడించిన పాపమునకు ఫలితముగా వానికి కుష్టువ్యాధి సంక్రమించెను వాడు భార్యాప్రేరితుడై స్వామిని దర్శించి మ్రొక్కులిడి, ఇంటికి రాగా క్రమేణ ఆరోగ్య వంతుడాయెను ఇట్టివి స్వామి మహిమలెన్నియో కథలు కథలుగా ప్రచారములో కలవు [10]

ఈ క్షేత్రమునకు నీటి కొరత లేదు ఇచటి నెమలిగుండము అరచదరపు మైలు విస్తీర్ణము కలిగి యున్నది లోతు తెలియదు

## మార్కాపురం తాలూకా

## లక్ష్మీ చెన్నకేశవ స్వామి, మార్కాపురం(మండల కేంద్రము)

మార్కాపుర మండల కేంద్రమున వెలసిన దైవము లక్ష్మీచెన్నకేశవ స్వామి

**మూలవిరాట్టు** స్వామి తూర్పునకభిముఖముగ చతుర్భుజములతో మనకు దర్శనమిచ్చును కుడి ఎడమల పై భాగమున చక్రశంఖములు కుడిపైపు క్రింది చేతిలో గధాయుధమును, ఎడమవైపు క్రింది చేతిలో శేష చక్రము (ప్రయోగ చక్రము) కలవు ఏ విష్ణాలయములోను మూలవిరాట్టునకు ఇట్టి శేష చక్రము లేదు, మార్కండేయ తపోభంగము చేయు 'కేసి' రాక్షసుని సంహరించుటకై విష్ణువు శేషుని చక్రము గా మలచుకొన్నాడు స్వామి పాదాలకు కుడివైపు మార్కండేయ మహర్షియు, ఎడమవైపు మారికా మారకులును కలరు ఈ స్వామి స్వయంభువు అని యందురు స్వామి వారి మకర తోరణముపై దశావతారములు కలవు స్వామి కెడమవైపున ప్రత్యేకముగ రాజ్యలక్ష్మి అమ్మవారి ఆలయము గలదు

ప్రస్తుతము గతకాలమున కంటె స్వామిని దర్శించు భక్తుల సంఖ్య పెరుగుచున్నది ప్రతి దినము 50 మంది వచ్చుచుండగా శనివారము 300 మందికి తగ్గరు

**తీర్థనైవేద్య ప్రసాదములు** నీరు, జాజికాయ, జాపత్రి, ఏలకులు, పచ్చకర్పూరపు పొడి, తులసి కలిపి తీర్థము తయారు చేయబడును ఇచట త్రికాల నైవేద్యము కలదు ఉదయము పొంగలి, మధ్యాహ్నము శుద్ధాన్నము, రాత్రి సుండలు స్వామికి నైవేద్యము, ఉదయ రాత్రములందలి నైవేద్యమును భక్తులకు ప్రసాదముగా పంచబడును

పట్టణమధ్యమున గల ఈ ఆలయములో పాంచరాత్రాగమ పద్ధతి ప్రకారము పూజలు నిర్వహింపబడుచున్నవి

**ఆలయద్వారములు - విశేషాలు:** ప్రథమ ప్రవేశ ముఖద్వారము లోపల హనుమాలయము దక్షిణాభిముఖముగా నున్నది ఈయన క్షేత్రపాలకుడు ఈ ఆలయమును ప్రాచీనమే, ఈ కోవెల వెనుక స్వామి వారికి పుష్పవనము కలదు

ద్వితీయముఖద్వారమునకు దక్షిణపుదిక్కున ఆగ్నేయ మూలలో పాకశాల - వాహన మండపము - అర్చకులకు వసతి గదులు - ప్రక్కనే సన్నిద్ధ రాళ్వారులు - గీతోపదేశ కృష్ణార్జునులు - కృష్ణాలయము, నైరృతి దిక్కున

కళ్యాణ మండపము, వాయవ్యమున జీర్ణోద్ధరణ చెందిన శ్రీ రంగనాయకస్వామి కానవచ్చును అప్రక్కన అండాళ్ అమ్మవారు కలరు ఈ శాన్యమున యజ్ఞశాల - దాని ప్రక్కన నైరృతి దిక్కునకు రామానుజస్వామి ఆలయము కలదు

ద్వారమున కెదురుగా మధ్యలో ధ్వజస్తంభము కలదు గర్భాలయమునకు ముందు మధ్య రంగము కలదు మధ్యరంగము ముందు గల అంతరాలయములోని స్వామి వారి ఉత్సవ విగ్రహాలకు కూడ మూలవిరాట్టుతో పాటు పూజలు జరుగుచున్నవి మారిక గర్భాలయమును నిర్మించగ, మధ్యరంగమును అచ్యుత రాయలు (కొందరు శ్రీ కృష్ణరాయలు) నిర్మించెనట!

**మారికా మారకుల కథ** 'మారిక' అను పేరు గల యాదవ వనిత అనుదినము పాలు, పెరుగు నమ్ముచుండెడిది స్వామి ఆమెకు కలలో కనిపించి, పుట్టలోనున్న తనకు ప్రతిరోజు పాలు పోయుమని కోరినాడు ఆమె యట్లే చేసినది పాలకు తగ్గ ప్రతిఫలము లేనందుకు భర్త, అత్తమామలు ఆమెను పేధించసాగిరి స్వామి మరల కలలో కన్పించి, ఆమె దాటి వెళ్లు కుండికా నదిలోని పిడికెడు ఇసుకను ధాన్యపు గాదెలో వేయుచుండు మని పలకగా, ఆమె అట్లే చేసినది ఒకరోజు గృహస్థులెల్లరు చూడగనది బంగారముగా కనిపించినది దానితో స్వామి గర్భాలయము, అంతరాలయము నిర్మించబడినవి

మునుపు మారిక ననుమానించిన భర్తమారకుడు తన భార్యపోయు క్షీరమును పుట్టలోని స్వామి గ్రహించుటను ప్రత్యక్షముగా చూచి క్షమింపవేడును వారి పేర్లు శాశ్వతముగ నుండుటకై పట్టణమునకు 'మారికాపురము' (అదే నేటి 'మార్కాపురము') అను పేరును స్వామి అనుగ్రహించును వారు స్వామిలో నైక్యమైరి అంతియేగాక మారికా మారకులకు మూలవిరాట్టులో పాదాలకెడమవైపున స్థానము కల్పించబడినది

**వాస్తుశిల్ప వైభవము** ప్రతిసంవత్సరము ధనుర్మాస సందర్భమున డిశంబరు 16 వ తేది నుండి జనవరి 14 వ తేదివరకు గల నెలరోజులలో ఒక వారము రోజుల పాటు సూర్యకిరణాలు గర్భాలయము లోనికి ప్రవేశించి, మూలవిరాట్టు పై ప్రసరించుట విశేషము ఇది నాటి శిల్పుల నిర్మాణ నైపుణ్యమని పూజారి నంద్యాల కేశవాచార్యులు తెలిపెను

**శాసనములు** చెన్నకేశవ స్వామి వారికి ఉత్సవాలు, నిత్య పూజలు, వైభవముగా జరుగుటకుగాను తిరుమలదేవరాయలు, అతని అల్లుడు మాద్రాజు నాగప్ప దేవమహారాజు కొన్ని గ్రామాలపై వచ్చు సుంకమును సమర్పించినట్లు ఆలయమున గల శాసనములు తెలుపుచున్నవి

పల్నాటిరాజుల పరిపాలనా కాలమున బ్రహ్మనాయుడు స్వామిని దర్శించి ప్రాకారాలు నిర్మించినట్లు, శ్రీకృష్ణరాయలు కొన్ని నిర్మాణములు గావించినట్లు తెలియుచున్నది దీనిని బట్టి ఇది ప్రాచీనాలయమని తెలియచున్నది

**పుష్కరిణి** స్వామి వారి కోవెల కెదురుగా 1 కి మీ దూరమున పుష్కరిణి కలదు స్వామి వారి అభిషేకములకు ఈ పుష్కరిణి నీరము నుపయోగింతురు

**గాలిగోపురము** నేడు తొమ్మిది అంతస్తులతో చూపరుల నాకట్టుకొనునట్లు గాలి గోపురము కనిపించు చున్నది ఇపుడు అది పాతగిల్లినది దానిని జీర్ణోద్ధరణ చేయవలసిన అవసరమున్నది

**ఆలయపుచుంచు** ఎగువపాలెం గాలిగోపురము - దిగువ పాలెం రచ్చబండ - మార్కాపురం చుంచు అని మార్కాపురము తాలూకా లోని వింతలను గూర్చి చెప్పుకొందురు ఎగువ పాలెం గ్రామములోని గాలి గోపురము సమున్నతమ్మైనదనియు, దిగువపాలెం గ్రామములోని రచ్చబండ విశాలమ్మైన దనియు, మార్కాపురం మధ్యరంగ మండపమునకు చివరనున్న చుంచు అద్భుతమ్మైనదనియు అర్థము

చెన్నకేశవాలయములోని ఈ చుంచు ఒకేరాయి అనేక మ్మైన వంపులు తిరిగి చక్కని పనితనముతో దర్శనమిచ్చును ఇది యొక అపూర్వ శిల్పకళాఖండము

**అన్నదమ్ముల స్తంభాలు** మధ్యరంగములో ప్రవేశించి, ఒకస్తంభము దాటగనే, లోపలికి వెళ్లు మార్గమున కిరువైపుల సమాన శిల్పనైపుణ్యముగల రెండు స్తంభములు కనిపించును అవి అన్నదమ్ముల స్తంభములగా పేర్కొనబడుచున్నవి ఇరువురు సోదరశిల్పులు మధ్య తెరగట్టుకొని శబ్దగ్రహణముతో నొకరినొకరు చూచు కొనకుండ, చెరియొక స్తంభమునకు శిల్పము చెక్కినారు తెరను తొలగించగ, ఒకేరకముగ కన్పించినవి

**ఉత్తర ద్వార దర్శనము** గర్భాలయమునకు వెనుక వైపున ఉత్తర ద్వారముగలదు ముక్కోటి ఏకాదశి నాడు చెన్నకేశవస్వామి వారు ఈ ద్వారము గుండ భక్తులకు దర్శనమిచ్చును వైకుంఠ ఏకాదశినాడు ప్రసిద్ధ వైష్ణవక్షేత్రములలో విష్ణువును ఉత్తర ద్వార దర్శనము చేయుట వైకుంఠమునందలి విష్ణువును దర్శించి నంత ఫలము కలుగునని భక్తుల విశ్వాసము

**తిరునాళ్ల** శ్రీవారి బ్రహ్మోత్సవాలు చైత్రశుద్ధ చతుర్దశినాడు అంకురార్పణతో ప్రారంభమగును చిత్తానక్షత్ర యుక్తత చైత్రశుద్ధ పౌర్ణమినాడు

శ్రీదేవి భూదేవీ సహిత చెన్నకేశవస్వామికి కల్యాణము జరుగును ఆరోజు మధ్యాహ్నము ధ్వజారోహణ, సూర్యవాహనోత్సవము, రాయబారము, ఎదురుకోల జరుగును తరువాతి రోజులలో చంద్రవాహనము, శేషవాహనము సింహవాహనము, వ్యాళవాహనము, పొన్నవాహనము, హనుమద్వాహనము, గరుడవాహనము ల పై స్వామి పురవీధులందు జ్గును తరువాతి రోజులలో మోహినీ ఉత్సవము - రథోత్సవము జరుగును పిదప అశ్వ హంసవాహనములు, చివరిరోజు వసంతోత్సవము జరుగును మొత్తము పక్షము రోజుల పాటు జరుగు తిరునాళ్ల కార్యక్రమమునకు విశేషముగా భక్తులు అనేక ప్రాంతాలనుండి అరుదెంతురు

**ఉత్సవాలు:** ఉగాది, శ్రావణ మాసములోని ఉట్ల పండుగ, దీపావళి, వినాయక చవితి, శివరాత్రి మొదలుగ ప్రతిపండుగ ఇచట వైభవముగా జరుగును కృష్ణాష్టమికి ఉట్ల పండుగ ఉత్సవము వైభవముగా జరుగును దీనికి ప్రత్యేక మండపము స్వామి కోవెలకు సమీపమున కలదు

## ఉపసంహారము

వాస్తవమునకు జీవుని దేహమునకు - దేవాలయమునకు భేదము లేదు కారణము భగవంతుడు సకలజీవుల హృదయాలలో దాగియున్నాడు అతనినే అంతర్యామి యని, సాక్షీ భూతుడని యందురు కనుక మహాయోగులు - జీవన్ముక్తులు ఎచ్చటికి వెళ్లక ఉన్నచోటనే చేతోలయులై దైవదర్శనము చేసికొందురు కాని, అందరు అట్టి ముక్తస్థితిలో నుండరు కనుక వారి కొరకు దేవాలయాలు ఏర్పడినవి కనుకనే, దేహమునకు సంకేతముగా దేవాలయము, దేహములోని దేవునికి సంకేతముగా దేవాలయములోని దైవ విగ్రహాలేర్పడినవి దేహమునెంత జాగ్రత్తగా పోషించుకొని, ఆధ్యాత్మిక సాధన కొరకు వినియోగించుకొందుమో దేవాలయమును సైతమంత శ్రద్ధగా నిర్మించుకొని అక్కడ దైవ విగ్రహమును ప్రతిష్ఠచేసుకొని, తద్వారా భగవదనుభూతిని బడసి తరించుట ఇచటి యుద్దేశ్యము కనుకనే సాధారణముగా ఏ దేవాలయము కూడ వికారముగనుండదు విష్ణుదేవాలయమసలు వికారముగ నుండదు విశిష్టాద్వైత ప్రకారముగా విష్ణువు స్వరూపము దివ్య మంగళము ఇక ఆయన ఆలయము సైతమట్లే యున్నదనుటకు ఈ అధ్యాయములోని ప్రతి వైష్ణవాలయము నిదర్శనమే

కర్నూలు జిల్లాలోని అనేక వైష్ణవ క్షేత్రములు నిత్యనూతన మనోహరముగా కనిపించుచున్నవి కొన్ని వైష్ణవ విగ్రహాలు స్వయంవ్యక్తములు, మరికొన్ని దైవ ప్రతిష్ఠితములు ఆలయ నిర్మాణ స్వరూపములో అపురూపమైన

వాస్తు వైభవము అద్భుతముగ కనిపించు చున్నది ఇంక సాంకేతికతకు కొరతయే లేదు రాజుల కాలములో నిర్మితమైన దేవాలయాలు గతకాల చారిత్రక విధానములను చెప్పకచెప్పుచున్నవి ప్రత్యేకించి సూర్యదేవాలయ చరిత్ర మొకటి ప్రశంసనీయముగా కనిపించుచున్నది కోస్తా జిల్లాలలోని అరసవెల్లి యొకటి నందికొట్కూరు మరొకటి ఇంకొకటి కర్నూలు నగరములో బిర్లా సత్యనారాయణాలయావరణలో కనిపించును ఆవుకు మండలములోని శివవరములోను ప్రాచీనమైన సూర్యనారాయణస్వామి గుడి కలదు

దేశములో బ్రహ్మదేవుని ఆలయములు ఎట్లు అరుదుగా నుండునో సూర్యదేవాలయాలు కూడ అట్లే అరుదుగా నుండును అట్టి అరుదైన సూర్యదేవాలయాలు కర్నూలు లో నేడుండుట విశేషము వీటి ప్రాచీనతయు గొప్పది అరసవెల్లి దేవాలయము జైనులనాటి దట! సూర్యుడు కూడా నారాయణాంశమే కనుక వైష్ణవకోటిలోనే చేరును కనుక ఈ క్షేత్ర ప్రశస్తిని ఈ అధ్యాయములో చర్చించుట జరిగినది

ఈ ఆలయాలలోని అర్చావిధానము పాంచరాత్ర పద్ధతి పాంచ రాత్రము విశిష్టాద్వైతము లోనిది అచట కుల మత వివక్షత యుండదు కనుకనే వైష్ణవక్షేత్రాలకు ఎక్కడ కూడ కుల మతాల వివక్షలేదు ఇదొక శుభ పరిణామమే దేవ, పరివార దేవతల దృశ్యాలు నయనా నందకరముగాను కవుల కలాలకు పదును పెట్టునదిగాను ఉన్నట్లు పరిశీలించుట జరిగినది అహోబిలస్వామిని ఎఱ్ఱనాదులు అంతగ విజృంభించి వర్ణించుట ఇందుచేతనే అదొక కుటుంబము, అందులో ఒక యజమాని, ఇల్లాలు, పిల్లలు, బంధుమిత్రాదులెట్లు కలిసిమెలసి కమ్మగా జీవించు చుందురో అట్లొకదేవాలయము - అందులో ప్రధాన దైవము, పరివార దేవతలు అట్లే - అనగా కుటుంబమునకు సంకేతముగా విలసిల్లి యొక ఆర్ద్రమైన సమైక్య వాతావరణమును పెంపొందించుచున్నట్లు చెప్పవచ్చును

ఈ వైష్ణవాలయాలలో ఎక్కువగా అర్చకులలో వారసత్వ విధానము కానవచ్చుచున్నది భక్తి ప్రపత్తులతో విలసిల్లు అర్చకులు ఆలయార్చకులుగా నుండి భక్తునికి, భగవంతునికి చక్కని అనుసంధానకర్తగ వ్యవహరించుట యే చాల చోట్ల కనిపించును ఇట్లు కర్నూలు జిల్లాలోని వైష్ణవ క్షేత్రాల ప్రశస్తిని, భక్తి ప్రపత్తులను చూచాయగా పరిశీలించుట జరిగినది

అన్ని దేవాలయాలను సందర్శించి అలసిపోవుట కంటె ఒక విష్ణ్వాలయమును ఆలంబనగా చేసికొని ఆత్మసాక్షాత్కారము పొందుటయే

్రెయస్కరము ఇది ఎట్లనగా భూమి చుట్టు తిరిగిన కుమారస్వామి, శివునిచుట్టు తిరిగిన వినాయకుడు - ఈ ఇద్దరిలో గణపతికే ముక్తి లభించినదట! విశ్వమును శివునికి వేరుగా చూచిన కారణముగ కుమారస్వామికి ముక్తి ఆలస్యమాయెనట!

'యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతంభవతి' (దేనిని తెలిసికొన్న ఈ సమస్తము తెలిసికొన్నట్లగునో అదియేచాలు) అను ఉపనిషద్వాక్యము దీనిని సమర్థించుచున్నది

## అధస్సూచికలు - ద్వితీయాధ్యాయము

1 ఈనాడు ప్రత్యేక అనుబంధం సీమవైభవానికి ఆనవాలు 186 వసంతాల కర్నూలు పేజి నెం 3 1993 సం॥ 'నాటి కందనవోలే నేటి కర్నూలు'

2 భగవద్గీత అధ్యాయము 13 , శ్లోకము 02

3 William Mionex Sandrit E.ıg Dictionary P No 497

4 మే 1982 సప్తగిరి 'తీర్థమహిమ' - శీర్షిక వీరరాఘవులు

5 దేవాలయములు - తత్త్వవేత్తలు - విటి శేషాచార్యులు

6 దేవాలయములు - తత్త్వవేత్తలు - విటి శేషాచార్యులు పేజి 24, 28

7 ఆంధ్రమహాభాగవతము, పోతన ప్రథమస్కంధము

8 నృసింహపురాణము ఎఱ్ఱన 5 ఆశ్వా 99 పద్యము

9 అన్నమయ్య వ్యాసావళి - చిత్రాజు గోవిందరాజు 53వ పేజి

10 నెమలి గుండ్ల రంగనాయక క్షేత్ర మాహాత్మము లిఖిత ప్రతి
టి గోవిందరాజులు



## తృతీయాధ్యాయము

# కర్నూలు జిల్లా వైష్ణవ క్షేత్రసాహిత్యము





# తృతీయాధ్యాయము

# కర్నూలు జిల్లా వైష్ణవ క్షేత్ర సాహిత్యము

**ఉపోద్ఘాతము**

కర్నూలు జిల్లాలో వైష్ణవాలయములు ఎక్కువగా వెలసినవి కర్నూలు జిల్లాలో దాదాపు రెండు వేల (2000) దేవాలయము లున్నట్లు పరిశీలనలో వెల్లడియైనది మొత్తము పై సంఖ్యలో సగము మించి జిల్లాలో విష్ణ్వాలయము లుండుటచే జిల్లాలో అడుగడుగున విష్ణువు గుడి కలదనవచ్చు

వైష్ణవాలయములలో పెక్కింటికి లఘుకృతులో, బృహత్కృతులో ఆవిర్భవించుట చేత వాని నితరులు సైతము చదివి, దైవాను భూతిని బడసి, తదకు జీవిత పరమావధిని పొందునవకాశమున్నది అసలు ఆలయ చరిత్ర సాహిత్యములోనికి వచ్చినదనగనే తత్ప్రశస్తి వెల్లడి యగుచున్నది దేవాలయము సప్తసంతానాలలో సైత మొకటి యగుట వల్ల, కృతి (సాహిత్యము) కూడ నొకటియగుట వల్ల ఆ రెండింటి (దేవాలయము - కృతి) ప్రాముఖ్యము తెలియుచున్నది

ఇట్టి సాహిత్యము ద్వార చరిత్ర - స్థానిక చరిత్ర కథలు - స్థానిక కథలు - జానపద వాతావరణము - నమ్మకాలు - పూజా విధానములు - నాటి, నేటి భక్తుల నిదర్శనాలు - ఇట్లు ఎన్నో విషయాలు తెలియవచ్చు చున్నవి లేకున్న ఏ గుడి ఎప్పుడు పుట్టినదో - ఎట్లు పుట్టినదో - ప్రేరణ యేమో - ప్రాముఖ్యమేమో తెలియక భక్తులుద్దీపనము చెందునవకాశముండేదిది కాదు జానపద వాతావరణము వల్ల దర్శింప వచ్చిన భక్తులు ఒకరకమైన ప్రశాంతత ఆవరించుచున్నది తద్వారా సాత్త్వికత యలవడి పరిణతి కూడ కలుగు నవకాశమున్నది

అన్నింటిని మించి ఆలయాల ప్రాచీనత, అర్వాచీనతలు, ప్రజలలోని భక్తి ప్రవత్తులు - పడుగు పేకలవలె అల్లుకొని యుండును అవన్నియు సాహిత్యము ద్వారముననే తెలియును ఎఱ్ఱాప్రెగ్గడ వంటివారు అహోబిల స్వామిని వర్ణించి నందు చేత ఆ దేవాలయ ప్రాచీనత, ప్రాధాన్యాలు తెలిసికొన్న భక్తులకు మరింత భక్తి ప్రపత్తులభివృద్ధి చెందును అంతేకాక, వైష్ణవ క్షేత్రాల వాతావరణమంతయు ప్రశాంతముగా నుండుట చేత వచ్చిన వారికి భక్తి ప్రేరణ కలుగును అట్లు

కలిగించుటక్షేత్రాలయుద్దేశాలలో నొకటి సాహిత్యము లందలి ఆయా వర్ణనలను బట్టి ఈ యంశమును నిర్ధారింపవచ్చును అక్కడి కొండలు, కోనలు భూమి వైశాల్యము, విగ్రహస్వరూపము పరివారదేవతలు పుష్కరిణి లేదా నదీతీరము ఓహో! ఒకటేమిటి! ఈ సృష్టిలోని రమణీయకమున కంతయు క్షేత్రమే కేంద్రమ్మై యలరారుచున్నదనుటలో నతిశయోక్తి లేదు

ఈ క్షేత్ర సాహిత్య మంతయు ప్రాచీన కాలములో సందర్భానుసారముగను, అర్వాచీన కాలములో అనివార్యముగను వచ్చినది అదికూడ నేటి కాలములో నధిక భాగము శతక సాహిత్యము; కర్నూలు జిల్లాలోనే కాక ఇతరమ్మైన జిల్లాలలోని దైవ సాహిత్యము కూడ నధిక భాగము శతక సాహిత్యమే ఉదా - శ్రీకాకుళం జిల్లాలోని 'శ్రీకాకుళాంధ్ర దేవ' శతకము (కర్త - కాసుల పురుషోత్తమ కవి) భక్తుల యార్తి ఇచ్చుట ప్రధానముగా కనిపించును పురుషులే కాక మహిళలు గూడ భక్తి రచనలు చేసి, మనశ్శాంతిని పొంది, భావి తరాల వారికొక శాంతి మార్గమును చూపుట విశేషము ఉదా - శేషమాంబ శతక రచయిత్రియగుట

ఆంజనేయ స్వామి పరమ వైష్ణవ కోటికి చెందును కనుక, ఆ స్వామి ఆలయాలు సైతము వైష్ణవ క్షేత్రాల పరిగణనలోనికే తీసికొని, యీ యధ్యాయమున కొక సమగ్రతను కల్పించు ప్రయత్నము చేసితిని వీలైనంత వరకు విశిష్టాద్వైతాంశమును దృష్టిలో నిడికొని ఈ క్షేత్రాల సాహిత్యమును విశిష్టాద్వైతాంశముగా నన్వయించు ప్రయత్నము చేసితిని ఏమైనప్పటికిని, వైష్ణవ క్షేత్రాల సాహిత్యము ఈ జిల్లాకు సంబంధించినంత వరకు, లభించినంతవరకు గ్రహింపబడినది ఒకప్పుడు కర్నూలు జిల్లా పరిధిలో నుండి ప్రస్తుతము ప్రకాశము జిల్లాలో గల ఆలయాలను కూడ గ్రహించి, సాహిత్యాంశములను వివరింపబడినది దీనిని బట్టి దేశములోని వైష్ణవ క్షేత్రాల స్వరూప స్వభావాలను పరిశీలించినట్లే య్యైనది

# ఆదోని డివిజన్

## ఆదోని తాలుకా ఆదోని మండలము.

## రణమండల ఆంజనేయస్వామి,

## ఆదోని

ఆదోని పట్టణము యాదవగిరి పై నెలకొన్న రణమండల ఆంజనేయ స్వామిని గురించి 'హనుమద్వైభవము' అను పేర దేవులపల్లి చెంచు సుబ్బయ్య గ్రంధము రచించెను

శ్రీరాముని పాదములను భజించినందువల్ల స్వామి సుగ్రీవునకన్నను హనుమంతుడు పూజ్యుడయ్యెనని చెప్పిన పద్యమిది

మ॥ హరిపుత్రుండిల నీ ప్రభుండగును, నీవా వానరస్వామికిన్
మరి భృత్యుండవు, మంత్రి సత్తముడ వా మాన్యున్ విభున్ మించి నా
వరయన్ ఖ్యాత్యతఁ బొందినావు, రఘురామాంఘ్రులన్ గొల్చుచున్
సరిగానర్చన లందుచుంటివయ! నీ సద్భక్తియే హేతువౌ! (6)

సుగ్రీవుని నమ్మినబంటు హనుమంతుడు, కాని శ్రీరామపాదసేవా సక్తివలన మారుతి సుగ్రీవుని మించిపోయెను మానవోత్తముడై, ఆదర్శమానవుడైన శ్రీరామచంద్ర దేవుని వలె, ఆలయాలలో కొలువుండి హనుమంతుడు ప్రజలచే పూజింపబడుచున్నాడు

హనుమంతుని స్తుతించువానిలో మన్యుసూక్తము ప్రముఖమైనది మన్యుసూక్తపురుషసూక్తములను పఠింతుననియు, మంత్రపుష్పము హారతి నిత్తుననియు కవి క్రింది పద్యములో పలికెను

చం॥ సురుచిర మారుతీ! పురుషసూక్తము, మంజులమన్యుసూక్తమున్
వరగుణ ! వాయు సంస్తుతిని, వానరవర్య! పఠింతు భక్తితో,
పరమపవిత్ర రూప! సురవందిత! శాస్త్రకళా విశేషముల్
హరి! వినిపించి వచ్చెదను, హారతిఁగొమ్మిక మంత్రపుష్పమున్ (24)

ఇట్లు మన్యుసూక్తాదులతో మారుతిని పూజింతునని కవి పలికినాడు

యాదవగిరిపై ఆలయములేని హనుమంతుని యునికిని చిత్రించిన చిత్రమిది

ఉ॥ ఎండకు నెండుచున్ దడియు చీగిరి వానకు శీతవాతముల్
మెండుగఁ దాకినన్ హనుమ! మేలిమి బంగరు వన్నెతగ్గదే!

కొండల రాయుడా! కొలుతుఁ గోరిన కోర్కెలఁ దీర్చిభక్తులన్
దండిగఁ గావ నిల్చితివి, దండము, లుండుమ యండదండగన్ (44)

ఎండకెండినను, వానకు తడిసినను, గాలి సోకినను స్వామి సువర్ణచ్ఛాయ తగ్గలేదని కవి ఆశ్చర్యపడుచున్నాడు భక్తుల కండదండలిమ్మని అర్థించుచున్నాడు

అచ్చ తెనుగు పదాలతో రంగరించిన పద్యముద్వారా కవి ప్రతిభ తెలియుచున్నది

ఉ॥ రంగుగఁ గొండ నుండువయ! రక్కసి మూకలఁ గూల్చినావయా!
సంగరమందు జాణవయ! చల్లగఁ జూచెడి తండ్రివయ్య! మా
బంగరు కొండవయ్య! పలు వన్నెల వెల్గెడి వేల్పువయ్య! మా
కొండ పసిండివయ్య! నినుఁగొల్చెడి వారికి లోటు లేదయా!

ప్రతి పదము శుద్ధాంధ్రమే మరియు హనుమంతునికు కొంగు పసిండి, బంగారుకొండ - అని కవి ఆంధ్రుల ఇలవేలుపుగా జాతీయాలతో పేర్కొనుట రమ్యము బిందు పూర్వక ప్రాసతో పద్యము సంగీత భరిత నాట్యము గావించు చున్నది 'సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్' అన్న సూక్తిని తలపింపజేయు చున్నది

కవి యింట స్వామి వానరాకారమున కన్పించిన వైనమును 'హనుమద్వైభవము' లో కవి నిబంధించినాడు

మ॥ భవదీయాద్భుత వైభవంబు మది సంభావించుచున్, వ్రాయుచున్
పవమానాత్మజ! భక్తిభావమున నిన్ బ్రార్థించు చుండంగ, వే
గ విచిత్రంబుగ నొక్క యాత్ర ఫలమున్ గైకొంచు నస్మద్గృహం
బవలోకించుచు, వచ్చి చేరితివి భాగ్యంబంచు భావించితిన్ -



రణమండల ఆంజనేయస్వామి

సహజముగా హనుమద్భక్తుడైన దేవులపల్లి స్వామిని స్వగృహము క పద్యరూపమున వర్ణించు సమయమున - మామిడి పండుతో వానరాకారమున కవియింటిలోనికి హనుమత్స్వామి వచ్చి వెళ్ళెనని చెప్పబడినది కవికి స్వామి సాక్షాత్కారము కలదనుట యిందు సూచ్యము

మంత్రాలయం రాఘవేంద్రస్వామి ఈ కొండపై నుండగ ఆదోని నవాబు సిద్ధమసూదుఖాన్ పంపిన మాంసపాత్రను రాఘవేంద్రుడు ఫలములుగా మార్చెనట దీనిని కవి 'యతివర్యుండగు రాఘవేంద్ర' **(66)** పద్యమున నుడివెను

కవి భక్త్యావేశమున శబ్దాలంకార భరితముగా కదనుత్రొక్కించిన పద్యమిది ఇచట 'ఛేకానుప్రాసము' కలదు రెండు హల్లులు జంటగ వెంటవెంటనే వచ్చు అలంకారమది

ఉ॥ మెట్టుల నెక్కియెక్కి, పయిమెల్లగ నిన్నలఁజూచి జూచి యా
పట్టున మ్రొక్కి మ్రొక్కి, మురిపానఁ బదంబులు పాడి పాడి, నీ
చుట్టును తిర్గి తిర్గి, మరిసొంపల రారగ నాడియాడి, నీ
తట్టునె నిల్చి నిల్చి, నిను తల్చుచు కొల్చెదనయ్య మారుతీ!

# ఆలూరు తాలూకా - ఆస్పరి మండలము

# జనార్ధన స్వామి ఆస్పరి

ఆస్పరి మండలకేంద్రమున దివ్యతేజస్సుతో దర్శనమిచ్చు జనార్దన స్వామిపై 'ఆస్పరి జనార్దన స్తుతి' అను పేరుతో దేవుల పల్లి చెంచు సుబ్బయ్య రచించిన స్తోత్రగ్రంథము కలదు

ఆస్తోత్రములో కవి దేవుల పల్లి చెంచు సుబ్బయ్య జనార్దనస్వామిని పర్యాయ పదములతో నిట్లు కీర్తించినాడు

ఉ॥ 'శ్రీరమణీ మనోహరునిఁ, జిన్మయరూపునిఁ, జిద్విలాసునిన్
సారసలోచనున్, గుసుమసాయకు కూరిమి కన్న తండ్రి, దై
త్యారి, వికుంఠధాముని, సురార్చితు, నాద్యుని, భవ్యభక్తమం
దారునిఁ, బద్మనాభు మదిఁ దల్చెద నశ్వపురీజనార్దనా!'

జనార్దన స్వామి లక్ష్మీ మనోహరుండట! జ్ఞానస్వరూపుడట! మానవునకు పార లౌకిక జ్ఞాన మిచ్చుటకు ఈ స్వామి కృప కావలెననుట! లోకముల నన్నిటిని తన పూలబాణములచే పరవశింపజేయు మన్మథునకే కన్న

తండ్రియఁట! విశ్వమోహనుడట! హేయమైన మాంసాదుల భక్షించు తామస ప్రవృత్తి గల రాక్షస సంహారుడఁట। స్వామి వైకుంఠమున నివసించు వాడట! దేవతల చేత పూజింపబడువాడఁట! భక్తజనులకు మందార వృక్షమఁట! భక్తుల లౌకికా లౌకిక వాంఛితములను నెరవేర్చు మహాత్ముడనుట అట్టి జగత్తుల సృష్టించు బ్రహ్మకు నివాసమైన పద్మమును నాభియందుగల పద్మనాభుడఁట! సృష్టికర్తకే తండ్రియైన ఆది పురుషుడనుట! ఇట్లు సాభిప్రాయాలతో ఈ పద్యమును కవి కూర్చినాడు

పర్వదినములలో ఆస్పరి పురము నందు ఉత్సవాలలో నూరేగు స్వామిని వర్ణించినదీ క్రింది పద్యము

మ॥ పురమందుత్సవ వైభవంబుఁ గనుచున్ బుణ్యాత్ములుత్సాహ సం
భరి తాంత కరణంబుతోఁ గొలిచి సంభావ్యంబుగా దేవ! శ్రీ
ధర! అర్చింతురు కాన్కలన్ ఫలములన్ దాంబూల పుష్పాదులన్
వరదా! విష్ణు! జనార్దనా! యనుచు నిన్ బ్రార్థించుచున్ గేశవా!

ఉత్సాహ పూరితమైన మానసములతో ఆస్పరీ పుర ప్రజలు విగ్రహ రూపమున నున్న స్వామి నర్చింతురఁట! స్వామి దర్శన మాత్రముననే వారు పుణ్యాత్ము లైరఁట! కానుకలు, పండ్లు తాంబూలాలు, పుష్పాలు ఇత్యాదులను స్వామికి సమర్పింతురఁట! స్వామి నిట్లర్చించి, అశ్వపురీజనులు తాము లౌకికాలౌకిక వాంఛితములను తీర్చుమని ప్రార్థింతురఁట!

ఇట్లు చక్కని భక్తి, వేదాంత భావ భరితముగా స్వామిని స్తుతించిన కవి దేవులపల్లి ప్రశంసనీయుడు



జనార్ధన స్వామి,
ఆస్పరి

# ఎమ్మిగనూరు తాలూకా. మండలము.
# వేంకటేశ్వర స్వామి దైవందిన్నె.

ఎమ్మిగనూరు మండలము దైవందిన్నెలో వెలసిన వేంకటేశ్వర స్వామిపై అశేష సాహిత్యము లభించినది చెన్నారెడ్డి కవి వ్రాసిన 'దైవము దిన్నె వేంకటేశ్వర శతకము' ఆ పరంపరలో ఒకటి ఆయన జీవాత్మ పరమాత్మ తత్త్వమును చక్కని శైలిలో వర్ణించినాడు

చం॥ భవనమునందు రాజువలెఁ బంజర మందు శుకంబువోలె, గౌ
రవముగఁ బేటికన్ రుచిర రత్నము చాడ్పున గాజు కుప్పెలో
దివియ గతిన్ శరీరమున దీపితుడై పరుడై , ప్రశస్తుడై
తవిలి వెలుంగు నాత్మ హరి - దైవము దిన్నియ వేంకటేశ్వరా!

జీవాత్మను దేదీప్యమానముగ ప్రకాశింపజేయునది పరమాత్మయని కవి చెప్పుచున్నాడు భవనము నందు రాజు వలె పంజరము నందు చిలుకవలె, పెట్టెలో రత్నమువలె గాజు కుప్పెలో దీపమువలె శరీరము నందు పరమాత్మ ప్రశస్తముగా వెలుగునని అర్థము

విశిష్టాద్వైత పరముగ నిజమునకు పరమాత్మ నివాసము జీవుల హృదయమందే కలదు ఈ సత్యమును కవి మనోహరముగా నుపమించుచు, వివరించినాడు దైవము సర్వ వ్యాపి కనుక హృదయము లందును విలసిల్లు చున్నాడు

'దైవం దిన్నె వేంకటేశ్వరుడు' అను శీర్షికతో దీపాల పిచ్చయ్య శాస్త్రి చెప్పిన పద్యములలో నొకటి తిరుమల కాపురమును వదలిపెట్టి, దైవము దిన్నెకు వేంకటేశ్వర స్వామి తరలి వచ్చుటను చమత్కారముగా కవి ఇట్లు చెప్పెను

సీ॥ పదిమందిలో పచ్చపచ్చగ నుండక
కొండలఁ బడియుండుకొదువ తీఱ
కడు బీదనని మొఱ్ఱలిడిన పీడక నెత్తి
బొచ్చుయినఁ గొనుసన్న మచ్చుమాయఁ
గొఱిగించి చెప్పుతోఁ గొట్టించి నా మమ్ము
దిద్దించు నను నప్రతిష్ఠ పోవ
లోక మచ్చెరువంద లోభియై వడ్డికా
సులఁ గూర్చు నన్నట్టి కొల తొలంగ

తే॥గీ॥ తిరుపతిన గంబు నందుఁ గాపురము మాని
ప్రీతి నేటికి నిందుఁ జేరితి వటోయి

శ్రీ యువతి వెంటఁ గొని, రామ రాయచిత్త
శరణ! జగదీశ! వేంకటేశ్వర! నమోస్తు

తిరుమలకు వెళ్ళు భక్తులు వెంట్రుకలిచ్చుట ఆనవాయితీ కవి దానిని చమత్కరించెను చాల బీదవాడనని మొత్తుకొన్నను తలపై వెంట్రుకల నూడ్చువాడనుచున్నాడు కవి స్వామికి వడ్డీ కాసులను భక్తులు చెల్లింతురు దానిని ప్రజలు ఆశ్చర్యపడునట్లు పిసినారియై వడ్డికాసులను గ్రహించునని కవి చమత్కరించినాడు ఇట్లు అపప్రథలు తొలగునట్లు - తిరుపతి కాపురమును వదలిపెట్టి లక్ష్మీదేవితో కలిసి రామిరెడ్డికి సంతోషము కలుగునట్లు వచ్చితివను చున్నాడు

రోహిణికుమార్ రచించిన 'దైవందిన్నె శ్రీవేంకటేశ్వర స్తోత్రము మరియు సుప్రభాతము' లో స్వామి స్తుతి కలదు స్వామి స్వరూప వర్ణన కలది క్రింది పద్యము

సీ॥ రిపుసంఘ గర్వ నిర్భేదణ దము నించు
శంఖంబు వామ హస్తాన వెలుగ
ఖండితాసుర మస్తకము చక్రరాజము
వలకేల పరివేషముల జెలంగ
త్రిదశాభయద, సర్వ దీన రక్షాప్రద
గదయును నొకచేత బొదలుచుండ
లోకరక్షణ దీక్షలో మున్గు నొక చేత
సంత తాభయ దివ్య సంజ్ఞగలుగ
తే॥గీ॥ కరుణ జగములఁ బాలించు కన్నతండ్రి,
కలుష హరణాభిధేయ! ఓంకారరూప!
దీనబాంధవ! దైవముదిన్నె వాస!
త్రాహి! పద్మావతీ సేవితాంఘ్రి యుగళ!

స్వామి చతుర్భుజ వర్ణనము ఎంత మనోహరమో! శత్రుమూకల గర్వములను భేదించు శంఖము ఎడమ చేతిలో నున్నదట! శత్రు శిరములను ఛేదించు చక్రము కుడి చేత కలదట! దేవతల కభయ మిచ్చుచు దీనజనులను రక్షించు గద మరొకచేత కలదట! లోకమును రక్షించు దీక్షను సూచించుటకై మరొక చేత అభయ హస్తము కలదట! ఈ యూహలెంత చక్కనివో గదా!

స్తోత్ర పద్యములు 11 సీసములలో వ్రాసిన కవి- 15 మేలుకొలుపు గేయాలను కూడ వ్రాసినాడు

నక్షత్రాలు వాయువై, సూర్యోదయమగుటను కవి ఇట్లు ఊహించినాడు

''తంబురలఁ జే పట్టి తలపైని పాత్రలిడి
తుంబుర స్వరముతో నామ కీర్తనల
బాడుచున్ దైవంపు దిన్నె దాసరులెల్ల
వాడల న్నీకీర్తిని వల్లించుచున్నారు'' ॥మేలుకో॥

తంబుర లను చేత బట్టుకొని, తలపై పాత్రలను పెట్టుకొని, స్వరాను గుణముగా స్వామి నామ కీర్తనలను దైవపు దిన్నె దాసరులు పాడుచున్నారట! దాసరుల స్వరూపమిచట చక్కగ చిత్రింపబడినది

అవధానం వేంకటరమణ మూర్తి రచించిన వేంకటేశ్వర దండకములో కొంత భాగము

'శ్రీదేవి భూదేవి సేవింప నిర్వంకలన్ జెన్ను మిన్నందగా భూరి వైభోగ మొప్పంగ నీధారుణిన్, మానవాళిన్, గటాక్షింపగాఁబూని వేదాది వాదంబులన్ గాని, తర్కాది శాస్త్రంబులన్ గాని, నీ దివ్య తేజస్సు వైకుంఠమున్ వీడి, శేషాద్రిపైఁజేరి, అందుం దిరం బొందగ మానసం బొప్పకే దైవపుం దిన్నెలోఁ జేరి, నీబిద్దెలాసంబులున్ జూపు చున్నట్టి యో దేవ! ------ శ్రీశ! శ్రీ వేంకటేశ! దిగంత ప్రకాశ! మహామోహనాశ! భవద్ధ్వాంత దుర్దాంత భానుప్రకాశ! నమస్తే నమస్తే నమః'

ప్రసిద్ధమైన ఆంజనేయ దండకము 'శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం' వలె సాగిన రచన యిది చివరి సమాసము రమ్యము చివరి నాలుగు సమాసములు తాళ భరితములు

## పత్తికొండ తాలుకా॥ దేవనకొండ మండలము
# కౌలుట్ల చెన్నకేశవ స్వామి
## పెద్దకోటకొండ

దేవనకొండ మండలములోని పెద్దకోట కొండకు సమీపమున కొండలలో వెలసిన కౌలుట్ల చెన్నకేశవ స్వామిపై డోన్ రామచంద్రరావు 'కౌలుట్ల చెన్నకేశవ శతకము' ను రచించినాడు ఈ క్షేత్రము కౌలుట్ల పేరుతో ప్రసిద్ధమైనది అందుకు కారణము ఈ క్రింది పద్యమున చెప్పబడినది

కం॥ ఐపోయె నీలో లీనము
గోపాలకుడైన యర్ర గొల్లడు కౌలు
ట్లీ పడసెను మోక్షంబును ॥ కాపాడుము॥ (81)

కౌలుట్లయను భక్తుడు గొల్లవాడు స్వామిని సేవించి మోక్షమును పొందెనను విషయము ఈ సిద్ధాంత వ్యాసము ద్వితీయ భాగమున వివరింప బడినది ఇతని వలననే నేడు స్వామి కౌలుట్ల చెన్నకేశవునిగా పిలువబడు చున్నాడు మోక్షప్రాప్తికి కులమక్కర లేదనుచు ప్రతి ప్రాణియు పరమేశ్వరాంశ స్వరూపమే కనుక ఎవరు కూడ తాము తక్కువ వారమని, తక్కువ కులము వారమని భావింపరాదు ఎందుకనగా తన మూలాంశము సాక్షాత్పరమాత్మయే కులమత జాత్యాది భేదములన్నియు కేవలము మానవ కల్పితములే

స్వామిని ధ్యానింపక కాలము వ్యర్థమైనదని బాధతో నీ పద్యమును కవి పలికెను

కం॥ పాపాంధకారమున సం
తాపంబొందితిని నిన్నుఁ దలపక యేండ్లె
న్నో పోయిన విల దేవా!
కాపాడుము మమ్ము శౌరి! కౌలుట్లహరీ! (34)

పాపమును చీకటితో పోల్చుచు అందులో మునిగి తాపమొందితినని యిట్లు సంవత్సరాల కాలము వ్యర్థమైనదని తన బాధను కవి వ్యక్తీకరించెను

పెద్దకోటపాడు గ్రామములో పుట్టి, కర్నూలులో స్థిరపడిన ధరణి రామ చంద్రరావు రచించిన 'శ్రీ కౌలుట్ల చెన్నకేశవ స్వామి మాహాత్మ్యము' కలదు ప్రతిష్ఠ విశేషాల తర్వాత, ఈ వృత్తములో పారుపేట పద్యములు కలవు

పరాంగనా సురతమున స్వరూపము మారిన విష్ణువును లక్ష్మీదేవి నిరసించుటయు, దానిని కప్పిపుచ్చుచు విష్ణువు సమాధానమిచ్చుటయు నిందలి ఇతివృత్తము ముఖమున కాటుక యంటినది కారణమేమని లక్ష్మీదేవి పలుకగా-

కం॥ చెలియా! కస్తురి తిలకము
అల చెమటున జారియుండ నల శాలువచే
సొలమి తడి యొత్తినాడను,
యిల కాటుక గాదు వినవె యింతిరొలక్ష్మి! (21)

అని స్వామి సమాధానమిచ్చెను తానునొసటికి పూసుకొన్న కస్తూరి తిలకము చెమటుకు జారిపోగా, మీదనున్న శాలువతో నొత్తితి ననియు కనుక నీకట్లు కనిపించినదే కాని ముఖమునకున్నది అన్యవనితా సంగతిచే నంటిన కాటుక కాదని స్వామి సమాధాన మిచ్చెను భగవద్రతిని ఆలంకారికులు రసాభాసముగా గాక రసముగానే పలికిరి రతి మానవ గతము కాకపోవుటయే భగవద్విషయములో రతి సమస్థాయిలోనే యుండును విష్ణువునకు లక్ష్మియైన చెంచువనిత యైన సమానమైన ప్రేమను పంచెనే తప్ప హెచ్చు తగ్గులకు గురికాలేదు ఈ పారుపేట పద్యముల రచయిత లంజపోలూరు యల్లకవి

'శ్రీ కౌలుట్ల చెన్నకేశవ స్వామి మేలుకొలుపు' అను పేరుతో అందలం జీవయ్య రచించిన లఘు రచన మరొక్కటి కలదు

''చెన్నకేశవ! మేలుకో శేషశయనా! మేలుకో (1)
మేలుకో జనమే జయార్చిత మేలుకో జలజాలయాధిప!
మేలుకో కౌండిన్య పూజిత కౌలుట్ల కేశవ మేలుకో (2)
పక్షి గణములు కూయసాగెను పక్షినాథుడు వచ్చిపేడెను
అక్షి ద్వయమును తెరచిలోకము రక్ష చేయగ మేలుకో (6)
గోప బాలకులెల్ల వచ్చిరి గోపికలు మిముచూడవచ్చిరి
గోగణంబులు వచ్చి నిలిచెను గోపబాలక! మేలుకో'' (10)

పైగేయము నందు శేష శయనుడు, కౌలుట్ల రంగడను పేరుగల వాడును, కాంచన వస్త్ర ధారియును ఐన చెన్నకేశవుని కవి మేల్కొలుపు చున్నాడు జనమే జయునిచే పూజింపబడినవాడు, కౌండిన్య మహర్షిచేత పూజింపబడిన వాడు, లక్ష్మీ నాథుడైన కేశవుని కవి మేల్కొలిపెను పక్షులతో బాటు విష్ణువు వాహనమగుటచే గరుత్మంతుడు సైతము వచ్చి నిలబడెనని, కనులు తెరచి లోకమును రక్షించుమని కవికోరెను గోపగోపికా, గోగణములు వచ్చి నిలబడెను లెమ్మని కవికోరెను తేట తెలుగు పదాలతో కూడిన గేయమిది



కౌలుట్ల చెన్నకేశవ స్వామి

## పత్తికొండ తాలూకా
## మద్దికెర మండలము
### రంగనాథస్వామి, పెరవలి.

కర్నూలు జిల్లా కంభం తాలూకా గుండువారపుర (బేస్తవారిపేట) వాస్తవ్యులు సకల రంగ నిష్ణాతులైన సేపూరి యల్లమందయ్య రచించిన 'శ్రీ రంగనాథ స్వామి వారి పెరవలి మహాక్షేత్ర పురాణము' అను పేర స్వామి స్థల పురాణము లభించు చున్నది స్వామిపై స్తుతి పద్యములిందు లేవు

కపిల మహర్షి దక్షిణ భారతదేశమును సంచరించుచు, ఆయా ఆశ్రమములందు ఇష్టదేవతా విగ్రహములను ప్రతిష్ఠించుచు, దండ కారణ్యమును చేరెను ఆ క్రమములో ప్రస్తుతము రంగనాథాలయము గల చోట ఒక శుద్ధ ఏకాదశి చిత్తానక్షత్ర యుక్త బ్రహ్మ ముహూర్తమున కపిలుడు రంగనాథ సాలగ్రామమును ప్రతిష్ఠించెను

టిప్పు సుల్తాను సైతము తన ప్రభుత్వములో స్వామి వారి అర్చకులకు పరిచారకులకు మిరాసులు పూర్వము వలె నడిపించుటకు - దేవుని ఉత్సవాలు పూర్వమువలె జరుపుటకు ఏర్పాట్లు చేసినాడు

ఈ ఆలయము, పావన పుణ్యక్షేత్రమని రచయిత పలికెను ఆగమాచార ప్రకార ముండవలసిన బలిపీఠములు ఈ ఆలయమున కలవు ఈ క్షేత్రమున ఆండాళ్, నమ్మాళ్వారులు కలరు ధ్రువ - ఉత్సవ - స్నపన - బలిబేరములు అను నాలుగు ఇచట కలవు



రంగనాథస్వామి, పెరవలి.

# కర్నూలు డివిజన్
## ఆత్మకూరు తాలూకా వెలుగోడు మండలం
## చెన్నకేశవ స్వామి, వెలుగోడు.

వెలుగోడు మండల కేంద్రమున వెలసిన చెన్నకేశవ స్వామి పై అన్నమాచార్యులు కీర్తించిన కీర్తనలు లభించినవి

"కేవల కృష్ణావతార కేశవా
దేవదేవ లోకనాథ దివ్య దేహకేశవా
కింకర బ్రహ్మాది గణకేశవా
కుంకుమాంశ కళ వెలుగోటికేశవా సర్వ
శంకాహర నమోజగదేక కేశవా" (11-1-96)

అని చెన్నకేశవుని అన్నమయ్య కేవల కృష్ణావతారముగా వర్ణించినాడు దివ్య దేహ విరాజితుడనియు, బ్రహ్మాది దేవతలు కింకరులుగా సేవింపబడు వాడనియు చెన్నకేశవుని కీర్తించుట జరిగినది ఈ సంకీర్తనలో వెంకటాద్రి అనియు కలదు అంతలోనే చెన్నకేశవునిలో వేంకటశైల నిలయుడగు వేంకటేశ్వర స్వామియు గోచరించెనేమో ! మరొక కీర్తన -



చెన్నకేశవ స్వామి వెలుగోడు (సిద్ధాంత కర్త అర్చకునితో)



అష్ట దిక్పాలకుల మధ్య శివపార్వతులు



దేవాలయ గోపురం

'కిరణార్క కోటి తేజకేశవా!
హరి లక్ష్మీనాయక యాదికేశవా!
గిరిరాజ సుత (తా) నుతకేశవసమో
శరధి గంభీరశాయి జయ జయ కేశవా
కేకి పింఛావ తంస కేశవా
శ్రీకర గుణాభిరామ చెన్నకేశవ
కేక (కి) వాహన వరద కేశవ
పాకశాసన వంద్య భళిభళికేశవా!'

కోటి సూర్యకిరణాలతో సమానమైన తేజస్సు గల వానిగా చెన్నకేశవుని అన్నమయ్య యిటు కీర్తించెను నిజముగా ఈ స్వామి ఇటు ఆకర్షణీయ విగ్రహము పార్వతీనుతులందు కొన్నవాడనియు, పాలకడలిని శయనించు వాడనియు, నెమలి పింఛమును ధరించిన వాడనియు, సకల సద్గుణాభిరాముడనియు దేవరాజు చేత స్తుతింపబడు వాడని కేశవుని వర్ణించి, అన్నమయ్య భళి భళియని కీర్తనను ముగించినాడు

## కర్నూలు తాలూకా, కర్నూలు మండలము
## సత్యనారాయణ స్వామి,
## కర్నూలు

కర్నూలు నగరములో వెలసిన సత్యనారాయణ స్వామి ఆలయమును కలకత్తా బిర్లా గన శ్యామ దాసు నిర్మించెను ఆ స్వామి పై మద్దుల పల్లి పేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి సుప్రభాతమును రచించెను ఇందు 58 శ్లోకములు కలవు

ప్రకృతిలోని లతలు, చెట్లు స్వామిని సేవించుటకై సిద్ధముగా నున్నవని ప్రాతః కాలమైనదని లెమ్మనుచు కవి స్వామిని ప్రార్థించు చున్నాడు

'శాఖా బాహుభి రంజలీకృత దళశ్రేణీ కరశ్రేణిభిః
నానాసూన సుగన్ధ బన్ధుర సుమాన్యాదాయ వల్లీద్రుమాః
పూజార్థం తవ కల్పయన్తి భగవం! ద్భ్రి సత్య నారాయణ
స్వామిన్! జాగృహి జాగృహీహ రజనీ నిర్యాత్యుషోఽభ్యేతిచ (9)

పూలతీగలు, పూలచెట్లు అనేక సుగంధ పూరిత పుష్పములను, శాఖలనెడి బాహువులతో - ఆకులనెడి అంజలి బంధముతో నీ పూజకొరకై పట్టుకొని యున్నవి కనుక నిద్ర మేల్కొనుము ప్రాతః కాలమగుచున్నది లెమ్మని కవి

పై శ్లోకములో పలుకుచున్నాడు ఇట్లు ప్రకృతి స్వామికి స్వాగతించు చున్నదని వాని అవయవములను బాహువులతో, దోసిళ్ళతో రూపించు చున్నాడు

క్రియతో ప్రారంభించి, మూడు పాదాలలో మూడు వాక్యాలు చెప్పిన ఈ శ్లోకమును కాంచుడు

'నమామి తే దివ్య పదాంబుజ ద్వయం
పిబామి తే నామ కథా సుధారసం
స్మరామి తే దివ్య చరిత్ర చిత్రణం
సమాదరా త్వత్యవిభో! ప్రసీదమే! **(43)**

తాళబద్ధముగ సాగిన శ్లోకమిది స్వామి పాద పద్మాలకు నమస్కరించు చున్నాననియు, స్వామి నామామృత సుధా రసమును త్రాగు చున్నాననియు, స్వామి దివ్య చరిత్రను స్మరించు చున్నాననియు కవి మూడు వాక్యాలలో పలికినాడు నమామి - పిబామి - స్మరామి అనునవి ఆ మూడు క్రియలు ప్రసన్నుడువు కమ్మని చివరి పాదమున కవి పలుకు చున్నాడు

మంగళా శాసనము నుండి ఒక శ్లోకము

'నిర్మోహాయ నిరీహాయ , నిర్గుణాయ గుణాత్మనే
నిత్యాయ నిరవద్యాయ , సత్యదేవాయ మంగళం' **(55)**

సత్యనారాయణ స్వామి మోహరహితుడు, కోరికలు లేనివాడు, సత్త్వాది వికారాలు లేని వాడు, భక్తోద్ధరణకై సగుణ స్వరూపుడు శాశ్వతుడు, నిత్య శుద్ధుడు ఆ స్వామికి మంగళము కలుగ వలెనని కవి కోరినాడు

ఈ అధ్యాయములో శ్లోక పూరిత గ్రంథమును గూర్చి వ్రాసిన ఆలయ సాహిత్యమిదొక్కటే నంద్యాలలో పూర్వము పేరు మోసిన సంస్కృతాంధ్ర పండితుడీతడు

# కోడుమూరు మండలము
# మాధవ స్వామి, గోరంట్ల

కోడుమూరు మండల కేంద్రమునకు సమీపమున గల గోరంట్ల గ్రామమున హంద్రీ నదీ తీరమున మాధవ స్వామి భక్తుల కొంగు బంగారమై దర్శన మిచ్చు చున్నాడు

ఈ స్వామికి సంబంధించి బాణాల వీర శరభేంద్ర కృత శృంగార పద్య శతకము, అజ్ఞాత కర్తృకమైన మాధవాష్టకము మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాల యములోని తాళపత్ర గ్రంథములలో కనిపించు చున్నవని వైద్యం వేంకటేశ్వరా చార్యులు శ్రీ మాధవ గానామృత పుస్తకాదిలో 'అభినందన' యందు తెలిపెను

స్వామిని ప్రేమించిన యొక నాయిక చెలిచే రాయబారమంపిన యితి వృత్తము గల పద్యమిది

సీ ॥ నడిచి రావడములో నొడిసి నాకు చంబుల c
బొడిచి యొక్కడగు నక్కడికి మలుపు,
మడుపు లందడములో మిడుత కైవడి నన్ను
మిడిసి పైబడి యొడంబడిక c జెప్పు,
కడగి నా విడిదిలోc బడుకుని నన్ను న
క్కడికి మూడడుగులు నడుపుమనుచు
కడకు నా పట్టు పచ్చడములో దూరి యో
పడుచ! యప్పుడు విడెంబడుగునమ్మ!

తే॥ గీ॥ బడిసి యటు వంటి చిచ్చుల పిడుగు పడుచు -
దుడుకు నడవడి సుడిబడి యడుగ సాగె
మగువ నీవేగి గోరంట్ల మాధవుణ్ణి
తోడుకుని వేగ రావమ్మ! తోయజాక్షి!

నడిచివచ్చునప్పుడు, మడుపు లందించునపుడు ప్రియుడు తనను వేధించిన విధానమును, తన నివాసమునకు వచ్చి తన వస్త్రములోనికి దూరి మాటాడిన విధమును తెలుపుచు ప్రేయసి - పిడుగు వంటి దుడుకు గల గోరంట్ల మాధవుని పిలుచుకొని రమ్మని చెలికత్తెను పంపిన విధాన మిందు వర్ణించబడినది **The Telugu Manuscripts volume VII - Sathakas - Madras No 1545** నుండి పై పద్యము సేకరించబడినది

బొబ్బిలి వేంకటరమణ మూర్తి, లంజ పోలూరు యెల్లకవి 19 వ శ॥ వారు వారు రచించిన అముద్రిత రచనలు నేడలభ్యము చారిత్రక, సాంస్కృతిక, సాహిత్య విశేషాలు గల గోరంట్ల మాధవుని గురించి చి॥ మధుసూదనాచార్యులు రచించిన పొత్తము 'శ్రీ మాధవ గానామృతము'

ఉదాత్త సాహితీ లక్షణములు లేకపోయినను, పద్యగేయ రచన గల పై పుస్తకము నుండి కొన్ని భక్తి కవితలు క్రింద చెప్పబడును

ఈ యువకవి రచించిన 40 పద్యాలలో స్వామి స్వరూపము వర్ణించబడినది

తే॥ గీ॥ శ్రీమహాలక్ష్మి నీ పాద సేవc జేయ
కౌస్తుభము నీదు వక్షాన కాంతి మెఱయ
శంఖ చక్రాలు హస్తాల సమత వెలయ
మమ్ము పాలించు గోరంట్ల మాధవుండు (పేజి -1 - పద్యం-1)

వక్షః స్థలమందు కౌస్తుభ రత్నమును, హస్తములందు శంఖ చక్రములను కల్గి, లక్ష్మీసేవలందు కొనుచున్న గోరంట్ల మాధవ స్వామి మనలను రక్షించునని పై పద్యార్థము

ఆపై సినిమా పాటల రీతిలో ఈ బాలకవి 24 గేయాలు వ్రాసినాడు అందొక్కటి, 'కొండలలో నెలకొన్న కోనేటి రాయడువాడు' అను అన్నమయ్య కీర్తన 'అల్లరి మొగుడు సినిమా' లో సైతము కలదు ఆ రీతిలో వ్రాయబడినదిది

చ ॥ గోపురము నెలకొన్న గోరంట్ల స్వాముల వారు
కోర్కె తోడి మమ్మలరింప రావా దేవులవారు ॥ గోపురము ॥
గోరంట్ల వాసుడైన శ్రీ మాధవ లక్ష్మీదేవ
యిమ్మన్న వరము లన్ని ఇచ్చిన దేవ
ద్వారమున నిలిచిన యట్టి ద్వార పాలకుల నిరువురి
కరుణతో కరుణించి కాపాడిన దేవ! ॥ గోపురము ॥

(పేజి-14 - గేయము-06)

ఈ పుస్తకమునకు మొదట వైద్యం వేంకటేశ్వరాచార్య విరచితమైన మాధవ సుప్రభాతము కలదు ఆశ్లోకములు ధారాశుద్ధితో సాగినవి

శ్లో ॥ శ్రీగోరువంక మునిరత్న నివాస భాస్వత్
దివ్యాశ్రయాశ్రిత! విశుద్ధ సమిద్ధకీర్తే!
ఐంద్రావతీ తట విరాజిత దివ్యమూర్తే!
గోరంట్ల మాధవ విభో! తవసుప్రభాతమ్! (4)

పూర్వము గోరువంక మహాముని నివసించిన గోరంట్లలో వెలసిన వాడనియు, కీర్తిమంతుడనియు, హంద్రీ నదీ తీరమున వెలసిన వాడనియు, గోరంట్ల మాధవుని కీర్తించుచు వైద్యం స్వామికి మేలుకొలుపును పలికినాడు



మాదవ స్వామి, గోరంట్ల

# డోన్ తాలూకా, డోన్ మండలము

# చెన్నకేశవ స్వామి, గుండాల గ్రామము

డోన్ మండలము సరిహద్దులో గల గుండాల చెన్నకేశవ స్వామిపై నొక యజ్ఞాత కవి వెలువరించిన శతకము నందు 51 పద్యములు మాత్రమే లో నున్నట్లు తెలియ వచ్చినది ఈ శతకము నందలి శైలికొక ఉదా -

శా ॥ దండం బంబుధి కన్యకా ధవునకున్, దైత్యారికిన్, శౌరికిన్
దండం బర్భగ రాజవాహనునకున్, దాక్షాయణీ శస్తుతా
ఖండ ప్రాభవ శాలికిన్, సకల లోక స్వామికిన్ నీ కహో
గుండాలాధి ప చెన్నకేశవ! హరీ! గోవర్ధనోద్ధారకా!

కృష్ణరాయల కాలమునాటి ప్రబంధశైలిని బోలిన పై పద్యమున కేశవునికి కవి వందనమర్పించెను అతడు లక్ష్మీ ప్రియుడట! దానవ వైరియట! పక్షిరాజ వాహనుడట! పరమేశ్వరునిచేతనే స్తుతింపబడునట! సకల లోకాలకు ప్రభువట!

దర్శన మాత్రముననే తాను ధన్యుడైతినని క్రింది పద్యమున తెలిపెను ఆదర్శన దినము తనకు పుణ్యదినమట!

శా ॥ మండాటంబిక నన్య దైవములతో మాకేల చాలుం బ్రప
న్నుండన్ నేనిను c జూచినన్ దిరుపతుల్ నూటెన్మిదింజొచ్చిన
ట్లుండున్ నేc డెటు వంటి పుణ్యదివ సంబో యెంత ధన్యుండనో
గుండాలాధిప !

అన్య దేవతలను సేవించననియు, శరణాగతిని కోరుదుననియు, స్వామి దర్శనమున 108 తిరుపతులలోని విష్ణు దేవతలను దర్శించినంత సంతోష పుణ్యములు లభించెననియు కవి పై పద్యమున తెలిపెను



చెన్నకేశవ స్వామి ఆలయము, గుండాల

# డోన్ మండలము
# ఆంజనేయ స్వామి, డోన్

ద్రోణాచలము మండల కేంద్రమున వెలసిన ఆంజనేయ స్వామిపై యవాది డోన్ రామచంద్ర రావు 'శ్రీ ద్రోణాద్రి పవనకుమార శతకము' రచించినాడు

'ణాచలనామ సార్థక్యము -

॥ తొలి ద్రోణాచార్యుండిట,
వెలసెను దపమూని హరిని వీక్షించెననన్
గలదు ప్రతీతి మహిమయుఃత్రు,
ఐలె నిల ద్రోణాద్రినాగ - పవనకుమారా!(4)

పూర్వము ద్రోణాచార్యులిట తపము చేసి శ్రీహరిని ప్రత్యక్షము ంకొనెనందురు కనుకనే ద్రోణాచలమను పేరు పట్టణమునకు వచ్చెనని దాని నామౌచిత్యమును పలికెను

కంద పద్యము పరిధిలో చిన్నదైనను, భక్తిని దానిలో కవి రంగరించెను మతల వీడక, ధ్యానము చేయుట వ్యర్థమనుచు కవి దానికొక నిదర్శన మిచ్చు న్నాడు కించిత్తు విషము గల్గినచో ఆవుపాలు త్రాగుటకు పనికి రావని పలుకు న్నాడు

॥ ధ్యానంబు మంచిదైనను, మానునుఫలమీక మమత మానకయున్నన్
ధేను క్షీరము మానవ, పానార్హమె విషము గల్గ పవనకుమారా! (10)

క్కడ ధేను క్షీరము దృశ్యాసక్తిని తెలుపు చున్నది

వాయుదేవుని అవతారాలు మూడని కవి క్రింది పద్యమున తెలిపెను

॥ 'వరుస హనుమంతుడు వృకో,
దరుండు - మధ్వమునిగ నవతారంబులతో
హరిపదము గొల్చినాడవు
వరజీవోత్తమ! మహాత్మ! పవనకుమారా! (92)

ద్వైతము చెప్పిన వాయుదేవుని అవతారాలను కవి హనుమంతుడు, ముడు, మధ్వాచార్యులని మూడింటిగా చెప్పినాడు

క్రింది పద్యమున గహనమైన వేదాంతము మృదు మధురముగా ప్పబడినది

కం॥ 'పురుషోత్తముని గుణమ్ముల
గురుతింతురు యోగ్యతాను గుణముగ నరులున్
తరగని యేటి జలంబును
బరిమితితో నించు ఘటము, పవనకుమారా! (21)

ప్రజలు వారివారి యోగ్యతను బట్టియే శ్రీహరిని దర్శింతురట! కుండల పరిమాణమును బట్టియే నదీ ప్రవాహములోని నీటిని నించుకొనుటకు వీలగునని కవి పై వాక్యమున సమర్థించినాడు అనగా వ్యక్తి మానసిక పరిపక్వతను బట్టియే స్వామిని దర్శింప వీలగుననుట సారాంశము ఈ అంశము 'అణోర ణీయాన్ మహతో మహీయాన్' (అణువులో పరమాణువు, మహా పదార్థములో పదార్థము) అను వేదోక్తిని పై పద్యము స్ఫురణకు దెచ్చు చున్నది

కం॥ 'నీవే గురుడవు తండ్రివి, జీవస్తోమంబు నందు శ్రేష్ఠుడ వీవే
దేవా! నిన్నే గొల్తును, భావి విధాతా! మహాత్మ! పవనకుమారా! (79)

ఇచ్చట కవి హనుమంతుని దైవముగానే కాక, తండ్రిగా గురువుగాతన ఐహికాముష్మిక భారమంతయు మారుతిపైనే వేయుచున్నాడు అతడు జీవులం దరిలో శ్రేష్ఠుడట! రాబోవు కల్పమున హనుమంతుడు బ్రహ్మ యగునను పెద్దలమాటను గుర్తుచేయుచున్నాడు! ఇట్లు ఈ శతకమున కవి చిన్న కంద పద్యాలలో హనుమంతుని ప్రశంసించుచునే మేరువంత యర్థము నిమిడించినాడు

## బేతంచెర్ల మండలము

## శ్రీ వేణుగోపాల స్వామి, ఎంబాయి

బేతంచెర్ల మండలములో ఎంబాయి గ్రామమునకు ఒక కి మీ దూరమున భోగేశ్వర క్షేత్రమున వేణుగోపాల స్వామి వెలసియున్నాడు ఈ శతక కర్త వేంకటరమణ మూర్తి (సిద్ధాంత కర్త)

**స్వామి పరిసరాల వర్ణన** - స్వామి ఆలయము క్రింద నుండి పుట్టిన నీటి బుగ్గ, అటనుండి కాలువగ పారుట విచిత్రవము దానినిట్లు కవి చమత్కరించినాడు

తే గీ॥ గంగ చంచలమై గుణ భంగమొందె
కాని, నీదు మూపునఁ బుట్టి కదలునట్టి
జల ప్రవాహ మొందె సకల సన్నుతలను
వేణు గోపాల దేవ! యో వేదవేద్య! (6)

•శమున బుట్టిన గంగ శంభుని శిరస్సుపైకి, ఆపై హిమాలయములకు
ంపైకి వచ్చిన అది ' వివేక భ్రష్ట సంపాతముల్ ' అని సుభాషితాలలో
కాని స్వామి క్రిందఁ బుట్టిన నీటి బుగ్గ మధురధారతో
గారి యైనదని చెప్పబడినది

,మి ఆలయమున కన్ని వైపుల మామిడి తోటలు గలవు ఇప్పటికిని
,లో ' ఎంబాయి మామిడి పండ్లు' అను ప్రసిద్ధి కలదు వాని ప్రశస్తిని
ంచినాడు

మృతముఁ బరిహసించెడి యమృత మాది
సహిత రసాలములు నీ పరివృతమయి
ర్గమును వెక్కిరించు నీ ప్రాంతమెపుడు ॥వేఙు॥ (7)

ర్గమునందలి అమృతమును పరిహసించు మామిడి పండ్ల తోటలు
ు కలవని చెప్పబడెను ఈ ప్రాంతము స్వర్గమును పరిహసించు
•రణమున్నది మామిడి పండ్లలో 'అమృతము' అన్నది యొక
మృతము', 'ఖేనీషా', రెడ్డిపసందు, మలగూబ, తీతర – ఇచ్చటి
మిడి పండ్లు అమృతము మొదలు మామిడి పండ్లిచట నున్నవి
,తమున్న స్వర్గలోకమును ఈ ప్రాంతము వెక్కిరించుననుట
ు సార్థకము

ంప దశావతార వర్ణనాదికము, స్వామి సంస్తుతి, విష్ణునామాల
। పద్యాల వరకు చెప్పబడినది 51 నుండి 98 పద్యాల వరకు
కముగు నీతులు గల పద్యములు గలవు

ానసంబన మిక్కిలి మార్దవంబు
నమునకుఁ గల్గు వ్రణమును మాన్పనగునె ?
ాక వ్రణానన్ బోల్పదగదు దాని ॥వేఙు॥ (79)

కడు మెత్తనిది మాటలచే (బాధగలిగించగా) మనసునకు
ు శారీరకగాయమునకు మందులున్నవి గాని మనస్సుకు చెందిన
। మాన్పుట అసాధ్యము

లచు చుండినకొలది సంతసము గొల్పు
,చ్ఛ సాహిత్యమను సుధ సంతతంబు
ఁగ సాహిత్యమున్ బోలు కళలు గలవె ॥వేఙు॥

మంచి సాహిత్యము సంతోష దాయకము అది ఆలోచించుకొలది సత్ఫలితమిచ్చును 'సంగీతమపి సాహిత్యం, సరస్వత్యాః స్తనద్వయమ్ ఏక మాపాత మధురం, అన్యదాలోచనామృతం' అని సంగీత సాహిత్యాలు భారతీకుచములనియు, సంగీతము ఆపాత మధురమనియు చెప్పబడెను ఐనను సాహిత్యము ఆలోచించు కొలది అమృతము వలె సంతోషదాయకమని పై శ్లోకార్థము వ్యక్తి స్థాయిని బట్టి అది విశదమగును కనుకనే కవి చతుష్షష్టి కళలలోను - అందులోను లలితకళలలో సాహిత్యమునను మించినది లేదనుచున్నాడు కవి నామాంకిత, నివాస, రచనా కాలాది కములతో అష్టోత్తర శత (108) సంఖ్యతో శతకము ముగియు చున్నది

## శ్రీ మద్దులేటి లక్ష్మీనరసింహ స్వామి
## రంగాపురము

రంగాపురమునకు కొంత దూరమున కొండలో వెలసిన శ్రీ మద్దులేటి లక్ష్మీనరసింహ స్వామి పై ఒక క్షేత్ర మాహాత్మ్యమును కలుగోట్ల విజయాత్రేయ ప్రకటించినాడు రచయిత ఉపోద్ఘాతమున 'అభినందన నందివర్ధనం' అను పేరుతో మద్దులేటి స్వామిని స్తుతించిన పద్యము మనోహరము

ఉ॥ కమ్మని కొండకోన, తినుగమ్మని ఖిల్లుల రాచ పిల్ల, ఘుం
ఘుమ్మను కౌగిలింతల జగమ్మున గ్రమ్మిన, మాధురీ తరం
గమ్ముల కుమ్ములాడు కసికాగ్రణి శ్రీ నరసింహ మూర్తి, భో
గమ్ముల మద్దులేటి దొరగారి పదమ్ముల కంజలించెదన్

కొండ కోనలలో, మద్దులేరు తరంగాలలో విహరించు రసికాగ్రణిగా, భోగిగా, మద్దులేటి స్వామిని కవి కీర్తించినాడు రాచ పిల్ల అను అచ్చ తెనుగు పదము రసికాగ్రణియను ప్రసిద్ధ సంస్కృత సమాసముగల చక్కని నడక పై పద్యమున కలదు ఈ రచన కనుబంధముగా క్రిష్టిపాటి కోదండరామన్ రచించిన శ్రీ నుద్దులేటి నరహరి శతకము కలదు

ప్రతి శనివారము, పర్వదినములందు భక్తజన సందోహము స్వామి దర్శనమునకై వచ్చి చేయు గోవిందనామ స్మరణముతో దిక్కులు పిక్కటిల్లునని కవి చెప్పిన పద్యము మనోజ్ఞము

తే గీ॥ 'మద్దులేటయ్య గోవింద' మమ్ముఁగనవె
దిక్కు నీ వంచు దిక్కులు పిక్కటిల్ల
కేకలిడి నిన్ను నుతియింత్రు కీర్తనముల
మద్దులేటి నరహరి! రమావరహరి! (4)

స్వామిని 27 పద్యాలతో స్తుతించుచు మద్దులేటి కవి రచించిన శ్రీ మద్దులేటి నృసింహ తారావళి' అను చిన్న పుస్తకము సుమధుర శైలి కలిగి యున్నది

వేదాంత ధోరణి - భక్తి ప్రపత్తులు గల మద్దులేటి రచించిన పద్యము ఇది

సీ॥ 'శాత్రవులార్గురు - సాల పీడింతురు,
జ్ఞానఖడ్గమునిమ్ము - నఱకి వైతు,
యీ షణ్త్రయ గిరి - నెక్క సాధ్యము గాదు,
భక్తిమార్గము జూపు పరమపురుష,
ఘోరాఘ సాంద్రంబు - మీరి యలలుగొట్టె,
కడతేర్చి కావుమో - గరుడగమన!
సంసార లతనాదు - చరణాలు ఖంధించె
ఛేదింప నీ పాద సేవనిమ్ము

గీ॥ త్వత్పదాబ్జముల్ నమ్మితి వారిజాక్ష!,
కన్న పుత్రుని మాదిరి నన్ను కావు
ఎర్రమలవాస! దివ్య పూర్ణేందుహాస!
శౌరి! మద్దులేటి నృసింహ నారసింహ' (2)

కామ క్రోధాదులు అరిషడ్వర్గము తనకు శత్రువులు అవి తనను పీడించు చుండెననియు, జ్ఞానమను కత్తినిచ్చినచో నరకి వేతునని కవి ప్రార్థించెను ఘోర పాపాలను సముద్రపుటలలు బాధించుటచే వానిని దాటించు మనుచున్నాడు తన పాదాలను కట్టివేసిన సంసార లతను స్వామి పాదసేవచే ఛేదింతుననెను ఎంత భక్తి వేదాంత వాసనలు గుబాళించు పద్యమో ఇది

మద్దులేటి నృసింహ మంత్ర రాజమును పఠించుట చేత కలుగు లాభములన్నిటిని కవి ఇట్లు పలికెను -

సీ॥ మద్దులేటి నృసింహ మంత్ర రాజముచేత
నష్టకష్టము లెల్ల నంతమగును
మద్దులేటి నృసింహ మంత్ర రాజముచేత
భవబంధ రోగముల్ బారిపోవు

మద్దులేటి నృసింహ మంత్ర రాజముచేత
ప్రారబ్ధ కర్మముల్ పరుగులిడును
మద్దులేటి నృసింహ మంత్ర రాజముచేత
సంస్కృతి వలలింక సమసిపోవు

తే గీ॥ దేవ! నీ నామ మంత్ర ప్రభావ మెన్న
మగుడి జన్మంబు లేదయ్యా మారజనక!



కష్టములు నశించుట, భవబంధములు పారిపోవుట, ప్రారబ్ధకర్మాలు పరుగులిడుట, పునర్జన్మ లేకుండుట - ఇవన్నియు స్వామి మంత్ర పఠనము వలన కలుగుననుట! ఐహికములైన కష్టములు నశించుట మొదలు పునర్జన్మము నశించు వరకు మేలు కల్గునని చెప్పబడినది

చతుర్థీ విభక్త్యంతము లైన మూడు విశేషణములను పలికి పాదాంతమున వందనమును చెప్పిన పద్యము ఇది

సీ॥ 'వైకుంఠ వాసాయ - పావన గాత్రాయ,
వామన రూపాయ - వందనంబు
గాన విలోలాయ - గంగాధరనుతాయ,
సుందర రూపాయ - వందనంబు'

ఇత్యాదిగ ఈ పద్యమున వాసాయ - గాత్రాయ - రూపాయ మొ॥ గ చతుర్థ్యంతము గల పదాలతో నాలుగు పాదాలలో మొత్తము 12 మార్లు పదాలను వాడి - స్వామికి నాలుగు వందనములర్పించిన తీరు మనోహరము

## డోన్ తాలూకా
## వెల్దుర్తి మండలము

# చెన్నకేశవ స్వామి,
## లంజ బండ గ్రామము. (భుజ బండ)

మండల కేంద్రమునకు 10 కి మీ దూరమున భుజబండ గ్రామము కలదు అందు చతుర్భుజములతో పశ్చిమాభిముఖుడై చెన్నకేశవ స్వామి దర్శనమిచ్చును

ప్రముఖ పరిశోధకుడు వైద్యం వేంకటేశ్వరా చార్యులు "చెన్నకేశవా!" అను మకుటముతో రచించిన శతకము అముద్రితము రామ శబ్దమునకు కవి చెప్పిన వ్యుత్పత్తి ప్రశంసనీయము

ఉ ॥ 'భుక్తిని గోరు వారలకు మూలము **ద్రవ్యమె** యెంచి చూడగన్
ముక్తిని గోరు వారలకు మూలము **జ్ఞానమె** యెంచి చూడ త
ద్భుక్తిని ముక్తియున్ బడయు మూలము **రామ** పదంబె కాన స
ద్భక్తిని 'రామరామ' యని తల్చెద నామది చెన్నకేశవా!

రా - అనగా ద్రవ్యము, మ - అనగా జ్ఞానమని అర్థము భుక్తిని గోరువారికి ద్రవ్యము, ముక్తిని గోరువారికి జ్ఞానము మూలములు రెండునొక్క చోట లభించు చోటు కలదు అదే రామ శబ్ద స్మరణము కనుక నేను నిన్నే ధ్యానింతు నను చున్నాడు కవి ఇట్టి వ్యుత్పత్తి రమణీయము

మరొక పద్యము శ్రీరాముని వంశ మూల పురుషుని ప్రశంసతో కూడిన పద్యమిది

ఉ॥ 'భానుడు తాపకుండు , మరివాని సుతుండన హంతకుండు, న
వ్వాని సహోదరుండు శని, వారలు పీడకులైన జానకీ
జానివి తత్కులోదధిని జన్మము నొందితి, వందుచేతనే
భానుడు 'మిత్ర' నామమున వాసికి నెక్కెను చెన్నకేశవా!' -

భానుడు వేడిని కలిగించు తాపకుడు (తాపము = వేడి) అతని కుమారుడు ప్రాణుల ప్రాణాలను తీసికొనిపోవు హంతకుడు యముడు అతని తమ్ముడు అదృష్ట జాతకాలను తలక్రిందులు జేసి కష్టాల పాల్జేయు శని విష్ణువు ఆ సూర్య వంశములోనే జన్మించినాడు విష్ణువు జన్మించుట చేతనే - తాపము కల్గించు సూర్యుడు 'మిత్రుడు' గా మారిపోయెనట! 'మిత్రుడ' ను పర్యాయ

పదము సూర్యునకున్నది ఇట్లు శ్రీరామ జన్మము చేతనే సూర్యుడు మిత్ర శబ్దవాచ్యుడయ్యెననుట చమత్కారము

**స్వామిని సేవించు అర్చకులను రక్షించుమని కవి చెప్పిన పద్యమిది**

ఉ॥ 'శ్రీయుత మూర్తి! యో మురహరీ! తిరువళ్ళురి సామపేదవం
శీయ సువైష్ణవార్చకుల సేవల నెన్ని తరాలుగానొ హృ
త్ప్రేయముగా గ్రహించితివి దేవ! తదీయులఁబ్రోవుమయ్య! దే
వా! యదు వంశభూష! భుజబండ పురాధిప! చెన్నకేశవా!'

పై పద్యము పోతన భాగవతములోని రుక్మిణీ కళ్యాణము నందలి రుక్మిణి కృష్ణునకు విన్నపముగ చెప్పి పంపిన 'శ్రీయుత మూర్తి యో పురుష సింహమ'! అను పద్యపు ఎత్తుగడను పోలినది ఇచట స్వామిని సేవించు అర్చకులు తిరువళ్ళురి సామపేద వంశీయులు వారు అను వంశీకముగ పూజారులు వారిని రక్షించుమని కవి కేశవుని కోరుచున్నాడు

ప్రతి పద్యము నందేదో చమత్కారమును కూర్చుట కవికిష్టము 'ప్రతి పద్యము నందు చమత్కృతిఁ గల్గఁ జెప్ప నేర్తు వు' అని చేమకూర పేంకట కవి ప్రశంసింప బడునట్లు కవి వైద్యం సైతము ప్రతి పద్య చమత్కృతి గల్గునట్లు రచన చేయగలడనుటలో సందేహములేదు

## నందికోట్కూరు తాలూకా
## జూపాడు బంగ్లా మండలము
## రంగనాయక స్వామి,
## తర్తూరు.

తర్తూరిలో పెలసిన రంగనాయక స్వామిపై ఉప్పల పిచ్చయ్య శాస్త్రి శతకమును రచించెను

తర్తూరి క్షేత్రములో నెలకొన్న రంగనాయక స్వామి ఆకారమును యథా తథముగా వర్ణించిన పద్యమిది

'శ్రీవనజాక్షియున్, పుడమి చేడెయు, చెంతలఁజేరి యోర్పుమై
సేవలుచేయఁ బాపదొరసెజ్జపయిన్, వలకేలు దిండుగా
తీవిఁ బరుండి చూపుల కడింది, దయారస ముప్పతిల్ల, లో
కావళి నేలు, నిన్ గొలుతు నర్మిలిఁ దర్తురి రంగనాయకా! (1)

శ్రీదేవి, భూదేవి రెండువైపుల చేరి సేవించుచుండగా శేషుని పై శయనించి చూపులలో దయారసమును చిలికించుచు, లోకాలను పాలించు నిన్ను నేను సేవింతునని పై పద్యార్థము స్వామి తర్నూరులో కొలువు తీరిన తీరు పై పద్యమున వాస్తవముగా వర్ణింపబడినది

సంపదలు లేకపోయినను, పుణ్య తీర్థ ప్రవాహములు ప్రవహింపకున్నను తర్నూరు గ్రామము ప్రశస్తినందెను అందులకు ఈ స్వామియే కారణమని కవి యుక్తి యుక్తముగ పలికిన పద్యమిది

చ॥ అలఘు విలాస సంపదల నందక, పుణ్య తరంగిణీ సమా
కలితము గాక, నీకతన గౌరవమీపురి గాంచె, నౌ మహా
త్ముల దయ గల్గినంత, నధముల్ ఘను లౌటది తథ్యమౌ కదా!
సలలిత రూప! పంకరుహ సాయక! తర్తురి రంగనాయకా! (4)

మహాత్ముల దయా విశేషము వల్ల నీచులు సైతము గొప్పవారగుట సత్యమను దానికి తర్నూరు నిదర్శనమని కవి పల్కుచున్నాడు రంగస్వామి మహాత్ముడనియు, ఏ విశేషము లేనిది తర్నూరనియు, స్వామి కృపామృత వృష్టి వల్ల ప్రఖ్యాతి లేని తర్నూరు ప్రశస్తి వహించిన దనుట సారాంశము పై పద్యములో మొదటి రెండు పాదములు ఒక వాక్యము, చివరి భాగమొక వాక్యము విశేష వాక్యమును సామాన్య వాక్యముచే సమర్థించుట జరిగెను కనుక ఇచట అర్థాంత రన్యాసాలంకారము కలదు

రంగనాయక స్వామి శ్రీ రంగ పురమును వదలి, తర్నూరును చేరెనని కవి ఇట్లు చమత్కరించుచున్నాడు

చం॥ ఉభయ ప్రవాహ మధ్యమున నుండుట ముప్పని తోచుటన్ మహా
రభసముతో ప్రియంబయిన రంగపురంబును బోవద్రోచి, స
ద్విభవ మెలర్ప నిచ్చట నతి ప్రమదంబున జేరి తౌక్కొ, ప్రా
ణభయము సర్వ జీవులకు నైజము, తర్నూరి రంగనాయకా! (8)

రంగనాథుడు తమిళనాడులోని శ్రీరంగపురములో రెండు ప్రవాహముల మధ్య నివసించు చుండుట జగత్ప్రసిద్ధము అది ప్రమాదమని తెలిసిన రంగస్వామి శ్రీరంగమును వదలి తన నివాసమును తర్నూరికి బదిలీ చేసెనఁట! దానికి కారణము సర్వజీవులకు ప్రాణభయము సమానమని కవి సమర్థించుచున్నాడు మానవులకే గాక ప్రాణభయము జగద్రక్షకుడైన స్వామికి సైతము సర్వసామాన్యమని కవి ఇచట చమత్కరించినాడు

తర్తూరి రంగనాయక కల్యాణము - రథోత్సవములు ప్రతి సం॥ము చైత్రమాసమున జరుగును ఈ ఉత్సవములను కనులార కాంచిన కవి ఈ శతకమున వరుసగా 78 నుండి 86 పద్యముల వరకు వర్ణించుట జరిగినది

స్వామి వారి హంసోత్సవమును కవి క్రింది పద్యమున వర్ణించినాడు

ఉ॥ 'వార విలాసినీ మణులు వచ్చి కురంగట నాట్యమాడ, పూ
జారులు చామర మ్ములు పసందుగఁ గ్రేవల వీచు చుండ, సిం
గారము మీర నంచ తురగంబు పయిన్ బరతెంచు నీ మహో
దార విలాస మాత్మకు ముదంబిడు తర్తురి రంగనాయకా! (80)

హంస వాహనముపై రంగడు ఊరేగు సన్నివేశమును కవి ఇచట వర్ణించినాడు వేశ్యలు సమీపమున నాట్యము చేయుచుండగ, పూజారులు రెండు వైపుల నిలబడి వింజామరలను వీచు చుండగ, శృంగారియై హంసవాహనము పై నూరేగుస్వామి శోభ కవికి సమ్మోదము కలిగించినదట ఈనాడును అనేక క్షేత్రాల యందు తిరునాళ్లలో గణికల నాట్యమును, అర్చకుల వింజామరల వీవనలును కనిపించు చున్నవి

ఇట్లు పల్లకీ ఉత్సవమును, సింహోత్సవమును కవి చక్కగా వర్ణించినాడు

వైకుంఠమున విష్ణువునకు శేష సర్పముశయ్య అతడు రామావతారమున శ్రీరామునికి తమ్ముడు (లక్ష్మణుడు), కృష్ణావతారమున అన్న (బలరాముడు) అంతటితో తృప్తి పొందక స్వామి ప్రస్తుతము శేషుని హయముగా (వాహనముగా) గ్రహించెనని 81 వ పద్యమున చమత్కరించినాడు అనగా శేషునకు విష్ణువునకు గల జన్మ జన్మల సంబంధమును పై పద్యమున కవి సూచించినాడు

## నందికొట్కూరు మండలము

## సూర్యనారాయణాలయము, నందికొట్కూరు.

నందికొట్కూరు పట్టణమున సుర్య నారాయణ దేవాలయము కలదు ఆ దేవుని పై 'నిత్య ప్రార్థనా స్తోత్రాలు' అను పుస్తకమును మల్లికార్జున రావు ప్రకటించెను ఇందు స్తోత్రములు మాత్రమేగాక ఆలయ ప్రాచీనత సైతము వివరింపబడినది

**ఆలయ ప్రాచీనత** - ఇచట అలంపూర్ పాలకులగు చాళుక్య రాజులు క్రీ శ 1080 సం॥ ర ప్రాంతములో శ్రీ ఛాయా ఉషాసమేత శ్రీసూర్యనారాయణ

దేవాలయమును నిర్మించినట్లు బ్రిటిష్ వారి కైఫీయతుల వలన తెలియుచున్నది ఆనాడు మన రాష్ట్రములోని 'అరసవిల్లి' తరువాత నందికొట్కూరు సూర్యాలయము ప్రసిద్ధి పొందియుండెను ఒక పిచ్చివాని వలన పూర్వ విగ్రహము పగిలిపోవుటచే ఈ ఆలయము ప్రజలకు దూరమైనది మొత్తముపై **1996** సం॥ ము చివరలో శ్రీ స్వామివారు పున ప్రతిష్ఠితుడయ్యెను ఈ చిన్న పుస్తకము చివరలో సూర్యస్తుతి కలదు

**సూర్య ప్రార్థన** -

'జపాకు సుమ సంకాశం - కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వ పాపఘ్నం - ప్రణతోస్మి దివాకరమ్' -

శివప్రోక్తమైన శ్రీ సూర్యాష్టకము –

'ఓం ఘ షోత్కాయ శాన్తాయ కారణత్రయ హేతవే
నివేదయామి చాత్మానం - నమస్తే జ్ఞాన రూపిణే'

కశ్యప పుత్రుడును, మహాకాంతి మంతుడును, చీకటిని, పాపములను నశింప చేయువాడును అయిన సూర్యునకు నమస్కారమని ప్రథమ శ్లోకార్థము రెండవ శ్లోకము నందు శాంత పురుషుడుగా, జ్ఞాన స్వరూపునిగా సూర్యుడు స్తుతించబడినాడు

సూర్య నారాయణ స్వామి యనుటలో సూర్యుడు విష్ణుస్వరూపుడని తెలియును శివ, విష్ణు దేవతలను పూజించుటకు ముందు ప్రాచీనకాలములో ప్రకృతి దేవతలుగా సూర్యుడు - అగ్ని మొ॥గు వారిని ప్రజలు పూజించెడివారు కనుక సూర్యుడు ఆదిదేవుడనియు, అత్యంత ప్రాచీనుడనియు స్పష్టమగుచున్నది



సూర్యనారాయణ స్వామి నందికొట్కూరు

## నందికొట్కూరు తాలూకా
## మిడుతూరు మండలము
## చెన్నకేశవ స్వామి
## మిడుతూరు.

మిడుతూరు మండల కేంద్రము నందు వెలసిన చెన్నకేశవ స్వామి కంకితముగా మాదిరాజు లక్ష్మీనారాయణ శర్మ 'శ్రీకేశవ శతకము' ను రచించెనర- అతనికుమారుడు డా॥ మాదిరాజు సుబ్బారావు దానికి విపుల వ్యాఖ్యానమును గావించినాడు అందుండి కొన్ని పద్యములు -

శా॥ 'ఓంకారంబొక విల్లుగా నమర నత్యుత్సాహ సంరంభత్వ
ద్ధుం కారంబున నష్టచేష్టులయి శత్రుల్ రాలిపోగా, ధను
ష్టంకారం బొనరించి, యాత్మశరమున్ సంధించి, లక్ష్యంబు ని
ష్టంకో దాత్తము నిష్ప్రపంచ మురు దీక్షం దాకుదున్ కేశ వా! (30)

ఈ పద్యము క్రిందనే కవి మంత్రము సైతమిచ్చినాడు ''ప్రణవోధనుః- శరోహ్యాత్మా, బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే, అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్

ప్రణవమను ఓంకారమునే ధనుస్సుగా భావించి, ఆత్మ లేక జీవాత్మ పరబ్రహ్మమునే లక్ష్యముగా నుంచుకొని - ఏమరు పాటు లేకుండా దృష్టిని ఏకాగ్రత చేసి, ఆ బ్రహ్మము నందు అట్లు దృష్టి నిలుపవలెననుట ఉపనిషద్వాక్యము దీనిని వీర రసస్ఫోరకముగా ఈ పద్యమున మాదిరాజు వర్ణించెను దనుష్టంకార మాత్రముననే అరిషడ్వర్గములను 'శత్రుల్ రాలిపోగా' అని ఉత్ప్రేక్షించినాడు-

దృఢతర దీక్ష వహించినట్లు - అరిషడ్వర్గముల నణచివైచి, ఉదాత్తమైనది- అచలమైనది అగు పరబ్రహ్మను చేరెదను గాక యని రచయిత ఆత్మస్థైర్యమును- ప్రకటించినాడు

ఓంకారమునకు ప్రాచీన గ్రంథములు మిగుల ప్రాముఖ్యత నిచ్చినవి-
'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం, సయాతి పరమాంగతిం' (భగవద్గీత 8 13)

అని గీతలో ' ఓం' అను అక్షరము నుచ్చరించుచు, నన్నెడ తెగక చింతించుచు, ఎవడు శరీరమును వదలునో వాడు సర్వోత్తమ స్థానమగు పరాంగతిని పొందునని కృష్ణ పరమాత్మ సూచించినాడు అట్టి ఓంకార మహిమను మాదిరాజు పై పద్యమున పలుకగా, కుమారుడు దానిని విపులముగా వ్యాఖ్యానించినాడు మరొక పద్యము

చం॥ ముదిమి యశక్తతన్ తనువు ముంచెడి వేళ, కఫంబుకుత్తుకన్
కుదురుగ నిల్వ, పిక్కిటిలు కోర్కెల నుక్కిరి బిక్కిరై వృథా
యొద కృశి యించు వేళ నిను నెట్టుల కీర్తన సేతు, నిప్పుడే
సదమల చిత్త వృత్తి కొని సాగిలి మ్రొక్కెనుతింతుకేశవా!

(కేశవ శతకము - 6వ పేజి - 8 వ పద్యము)

ముసలితనమున శక్తి క్షీణించినపుడు కఫము కుత్తుకలో నడ్డగించినపుడు, కోర్కెలు తత్తర పాటు గల్గించి, హృదయము కృశించినపుడు నిన్ను కీర్తించలేను, ఇప్పుడే నీకు నమస్కరింతు ననుచున్నాడు స్వామితో కవి ఇది నిత్యసత్యము మన గృహములలో - పరిసర గృహాలలో తరచు కనిపించు దృశ్యమిది

భద్రాచల రామదాసు సైతమిట్లే అభిప్రాయపడినాడు

ఉ॥ 'ముప్పునఁ గాలకింకరులు ముంగిట వచ్చిన వేళ, రోగముల్
గొప్పరమైనచో, కఫము కుత్తుక నిండినవేళ, బాంధవుల్
గప్పిన వేళ

(దాశరథి శతకము - 16 )

ఇట్లు వేదాంత, భక్తి, జ్ఞాన విషయాలతో తండ్రి మాదిరాజు వంద పద్యాలతో కేశవ శతకమును రచింపగ, కుమారుడు డా॥ మాదిరాజు చక్కని వ్యాఖ్యానము గావించెను

మాదిరాజు లక్ష్మీనారాయణ శర్మ 40 శ్లోకములతో సుప్రభాతమ్ సైతము రచించెను వేంకటేశ్వర సుప్రభాతమునకు తగ్గని రచన ఇది అందుండి యొక శ్లోకము

'భక్తావ నార్థం తో కదేతియానం
త్వాం సేతుకామాః ఖలు సంభ్రమంతి
పక్షీంద్ర కేశేంద్ర గజేంద్ర ముఖ్యాః
ఉత్తిష్ఠ శ్రీ కేశవ చెన్నరాయః (చె కే సుప్రభాతం)

ఏక్షణమున ఏ భక్తుని రక్షించుటకై తమను పిలుతురోయని వాహనములైన గరుత్మంతుడు - హనుమంతుడు - గజేంద్రుడు మొదలైన భక్తులు తొందరపాటుతో సిద్ధముగా నున్నారు కనుక చెన్నకేశవరాయా! మేలుకో అని పై శ్లోకమున కవి చెన్నకేశవుని మేల్కొలుపుచున్నాడు

ఇట్లు చెన్నకేశవుని పై శతకమును, సుప్రభాతమును కూర్చిన మాదిరాజు లక్ష్మీనారాయణ శర్మ సుకృతాత్ముడు, కీర్తికాయుడు

# నంద్యాల డివిజన్

## ఆళ్లగడ్డ తాలూకా, ఆళ్లగడ్డ మండలము.

# నరసింహ స్వామి,

## అహోబలము

కర్నూలు జిల్లాలోని ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రము అహోబలము నరసింహ స్వామిపై విశేష సాహిత్యము కలదు అందులో 14 వ శతాబ్దికి చెందిన ఎఱ్ఱాప్రగడ నృసింహ పురాణము ప్రముఖమైనది అందలి సాహిత్యాంశములు కొన్ని తెలిపెదను

ఎగువ అహోబలము భవనాశనీ నదీతీరమున గలదు గాలవ మహర్షి తీర్థ సంసేవన మాచరించుచు, భవనాశిని చేరెనని రోమహర్షణుడు చెప్పుచు నిట్లు పలికెను

కం॥ 'అందు భవనాశ నీ నది, నందన దళితారవింద నవ మకరంద
స్యంద మద వదిందిందిరఁ జందన చంద్రాంశు విశద సలిల భజించెన్

నందనోద్యాన వనమందు వికసించిన పద్మాలలోని మకరందమును గ్రహించు తుమ్మెదలు గలది, చందనము వలె చల్లనైన వెన్నెల వలె స్వచ్ఛమైన నీరు గలదియైన భవనాశనీ నదిని ఋషి భజించెననుట

ఈ భవనాశనీ మాహాత్మ్యమును నృసింహస్వామి బ్రహ్మకు తెలిపినాడు

కం॥ భవనాశిని భవనాశిని
భవనాశిని యనుచుఁ బలుకు భక్త జనులకున్
భవనాశిని భవనాశిని
యవుటకు భువియందు సందియంబును గలదే! [1]

భవనాశినీ నది నామస్మరణము చేతనే పునర్జన్మ లేకుండాఁ జేయునని పై పద్యార్థము

గోవింద పాదార విందములను ధ్యానించు మనస్సులు గలవారిని గూర్చి ఎఱ్ఱన క్రింది పద్యమున వర్ణించెను

ఉ॥ పొందవు దుఃఖముల్, భయము పొందదు, పొందదు దైన్యమెమ్మెయిన్
బొందవు తీవ్ర దుర్దశలు పొందు ప్రియంబులు, పొందు సంపదల్,
పొందు సమగ్ర సౌఖ్యములు, పొందు సమున్నత కీర్తులెందు గో
విందు పదార వింద పదవీ పరిణద్ధ గరిష్ఠ చిత్తులన్, [2]

విష్ణు పాదారవిందములపై మనస్సు లగ్నము చేసిన వారికి దుఃఖ, భయ, దైన్యాదులుండవని, సంపద, సౌఖ్య, కీర్త్యాదులు సమకూరునని పై పద్యార్థము

నృసింహ స్వామి ఆవిర్భావమును ఎఱ్ఱన స్తంభోద్భవ వచనమున విస్తారముగా వర్ణించినాడు కనులకు కట్టినట్లున్న స్వామి యుగ్రరూపము, పై వచనమున సాక్షాత్కరించును ఆ స్వరూపమును 'తేఱి చూడలే కెక్కడయుంజనంగఁ దెలియింపు కె ఱుంగక దైత్యుడెంతయున్ జొక్కి మనంబునన్ దిగులు చొచ్చినఁ జేష్టల దక్కె నత్తఱిన్' - అని ఎఱ్ఱన వర్ణించినాడు

నృసింహ భీషణాకారమును హిరణ్యకశిపుడు తేఱి చూడలేక పోయినాడు ప్రక్క కెచ్చటికి పారిపోలేక పోయినాడు మనస్సున దిగులు నందినాడు నిశ్చేష్టుడైనాడు నృసింహుని స్వరూపము ప్రహ్లాదునికి దివ్యావతారముగా గోచరించినది అతని మనస్సులో భయమును, సంభ్రమమును, అద్భుతమును, భక్తియును పెనవేసి కొన్నవి భయముతో పాటు తొట్రుపాటును, అబ్బురమును కల్గుటయే గాక భక్తిని కలిగించినది

ఇట్లు భగవద్దర్శనంబున దుష్ట శిష్టులకు గల్గిన దృష్టి భేదమును ఎఱ్ఱన వర్ణించిన తీరు ప్రశంసార్హము

దేవతలు, మునులు నృసింహావిర్భావము జరిగిన వెంటనే దండకమున స్వామిని స్తుతించినట్లు ఎఱ్ఱన వర్ణించెను

'శ్రీనాథ నాథా జగన్నాథ నమ్రైక రక్షా సమక్షా సరోజాక్ష.

ఇత్యాదిగా 64 పంక్తులలో సంస్కృత సమాస భరితముగా సాగిన దండకము 'మమ్మెప్డు రక్షించు లక్ష్మీశ యీశా నృసింహా నమస్తే నమస్తే నమః' అనుటతో ముగియును శబ్దాలంకార యుక్తముగా తాళగతిలో సాగినదీ దండకము కావ్యాలలో దండకమును గూర్చు సంప్రదాయము ఆదికవి నన్నయభట్టు మహాభారతము తోనే ప్రారంభమైనది పరమేశ్వరుని విశ్వరూపమును గాంచి, అర్జునుడు దండకములో గావించిన స్తోత్రము 'ఈశ్వర దండకము' గా ప్రఖ్యాతి గాంచినది

'శ్రీ కంఠ! లోకేశ! లోకోద్భవ స్థాన సంహారకారీ! పురారీ! మురారిప్రియా! చంద్రధారీ ! మహేంద్రాది బృందారకానంద సందోహ సంధాయి పుణ్య స్వరూపా!' ఇత్యాదిగా సాగుచు, 'కారుణ్యమూర్తీ! త్రిలోకైక నాథా! నమస్తే! నమస్తే! నమః' [3] వరకు 20 పంక్తులలో ఈ దండకము ముగియును

అహోబల ప్రశస్తి నిట్లు కవి వర్ణించెను

'అభినవ స్వర్గం బనందగి, యపర బ్రహ్మ లోకంబు, నా నొప్పారి,
ద్వితీయ వైకుంఠం బనం బరగి యహోబిలంబు'[4]
ప్రకాశించు చుండె - నట

మరొక స్వర్గలోకమో, ఇంకొక బ్రహ్మలోకమో, రెండవ వైకుంఠమో అన్నట్లు అహోబలము ప్రకాశించు చున్నదఁట!

గరుడాద్రి విశిష్టతను స్వామిచే కవి పలికించినాడు

కం॥ 'గరుడాద్రి దురిత విషధర, గరుడాకృతి సిద్ధ సాధ్య గంధర్వ మరు
ద్గరుడా సేవ్యం బుజ్జ్వల గరుడాయిత మస్మదీయ కర్మ స్థితికిన్' [5] -

పాపాలను సర్పములకు గరుడాకృతిగా నుండునది, సిద్ధ సాధ్యాదులచే సేవించబడునది ఆగరుడాద్రి భవనాశిని, లక్ష్మీవనము, గరుడాద్రి, నృసింహ స్వామి విశిష్టతలను నరసింహ స్వామి 6వ ఆశ్వాసం - 148 నుండి 182 పద్యాల వరకు బ్రహ్మకు వివరించుట జరిగెను

ఎఱ్ఱన పద్యకళికలు కొన్ని పోతన భాగవతములో పద్యముల వలె విప్పారినవి

ఆ వె॥ 'కుడిచినపుడు నిద్ర గూరిన యప్పుడు,
మేలుకొనినయపుడు మెలగినపుడు
విష్ణు కీర్తనంబు విష్ణు చింతయకాని,
పలుకఁ డొండు బుద్ధిఁ దలపఁ డొండు' [6]

ఈ కంద పద్యము పోతన చేతిలో శార్దూలముగా వికసించినది

శా॥ పానీయంబులు ద్రావుచుం, గుడుచుచున్, భాషించుచున్, హాస లీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్, లక్షించుచున్, సంతత
శ్రీ నారాయణ పాద పద్మ యుగళీ చింతామృతా స్వాదసం
ధానుండై మఱచెన్ సురారి సుతుఁడే తద్విశ్వమున్ భూవరా![7]

ఎఱ్ఱన పద్యములో భుజించునపుడు, నిద్రించు నపుడు మేల్కొన్నప్పుడు
ంచరించునపుడు విష్ణువును చింతించెనే గాని, ప్రహ్లాదుడు మారుపల్కలేదని
ల్కగా పోతన దానిని రమణీయముగా ఆరు కార్యాలలో ప్రహ్లాదుడు విష్ణువును
గ్యానించుచున్నాడు అని పలికినాడు

..॥ 'వాసుదేవుని పాద వనరుహంబుల భక్తి తగదను తండ్రియుఁ దండ్రిగాడు
వేద చోదితమైన విష్ణు ధర్మమునకుఁ, గోపించు గురుఁడును గురుడు గాడు
భవ దుఃఖములు మాన్పఁ బ్రభువైన హరిసేవ, నెడలించు హితుడును
హితుడు గాడు
వర యోగ మతమగు వైష్ణవ జ్ఞానంబు, వదలిన చదువును జదువు గాదు

..॥ కేశవాకార లీలలు గీలుకొని ము,
దంబుఁ బొందని తలపును దలపుగాదు
మాధవస్తోత్ర ఘన సుధా మధుర రుచులఁ,
జిలుక కుండెడి జిహ్వాయు జిహ్వాగాదు' [8]

అను ఎఱ్ఱన నిషేధ రూపమైన యర్థము పోతన పోతలో అర్థాంతర
సంక్రమిత వాచ్యధ్వనియై మనోహర శబ్దయుతముగా నిట్లు మారినది

..॥ 'కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వాజిహ్వా
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేష శాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు,
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు,
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

గీ॥ దేవదేవుని చింతించు దినము దినము,
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు,
తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి' [9]

విష్ణువు పాదాలపై భక్తి వలదను తండ్రి తండ్రి కాదు అనునట్లు నిషేధ
రూపార్థమున ఎఱ్ఱన కవితలో నుండగా, 'విష్ణువును పూజించు చేతులే యుత్తమ
మైన చేతులు' ఇత్యాదిగా వాచ్యరూపమున లాటాను ప్రాసాలంకారముగా పోతన
భాగవతములో పరిమళించినది

పోలూరి రామకృష్ణయ్య యను హిందీ ఉపన్యాసకులు వ్రాసిన 'నుత భారతి' పద్యకావ్యమున అహోబిల గరుడాచల వర్ణన యున్నది

వాచస్పతి యను బ్రాహ్మణుడు దర్శించిన 'అహోబిలము' తత్పరిసర ప్రదేశము లీ, కావ్యమున వర్ణింపఁ బడినవి వాచస్పతి సరస్వతీ ప్రార్థన యిందు కలదు

నవ నారసింహులు వెలసిన అహోబిల క్షేత్రమును ఒక యాత్రా చరుఁడు వాచస్పతి కిట్లు సీస పద్యమున వర్ణించెను

సీ॥ నవనారసింహ పుణ్యక్షేత్రమిది సర్వ, పాప మేఘౌఘ ప్రభంజనంబు,
నవనారసింహ జన్మ క్షేత్రమియ్యది, ప్రహ్లాద రక్షా శరణ్య పథము
నవనారసింహ భక్త వరేణ్య సంవాస, మిది హిరణ్యకశిపు మృత్యుపథము,
నవనారసింహ పూర్ణ ప్రేమ ఝరి యిది, చిర పుణ్య, ముని జన జీవదంబు,
తే గీ॥ జన్మరాహిత్య వరదాన శక్తి యుక్త, కల్ప వృక్షంబు వివిధ సౌఖ్య ప్రదంబు,
సచ్చిదానంద సంధాన చైత్య మహిత, మారుతాలోల సౌరభ మంజులంబు' [10]

సర్వ పాప మేఘములకు సుడిగాలి, ప్రహ్లాదుని రక్షించినది, భక్తుల నిలయము, హిరణ్యకశిపుని సంహార ప్రదేశము, నరసింహ ప్రేమఝరి, పుణ్యములకు ప్రాణప్రదము, భవరహితమైన శక్తియుతమైన కల్పవృక్షము, సచ్చిదానంద నిలయము - నవ నారసింహ నిలయమైన అహోబిలమనుట

గరుడాద్రిలో 'కాశిరెడ్డి నాయన' అను అవధూత పూర్వము నివసించు చుండెను అతనిని కవి రామకృష్ణయ్యనుత భారతి - తృతీయనుతిలో 19 నుండి 37 పద్యాలలో వర్ణించెను మచ్చున కొక పద్యము

ఉ॥ 'కారణ జన్ముఁ డితఁడనగా విదితంబగుచున్న రూప రే
ఖా రమణీయ ఫాల ఫలకంబు వెలుంగ బహు ప్రయోజనా
ధార పటుత్వ వాఙ్నియమ దక్షత యొప్ప నిమిత్త మాత్ర సం
చార దరస్మితంబలర సమ్మతి నొప్పెడి 'కాశివాసి తాన్'

ఆ యవధూత నొసటి వర్చస్సును గాంచిన కారణ జన్ముడని పించునఁట! మాటలు అనేక ప్రయోజనాధార, పటుత్వము గలవఁట ఆనవ్వు దరస్మితము, నిమిత్త మాత్రము నట ఇట్టి ఆ మహనీయుని చిత్ర పటము కనులకు కట్టినట్లు వర్ణించినాడు కవి ఈ కావ్యమున నవ నారసింహ క్షేత్రాలు, గరుడాద్రి, హనుమద్గిరి, పేల్పులదరి - ఒక దాని తర్వాత నొకటి చలన చిత్రములలో ఒకదాని తర్వాత మరొక చిత్రము వలె కవి క్షేత్రములో నన్ని దృశ్యములను వరుసగా చూపించి, వర్ణించినాడు

గరుడాద్రిలో అన్నదానము ఆనాటి వలె (1974) నేడును సాగుట గమనార్హము

'గరుడాద్రిని కనునట్టి వారలకు రేయిబవల్ నిరతాన్నదాన సే
వనమున 'నన్న తృప్తి' గనుపట్టెడి క్షేత్ర మహత్త్వ మెట్టిదో!'

గరుడాద్రిలో దర్శించు వారికి రాత్రింబవళ్ళు నిత్యాన్నదాన మొనర్చి, అన్న తృప్తి గావించు క్షేత్ర మాహాత్మ్యము ఎంత గొప్పదో!' అని కవి ఆశ్చర్యమును వ్యక్త మొనర్చు చున్నాడు

కవి అనేక పర్యాయములు గావించిన సరస్వతీ స్తుతి కొక్క యుదాహరణ -

ఉ॥ 'అమ్మవునయ్యవై వరదయాహృదయాంబుజ సౌరభార్ద్ర త
త్త్వమ్మున నొప్ప నిన్ను మది తత్పర భక్తి నుతించి త్వత్పదా
బ్జమ్ముల వ్రాలి మజ్జనన బంధ విముక్తికి గొల్చుచుందు వి
శ్వమ్మున నన్ను బ్రోవ గల పావన దేవత వీవె భారతి!' [12]

తల్లియు, తండ్రియు నైన భారతి దయాహృదయ ఆమెను భక్తితో స్తుతించి, జన్మ రాహిత్యము కొఱకై కవి సేవించునంట! విద్యాప్రాప్తికి గాక, కవి రామకృష్ణయ్య భారతి నిహ జన్మ రాహిత్యమునకై నుతించుట గమనార్హము! 374 పద్యాలలో సంస్కృత సమాస భూయిష్ఠముగా మధురముగా సాగిన యీ కావ్యము భారతీ దేవికి వినూత్న మణిహారమే!

నృసింహ చరిత్ర గల మరొక రచన 'శ్రీవాసంతికా పరిణయ' నాటకము నృసింహ స్వామి ఎఱుకత వాసంతికను వివాహమాడిన యితివృత్తమిది శ్రీశ్రీశ్రీవణ్ శఠగోప యతీంద్ర మహాదేశికులచే సంస్కృమున వ్రాయబడిన నాటకమును ఎల్లిగుడి (రాచర్ల) శ్రీనివాసాచార్యులు, తజ్జ్యేష్ఠ పుత్రుడు రాఘవాచార్యులు ఆంధ్రీకరించిరి

రాచర్ల శ్రీనివాసాచార్యులు చెప్పదలచుకొన్న విషయమును తేట తెనుగు మాటలలో రమణీయముగా చెప్పగలడు విదూషకుడు తనలోనిట్లు భాషించెను

తే గీ॥ మొదలె నర మృగేంద్రుండు వేట మది గలంగి
యున్నచో మన్మథోన్మాదమొదవె, నితనిఁ
గల్లు ద్రావియు తేల్గుట్టి యుల్ల మదరు
కోతికిన్ భూత మెనసిన రీతి యయ్యె' [13]

ముందే నృసింహస్వామి మృగయాసక్తుడు దానికి, దోడు మన్మథో ద్రేకముకలిగెను ప్రస్తుతమైన దీనిని కవి యెట్లు ఉపమించెనో పరిశీలింపదగును

కల్లు త్రావి, తేలు కుట్టి మనశ్చాంచల్యము గల కోతికి దయ్యము పట్టినట్లున్నదట! వాసంతికపై యనురాగ ముదయించుటు, భూతము పట్టిన దానితో సమానము మూల భావమయ్యెను, వ్యక్తీకరించిన విధానము, భావము రమ్యము

విషాద సంతోష సమ్మిశ్రితమైన నృసింహస్వామి నోట వెలువడిన పద్యమిది

ఉ॥ 'ఇంతి మనంబు నందు దపియించిన నా మది చల్లనౌ, మనః
కాంత మనంబు చంచలత గాంచిన నా మది నిశ్చలంబగున్,
వంత నెలంతపై దరుగ నాదగుమై పరిపోషమూను, బల్
సంతసమయ్యె మద్విరహ సాధ్వస యాసఖియౌట నా మదిన్' [14]

నృసింహస్వామి మనస్సును వాసంతిక తపింపజేసిన చల్లనగునట ఆమె స్వామి మనస్సును చలింపజేసిన నిశ్చల మగునట ఆమెపై బాధ తగ్గిన శరీరము పోషింపబడునట ఆమె స్వామిపై విరహమూనుటచే స్వామి సంతసించెనట! ప్రభావ మొక రీతిగానుండగా ఫలితము మరొక్క రీతిగా మారునట్లు ఇట వర్ణించబడినది

సంస్కృత నాటక రచయిత శ్రీశ్రీ శ్రీవణ్ శఠగోప యతీంద్ర మహాదేశికులు అహోబిల గురు పరంపరలో **1513 - 1522** మధ్య ఏడవ పీఠాధిపతిగా నుండినవారు వీరి రచనకు ఆంధ్రానువాదముగా రాచర్ల శ్రీనివాసాచార్యులు 4 అంకాలు ఆంధ్రీకరించి గతించగా, వారి కుమారులు రాఘవాచార్యులు చివరి పంచమాంకమును తర్వాత ఆంధ్రీకరించిరి

మూలమును పెంచి, మెరుగులు దిద్దిన ఘట్టములు ఆంధ్రానువాదమున కొన్ని కలవు అధికముగా - న్యూనాధిక్యతలు లేని యథా మూలానువాదములే యిందు కనిపించును

మచ్చునకు - వాసంతికా సఖుల సంభాషణా పద్యము యథా మూలముగా నున్నది

(మూలము) వాసంతికా - సఖి! చతురికే! మమ నస్ఫురతి త్వమేవవాచయ

ఆంధ్రము - సఖీ! ఇందున్న సందర్భము నాకు తోచకున్నది నీవే చదువవలెను.

మూలము చతురికా - శ్లో॥ ప్రశూషయా సుముఖితే సుతరా మతుష్యం

ఆంధ్రము -

మ॥ 'అతివా! నీ యొనరించుచున్న పరివస్యం జేసి సంతోషమంది తి'

మూలము భ్రమరికా - అస్మత్కులదేవతయా అంబాయాస్తవో పరికానామ వత్సలతా?
ఆంధ్రము - మన కులదేవతయైన అంబికకు నీపై నెంత వాత్సల్యము?

ఇట్లు నాటకము నందాంధ్రాను వాదము సాగినది

కాళిదాసు అభిజ్ఞాన శాకున్తల నాటకమునకు - ఈనాటకమునకు కొన్ని పోలికలు గోచరించును

1 కాళిదాసు నాటకమున నాయకుడు దుష్యంతుడు నాయిక, చెలికత్తెల మాటల వల్ల ఆమె అవివాహితయని తెలిసి కొనును ఈ నాటకము నందును నృసింహస్వామియు అట్లే తెలిసికొనును

శాకున్తల నాటకమున - మదించిన యేనుగు ఆశ్రమ వాసులపై బడిన దనువార్త విన్న నాయిక (నేపథ్యము నుండి వచ్చిన) నాయకునికి దూరముగా తొలగిపోవును ఈ నాటకము నందును నేపథ్యమున - వేటాడ వచ్చిన వారు జంతువులను చీల్చి చెండాడుచున్నారను వార్త వినగానే ప్రథమాంకమున నాయిక నాయకుని నుండి తొలగి పోవును

శీతలోపచారములు నాయికకు వ్యర్థమాయెనని శాకున్తలము నందు వలెనే యిందును తెలియును

శతావధానులు వీర రాఘవ సుబ్బారామ కవులు 'శ్రీమదహోబిల మహాత్మ్యము' ను రచించిరి ఇది పారాశర కృత బ్రహ్మాండ పురాణస్థ క్షేత్ర కాండమున కనువాదము ఇది అహోబిల క్షేత్ర మాహాత్మ్యమును తెలుపు పద్య కావ్యము

తనను గురించి తపస్సు చేసిన గరుత్మంతునితో విష్ణువిట్లనినాడు

తే గీ॥ 'సత్యధనుఁడవు, నీతి విశారదుఁ డవు
నిన్ను వాహనముగ c గయికొన్నవాడ,
గరుడగిరి యన నీ పేర c బరగుచుండు
నెలమి నా చంద్ర తారార్క మీ ధరంబు'

ఇందు విష్ణువు గరుత్మంతుని తపస్సుకు మెచ్చి, అతనిని వాహనముగా గ్రహించినాడు అతడు తపస్సు చేసిన కొండకు 'గరుడాద్రి' అను పేరు ననుగ్రహించినాడు నేటికిని ఈ కొండ గరుడాద్రి గానే పిలువబడుచున్నది గరుడాద్రికా పేరు వచ్చుట ఈ గ్రంథమునందిట్లు చెప్పబడినది

ప్రహ్లాదుని పద్యమును వర్ణించిన పద్యమిది

సీ॥ కుటిలుఁ డై యెపుడైన కోపించు టెరుగడా
ధీరుండు తన్నారుల్ దూరుచున్న,
ఆటలనైన బొంకాడ నెఱుంగడా,
యనఘుఁ డే ముప్పు తన్నెనయుచున్న,
కలనైన హరిభక్తి చలియించు టెఱుగడా,
ఘనుడెన్నివికలముల్ కలుగుచున్న
పిన్నయై యడుగ లేదన్న మాటె ఱుఁగడా,
పుణ్యాత్మ్రి వంచకుల్ ఖూనుచున్న

గీ॥ నట్టి శాంతజ్ఞుఁ డట్టి సత్యవ్రతాఢ్యు,
డట్టి భాగవతోత్తరుండట్టి దాన,
శీలుఁ డసమానుఁ డంచు లోకాళి పొగడ,
నమల గుణపాదుఁ డైన ప్రహ్లాదుఁ డౌనరో'

శాంతము - సత్యము -హరిభక్తి - దానశీలము గలవాడు ప్రహ్లాదుడను విషయమును క్రమాలంకారములో కవులు చెప్పిరి సీసము 4 పాదాలలో వరుసగా నున్న గుణములను ఎత్తు గీతిలో వరుసగా కూర్చినారు కుంటువడని రచనగానుండి, ప్రహ్లాదుని గుణ గణాలను చక్కగా నిరూపించిన కవితారీతియిది

నృసింహు రౌద్రమును వర్షముగా వర్ణించిన రీతి యిది

కం॥ కనుకొనల నగ్నికణములు, ఘన విద్యుల్లతలుఁ గాగ, గర్జలురుములై
యెనయుగఁ బొగలు మొగుళ్ళై, ఘన రౌద్రపు వృష్టిగురిసియ గలఁ గవెజగముల్[15]

కనుల చివరలలో వెలువరించు అగ్ని కణాలు - మెఱపు తీగలుగా, గర్జనలు ఉరుములుగా, పొగలు మేఘాలుగా - నరసింహ రౌద్రమను వర్షము కురిసినదని భావము 'అల్పాక్షరముల ననల్పార్థ రచన' కావించు జంటకవుల కవిత్వమున కది నిదర్శనము

'శిఖి నరసింహాశతకము' -అను శకున శాస్త్రము శకునములను తెలుపు చిన్ని పొత్తమైనప్పటికి నరసింహస్వామి కంకిత మియ్యబడినది 'శిఖి నరసింహా' - అను సంబోధన గల యీ పొత్తమున 308 కంద పద్యములు గలవు

ఈ పుస్తక ప్రారంభ పద్యాలలో -

కం॥ 'సిరులలరిన శకునములకు, నెర యోజకులైన యశ్వినీ దేవతలన్
గురుతర భక్తి నుతింతును సిరివర! శుభములొసగు శిఖి నరసింహా! [16]

మంచి శకునములను సమకూర్చు అశ్వనీదేవతలకు కవి నమస్కరించు చున్నాడు

శుభాశుభశకునాలు, ప్రయాణ దినములు, బల్లి పలుకు శకునాలు, తుమ్ముల శకునము, తొండపాటు, బల్లిపాటు, సర్పదర్శన శకునము, మార్జాల,శునక శకునాలు, జంబుక, గరుత్మంత, వాయస శకునాలు, వైద్యశకునాదులు, శకున శాంతి - ఈ శతకమున గలవు

బల్లి శకునమునకు ఉదా॥

కం॥ తన మేనమామ గండము, విను తలఁబడ, ముందలయును విత్తము గీడున్,
కొన వెంద్రుకలను మరణము, చినయోబళగిరి విహార! శిఖి నరసింహా!

బల్లి తలమీద పడిన - పడిన వాని మేనమామకు చెరుపు తలకు ముందు భాగమున పడిన ధనహాని కలుగును వెంట్రుకల కొన యందు పడిన మరణము సంభవించును అని యర్థము

నందవరం ఓబయమంత్రి రచించిన యక్షగాన కృతి 'గరుడాచలవిలాసము' చెంచు వనితకు, నరసింహ స్వామికి జరిగిన కళ్యాణమును వర్ణించు కృతియిది

గరుడాద్రిపతి కంకితముగా రచించిన యక్షగానంబునకు కథాక్రమము - అని (జంపెతాళము) -

'రథ గజాశ్వ పదాతి, రమణీయ సంకులము
పృథుల పుణ్య స్థలము పెదయహోబలము

నలువొందునట నాది నారాయణుండు'

అని కవి పల్కెను చతురంగ బలములతో కూడిన పుణ్యస్థలమైన అహోబలము నందు ఆదినారాయణుఁడు నివసించుననుట

చివరగా ఆట తాళమున గల రచన -

'చెంచు బలగము నేలిన వారిలోఁ, జెలియతానూ!
మెలగుచు చెంచు యోబళపతి యనంగఁ బ్రసిద్ధి కెక్కెన్ ॥
ధరణిలో, దనునమ్మి కొలిచిన దాసులకునూ
వరములు కరుణతో నొసగుచును విశ్వాకారు ఁ డగు చూ ॥
సత్యమూర్తి యనంగ గరుడాచలము నందూ
బాయక నిత్య నిరుపమ వైభవంబుల నెగడు చుండెన్ ॥

చెంచువనితతో కూడుటచేత స్వామి 'చెంచుయోబళపతి' యని ప్రసిద్ధి కెక్కెననియు, తనను నమ్మి సేవించిన వారికి 'సత్యమూర్తి' - యని

పిల్వబడుననియు - గరుడాచలమున వైభవముతో వసించుననియు పై రచనలో చెప్పఁ బడినది

నరసింహ స్వామిని స్తుతించు 'ఔబళ నారసింహ శతకము' [17]ను రచించిన కవి యెవ్వరో తెలియదు మత్తకోకిల వికారమనఁదగు గేయ రచనమున నీ శతకము గలదు

నరసింహ స్వామిని స్తుతించు 'ఔబళ నారసింహ శతకము' ను రచించిన కవి యెవ్వరో తెలియదు మత్తకోకిల వికారమనఁదగు గేయ రచనమున నీ శతకము గలదు

'శ్రీరమాపతి సృష్టినాయక వారి జాసన వందితా
లేరు నీ సరి వేల్పు లెన్నగ వీర యౌబళ నారసింహా!
శ్రీమతే రామానుజాయని స్వామియని నెమ్మనమున
నీ మహిమలే విస్తరించెదఁ బ్రేమ నౌబళ నారసింహా!
ముదమునను నరసింహ శతకము చదివి చెప్పెడి వారికి
ఖదిలముగ నొసంగుదువు కోరిన వరము ఔబళ నారసింహా'

నీ సరి వేల్పు లెవరు లేరు, రామానుజాయని తలంచి నీ మహిమలను వివరింతును అనియు పల్కుచు - చివరలో నరసింహ శతకము చదువు వారికి, వినువారికి కోరిన వరము లిత్తువని స్వామిని సంబోధించుట జరిగెను [18]

పదకవితా పితామహుడైన అన్నమయ్య రచించిన వేలకొలది కీర్తనలలో అధిక భాగము తిరుమల వేంకటేశ్వర స్వామిపైననే పలికెను ఆ తర్వాత అత్యధిక సంఖ్యలో నరసింహస్వామిపై నుడివినాడు అన్నమయ్య శ్రీమన్ శఠగోప యతి వద్ద నృసింహ మంత్ర రాజమును గ్రహించినాడు నేడు క్రింది అహోబిలములో ప్రహ్లాద వరద నరసింహ స్వామి గర్భాలయములో శఠగోపయతి - అన్నమయ్య విగ్రహ రూపాలలో వెలుగొందు చున్నారు

**అన్నమయ్య రచించిన సంకీర్తన మిది -**

పల్లవి - ఫాల నేత్రానల - ప్రబల విద్యుల్లతా
కేళీ విహార ల - క్ష్మీ నారసింహా

చ 1 ప్రళయ మారుత ఘోర - భస్త్రికా పూత్కార
లలిత నిశ్వాస డో - లా రచనయా
కులశైల కుంభినీ - కుముద హిత రవిగగన
చలన విధి నిపుణ ని - శ్చల నార సింహా!

చ 2 వివర ఘన వదన దు - ర్విధ హసన నిష్ఠ్యూత
లవ దివ్య పరుష - లాలా ఘటనయా
వివిధ జంతు వ్రాత - భువన మగ్నొకరణ
నవనవ ప్రియ గుణా - ర్ణవ నారసింహా!

చ 3 దారుణోజ్జ్వల ధగ - ద్ధగిత దంష్ట్రానల వి
కార స్ఫులింగ - సంగ క్రీడయా
వైరి దానవ ఘోర - వంశ భస్మీకరణ
కారణ ప్రకట వేం - కట నార సింహా!

(అన్నమాచార్యుల అమృతవర్షిణి 116 పేజీ - ఐ.వి. సీతారావు)

సంస్కృత భాషలో రౌద్ర స్ఫూర్తితో సాగిన సంకీర్తన మది ఈ కీర్తనలో ప్రతి చరణము ఒకే సమాసములో ఘటింపబడినది సంకీర్తనా చార్యుని సంస్కృత భాషాధి కారమున కిది సంకేతము

పై పల్లవిలో నుదుటిపై అగ్ని రూపమై, ప్రబల విద్యుల్లతతో కేళి సల్పు లక్ష్మీ నారసింహుని సంబోధించినాడు అన్నమయ్య

మొదటి చరణములో ప్రలయకాల ఝుంఝూ మారుతముతో సమానమైన భయంకరమైన పూత్కారమను ఉచ్ఛ్వాస నిశ్వాసములచే కుల పర్వతములను రవి, చంద్ర, భూ, గగనాదుల నుయ్యాల లూపుచున్నను నిశ్చలముగా నున్నావని నరసింహ స్వామిని అన్నమయ్య ప్రశంసించినాడు

రెండవ చరణమున ముఖము తెరవగానే దుస్సహమైన అట్టహాసము కల్గినదనియు, ఉమిసిన వెంటనే కలిగిన లాలాజలము చేత సకల చరాచర జగత్తును లయింపజేయగల శక్తి కల్గినదని స్వామి రౌద్ర స్వరూపము వర్ణింపబడినది

మూడవ చరణమున స్వామి దంతాలు ఉజ్జ్వలమై, ధగ ధగ మెరయుచున్నవనియు, అందుండి జ్వాల లుదయించు చున్నవనియు అందుండి నిప్పురవ్వలు వెడలు చున్నవనియు - అవి శత్రువులైన ఘోర రాక్షసుల వంశాలను బుగ్గి చేయ శక్తి వంతములని అన్నమయ్య పలుకుచున్నాడు

మొదటి చరణమున స్వామి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు - రెండవ చరణమున స్వామి మహాట్టహాసము - తృతీయ చరణమున స్వామి నుండి వెలువడు జ్వాలల నిప్పురవ్వల సెగ కఠిన సంస్కృత సమాసములలో అన్నమయ్య నిబంధించినాడు తెలుగులో నైషధమున శ్రీనాథుని రచనవలె సాగిన రచనమది అహోబల దేవస్థానము వారు నేడనుదినము వేయి కాసెట్లలో నరసింహస్తుతిగల అన్నమాచార్య కీర్తనలు గలవు

'అహర్నిశం ఒక దినము అహోబిలంలో ఉండి
అహోబిల స్వామికి పూజలు మనం చేస్తాం రండి
ఉగ్రవీర నరసింహ ఊర్ధ్వ రేతస్సు గలవాడే
మహావిష్ణు రూపమయ్యా నరసింహ అవతారం
జ్వలంత నేత్రం చూస్తుంటే
రవి ఇందులు కాబోలు
సర్వతో ముఖము నీది
సుందరము సుందరమూ ॥ అహర్నిశం ॥
నృసింహ మంత్రం శ్రేష్ఠమయ్యా
మంత్రములలో గొప్పదయ్యా
భీషణం అతని రూపం
అసురులకు ఎల్లవేళా
భద్రమయ్యా మన కంతా
నారసింహుడుండు వరకూ
మృత్యు మృత్యు భయం లేదు
నారసింహ రక్ష మనకూ ॥ అహర్నిశం ॥

రాత్రింబవళ్ళు, 24 గంటలు, ఒకరోజు అహోబిలములో వసించిన అన్నమయ్యకు అనిర్వచనీయమైన దివ్యానుభూతి కలిగినట్లు పల్లవిని బట్టి తెలియుచున్నది

అన్నమయ్య అహోబిలములో వెలసిన ఆదివన్ శఠకోపయతి వద్ద వేదాంత రహస్యాలు తెలిసికొన్నాడు నృసింహావతారము మహా విష్ణువు యొక్క రూపమే అంటాడు స్వామి దివ్య కాంతులీను నేత్రము సూర్యచంద్రుల యేకాకృతి యనునను మంత్రములలో కెల్ల నరసింహ మంత్రము శ్రేష్ఠమనుచున్నాడు బహుశః శఠగోపయతి బోధించిన మంత్ర మిదే నేమో! స్వామి స్వరూపము అసురులకు భీషణమైనను, భక్తులకు శుభంకరమనుచున్నాడు నరసింహస్వామి చెంత నుండు వరకు మృత్యుభయము లేదనుచు, ఆ స్వామి మనకు రక్షయని పలుకు చున్నాడు
నరసింహ స్వామికి జయజయ ధ్వానములు చేయు మరియొక కీర్తన

'ఓం నమో నరసింహాయ
జై జై అంటూ జై బోలో నరసింహా ॥ ఓం నమో ॥
పక్షిగిరి శిఖరాన భవనాశి తీరాన

భక్త వత్సల పాలనకై
వచ్చెనులే నర కేసరి ॥ ఓం నమో ॥

బాల భక్తితో రక్షణకై
దాన వేంద్ర శిక్షణకై
ధరణి లోకి దిగి వచ్చెనులే
నరహరి మము రక్షించు ॥ ఓం నమో ॥

పన్నగ శయనములో
పవ్వళించిన ఓ స్వామీ
నిన్ను మేము సతతమూ
గానం చేయు బుద్ధి నిమ్ము ॥ ఓం నమో ॥

ఇక్కడ పక్షిగిరి యనగా గరుడాద్రి గరుడాద్రికి పర్యాయముగా చక్కని పదమును అన్నమయ్య ప్రయోగించినాడు

భక్తి గల బాల ప్రహ్లాదుని రక్షించుటకై, అమేయ బల పరాక్రమాలుండి, మూర్ఖుడైన రాక్షసరాజు హిరణ్యకశిపుని శిక్షించుటకై దివినుండి భువికి స్వామి దిగివచ్చినాడట పన్నగ శాయి యైన విష్ణు స్వరూపమే నరహరిగా అవతరించెనని, అతనిని గానము చేయు బుద్ధి నివ్వమని అన్నమయ్య ప్రార్థించినాడు

నవవిధ భక్తులలో గానము సైతమొకటి విష్ణువును గానము చేసి, నారదాది భక్తులు తరించినారు నరసింహస్వామి భక్త వత్సలుడట! విశ్వమును మోయు వారిలో ఆదిశేషుడొకడు సహనమునకు పరాకాష్ఠ అతనిని శయనముగా గల మహాను భావుడు స్వామి

అన్నమయ్య లక్ష్మీనృసింహు దివ్య స్వరూపమును, అవతార విశేషములను వర్ణించుచు, ఎన్నో కీర్తనలు రచించినాడు అన్నమయ్య ఎగువ, అహోబల క్షేత్ర మూర్తులనే గాక సింహాద్రి, వేదా చలము, కనకగిరి క్షేత్రములలో నెలకొన్న నరసింహ స్వామిని కీర్తించినాడు అన్నమయ్య నరసింహస్వామిని, శ్రీరాముని, శ్రీకృష్ణుని - ఏ దైవమును కీర్తించినను సకల దేవతల స్తుతిలోని చివరి చరణాలలో శ్రీవేంకటేశ్వరునితో నభేదమును కల్పించి, కీర్తించినాడు

'అనాది జగమున కౌభళము
అనే కాద్భుతం బౌభళము
తగు శ్రీ వెంకట ధామంవిహారం
బగు శుభాంచితం బౌభళము' (సంపుటి10 కీర్తన29)

జగమున కంతకు అనాదియైనది అహోబలము అద్భుతావహమైనది శుభలక్షణోపేతమైనది ఆక్షేత్రము। పై సంకీర్తన తృతీయ పాదములో శ్రీ వేంకటధామం - అనగా తిరుమల యని అన్నాడు అతనికి అహోబలములోను తిరుమలయే కనిపించును తిరుమల శ్రీ వేంకటేశ్వరునిపై అనేకానేక కీర్తనలు వ్రాసినను, తాను అహోబల స్వామి పైనను అన్నమయ్య ఎన్నో కీర్తనలు రచించినాడు

'నవ నారసింహా నమోనమో

భవనాశితీర యహోబల నారసింహా'

భవనాశి తీరమున నవ నారసింహులు కలరు వానిలో వెలసిన నరసింహస్వామీ। - వందనమని కవిపై కీర్తనలో పలుకు చున్నాడు

భవనాశినీ తీరములో సాగు లక్ష్మీనృసింహుల లీలా విహారాలకు సైతము అన్నమయ్య -

'ఇంతులార చూడరమ్మ ఇద్దరు జాణలే వీరు'

----------------------------

--- నిందిర నంటె శ్రీ నరసింహుడు' -

ప్రబంధాలలో నాయికా నాయకుల జలక్రీడా విహారములను పోలిన వర్ణన పై సంకీర్తనలో కనిపించును

అన్నమయ్య కాలమునాడు సైతము నృసింహ జయన్తి జరుగునట్లు క్రింది సంకీర్తన తెలుపుచున్నది

'జగతి వైశాఖ శుద్ధ చతుర్దశి మందవార

మగణితముగఁ గూడెనదె స్వాతి యోగము'

ఒక సంవత్సరము వైశాఖమాసము - శుద్ధ పక్షము - చతుర్దశీ తిథిని శనివారము నృసింహ జయంతి జరిగినదని అన్నమయ్య పై కీర్తనలొ తెలిపినాడు



భార్గవ నరసింహా



యోగానంద నరసింహా



ఛత్రవట నరసింహా



కారంజ నరసింహా



అహోబిల నరసింహా

# చాగలమర్రి మండలము
# చెన్నకేశవ స్వామి
## చాగలమర్రి

చాగలమర్రి మండల కేంద్రములో వెలసిన చెన్నకేశవ స్వామిపై అన్నమయ్య వ్రాసిన కీర్తనలు లభించినవి

'చెందితి శ్రీ వేంకటేశ చేగల మర్రిలో నన్ను
మందలించ బోతేను మతకమే కాదా! (27సం - 205 కీర్తన)
కావించి కూడితివి చేగల మర్రి చెన్నుడవై
శ్రీవేంకటేశుడ - ఇంక జెల్లునీకు నన్నియు (13సంపుటి - 451 కీర్తన)
ఇచ్చులోని దాన నేను ఇన్నిటా నీకు
గుచ్చు లేమిటికి రా చేగలమర్రి చెన్నుడా (26 సంపుటి - 162 కీర్తన)

పై సంకీర్తనలలో అన్నమయ్య చెన్నకేశవుని కీర్తించినను వేంకటేశ్వరునే సంబోధించినాడు అన్నమయ్య దృష్టి యంతయు వేంకటేశ్వరుని పైననే వైష్ణవ సిద్ధాంతములో మధుర భక్తికి ప్రముఖ స్థాన మీయబడినది విశ్వమందలి ప్రాణులన్నియు స్త్రీలు కాగా భగవంతుడొక్కడే విష్ణువనుట ఈ సిద్ధాంత సారము

చాగలమర్రి చెన్నకేశవా! నిన్ను శరణుఁ బొందితిని నన్ను మందలింప దలచితివేని అది మోసమే సుమా! అని పలుకు చున్నాడు పద కవితా పితామహుడు నమ్మిన వానిని నట్టేట ముంచవద్దనుట భావము నన్ను రక్షించుటకై నీవిట అవతరించినావు నీ వెచట నున్నను నీకు చెల్లునండూ ఇవి అనగా ఎక్కడున్నను నీవు రక్షింపవలసినదే యనుట నీకు నే నిష్టమైన దానిని నీవు నన్నింకను పరీక్షించుటెందుకు? అని అన్నమయ్య ప్రశ్నించుచున్నాడు. భక్తుడు దేవునితో మాట్లాడుట కవుల రచనలలో కనిపించును నిజముగా భక్తునికి దేవుడు సమాధానమీయక పోడు

'సిగ్గుగల యాడదైతే జేరవచ్చునా ?
ఒగ్గినే కాఁ గానీతో నొక్కటైతిఁ గా' (3-567)

సిగ్గుగల స్త్రీ నిన్ను చేరరాదు నేను తలవంచి నీతో కలియవచ్చితినని అన్నమయ్య పలుకుచున్నాడు జీవాత్మ - పరమాత్మల యైక్యమును అన్నమయ్య ఇటు ధ్వనింపజేసినాడు ఇట్లు అన్నమయ్య కీర్తనలలో వైష్ణవ భక్తి సిద్ధాంతాల చక్కగా ప్రతిపాదింపబడినవి

'చెన్నకేశవ స్తుతి' పేరిట చాగలమఱ్ఱికి చెందిన ప్రముఖాష్టావధాని మాచిరాజు శివరామరాజు రచించిన పద్యములు లభించినవి

చం॥ ' రమణఁ జతుర్భుజంబుల మురారి! చతుః పురుషార్థ దాన చి
హ్నముగ ధరించినావు, భువనత్రయ రక్షణ దీక్ష నూర్ధ్వ పుం
డ్రముల ధరించినావు, వృజినంబులఁ బాప సుర స్రవంతిఁబా
దమున ధరించినావు, వినతావన! చాగలమఱ్ఱి కేశవా!

స్వామి అవయవాలను అలంకారములను సార్థకముగా ధరించెనని అష్టావధాని మాచిరాజు పై పద్యమున పల్కినాడు చతుర్విధ పురుషార్థములను ధర్మార్థ కామ మోక్షముల నిచ్చుటకై చతుర్భుజ ములను ధరించినాడఁట! స్వర్గ మర్త్య పాతాళములను - ముల్లోకములను రక్షించుటకై మూడు నామములను ధరించినాడట! పాపములను క్షాళితము గావించుటకై గంగానదిని పాదములందు ధరించినాడట! ఇట వకుళానది స్వామి పాదముల క్రిందపారుట స్థానిక వైశిష్ట్యము ఇట్లు చతుర్భుజాలు గల్గి యుండుట, ఊర్ధ్వ పుండ్ర ధారణము, గంగ పాదోద్భవ యగుట విష్ణువునకు సహజమయ్యెను - అందులకు కారణాలను సయుక్తికముగా సమర్థించి చెప్పుటలో కవి నైపుణ్యము వ్యక్తమగుచున్నది

చం॥ 'వర వకుళానదీ శిశిర వాయు తరంగ సదాభిషిక్త సుం
దరపుర 'చాగ్లమఱ్ఱి' ని నతాభ్యుదయంకరణ ప్రవీణతా
స్థిరమతిఁ బ్రాఙ్ముఖుండవయి, తేజముతోఁ బదు నాల్గుస్తంభముల్
వఱలు గుడిన్ జగత్ పతిగ భాసిలు చుంటివి చెన్నకేశవా'!

వకుళానది (వక్కిలేరు) యొక్క శిశిర వాయు తరంగాలతో సంతతము అభిషేకింపబడిన సుందర పురము చాగల మఱ్ఱి యఁట! తూర్పు ముఖముతో స్వామి యుండుట తెలుపుచున్నాడు పదునాల్గు లోకాలకు ప్రభువని తెల్పుటకో యన్నట్లు ఆలయములో పదునాల్గు స్తంభాలు గలవని స్వామి స్తంభాల యునికి సార్థకమని తెల్పు చున్నాడు ఇట్లు చాగల మఱ్ఱి చెన్నుని కీర్తించిన మాచిరాజు ధన్యుడు

# కోవెలకుంట్ల తాలూకా
# ఉయ్యాలవాడ మండలము
# కంబగిరి స్వామి, సుద్దమల్ల

ఉయ్యాలవాడ మండల కేంద్రమునకు 5 కి మీ దూరమున వెలసిన కంబగిరి స్వామిపై విరచితమైన సాహిత్యము ఇట పరామర్శింపబడును

'సుద్దమల్ల కంబగిరి గేయ శతకము' అను చిరు పొత్తమును తద్గ్రామ ప్రజల ప్రార్థనను పురస్కరించుకొని వైద్యం వేంకటేశ్వరాచార్యులు విరచించెను

'సురకిరీట మణి ప్రభాంచిత
శోభితాంఘ్రి సరోరు హా!
కరుణతో మము గావరాగదె
కంబగిరి లక్ష్మి నృసింహా!' -

సంస్కృత సుప్రభాత స్తోత్రములను బోలుచు, మూడవ పాదమున ఆంధ్రత్వముతో స్వామిని కవి రక్షింపమనుచున్నాడు దేవతల కిరీట ములందలి మణులచేత ప్రకాశింపబడు పాద పద్మాలు గలవాడా! అని పాద ద్వయార్థము దేవతలందరి చేత నమస్కరింపబడు వాడు కంబగిరి స్వామియనుట సారాంశము శంకరాచార్య విరచిత 'లక్ష్మి నృసింహస్తోత్రమ్' లోని - 'బ్రహ్మేంద్ర రుద్ర మరుదర్క కిరీటకోటి సంఘట్టి తాంఘ్రి కమలామల కాంతి కాంత' - అను శంకరాచార్య శ్లోక పాదములను స్ఫురించు గేయ పాదములివి

'స్వామి! తాపత్రయ మహానల
తప్త సంకట హృదయుడన్
కామితార్థద! కృపామృతమిడు ॥కంబగిరి॥

తాపత్రయములను అగ్ని - రూపకము తాపత్రయాగ్ని తప్త హృదయమునకు దయయనెడి అమృతము నిమ్మని కంబగిరి స్వామిని కవి ప్రార్థించు చున్నాడు చారు పటు వాగ్ధారతో నిను నుతింతునని మునుపు చెప్పిన కవి తన మాట నిట్లు సార్థకము చేసికొనుచున్నాడు

పదదళ సార్థక్యముతో కూడిన గేయమీ క్రిందిది

'ఘోర సంసరణమ్ము నాబడు
కూపమున కూలితిని సుగుణా
గార! చక్రీ! చేదికో గదె ॥కంబగిరి॥

సంసారమను కూపమున బడిన తనను చేదుకొనుమను చున్నాడు కవి! సుగుణాగార అనగా మంచి తాళ్ళకు నిలయమైన వాడా! అని

యర్థాంతరము సద్గుణాలకు నిలయమైన వాడనుట పైకి కనిపించు నర్థము చక్రీయనగా చక్రాయుధము గలవాడనుట అర్థము చక్రము గల గిలక అనునది అంతరార్థము చేదుకొనుటకు గిలక గలవాడు స్వామి యనుటశ్లేషాలంకారయుత చమత్కారగేయమిది ఈ క్రింది గేయమును ఆ కోవలోనిదే

స్వామి! సంసరణోరు భీకర
సర్ప దంష్ట్రా దష్టుడను ఖగ
గామి! ప్రోవు సుధాబ్ధినిలయా ! ॥కంబగిరి॥

సర్పమునకు గరుత్మంతుడు శత్రువు గరుడరేఖ గలవాని దగ్గరకు పాముచాదు గరుడ స్మరణము వల్ల సర్ప బాధ నివారింపబడును పాముకాటు తిన్నవానికి గరుడ మంత్రము కావలెననియు అమృత మందించవలె ననియు కవి ఆశయము ఖగగామి, సుధాబ్ధి నిలయా - అను సమాసాలు సార్థక ప్రయోగములు ఇట్లు గేయ శతకము ఆలోచనామృతమై కొనసాగును

సుద్దమల్లలో భజన సుబ్బన్న గానము చేయు తత్వములో నొకటి -

పురమె సుస్థిరమైనది సుద్దమల్ల హరికి కాపురమైనదీ
పురమె సుస్థిరము శత్రుల భీకరము మౌనుల మోక్షకరము
మోహ మద మాత్సర్యము దుర్బుద్ధి కావరము లణచునట్టిపురము
చేరిన పాపహరము ఆహా! శ్రీకరము ॥పురమె॥

విష్ణువు వసించు సుద్దమల్ల పురము స్థిరమైనది, శత్రు భీకరమైనది, మునులకు మోక్షమందించినట్టిది, మోహాద్యరిషడ్వర్గములను నశింప జేయునది ఐన సుద్దమల్ల పురము శ్రీకరమైనదని పై తత్వకర్త యభిప్రాయము ఇత్యాదిగా తత్వము సుదీర్ఘముగా సాగును



కంబగిరి లక్ష్మీ నరసింహ స్వామి

# కొలిమిగుండ్ల మండలము
# లక్ష్మీనరసింహస్వామి,
# కొలిమి గుండ్ల

కొలిమిగుండ్ల మండల కేంద్రమున ఎత్తైన కొండపై వెలసిన భక్తుల కొంగు బంగారమైన దైవము లక్ష్మీనరసింహ స్వామి

ఆ స్వామిపై కొలిమి గుండ్ల మండలము నందిపాడు నివాసి, సహజ పండితురాలు నందిపాటి శేషమ్మ ' శ్రీ కొలిమి గుండ్ల లక్ష్మీ నరసింహ శతకము' ను రచించినది

'శేషమ్మగారి రచనలు నిద్రాణమైన చైతన్యాన్ని తట్టి లేపి', నిక్షిప్తమైన జ్ఞాన ఖనిని వెలికి తీసి వెదజల్లునవి ప్రగతి రథ చక్రాలకు జీవము పోయునవి మూర్ఖులకు జ్ఞానగవాక్షము వంటివి' అని యొక సహృదయుని అభిప్రాయము [20] క్రింది పద్యమును చూచిన పై విషయము స్పష్టమగును

సీ॥ అజ్ఞాన మనెడి మహాంధ కారంబునఁ, బడితినీ జ్ఞాన దీపంబొసంగు
తీరని దుఃఖ సంసారాబ్ధిలోపలఁ, గ్రుంకితి దరిని నన్నింకఁ జేర్చు
కడు విపద్దశలను కార్చిచ్చులోపలఁ గ్రాగితి c జల్లార్చి వేగఁ బ్రోవు,
కలుషంబులను ఘోర గగన మధ్యంబున, జిక్కితిఁద్రోవ పెంపెక్కఁజూపు,

గీ॥ మంత్య కాలంబుననను గల్గునాపదలకు జడిసితి రయంబునను వచ్చి జరుపు దీర్చు,
కుజన గణభీమ! శ్రీ కొల్మిగుండ్ల ధామ, నతభవబ్రహ్మ! శ్రీ వీరనారసింహ!'

పై పద్యములో కవయిత్రి అజ్ఞానమనునది మదాంధకార మనియు, నందులో పడిన తనకు జ్ఞానమను దీపంబొసంగు మనుచున్నది చీకటిలో నున్న వానికి దీపవెట్లవసరమో, - అజ్ఞానములోనున్న వానికి జ్ఞాన మట్లవసరమన్న మాట దుఃఖమనెడి సంసారములో కూరుకొని పోయిన తనను దరిజేర్చుమనుచున్నాడు కష్టదశలు కార్చిచ్చు వంటి వనియు అందుండి తనను చల్లార్చుమని వేడు చున్నదామె అడవిలో నున్నట్లుండి రావిడికి పుట్టు భయంకరమైన అగ్ని కార్చిచ్చు లౌకిక కష్టము లట్టివనియు, భగవద్భక్తి ప్రసాదించి, వానిని చల్లార్చుమని ఆమె ప్రార్థన పాపాలను ఆమె అరణ్య మధ్యముగా రూపించి, దారి తప్పిన తనకు దారి చూపించు మనుచున్నది పై పద్యము పై సహృదయురాలు పేర్కొన్నట్లు అజ్ఞానికి జ్ఞాన ప్రబోధము

కల్గించునదై, నిద్రాణ చైతన్యమును లేపి, జ్ఞాన ఖనిని వెలికి తీయునదిగా నున్నది పైగా, పై పద్యములో చక్కని రూపకాలంకారము సైతము కలదు

'వ్యవహారిక సావాగ్రితో పాటు ఆధ్యాత్మిక తత్త్వమును జోడించి రచించిన కళాకౌశల మిందుట్టి పడుచున్నది జ్ఞాన దృష్టిలేని గ్రుడ్డి ధృతరాష్ట్రుల నెందరినో తన జ్ఞానాంజన శలాక చేత జ్ఞాన నేత్రము పొందిన అర్జునులుగా మార్చగలిగిన మహా జ్యోతి యనందగు' అని యొక పండితు డభిప్రాయ పడెను పై అభిప్రాయాలకు అనుగుణమైన పద్య మీ క్రిందిది (కాశీభట్ల మల్లికార్జున శాస్త్రి)

సీ॥ 'పలువురు పుత్రులన్ బడసిన ఫలమేమి
గాంధారి నూర్వురఁ గాంచలేదె
స్త్రీలపై మోహంబుఁ జెందిన ఫలమేమి
స్త్రీ c గోరి చావఁడే సింహ బలుడు
గర్వించి సతుల నెగ్గాడిన ఫలమేమి
యెగ్గాడి కర్ణుండు గ్రుగ్గలేదె
పరులను హింసించి భక్షింప ఫలమేమి
యిల్వలుండు భుజియించి యీల్గలేదె

తే గీ॥ పాతకంబు లొనర్చిన ఫలమదేమి
కుటిలుడై చేసి కంసుండు గూలి పోఁడె ॥కుజన॥ (38)

వందమంది కుమారులను గన్న గాంధారి వారి దుష్టత్వ కారణముగా తన కండ్ల యెదురుగా వారి మరణమును గాంచిన దనియు, స్త్రీ వ్యామోహ (కామ) కారణముగా సింహబల బిరుదాంకితుడు చచ్చెననియు, నిష్కారణముగా ద్రౌపదిని నిందించిన కారణముగా కర్ణుడు గ్రుగ్గెననియు, పరులను హింసించి భక్షించిన కారణముగా ఇల్వలుడు మరణించెననియు, పాతక ఫలితముగా కుటిల కంసుడు కూలిపోయెననియు, పాతక ఫలితముగా కుటిల కంసుడు కూలిపోయెననియు - శేషమగు ప్రసిద్ధ పౌరాణికోదాహరణలతో లౌకికాధ్యాత్మిక నీతులను సులభ శైలిలో పై పద్యమున వివరించినది

వ్యాజస్తుతి అలంకార సహిత మీ క్రింది పద్యము స్తుతి చేత నిందగాని, నిందచేత స్తుతిగాని స్ఫురించుట వ్యాజ స్తుతి

సీ॥ అలకు చేలునకు భాగ్యం బొసంగి తినన్న
నెలమి నటుకులు దినియిచ్చినావు
వరుస పాంచాలికి వలువ లిచ్చితివన్న
చెల్లెలంచని మేలు సేసినావు

తిరముగా ధ్రువునకు వరము లిచ్చితివన్నఁ
జిరకాలము తపంబుఁ జేసినాడు
లలి విభీషణునకు లంక నిచ్చితి వన్నఁ
బరుల మర్మంబు నీకెఱుఁగ జెప్పె

తే గీ॥ అంబు జాతాక్ష! నీకు లాభంబు లేక
యెవరి కేమిచ్చితో దెల్పుమిపుడు నాకు ॥కుజన॥

లాభాపేక్షతోనే స్వామి ఆయా వ్యక్తులకు మేలు చేకూర్చినాడని పైకి నిందగ గోచరించినను - పర్యవసానము స్వామి స్తుతియే అటుకులిచ్చి నందు వల్లనే కుచేలునకు భాగ్య మిచ్చినాడనియు, చెల్లెలు వరుసగుట చేతనే నిండు సభలో పరాభవము పాలు కాబోవు పాంచాలికి వస్త్రదానము చేసెననియు, చిరకాల తపః ప్రభావము చేతనే బాల ధ్రువునకు వరము లిచ్చెననియు, శత్రువైన రావణాసుర ప్రాణవుర్మము చెప్పినందుకే విభీషణునకు లంకారాజ్య పట్టాభిషేకము గావించెననియు పై పద్యార్థము ఏమి చెప్పినను స్వామిని స్తోత్రము చేయుటయే శేషమాంబ పరమోద్దేశ్యము

ఇట్లు లౌకిక పారమార్థిక విషయాలతోఁ గూడిన నరసింహ స్తుతి గావించిన శేషమాంబ ధన్యురాలు

# కొలిమిగుండ్ల మండలము
# నందిపాడు ముకుందస్వామి
# నందిపాడు

కొలిమిగుండ్ల మండలము నందిపాడులో వెలసిన నంది పాటి ముకుందుని పై (చెన్నకేశవుని పై) నందిపాటి ముకుంద శతకమును రచించిన కవయిత్రి శ్రీమతి నందిపాటి శేషమ్మ

భక్తి నీతి భరితమైన కంద పద్య శతకమిది బాల్యముననే వైధవ్య మనుభవించిన శేషమ్మ జీవితమును భగవదర్పిత మొనరించి, ఆంధ్ర కవయిత్రులలో చేరినది దాదాపు షష్టిపూర్తిని ఇహలోకము లో గావించుకొని, స్వగ్రామము నందిపాడులో 1943 సం॥న పరమ పదించిన భక్త కవయిత్రి శేషమాంబ

లౌకిక చింతనా సక్తత ఇసుమంతలేనిది రచయిత్రి రాత్రింబవళ్ళు తన చిత్తము భగవంతుని పైననే లగ్నము చేసితినని క్రింది పద్యమున ఆమె పలుకుచున్నది

కం॥ 'తోయజ లోచన! చోద్యం
బాయెను మరి యేమొ తెలియ దాయె గదయ్యా!

రేయుంబవలును నిన్నెడ
బాయదు చిత్తంబు నందిపాటి ముకుందా! (30)

అట్లామె మానసము భగవంతుని పైననే నిలుచుట తన కాశ్చర్యము కలిగించుచున్నదని కవయిత్రి పలుకుచున్నది ఈమెది గీతాకారుడు చెప్పినట్లు నిజమైన యుక్త చేతస్సు, కానిదే అహర్నిశలు దైవమును ధ్యానించునా!

కం॥ 'సారమయా నీ నామము,
కోరమయా యితరమైన కోర్కుల, నింకన్
దూరమయా, పాపంబుల
పారమయా తలప నందిపాటి ముకుందా!' (38)

పై పద్యము కృష్ణ శతకములోని 'దండమయా విశ్వంభర' అను పద్యమును పోలియున్నది ముకుంద నామము సారవంతమైన దనియు, లౌకిక వాంఛలను తాను కోరననియు, పాపంబులను పారద్రోలుమనియు, కవయిత్రి పై పద్యమున దైవమును ప్రార్థించినది

స్త్రీ లొసగిన నైవేద్యమును అలయమున భగవంతుడు గ్రహించడని కొందరందరు దాని నాసరాగా చేసికొని కవయిత్రి శబరి యెంగిలి పండ్లను గ్రహించిన పైనమును క్రింది పద్యములో గుర్తు చేయుచున్నది

కం॥ 'చెలువ లొసంగిన వాటిని
నల మనమున సమ్మతింప వని యెదవేమో!
చెలువయగు శబరియొసగిన
ఫలములు గొనలేదె! నందిపాటి ముకుందా! (56)

శబరి ఫలముల వలె తన శతకమును గ్రహించుమని కవయిత్రి ముకుందుని పై పద్యమున ప్రార్థించినది

కవయిత్రి గురువుకడ సాహిత్య మభ్యసింపక పోయినను తన శతకములో శబ్దాలంకారములను భక్త్యావేశమున ప్రకటించినది

కం॥ 'కరివర పరిరక్షా! భీ
కర దానవ శిక్ష! భవ్య కౌస్తుభ వక్షా!
సరసీరుహ పత్రాక్షా!
భరిత మహానంద ! నందిపాటి ముకుందా! (35)

పాదాంతమునందును, పదాంతమునందును, వాక్యాంతమునందును ఒకే అక్షరము వచ్చుటను అంత్యాను ప్రాసము అందురు ప్రతి పదబంధముచివరగా 'క్ష' అను వర్ణము వచ్చినది కనుక ఇచట అంత్యాను ప్రాసము గలదు ఇందు పోతన దాగియున్నాడు

# కోవెలకుంట్ల మండలము

## పాండురంగ స్వామి

### కోవెలకుంట్ల

కోవెల కుంట్లలో వెలసిన పాండురంగ స్వామిని పదకవితా పితామహుడు అన్నమయ్య కీర్తించినాడు ఈ విఠల సంకీర్తన ప్రశంస అన్నమయ్య తో బాటీ తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు కూడా కొనసాగించినాడు [19]

అందు మొదటి కీర్తన పాండురంగస్వామికి సంబంధించినదిఈ ఈ అన్నమయ్య రచన

'రచ్చకెక్కితివి పండ రంగ విఠలా
వచ్చిదేరే వింతలోనె పండరంగ విఠలా
తతి నీవున్న చోటికి దగ్గర వచ్చిన నంతనే
రతి కూడితివి పండ రంగ విఠలా
గతియైన శ్రీవేంకటనాథ ఏలతివి
పతివై కోవెలకుంట్ల పండరంగ విఠలా'

తతి అనగా అదను మానసికముగా భక్తి భావరీతి కల్పించినాడు అన్నమయ్య నీవే గతి, నీవే యేడు గడవు, భర్తవని తన శరణాగతిని, మధుర భక్తిని పై కీర్తన లో పేర్కొను చున్నాడు

మరొక కీర్తన గోపాల కృష్ణునికి సంబంధించినది కోవెలకుంట్లలో గోపాల కృష్ణాలయము లేదు ఇచటి పాండురంగస్వామినే తిరుమలాచార్యులు గోపాలకృష్ణునిగా భావించినాడు తనను నాయికగ భావించి కృష్ణుని నాయకునిగా నెంచి కీర్తించిన ఈ కీర్తనలో మధుర భక్తి సంప్రదాయము కలదు





కోవెలకుంట్ల పాండురంగస్వామి ఆలయ ఉత్సవ విగ్రహాలు మరియు మూల విరాట్టు

'చెల్లెనీవు, సేసినట్టి చేత లెల్లాను
కొల్లలై కోవెలకుంట్ల గోపాలకృష్ణుడా
పేసారపు రతుల శ్రీవెంకట నాథ లోకరి
కోసమా కోవెలకుంట్ల గోపాలకృష్ణుడా!'

చేతలు చెల్లిపోయినవి కొల్లలు - అనగా చాల అని అర్థము పేసారపు అనగా ఏసరిక చెందుట ఇక్కడి రతి అనగా మానసిక భక్తి - మానసిక భక్తితో నేను నిన్ను చేరుదునని అర్థము

## దొర్నిపాడు మండలము

## చెన్నకేశవ స్వామి

## చాక రాజు వేముల

దొర్నిపాడు మండలము, చాకరాజు వేములలో గల చెన్నకేశవ స్వామికి సంబంధించిన సాహిత్యము తాళపత్రాల నుండి గ్రహించబడినది

'నందవరీక ప్రశంస' లో ఈ విషయాలు గలవు అందున్న మొదటి శ్లోకమిది

శ్లో॥ 'శాకాబ్దే శరబాణ నేత్రవిధు సంఖ్యాగే విరూపాక్షకే
తిర్థే చైశ్వర వత్సరే కపిలషష్ట్యాం కంచనార్యాయచ
కాచార్యాయచ పెమ్మనాఖ్య విదుషే పోతాఖ్య విప్రాయచ
గ్రామం చాకయ వేములం హరిహరం శ్రీ కామలాఖ్యందదౌ'

శక సంవత్సరం 1255 (క్రీ శ 1333) ఈశ్వర నామ సంవత్సరం కపిలషష్టి దివసమందున హరిహరరాయలు కంచన - కాచన - పెమ్మన - పోచన అనువారలకు 'చాకయవేముల' - అగ్రహారమునిచ్చెనని భావము దాని క్రింది శ్లోకములో -

శ్లో॥ కంచనః కాచనశ్చైవ పెమ్మనః పోతనస్తదా
కామలా ర్వరం యాంతి చత్వారశ్చ మహాజనాః॥

తర్వాతి మూడో శ్లోకంలో

శ్లో॥ శ్రీ లక్ష్మీయుత దేవరాయ విభు సాక్షాన్మండలీపాలితే
సోమాబ్ధిత్రయ భూగణాఖ్య శకవర్షేష్వతి తేష్వపి
చాకాపేముల భూసురేర్నిజపురీ మధ్యేస్థలే కల్పితం
మాఘే శార్వరి వత్సరే శుభ తిథౌ శ్రీ చెన్నరాయాలయమ్॥

దేవరాయులు రాజ్యము పరిపాలించినపుడు శా॥శ॥ 1371 సం॥ము (క్రీ శ 1371+78=1449) లో చాకరాజు పేముల గ్రామం మధ్యమున శ్రీ చెన్నకేశవాలయమును విప్రుల కొరకు నిర్మించడమైనది అది శార్వరీ సంవత్సరము మాఘమాసమట!

మొత్తముపై విజయనగర సామ్రాజ్యమును పాలించు హరిహర రాయలు - దేవరాయల కాలంలో చాకరాజుపేముల గ్రామము విప్రులకీయబడినదటు అది అతి ప్రాచీనమైనట్లు ఈ రచనను బట్టి తెలియుచున్నది ఇది ఈ దేవాలయము సాహిత్యము

## నంద్యాల తాలూకా, గడివేములమండలము
## భాను మండలస్థ లక్ష్మీనారాయణ స్వామి, గని

1 అభివందన బృందావని

2 అభినందన సుప్రభాతము - అనుపేర కలుగోట్ల

విజయాత్రేయ, గని నివాసి వ్రాసిన చిరుపొత్తము ఈ ఆలయ సంబంధిత సాహిత్యము

మొదటి భాగము నందు ఆలయ పునరుద్ధరణ కర్త, అవధూత కాశిరెడ్డి నాయన నభినందించిన విషయము కలదు 22 పద్యాలీ భాగమున కలవు ఉదా -

ఉ॥ 'అందరు నాయనా! యని ప్రియమ్మున బిల్తురునిన్ను, స్వామి! నా
కెందుకొ అమ్మవోలె గనిపింతువు, పూజలు సల్పుచుంటి, నే
నందులకే జగజ్జనని యంచు హృదంబుజ భర్మపీఠి జె
న్నొందగ, నీ జగన్నుత వియన్నుత కాంతులు కాశిదేవరా!'

అందరు ప్రజలు కాశిరెడ్డి గారిని నాయనా యని పిల్చుచుండగా, తనకమ్మ వలె కనిపించు ననియు, అట్లే తాను ధ్యానింతు ననియు, కవి పల్కుచున్నాడు

తే గీ॥ నీ నిరాడంబర మధురాఖ్యా నమునకు
నీ వినిర్మల భక్తి సంభావనలకు,
నీ విలక్షణ కించిదు న్మీల్య నయన
రేకలకు సవినయ నమో వాకములివె' -

భక్తి భావాలకు, అరమోడ్పు కనుల గమనమునకు - తాను నమస్కరింతు నన్నాడు కవి

ద్వితీయ భాగము నందు లక్ష్మీనారాయణ స్వామి మేలుకొలుపు కలదు.
18 పద్యాలు, 1 శ్లోక మిందుకలవు

తే గీ॥ 'భవ్యగనిపుర భ్రాజ విభ్రాజ మాన,
మధుర మధురానదీ తట మంజునిలయ!
భాను మండల నారాయణా! నమోస్తు
లెమ్ము లేలెమ్ము సుప్రభాతమ్ము నీకు '

ద్వితీయ భాగము నందు లక్ష్మీనారాయణ స్వామి మేలుకొలుపు కలదు
18 పద్యాలు, 1 శ్లోక మిందుకలవు

తే గీ॥ 'భవ్యగనిపుర భ్రాజ విభ్రాజ మాన,
మధుర మధురానదీ తట మంజునిలయ!
భాను మండల నారాయణా! నమోస్తు,
లెమ్ము లేలెమ్ము సుప్రభాతమ్ము నీకు '

సూర్య మండలము చుట్టుగానున్న లక్ష్మీనారాయణ స్వామి యగుటచే - ఈ దేవుడు భానుమండలస్థ లక్ష్మీనారాయణ స్వామి యైనాడు ఈ జిల్లాలో ఒక ప్రత్యేక విగ్రహమిది మధురానదీ తీరమున గనిపురమున ప్రకాశించు భాను మండల నారాయణ స్వామికి నమస్కరించుచు సుప్రభాతము పాడుచున్నాడు కవి

తే గీ॥ 'అష్టదిక్పాలకాది యుత్కృష్ట దివిజ,
వర్గము నవగ్రహములు సప్తర్షివితతి
ఫణులు నరులును భక్తి కొల్వందినారు
లెమ్ము లేలెమ్ము సుప్రభాతమ్ము నీకు'

స్వామి! అష్టదిక్పాలకాది దేవతలు, నవగ్రహములు, సప్తర్షులు, ఫణులు, నరులు నిన్ను సేవింప వచ్చినారు నీవు లెమ్ము, లేలెమ్ము, సుప్రభాతమగును గాక! అని పద్యార్థము

స్వామి ప్రహరీగోడలోనే పై దేవతాదులుండుట సత్యవర్ధన

తే గీ॥ 'పాంచజన్య సుదర్శన ప్రాభవాన,
శార్ఙ్గ కౌమోద నందకోజ్జ్వలత మెరయ
కౌస్తుభ ప్రభ కల్యాణ కళలు వెలుగ
లెమ్ము, లేలెమ్ము సుప్రభాతమ్ము నీకు'

విష్ణువు శంఖము పాంచజన్యము, చక్రము సుదర్శనము, విల్లు శార్ఙ్గము గద కౌమోదకము, కత్తి నందకము, వక్షస్థలమణి కౌస్తుభము, విష్ణువు

ఆయుధాలన్నిటిని పేర్కొనుచు తత్కాంతులతో కవి మేల్కొను మనుచున్నాడు

గీ॥ 'జయతు గని పురాగార విశ్రాంతి మూర్తి,
జయతు లక్ష్మి నారాయణ సత్యదీప్తి,
జయతు భాను మండల కళాచక్రవర్తి
జయతు మధురా తటీచార సాంద్రకీర్తి,

అంత్యాను ప్రాసముతో లక్ష్మీనారాయణుని కీర్తించిన జయవాచకము అది.





భానుమండలస్థ లక్ష్మీ నరసింహస్వామి
దశావతారముల శాసనస్థకాశిరెడ్డి నాయని. గని

## వండుట్ల రంగస్వామి క్షేత్ర సాహిత్యము.

గడివేముల మండలకేంద్రమునకు - 15కి మీ దూరమున గని గ్రామమునకు - 5కి మీ దూరమున కొండలో వెలసిన దైవము వండుట్ల రంగ (రంగనాథ) స్వామి

ఈ స్వామి పై గని గ్రామము నందు బి సి కోటా రెడ్డి అను భాగవతుఁడు సేకరించిన లభిత పూర్వకమైన 'పారువేట పద్యాలు' లభించినవి 22 పుటలు గల చిరు పొత్తమది

**అందలి కథ** - గరుత్మంతునిపై నాకాశ విహారము గావించు విష్ణువు భూతలమున గని పట్టణంబు గని, సంభ్రమాశ్చర్యముల నంది, అందుదిగి, వండుట్ల రంగనాథ స్వామిగా నిలిచిపోయెను అతఁ డొకనాడు వేటకు వెళ్లి, యొక భిల్లాంగనంగని, పరవశించి యామెతో సయ్యాటలాడుచు, లక్ష్మీదేవిని విస్మరించెను విరహియైన లక్ష్మీదేవి పంపిన దొంగలు స్వామి వారి చామరఛత్ర భూషణంబుల తస్కరించి,

యామె కందియిచ్చిరి తద్వస్తు సమూహమెటనున్నది విష్ణుభటు లాతనికి నివేదించిరి అపుడు విష్ణువు తన వస్తువులను పంపుమని యొక చుర్ణికాయుత లేఖను లక్ష్మి కంపగా, ఆమెయు చూర్ణికాయుత లేఖనే ప్రత్యుత్తరముగా వ్రాసి యుండెను

వెంటనే విష్ణువు తన గుట్టు లక్ష్మికడ రట్టయినదని, విచారించి చెంచెతంగొని, పరివార సమేతుండై లక్ష్మి నెలవు దాపున చెంచెత నొక హర్మ్య ప్రదేశంబున నుంచి లక్ష్మినిలయమునకు చేరఁబోయెను ఆమె బంధించిన కవాటమును తెరవమని కోరగా, ఆమె పతిని గుర్తించలేని దానివలె చనుకులు, దరువుల లో, వక్రోక్త్యలంకారములో సమాధానమిచ్చును అన్యకాంతా సంగమము వల్ల విష్ణుదేహమునందు చిహ్నాము లున్నవని సతి యదిలింపగా, కాదు కాదు కారణమితరవమని కమలనాథుఁడు కప్పిపుచ్చును లక్ష్మి విష్ణుదేవులిరువురు చివరకు సన్నిహితమగుదురు

**ఛందోవైవిధ్యము** - పరిమాణమునందు చిన్నదయ్యును, గద్యముతో బాటు ద్విపదలు, దరువులు, యాలలు, చనుకులు, చూర్ణికలు సైతము ఈ చిరుపొత్తవు నందు గలవు గేయవముల వంటి యీ ఛందవములు సైతమిందుండుటచే నీ కృతి యక్షగానమును పోలియున్నది పద్యములో చెప్పిన విషయమే, వెంటనే గేయము వంటి దరువు ఇత్యాదులలో చెప్పబడినది

ఉదా - వేటకు వెళ్ళిన వండుట్ల రంగనాథ స్వామి ఖిల్లాంగనం గని యొక పద్యములో నిట్లనును-

మ॥ 'లలనా! యెవ్వరి దాన వెవ్వతెవు? ఉగ్రారణ్య మధ్యంబునం
దలఘు ప్రాభవ మొంది దుష్టమృగ సంహారంబు గావించుచున్
విలసద్ధైర్యమునన్ చరించెదవు? నీ వృత్తాంతమున్ తేటగా
తెలియం జెప్పుము నీదు వర్తనము, నీధీరత్వమున్ మెచ్చగన్' -

నీవెవరవు? నీ వృత్తాంతమును వివరముగా తెలుపుము అను విషయాలే ఇంచుమించు పద్యము నందున్నవే దరువులో సైతము చెప్పబడినవి

పల్లవి యవ్వరిదానవే నీవు, యిగురు బోణి ॥యెవ్వరి॥
అనుపల్లవి యవ్వరి దానవు యిట్లు యేకాంగతముగాను నీవు
యివ్వనాంతరంబులోనా యీ రీతి దిరుగంగనేల ॥యవ్వారి॥

చ॥ సందీయ మెందుకె వోకుంద రదనా!
యింపొందగా చెప్పవే నాతో యిందువదనా!

సుందరూాల సేన సేక మందిని చూచితిని గాని

అందా మూాలకెల్ల మూాల కందాపై వున్నావు ॥యవ్వారి॥

వ్యవహారిక భాషలో దరువు సాగినను, రమణీయ పదబంధురముగా నున్నది

ఏతత్కృతి కర్త యెవరో తెలియదు ఇది అర్వాచీనమో, ప్రాచీనమో తెలియదు

లక్ష్మీదేవి చెలికత్తెలు వుండుట్ల రంగనాథుని రూపమున నున్న విష్ణువును గని పలికిన దరువులోని భాష, నడక చక్కగా నున్నది

పల్లవి కంటిమమ్మ వోయమ్మ రంగని పొడగంటి మమ్మా వోయమ్మ ॥కంటి॥

అనుపల్లవి కంటిమమ్మ మేము జంట గూడుక పోయి తుంట విల్తుని గన్న

తోయజాకుని పొడగంటి మమ్మా పొడగంటి మమ్మా వోయమ్మా ॥కంటి॥

చ 1 చలువ చప్పరము లోపల పూల పాన్పుపై

చెలిగూడి పవళించి, చెలువు మించినవాని ॥గంటిమమ్మా॥

చ 2 రంగూగ వండుట్ల చెంగాట వెలసీన రంగాని

నవ మోహనాయ సీవేళాను ॥గంటిమమ్మా॥

పై దరువులో 'రంగుగ' అను పదమునకు 'రంగూగ' అనియు,

'చెంగట' అనుపదమునకు 'చెంగాట' అనియు,

'రంగని' ఆనుపదమునకు 'రంగాని' అనియు,

'ఈవేళను' అనుపదమునకు 'ఈవేళాను' అనియు -

పదాలలోని అక్షరాలను సాగదీయుట జరిగినది ఇది పాట పాడుట కనుకూలముగా నుండి, శ్రుతి పేయముగా నడకసాగినది

చెలికత్తెల మాటలు విని, శ్రీదేవి తన పతిని గురించి పలికిన మాటలు ద్విపదలో నిట్లున్నవి -

'నన్ను' - 'విడనాడి పేరొక్క విరిబోణి గూడి

యడ బాయకున్నాడు యే మందునికను

మగవారి మాటలు మదినమ్మరాదు

విగ త సత్యులు ప్రగల్భిష మానసులును' - ।

ఈ ద్విపదలో యతిప్రాసలు కలవు, ఛందమును సరిగా నున్నది, కాని వ్యావహారిక సన్నిహితమే, మూడవ పాదము

'మగవారి మాటలు మదినమ్మరాదు' - అనువాక్యము

తాళ్ళపాక తిమ్మక్క సుభద్రా కల్యాణములో

'పొలతి నమ్మగరాదు పురుషుల నెపుడు

పలురీతిఁ గృష్ణ సర్పమ్ములై యుంద్రు' - అను ద్విపదవాక్యములను తలపించు చున్నవి సుభద్ర నత్తవారింటికి పంపునపుడు రుక్మిణి చెప్పి పంపిన మాటలలో పై ద్విపద పాదము లున్నవి

లక్ష్మీదేవి కడకు విష్ణువు వెళ్లినపుడు -

శ్రీ వండుట్ల నగేశుఁ డాత్మ సచివుల్ సేవింపగా' అను పద్య పాదము కలదు ఇచట విష్ణువును కవి వండుట్ల నగేశుడుగా చెప్పినాడు

తలుపువేసిన లక్ష్మితో విష్ణు సంభాషణము - అనగా సతీపతుల సంభాషణము 'చణుకులు' - అను ఛందమున కలదు విష్ణువు సమాధానములను లక్ష్మీదేవి వక్రోక్త్యలంకారములో సంభాషించును శ్లేషము చేతకాని, కాకుస్వరము చేతకాని యర్థాంతరమును కల్పించుట వక్రోక్తి యగును ఇట విష్ణువు మాటలకు అమ్మవారు శ్లేషము చేత నర్థాంతరము కల్పించి సంభాషించును

నీవెవరివని ప్రశ్నించిన లక్ష్మీదేవికి స్వామి సమాధానము

'సరసిజనేత్రి వసంతుడుగా, నరిధరుడనె పుత్తడి బొమ్మనే చక్రధరుడనే బొమ్మ లక్ష్మి - అరయకులాలుడ వైతే పురములో కలశంబులు శాయవోయి, మట్టి కలశంబులు శాయవోయి,

విష్ణు - భామ! కులాలుడ గానె సమంచిత భూమి ధరుడనే భావా! నే భూమీధరుడనే భామా!

నేను చక్రమును ధరించిన వాడను, చక్రధరుడనని స్వామి పల్కగా, లక్ష్మి - చక్రమును ధరించి కుండలు చేయువాడు అని కుమ్మరి వాడను నర్థమును (శ్లేషగా కులాలుడు) గ్రహించి పల్కినది దానికి విష్ణువు తాను కుమ్మరి వాడను గానని, భూమిని ధరించినాడనని పలుకును ఇట్లు దాదాపు 40 పాదాలు సాగిపోవును తొల్లింటి భామా కలాపమును బోలినదిది సత్యాకృష్ణుల సంభాషణ - గొల్లభామ కృష్ణుల సంభాషణము పోలినదిది లక్ష్మి విష్ణువుల సంభాషణ యాలల' యందును కొంత కలదు ఇది వ్యవహార భాషా భరితము

చం॥ పటుతర యవ్వనాంగి నిను పల్కరు నే ఐతిమాలి పేడెదన్
తటపట మాటలాడుచును తల్పులు దీయవదేమి యిప్పుడే
నెటువలె నిర్వహింతు మరుడేయు శరంబుల కెట్లు దాళుదున్
కటకట నీవు నామనవి గైకొని తల్పులు దీయవదేమి యిప్పుడే'

ఇట్లు చివరగా లక్ష్మీదేవిని తలుపు తీయుమని విష్ణువు వేడిన పద్యము..స తేట తెనుగు పదాల కూర్పు కలదు

పద్యాలలో వ్యావహారిక భాష లేకుండుట గమనింపదగును

# నంద్యాల మండలము

## కోదండ రామాలయము,

## క్రాంతి నగర్ కాలనీ, నంద్యాల.

శ్రీరాముడు నంద్యాల పట్టణము శివార్లలో క్రాంతినగర్ కాలనీలో కుముద్వతీ నదీ తీరమునందు సీతాలక్ష్మణ సమేతముగా నుత్తర ముఖముగా భక్తజన మందారుఁడై దర్శన మిచ్చు చున్నాడు స్వామి కెదురుగా ముకుళిత హస్తుడైన హనుమదాలయము గలదు

'శ్రీరామ స్తుతి' యను పేరుతో వేంకటరమణ మూర్తి (సిద్ధాంతకర్త) రచించిన పద్యములలో స్వామి గుణ గానము గావింపబడెను

సీ॥ పితరుల యాజ్ఞను ప్రీతితో నెరవేర్ప
కఠిన వనంబున గడిపినావు
ప్రజల యభీష్టంబుఁ బాటింప ప్రియపత్ని
సీతమ్మను పరిత్యజించినావు
భక్తవరేణ్యుఁడు పావనిన్ నీ వంటి
దేవునిగాఁ దీర్చి దిద్ది నావు
శరణంబుఁ గోరగా శాత్రవ భ్రాతకు
నభయ మొసంగి కాపాడినావు

తే గీ॥ సత్యధర్మ దయా గుణా సక్త చిత్త!
మానవాదర్శ చరితుఁ డా! మహిత రూప!
మంచి మనసును మాకిచ్చి మనుచు మయ్య!
క్రాంతి నగరేశ! జానకీ రామభద్ర!

పితాజ్ఞా పాలనకై పిపినాల పాలైన వాడు - లోకాపవాద భీతిచే భార్య సీతమ్మను త్యజించిన వాడు - భక్తుడైన హనుమను దేవునిగా తీర్చిదిద్దిన వాడు - శరణము గోరిన విభీషణున కభయమిచ్చి కాపాడినవాడు - సత్య ధర్మ దయాది గుణ భరితుడు శ్రీరాముడు అట్టి శ్రీరాముని - మంచి మనసు నిచ్చి, కాపాడుమన్నాడు కవి ఆదర్శ మానవునిగా స్వామిని చిత్రించినాడు కవి

ఆలయ నిర్మాణమైన తర్వాత మొదటి శ్రీరామ నవమినాడు స్వామి కళ్యాణము నుద్దేశించి, కవి పలికిన పద్యమిది

ఆ వె॥ పురుష జనుల నెల్ల మోహింపగా ( జేయు
సుందరాంగు నిన్నుc జూచి జనులు
చేష్టలుడిగి నిన్ను సేవించి చనినారు
క్రాంతి నగర వాస! రామభద్ర!

శ్రీరాముడు జగన్మోహనాకారుడు పురుషులనే మోహింపcజేయువాడు మధుర భక్తిలో జీవులెల్లరు స్త్రీలే స్వామి దర్శనముచే భక్తులు నిశ్చేష్టులైనారని కవి వర్ణించెను భక్తి పారవశ్యమున భక్తులు దేనినీ కనబోరని కవి అభిప్రాయపడెను

తే గీ॥ పరగ ద్వారకా నాథ దంపతులు నిన్ను
క్రాంతి నగరులో నిలుపంగ శ్రమను చెంద,
వారి భక్తిని భరియింప వశముగాక
భాగ్య నగరాని కంపితే పరమ పురుష!

ద్వారకా నాథ దంపతులు అహరహము శ్రమించి, ఆలయ నిర్మాణమునకు దోహదమ్మైనారు అట్టి వారి భక్తిని భరింపలేక, వారిని హైదరాబాదున కంపినావని స్వామిని కవి వెక్కిరించెను నిజమునకు దైవము విగ్రహము లోనే కాదు, ప్రతి భక్తుని హృదయ మను గుడిలో సంతతము వసించును దీనిని దృష్టిలో నుంచుకొని, కవి 'వ్యాజస్తుతి' తో చెప్పిన పద్యమిది



**కోదండ రామాలయము క్రాంతి నగర్ కాలనీ, నంద్యాల**

## బండి ఆత్మకూరు మండలము.
# చెన్నకేశవ స్వామి,
## పెసరవాయి గ్రామము.

నంద్యాల నగరమునకు 16కి మీ దూరమున బండి ఆత్మకూరు మండలకేంద్రమునకు సమీపమున పెసరవాయిలో వెలసిన దైవము చెన్నకేశవ స్వామి

తెలక పల్లి రమణ మణిశర్మలు 'సూక్తి ప్రసూనాలు' అనుపేరులో నీతి పద్య శతకమును 'శ్రీశ పెసరవాయి చెన్నకేశ' - అను మకుటముతో చెన్నకేశవ స్వామిని సంబోధించుచు వ్రాసిరి

ఆవె॥ 'శ్రీయు భూమిదేవి శృంగారములతోడ
చెంతజేరి మిగుల సేవ జేయ
మోద మంది భక్త మోదంబులను దీర్చు
శ్రీశ పెసరవాయి చెన్నకేశ

ఇది శతకములో ప్రథమ పద్యము శ్రీదేవి భూదేవీ సహితుడు చెన్నకేశవ స్వామి శృంగార యుతముగా కొలువున్న వైనము ఈ పద్యమున వర్ణింపబడినది

ఆవె॥ విద్యావిహీను డెట్లు నిందించబడునో క్రింది పద్యమున చెప్పబడెను
చదువురాని వాడు చక్కని వాడైన
చవట యంద్రు వాని జగతి యందు
ముద్దులొలుకు చుండు మోదుగు పూలట్లు ॥శ్రీశ॥ (14 పద్యం)

విద్యావిహీనుడు రూపవంతుడైనను 'చవట' యని లోకము నిందించునన్నది - నీతి దృష్టాంతముగా అందమైన మోదుగు పూల - నెవ్వరు ధరింపరనుట విషయము స్పష్టమగుటకీ దృష్టాంత ముపయోగ పడినది

హీనునకు సంపదలిచ్చిన నెట్లుండునో చెప్పిన పద్యమిది!

ఆవె॥ 'హీన మతికి సంపదెక్కువై యుండెనా
వాని పట్టగాను పగ్గమున్నె ?
నహుష చక్రవర్తి బహుభోగి యైనటుల్ (51 పద్యము)

బహు పుణ్యఫలముగ నహుష చక్రవర్తి దేవేంద్ర పదవి నధివసించెను గర్వియైన నహుషుడు సప్తర్షులచేత పల్లకీ మోయించినాడు చివరకు అధః పతితుడైనాడు ఈ పురాణ వృత్తాంతమును కవులు హీనునకు సంపద లభ్బిన

సహనముతో నుండ జాలడను విషయమున కుదాహరణగా తెల్పిరి 'పట్టగానే పగ్గమున్నె' చక్కని జాతీయ వాక్యము

పై శతకములో చాల పద్యాలలో రెండు పాదాలలో నీతి చివరి పాదమున దృష్టాంతములు గనిపించును ఇట్లు తేట తెనుగు పదాలలో వేమన శతకము వలె సాగిన నీతి శతకమిది

దసరా నవరాత్రులందు పెసరవాయిలో పిల్లలు పాడు పాట ఈ క్రిందిది వినిని పూర్వము 'మార్గపద్యము' లనెడివారు

'శ్రీమహా రమణీ మణీ సుఖ సేవితాంఘ్రి సరోరుహా!
కామ సుందర కామిత ప్రద కలిత జలధర విగ్రహా!
హేమ మణిమయ మకుట కుండల ధామతామర సాక్షి! మా
రామ నేలర! పెసర వాయి సుధామ! శ్రీ చెన్నకేశవా!
దంతి రక్షక! కంతు జనక దురంత పాప నివారణా! ఉ
నంతశయ నానంతనయ నానంత మానిని పోషణా!
అంతరంగము నందు నిన్నే చింత సేయుచు నున్న మా
కాంత నేలర! పెసరవాయి నితాంత శ్రీచెన్నకేశవా!

మొదటి పాదమున పాదపద్మ విశిష్టతను, ద్వితీయ పాదమున స్వామి యాకార విశిష్టతను, కుండలాల అందమును చెప్పుచు ప్రియురాలి నేలుమని ఈ గేయమున స్వామిని కోరబడినది ఐదవ పాదమున స్వామి సంబోధనలను చెప్పుచు, శబ్దాలంకారము ఆరవ పాదమున చెప్పుచు, 7,8 పాదాలలో నిన్ను తలంచు కాంత నేలుమని చెప్పబడినది

'ఇందు సుందర కాంతిల సదర విందనయన దయాకరా!
సుంద రాధర ఏలరా! నీ మదిని కపటము మానరా!
ఇందువదన కుందరదన మందయానను ముదముతో
పొందరా మా పెసరవాయి ముకుంద చెన్నకేశవా!

పై మొదటి రెండు పాదాలలో శబ్దాలంకారమును, ఇంతిని పొందుమని చివరి పాదాలలో చెప్పబడినది

# బనగాన పల్లె తాలూకా

## ఔకు మండలము

## కదిరి లక్ష్మీ నృసింహస్వామి, మెట్టుపల్లి

మెట్టుపల్లి నివాసియైన కీ శే అందలం జీవయ్య ఈ స్వామి పేరిట 'నృసింహ విలాసము' రచించినాడు ఈ గ్రంథము తాళపత్రములలో దేవనాగర లిపి యందున్న దానిని తెలుగులో గద్యరూపమున రచించి, కదిరి లక్ష్మీ నృసింహ స్వామికే యంకితము గావించినాడు జీవయ్య

హిరణ్యకశిప సంహారానంతరము ప్రహ్లాద ప్రార్థితుడై శాంతుడైన నరసింహ స్వామి తన నరసింహ కళలు 108 శైలములమదు నిలుచునని చెప్పుచు అందు మెట్టు పల్లె సమీపములో కదిరి శైలమునందు కదిరీ నరసింహుడను పేరుతో దర్శనమిత్తునని పలికినాడు (నృసింహ విలాసము - పేజి-967)

హిరణ్యకశిప సంహారానంతరము నరసింహ స్వామి ఉగ్రరూపమును చూచి లక్ష్మీదేవి పలికిన వాక్యములు మనోహరముగా నున్నవి 'ముఖము ప్రళయార్కుని వలె దుర్నిరీక్ష్యమగు చున్నది కాని పూర్ణ చంద్రుని వలె లేదు చూపులు మంటలు గ్రక్కుచున్నవే గాని చల్లగాలేవు తీక్ష్ణమగు కోటి దంతములు కనబడుచున్నవి కాని నగుమోము కానరాదు ' (64 పేజి) పై వాక్య నిర్మాణ ములో దుర్నిరీక్ష్యము, తీక్ష్ణము మొదలగుమాటలు చిన్నయ సూరి రచించిన మిత్రలాభ మిత్ర భేదములందలి పదములను పోలియున్నవి

ఈ గ్రంథమునందు ఈ కథను రామానుజాచార్యులు మాధవునకు తెలిపినట్లుగా కలదు ఈ కథకు చివరగా రచయిత అందలం జీవయ్య నరసింహస్వామికి అందించిన మంగళ హారతి ఇంపుగా నున్నది

'శ్రీమనో హరుడైన శ్రీ నారసింహులకు
జయమంగళం నిత్య శుభమంగళం
జయాజయ మంగళం నిత్య శుభమంగళం ॥శ్రీమనోహరుడైన॥
ఆహవంబున హేమకశ్యపుని వక్షమును
అద్భుతంబుగ చీల్చినట్టి నరహరికి ॥జయమంగళం॥
ప్రహ్లాద వరదునకు - పాపసంహారునకు
పక్షీంద్ర వాహనునకు - పద్మనేత్రునకు ॥శ్రీమనోహరుడైన॥
ఈ లోకముల నెల్ల నాలోకముల చేత
కాపాడునట్టి శ్రీ కదిరయ్యకు ॥జయమంగళం॥

గుహలందు మౌని హృద్గుహలందు వెలుగుచును
ఇహపరంబుల సౌఖ్యమిచ్చు శ్రీహరికీ ॥శ్రీమనోహరుడైన॥
కోరదంతపు కాంతి కోటీర కాంతులును
కోటి సూర్యుల మించు కొండ వాసునకూ ॥జయమంగళం॥
జీవయార్యుని చేత సేవలను బొందుచును
శ్రీవత్స ధారియగు శ్రీ నృసింహునకు' ॥జయమంగళం॥
(పేజి 89-90)

ఈ మంగళహారతిలో రచయిత జీవయ్య పేరుండుట గమనార్హము 'ప్రహ్లాద వరదునకు - పాప సంహారునకు, పక్షీంద్రవాహనునకు - పద్మనేత్రునకు' అను చరణములో 'ప' వర్ణారంభముతో గల నాల్గు పదములు శబ్దాలంకార శోభితముగా నున్నవి మునుల హృదయాలను గుహలతో రూపించుట చక్కగా నున్నది గుహలందు మౌని హృద్గుహలందు అనుపద బంధములు శబ్దాలంకార శోభితములు ఈ లోకముల నెల్ల - పదము వెంటనే ' ఆలోకములచేత ' అను పదబంధము బాగున్నది ఆ లోకములు అనగా చూపులని అర్థము

ఈ కథానంతరము నలుబది పేజీలలో ''శ్రీ చెంచు లక్ష్మీ కళ్యాణము'' ను రచయిత కూర్చినాడు ఈ గ్రంథమున కనుబంధముగ షోడ శోపచార పూజలతో నృసింహ స్వామిని పూజించు విధానము కలదు

అంకి తాంక పద్యములు గ్రంథారంభమున కలవు అందొకటి

చ॥ జయజయ శ్రీ నృసింహ! హరి! జై కరుణాకర! నారసింహ జై!
జయ కదిరయ్య! దుష్టహర! జైగిరివాస! మునీంద్ర వందితా!
జయజయ శంఖ చక్రధర ! జైవనమాలి! కరీంద్ర రక్షణా!
జయ జయ నారసింహ! జలజాలయనాయక! చెంచితేశ జై! (పేజి 8)

అంకితాంక పద్యములు మూడింటిలో చివరి పద్యము -

ఉ॥ 'దండము శ్రీనృకేసరికి, దండము రాక్షస వక్ష భేదికిన్
--------------------------------
--------------------------------
దండమొనర్చి వేడితిని దాసుని సేలుము శ్రీనృకేసరీ!

పై పద్యములందలి శైలి మనోహరము జయ జయ పద సంయుతమైన ద్వితీయ పద్యమున స్వామిని స్తుతించిన వైనము స్తుతి పాత్రము అడుగడుగున దండములు పెట్టిన తృతీయ పద్యము వైష్ణవ శరణాగతిని సూచించు చున్నది

# ఇతరములు

### ప్రకాశం జిల్లా

### గిద్దలూరు తాలూకా

## మాధవ స్వామి, తురిమెల్ల.

గిద్దలూరు సమీపమున తురిమెళ్ళలో వెలసిన మాధవ స్వామిపై శార్వరి సం॥ (1960) చైత్ర శుద్ధ పాడ్యమి తురిమెళ్లలో నూరేగ వచ్చిన మాధవ సందర్శనమున ప్రారంభించి, మేడవరం చెన్నకేశవ శాస్త్రి ఒక మాసములో నీ శతకమును పూర్తి చేసెను

అష్టోత్తర పద్యాల వంటి 108 పద్యాలతో సాగిన శతకములోని భక్తి, కవితా వైశిష్ట్యములను సూక్ష్మముగ వివరింతును

తాను పద్య సుమములతో స్వామి పాద పద్మ ద్వయము నర్చింతునని కవి చెప్పిన పద్యము చమత్కార యుతము

చం॥ 'పదములె రేకు లై, విమల భవ్యము లర్థము లెన్నఁ దావి యై,
పొదలు నలంకియల్ ధ్వనులు పుప్పొడి యై, యలరారు భావసం
పదమకరందమై, తనరు పద్య సుమంబుల నర్చసేతు త్వత్
పదయుగళంబు - భక్తసుర పాదప! శ్రీ తురిమెళ్ళ మాధవా! (1)

తాను ప్రయోగించు పదములు రేకులుగా - అర్థములు సువాసనగా - అలంకార ధ్వనులు పుప్పొడిగా - భావ సంపద మకరందముగా - పద్యములను పుష్పములతో స్వామి పాద పద్మ ద్వయమును పూజచేతునని - స్వామిని భక్తులకు కల్ప వృక్షమని కవి కీర్తించు చున్నాడు

మాధవ గుణ గణ వర్ణన హద్దులేని దనుచు కవి కావించిన వర్ణనము క్రింది పద్యమున కలదు

ఉ॥ 'వారిధి పాత్రఁ గజ్జలపుఁ బర్వతమన్ మసిఁగూర్చి కల్పక
క్ష్మారుహ శాఖయన్ గలమునన్ ధరణీతల పత్రమందు నా
శారద నాల్గు హస్తముల సమ్మతి జీవిత మంత వ్రాసినన్
బారముఁ జెంద వౌ తమ గొనంబులు శ్రీ తురిమెళ్ళ మాధవా! (28)

సముద్రమును పాత్రలో కాటుక కొండయును 'ఇంకి' ని కలిపి కల్పవృక్షపు కొమ్మయను కలముతో- భూతలమను ఆకునందు సరస్వతి తన నాల్గు చేతులతో తన జీవిత కాలమంతయు వ్రాసినను - స్వామి గుణ గణవర్ణన తీరమునకు చేరుకోవని పద్యభావము చదువునకు అధిష్ఠాన దైవము సరస్వతి

ఆమెకే స్వామి గుణాలను వర్ణించుటకు నలవికాదనిన స్వామి ఎంతటి గొప్పవాడో తెలియుచున్నది

క్రొత్త యుపమానాలతో కూడిన క్రింది పద్యమున కవి జీవితమును సినిమాతో పోల్చెను

ఉ॥ 'భూ వలయంపు రంగమున భూత చయంబను వేషధారులన్
దావక మాయ యన్న పరదా పయి వేసటి యుంచునట్టులన్
వావిరి నాయు'ఫోకసుపవర్' వెల యించెడి యంత్రరాజమై
జీవితమన్ సినీమ విరచింతువు శ్రీ తురిమెళ్ళకేశవా!

భూమి - రంగస్థలము ప్రాణులు - పాత్రధారులు, **(Actors)** దైవమాయ - పరదా **(Screen)** ఆయువు - ఫోకసు పవర్, జీవితము - సినిమా **(Cinema)** ఇట్లు జీవితమును సినిమాగా పోల్చుటకు ప్రాణులందరిని పాత్రధారులుగా పోల్చిన యీ పద్యము కవి లౌకిక దృష్టికి నిదర్శనముగా కనిపించును ఈ కవి పెద్దవేదాంతార్థములను సైతము అలతి పదములతో పొందు పరచిన పద్యములు కూడ ఈ శతకమున కలవు

## గిద్దలూరు తాలూకా
## నెమలి గుండ్ల రంగనాయక స్వామి
## జిల్లివారి పుల్లల చెర్వు.

శ్రీ నెమలి గుండ్ల రంగనాయక స్వామిపై 'శ్రీ నెమలి గుండ్ల రంగనాయక మహాత్మ్యము అను - చిరు పొత్తము పత్తి ఓబులయ్య రచించెను మొదటి 9 పేజీలలో స్వామి చరిత్ర కలదు తదుపరి రంగనిపై శతకము కలదు ఓబులయ్య భక్త్యావేశము తో చెప్పిన పద్యమును ఉదహరింతును

ఆ వె॥ 'రంగ! రంగ! భక్త రంగ! నెమలి గుండ్ల
రంగ! దివ్య తేజ రంగ! పుణ్య
రంగ! పూజ నీయ రంగ! విమల రంగ!
నెమలి గుండ్ల రంగ! నీవె రక్ష!

దివ్య తేజస్సు గలవాడు, పరమ పవిత్రుడు, పుజ నీయుడు ఐన నెమలిగుండ్ల రంగా! నీవే రక్ష అనుచున్నాడు కవి ఆవేశముతో ఎన్నో మారులురంగా! అని పల్కినాడు నెమలి గుండ్ల రంగస్వామి మహిమలు అను పేరుతో గోవిందరాజులు రచించిన వ్రాత ప్రతిలో స్వామిపై భక్తితో వివరించిన గేయమొకటి

పల్లవి 'నలమల యడవుల నిలిచితివా
శ్రీగిరి శిఖరాన వెలసితివా ॥నలమల॥

1 చరణం కొండల నడుమ కోనలలోన
అమయూర ఋషి తపమొనరించిన
కనికరముంచి కనిపించితివే
కామితముల నెల్ల తీర్చితివే ॥నలమల॥

2 చరణం తెలియగ రారు తెలిపిన వినరు
మాయామోహము నందు మునిగెదరు
రంగని పదములె కొంగు బంగారము
రయమున గనుగొని రంగని జేరుము ॥నలమల॥

3 చరణం పాపము పుణ్యము తెలియని నన్ను
కరుణతో నీదరి జేర్చుము తండ్రీ
శ్రీ రంగనాయకా! ఆనంద దాయకా!
ఈ జన్మమిక చాలు ఓదేవదేవా! ॥నలమల॥ (25-పేజి)

పరిసర ప్రకృతిని కవి ప్రశంసించినాడు మయూరుని కోరికను తీర్చెనని, గుర్తుచేసినాడు మాయా మోహములలో మునిగిన వారికి శ్రీరంగని పదములే కొంగు బంగారమని తెల్పి చెప్పినాడు అమాయకుడనైన తనను దయా దృష్టితో దగ్గరకు చేర్చుకొమ్మని, పాపపూరితమైన జన్మము తన కింక వలదని, రయముగ పారమార్థిక పథమున సాగనిమ్మని కవి స్వామినర్థించినాడు

## మార్కాపురం తాలూకా
## మారికాపుర లక్ష్మీ చెన్నకేశవ స్వామి, మార్కాపురం

పూర్వపు కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకా కేంద్రములో వెలసిన స్వామి లక్ష్మీ చెన్నకేశవ స్వామి ప్రస్తుతము ఈ క్షేత్రము ప్రకాశం జిల్లా పరిధిలో నున్నది

మార్కాపుర క్షేత్ర ప్రసక్తి రాయప్రోలు సుబ్బరామయ్య 'నీరాజనము' నందు గలదు

సీ॥ 'ఉండెలే! ఇచట మార్కండేయమౌని త
పస్సమాధిని గొన్న భవ్యదినము -
కలదులే! ఇచట రాయల కేలుదోయి వి
శ్రాంతి గైకొన్న ప్రశస్తదినము

అలరెలే! ఇచట వేమన్న తత్త్వము లాట
వెలదుల కెక్కిన విమల దినము
మెరసెలే! ఇచట సోదరుల శిల్ప ప్రౌఢి
కంబాలు సరితూగు క్రమ దినంబు

తే గీ॥ ఆ శుభ సుఖ క్షణమ్ముల నన్వయ ప్ర
మోదమున దిక్కుల హసించి, పొలుపుగన్న
మారికాపురి గోపుర మస్తమెత్తి
చాటులే నేడు నీ మహోత్సవ విభూతి' [21]

**ఈ పద్యమును బట్టి తెలియు విశేషములు**

1 ఈ స్వామి శిలా విగ్రహమును మార్కండేయ మహర్షి ప్రతిష్ఠించెనని స్థల పురాణము కలదు 2 శ్రీ కృష్ణ రాయలు కటకమును జయించి తిరిగి వచ్చుచు విడిదిచేసి, ప్రస్తుత మాలయమున్న స్థల మాహాత్మ్యమునకు సంతసించి, దేవాలయ నిర్మాణమునకు పూనుకొన్న విషయము ప్రచారములో కలదు 3 ప్రజాకవి వేమన ఈ ఆలయమున విశ్రమించి కొన్ని దినాలు తాత్త్విక విచారము చేసి యుండెనని రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ వేమన చరిత్రలో పలికెను 4 ఆలయ మండపము ముందు భాగమున అన్నదమ్ముల స్తంభములు అను రెండు రాతి స్తంభములు కలవు ఒకరినొకరు చూడక, తెరగట్టుకొని శబ్ద గ్రహణముచే వీనినొకే రీతి నిర్మించిరట!

క్రింది పద్యమును బట్టి పూర్వము చెన్నకేశవ స్వామి దర్శనార్థమై భక్తులు వరుస క్రమములో నిలబడి ప్రతీక్షించెడివారని తెలియుచున్నది

ఉ॥ 'కాలము మారిపోయె - కలకాలము నీకిటు లుండ గాదు ర
మ్మాలయ సీమ వీడి కరుణాలయ! బాహిరవీధి - కియ్యెడన్
వేలకు వేలుగా ప్రజలు విశ్వజనీనము లైన నీదు పా
దాలకు మ్రొక్క వచ్చిరట, దర్శనమిచ్చి యను గ్రహింపవే'

నీపాదసేవ చేయుటకై భక్తులెదురు చూచు చున్నారు ఆలయమును వీడి వారికి దర్శన మిచ్చుటకై బయటకు రమ్మని కవి పలుకు చున్నాడు ఇట్టి భావమునే ఈ సిద్ధాంత వ్యాస కర్త తిరుమల వేంకటేశ్వర స్వామి దర్శనార్థమై వరుసలో వెళ్ళుచు పలికినాడు

తే గీ॥ 'ఎప్పుడు స్వామిని చూతుమో! ఇంక లేట
దెంత కల్గునో యంచు, చింతించు చుంద్రు
భక్త తండంబు 'క్యూ' ను నిల్చబడి నిన్నుఁ
జేరగా భక్తుల్ ద్రోతురు, చీదరింత్రు'

ఓరుగంటి వేంకటరమణయ్య రచించిన 'మార్కాపుర లక్ష్మీ చెన్నకేశవ స్వామి చరిత్ర' ఆధారముగ పై విషయములు తెలుపబడెను ఈ గ్రంథములోనే మాదిరాజు లక్ష్మీ నరసింహ శర్మ రచించిన సుప్రభాతము కూడ కలదు అందు ఐదు శ్లోకములన్నవి

'పిశాచ బాధా మప హృత్య భక్తాత్
మారీ వధూక్షీర ఘటాత్ పయశ్చ
అపూర్వ దుర్గం కృపయా పునస్త్వం
మార్కాపురం కల్పిత వాన్ మహిమ్నా' (XV పేజి)

పుష్కలుడు మొ॥ కొందఱు భక్తుల పిశాచ బాధాదికమును కేశవ స్వామి పోగెట్టెనఁట! 'మారిక' యను యాదవ యువతి క్షీర ఘటములోని క్షీరమును గ్రహించి, బదులుగా సువర్ణము నొసంగి, దానితో గర్భాలయ నిర్మాణమును, చుట్టు మార్కాపుర నగర నిర్మాణమును గావించిన మహానుభావుఁడఁట ఆ స్వామి!

'అజన్యవాః కుండికయా విధూతం' అను శ్లోకమునందు స్వామి ఆలయ సమీపము నందలి గుండ్ల కమ్మ తీర్థ వైశిష్ట్యమును గూర్చి చెప్పబడినది

## స్వగృహమే వేంకటేశ్వరాలయముగా మలచుకొన్న రంగాచార్యుల నివాసము, ఆలూరు.

ఈ సాహిత్య విభాగమున పై స్వగృహాలయము ప్రత్యేకతను సంతరించుకొన్నది ఆలూరు లోని ప్రైవేటు వైద్యుడు రంగాచార్యులు భక్తిపరుడు ప్రాత ఇల్లు విప్పి నూతన నిర్మాణము గావించు సందర్భమున అతని కుమారుని తలపై పెద్దరాయి పడెను పెద్ద వైద్యులు కుట్లు వేసినను ప్రయోజనము లేకపోయెను చివరకు తండ్రియే అతని తలపై ఏదో ఒక మందు మందముగా పూసి, కట్టు కట్టి వేంకటేశ్వర స్వామిపై భారము వేసెను కుమారుడు నిదానముగా స్వస్థుడయ్యెను రంగాచార్య తిరుమల స్వామిని దర్శించి బాలాజీ చెక్కబొమ్మను తెచ్చికొని ఈనాటికిని అనుదినము నిత్య నైవేద్యము చేయుచు, విజయ దశమి నవరాత్రులు చేయుచు చివరగా విజయ దశమీ దినమున అన్నదానము చేయుచు, స్వామిని నగర వీథుల నూరేగింపు చేయుచున్నాడు

అష్టావధాని రామమూర్తి ఆ రంగాచార్యుల కంకితముగా 'శ్రీ వేంకటేశ్వరుని పారువేట' అను 80 పద్యాల లఘుకృతిని రచించెను వేటకు వెళ్ళి వేంకటేశ్వర స్వామి సాకారయైన భూదేవితో గడపిన విషయము శ్రీదేవి ఎరుగుట - స్వామి శ్రీదేవి సంగమ మిచ్ఛగింపగా ఆమె మొదట తిరస్కరించి, పిదప స్వామి చెంతచేరుట ఇందలి కథాంశము

ఇందిర (అలమేల్మంగ) తన రసికత నెరిగినదని స్వామి భూదేవి దగ్గర సెలవు తీసికొని వెళ్ళినాడు

తే గీ॥ పుడమి సతి చెంత కే తెంచి ముద్దులొసగి
కాంత! నీ పొంత వీడగ కాననయ్యె
పురము నందలి భక్తులఁ బ్రోచి, వేగ
వత్తు సెలవిమ్ము ప్రేయసీ ! వనజ నయన! **(24)**

ఈ పద్యార్థము స్పష్టము కరుణశ్రీ 'కుంతీకుమారి' ఖండికలో కుంతి తన కుమారుని కర్ణుని పెట్టెలో పెట్టి వీడ్కోలు గావించు సన్నివేశ పద్యమును తలపించు పద్యమిది ముద్దులిచ్చి, బుజ్జంద బెట్టి, ఇత్యాది పద ప్రయోగము గల ఆ పద్యములు ఇప్పట్టున స్ఫురింపక మానవు

ఇందిర మందిరము చేరనెంచిన స్వామికి - అమ్మవారికి జరిగిన సంభాషణలో స్వామి ఇట్లు పల్కెను

కం॥ బాలా! బాల సుధాకర, ఫాలా! యీలీలఁబల్క భావ్యంబౌనా!
హేలా మ త్స్యాకృతి వే, దాళిన్ మును బ్రోచి నట్టి హరిని సుశీలా!





మారికాపుర లక్ష్మీ చిన్న కేశవ స్వామి మరియు ఆలయ గాలిగోపురం మార్కాపురం

మత్స్యావతారమెత్తి వేదములనుద్ధరించిన విష్ణువునునేను నీవు నిరసించుచు, నన్ను గుర్తింపకుంటి వేల! అని భావము దాని కామె చెప్పిన సమాధానము

కం॥ చెప్పకు మెప్పుడు తొప్పల , గప్పక కళ్ళప్పగించి కాంతలగనునీ
గొప్పలె కంపుల తుప్పలు , తప్పడు మీనంబవెట్లు తలుపుదెరుతునొ' 3

చేపలోని లోపమును నాయిక ఎత్తిపొడిచెను రెప్పలను మూయకయే కళ్లప్పగించి స్త్రీలను చూచు నీ ప్రవర్తన దోషమయమని ఆమె పలికెను ఇందు

వ్యాజస్తుతికలదు ఇట్లు 20 పద్యములు నవ్వుగొల్పుచు, సాహిత్యము ''ఆలోచనామృతమ్'' అనుటకు నిదర్శనములగుచున్నవి

**ఉప సంహారము**

ఇట్లు కర్నూలు జిల్లాలో వైష్ణవ క్షేత్రాల సంఖ్య అపరిమితముగా కనిపించుచున్నది ఇదొక విధముగా ఇక్కడి ప్రజల భక్తిప్రపత్తులను పట్టి చూపుచున్నది ఒక్కొక్క గుడి ఇక్కడి ప్రజల భక్తి ప్రపత్తులకు ఎత్తిన కరదీపికవలె కనిపించుచున్నది ఈతిబాధలు, కరువు కాటకాలు ఎన్నివచ్చినను ఇక్కడి ప్రజలలో భక్తి సంస్కారమునకు మాత్రము క్షతి రాలేదు ప్రధానముగా భారతదేశము ఆధ్యాత్మిక కేంద్రముగా ప్రశస్తి కెక్కినది దక్షిణ భూభాగములో నున్నన్ని ఆలయాలు దేశములో మరెక్కడ లేవని ప్రతీతి

వైష్ణవాలయాలలో కర్నూలు జిల్లాయంతట అర్చావిధానము దాదాపు ఒకే విధముగా కనిపించుచున్నది అదే పాంచరాత్రాగమ విధానము కాగా శిలావిగ్రహాలకైనచో తరచుగ ప్రతి దినమభిషేకము చేయుట జరుగుచున్నది పాలరాతి విగ్రహాలకైనచో తరచుగ వారమునకొక పర్యాయము క్షీరజలధారలతో నభిషేకము చేయుట కనిపించుచున్నది అర్చావిధానములో పాంచరాత్రాగమ పద్ధతి పాటింపబడుట వలన ఈ ఆలయము లన్నియు, దీని విధానములన్నియు విశిష్టాద్వైతాంశములోని భాగాలని చెప్పుటలో సంశయము లేదు కారణము సకల దేవతలలో విష్ణువే అధిపతి అందుకే ఆయనను దేవలము దేవుడనక, దేవాధిదేవుడని, మునిజన వంద్యుడని ఈ క్షేత్రాల సాహిత్యము ప్రస్తుతించుచున్నది

అనేక క్షేత్రాలకు వెనుకటియంశములను బట్టి చూచిన ప్రాచీనత, చారిత్రకత, జానపద గేయ గాథలు, పవిత్రతలు కనిపించు చున్నవి అవన్నియు ఈ తరము భక్తులకు గొప్ప స్ఫూర్తిని కలిగించుచున్నది అన్ని క్షేత్రాలకించు మించు చక్కని సౌకర్యము లుండుట చేత ప్రతిభక్తుడు గుడికి వెళ్లి దైవమును ముఖాముఖి దర్శించుకొను అవకాశము కలిగినది ఇది ఒక శుభపరిణామము ఇట్టి క్షేత్ర సాహిత్యము వెల్లివిరిసి, మనిషిలోని మృగమును చంపి, అచ్చమైన మానవత్వమునకు - అటు పై దివ్యత్వమునకు దోహదము చేయగలదు ఒకనాటికి వైష్ణవ క్షేత్రము శిలమైనను తత్సాహిత్యము మాత్రము శాశ్వతముగా జీవించగలదు ప్రజలలో భక్తి సంస్కార బీజాలను అంకురింపజేయగలదు



## అధసూచికలు


1 శ్రీ నృసింహ పురాణము, ఎఱ్ఱన 5 ఆశ్వా - 152 ప

2 శ్రీ నృసింహ పురాణము, ఎఱ్ఱన 2 ఆశ్వా - 31 ప

3 ఆంధ్ర మహాభారతము - ఆరణ్యపర్వము, నన్నయభట్టు 1 ఆ - 324 ప

4 శ్రీ నృసింహ పురాణము, ఎఱ్ఱన 5 ఆశ్వా - 197 ప

5 శ్రీ నృసింహ పురాణము, ఎఱ్ఱన 5 ఆశ్వా - 162 ప

6 శ్రీ నృసింహ పురాణము, ఎఱ్ఱన 3 ఆశ్వా - 151 ప

7 ఆంధ్ర మహాభాగవతము, బమ్మెరపోతన 7 స్కం - 123 ప

8 శ్రీ నృసింహ పురాణము, ఎఱ్ఱన 5 ఆశ్వా - 22 ప

9 ఆంధ్ర మహా భాగవతము, పోతన 7 స్కం - 169 ప

10 నుతభారతి పోలూరు రామకృష్ణయ్య 2 నుతి - 09 ప

11 నుతభారతి పోలూరు రామకృష్ణయ్య 3 నుతి - 20 ప

12 నుతభారతి పోలూరు రామకృష్ణయ్య 3 నుతి - 55 ప

13 శ్రీ వాసంతి కాపరిణయము - రాచర్ల శ్రీనివాసాచార్యులు
1 అంక - 12 పేజి

14 శ్రీ వాసంతి కాపరిణయము - రాచర్ల శ్రీనివాసాచార్యులు
4 అంక - 58 పేజి

15 శ్రీ మదహోబిల మహాత్మ్యము - వీరరాఘవ సుబ్బరామ కవులు
3 ఆ - 167 పద్యము

16 శిఖి నరసింహ శతకము - 3వ పద్యము

17 **A Descriptive catalogue of the Telugu Manuscripts, Govt oriental Manuscripts in the Library, Madras Parabrahma Sastry, Volume VIII Yakhagnas & Dandak**

18 అన్నమాచార్యుల స్మృతవర్షిణి - 116, 117 పేజీలు ఐ వి సీతారా
అన్నమాచార్య ట్రస్టు - చిక్కడపల్లి, హైదరాబాదు అక్టోబరు 1

19 అన్నమాచార్య వ్యాసావళి - 56,57 పేజీలు చిత్రాజు గోవిందరా

20 ఎస్ దేవదయానంద్ సింగ్, ప్యాపిలి - పండితాభిప్రాయము

21 మారికాపుర లక్ష్మీచెన్నకేశవ చరిత్ర - పేజి నెం 1
ఓరుగంటి వెంకటరమణయ్య



# చతుర్థాధ్యాయము

# శ్రీ వైష్ణవాలయ నిర్మాణాదిక పరమార్థము





# చతుర్థాధ్యాయము

# శ్రీవైష్ణవాలయ నిర్మాణాదిక పరమార్థము

**ఉపోద్ఘాతము**

పరమ పవిత్రమైన భారతీయ సంస్కృతి ననుసరించి మానవుడు పరిపూర్ణత్వమును పొంది ఆనందస్వరూపుఁడగుటకు ఋషులు - 'ప్రస్థాన త్రయమును' - విశిష్టమైన సాహిత్యముగా భారత జాతి కందించినారు ప్రస్థానత్రయమనగా జీవుని ప్రకృష్టమైన స్థానమునకు చేర్చుటకు ఉపకరించు మూడు విధముల సాహిత్యము అవి -

1 బ్రహ్మ సూత్రములు 2 ఉపనిషత్తులు 3 భగవద్గీత

ఇవన్నియు ఉదాత్తానుదాత్త స్వరూపములతో సంస్కృత భాషలో ప్రవర్తిల్లినవి వీనిని అవగాహన మొనర్చుటకు సాహితీ ప్రకర్ష, ఉత్తమ సంస్కారము మొ॥ అర్హతలున్నవారికి తప్ప సామాన్యులకు అలవికాదు కాలక్రమమున వీని యవగాహన యెక్కువ మందికి లేని కారణమున కేవల లోక శ్రేయస్సు నాశించిన పరమ కృపాళువులగు మహనీయ ఋషులు, మహా కవులు 'ప్రస్థాన త్రయ' సందేశము నందించి, సామాజిక శాంతితోఁ బాటు మానవుని ఆత్మోన్నతికి దోహదములగు సత్యధర్మములను ప్రచారము చేయుటకు పురాణములను రచించిరి వానిని సైతము కాలక్రమమున ప్రాధాన్యము తగ్గునేమోయని యూహించి, ఋషులు లోక కళ్యాణము నాశించి, ఆగమ శాస్త్రమను దానిని రూప కల్పన చేసి, ప్రశాంత గమ్భీరమైన పర్వతములు, లోయలు, నదీతీరములు, అరణ్య ప్రదేశము లందు - చివరకు జనపదములందును ఆలయ నిర్మాణములకు పూనుకొనిరి

వారు సర్వాంతర్యామియైన పరమాత్మను దర్శింపగలిగి, నిరంతరము 'సర్వంఖల్విదం బ్రహ్మ' - అను ఉపనిషత్సూక్తి నవగాహన చేసికొని, యంతటితో నాగక పరిపూర్ణుడైన భగవంతుని దేవాలయమునందు విగ్రహ రూపమున ప్రతిష్ఠింపజేసి, సామాన్యులకు భగవత్స్వరూపమును కన్నులకు గట్టినట్లుగా చూపుచు, తద్వార సాధనా వశమున ఆత్మోన్నతిని పొందుటకుపకరించిరి అనాటి నుండి ఆగమ శాస్త్రానుసారముగా పవిత్ర భారతదేశములో దేవాలయ నిర్మాణ మారంభమైనది భారతదేశ మందు ఏదో ఒక ఆలయము లేని గ్రామము లేదనుటకు సందియము లేదు భక్తుని మహాభీష్టము ననుసరించి

రామకృష్ణాంజనేయాది దేవాలయములు వెలసినవి ఈ ఆలయ నిర్మాణమున వివిధ వంశములకు చెందిన రాజులు, సేనాధిపతులు, దండనాయకులు వారి వారి భక్తనుసారము ఆలయ నిర్మాణముతో బాటు అద్భుత శిలాపోషణ గావించి జన్మలను చరితార్థము చేసికొనిరి ఆలయములు మొదటినుండి భక్తికి తావలము లగుట యేగాక శిల్ప సంగీత, నృత్యాది వివి౹ ౹ కళల కాటపట్టులై భారతీయ సంస్కృతిని పరిరక్షింప జేసినవి

మానవుడు ఆకారముతో నున్నాడు కావున నిరాకారుడైన భగవంతునకు ఒక ఆకారమును కల్పించుకొని, పూజించుట సహజము, అవసరము మానవులందరు ఉన్నతస్థాయిలో నుండరు కొందరు నిరాకారోపాసన చేయుదురు, మరికొందరు సాకారోపాసన ద్వార తుదకు నిరాకార గమ్యమును చేరుకొనుచుందురు ఏది యేమైనను అన్నిటికి మూలము దైవభక్తియే - దేవాలయాలు - అందలి విగ్రహములు ఇంచు మించు సాకారోపాసనకే సాధనలని చెప్పవచ్చును

ఇది యిట్లుండగా భగవంతుడు సర్వవ్యాపకుడుగాదా! మరి దేవాలయములేల? అని కొందరనవచ్చును దీనికి పైననే చెప్పబడియున్నది మనుష్యులందరు ఒకే స్థాయిలోనుండ రన్నదే ఆ సమాధానము భగవంతుని సర్వవ్యాపకత్వమును నిరంతరము అనుభవించు స్థితి జీవన్ముక్తులకే సాధ్యమగును తక్కిన వారందరు అంతంత మాత్రము చేత తృప్తిపడుచుందురు వారు కొంత సమయమును లౌకిక కార్యక్రమముల కొరకు, మరికొంత సమయమును భగవత్కార్య క్రమముల కొరకు కేటాయింతురు ఇట్టి వారి కొరకే దేవాలయములు, అందలి విగ్రహములు ఏర్పడినవి అనగా వీరుసైతము ఇంక పెరగ వలసినవారే యన్న మాట!

మనుష్యులలో మూడు తెగలు 1 ఉత్తములు 2 మధ్యములు 3 అధములు అధములకు భక్తి యస లుండదు వారు ప్రయత్న పూర్వకముగా మధ్యమస్థాయిని పొందవలసియున్నారు పిదప ఉత్తమ స్థాయిని పొందుదురు అట్లే మధ్యములు సైతము ఉత్తమ స్థాయిని పొందవలెను ఇంతకు ఉత్తమ స్థితి యనగా ముక్తస్థితి అనగా యోగస్థితి

దైవము కూడ భక్తుల అభీష్టము మేరకు రూపధారణ చేయుచున్నాడు అట్లు సాకారము మధించినచో ఇట్లుండునను ఊహాయే విగ్రహము ఇవి (విగ్రహాలు) స్వయం వ్యక్తములని, దైవ ప్రతిష్ఠితములని, మానవ ప్రతిష్ఠితములని పలు విధములు, ఏమైనప్పటికి జీవుని దేహనిర్మాణ వైవిధ్యముల కంతటికి దేవాలయ

మన్నది ఒక సంకేతము మాత్రమే లోపల, బయట - స్వప్నావస్థలో, సుషుప్త్యవస్థలో భగవంతుని వ్యాప్తియున్నది అందుచేత ఏకాగ్రత కొరకు దేవాలయములు, విగ్రహములు ఏర్పడి మానవులలో ఆధ్యాత్మికాభివృద్ధిని ఆవిష్కరించు చున్నవి అట్టి ఆలయములు మానవుల మనోభిప్రాయముల మేరకు ప్రశాంత ప్రదేశములలో వెలసియున్నవి అక్కడ మనసు శాంత స్థితికి వచ్చును ఆ స్థితిలో మనసు దైవముపై లగ్నమగును

ప్రస్తుతాధ్యాయము నందలి ఆలయ విగ్రహాదుల పరమార్థము లన్నియు వక్ష్యమాణాధ్యాయమగు వైష్ణవ క్షేత్రాల ప్రశస్తికి అనుసంధేయములై యున్నవి అందుచేత ఈ అధ్యాయము లందలి సాంకేతికాంశములను, పారమార్థికాంశాలను దృష్టిలో నుంచుకొనియే వైష్ణవ క్షేత్రాల యధ్యయనము చేయుట జరిగినది

**ఆలయ దర్శనములో ఋషులు దర్శించిన పారమార్థికత -**

'దేహో దేవాలయప్రోక్తో, జీవోదేవస్సనాతనః
త్యజేదజ్ఞాన నిర్మాల్యం, సోఽహంభావేన పూర యేత్' -

పై ఋషివాగనుసారము దేహమే దేవాలయము, అందున్న జీవుడు సనాతనుఁడు, ఎన్నో జన్మల నుండి వచ్చిన 'దేహమే నేను' అను అహంకార పూరితాజ్ఞానమును తొలగజేసికొని, నేను దేహము కాదు - జీవుడు కాదు - ఆ పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపుడను అను భావమును అనుభవముతో పొందవలెను అట్టి విశిష్టమైన అనుభవమును పొందగల ప్రస్థానత్రయ సారాంశమే దేవాలయము ఇట్టి పవిత్ర జ్ఞానము నందించు దేవాలయము భారతీయ సంస్కృతిలోనే యుండుట ప్రతి భారతీయుడు గర్వింపదగినది కాని, ఈ ఆలయ సంస్కృతిలో గల యౌన్నత్యమును కొన్ని సాంఘిక కారణముల వల్ల, అజ్ఞానము వల్ల దేవాలయములు నిమిత్తమాత్రముగా నిలిచిపోయినవి అనేకులు కేవల లౌకిక సుఖముల నాశించి, దేవాలయ దర్శనము గావించుకొని తామాశించిన కోరికలు నెరవేరనిచో దేవాలయ సంస్కృతిని దూషించు ప్రమాదమేర్పడినది పరమార్థము వారికి తెలియదు పరమార్థమును కోరి నిరంతర సాధనతో దేవాలయ దర్శనము గావించుకొనినచో అట్టివారికి కల్గు అలౌకికానందము ఇట్టిదని నిర్వచించలేము అది కేవలము అనుభవైక వేద్యము అట్టి యానందము నందుటకే ఆలయ నిర్మాణము జరిగినది

ప్రస్తుతము ఆ పారమార్థికత ఆలయ నిర్మాణములో నెట్లు పొందు పరచబడినదో పరిశీలింతము

ఆగమ శాస్త్రానుసారము దేవాలయములో 1 గోపురము 2 ధ్వజ స్తంభము 3 బలిపీఠము 4 అర్థమండపము 5 ముఖమండపము 6 అంతరాళము 7 గర్భాలయము ప్రధానాంగములు

**గోపురము** - గోపురమనునది సర్వాంతర్యామి యగు విరాట్పురుషునకు పాద స్వరూపమని, కలశములు శిఖరమని పూర్వీకుల అభిప్రాయము సాధారణముగా గోపుర ద్వారములు 1,3,5,7,9 వరకుండును ఈ సంఖ్యలో అంతరార్థము మానవ శరీర నిర్మాణమునకు సరిపోగలవు

**ఒకటి సంఖ్య** - 'ఏకం సద్విప్రా బహుధా వదన్తి' అను వేదోక్తి ననుసరించి ఒకే పరబ్రహ్మ స్వరూపము బహువిధములుగా నున్నట్లు చెప్పబడినది అనగా ఒక పరబ్రహ్మ స్వరూపము సకల జీవరాశులందుండి నడిపించుచున్నది దీనినే 'ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు పోలిక' [1] అని బమ్మెర పోతన పల్కినారు ఈ విషయమే ఒక ద్వారము గల గోపురము తెలియ జేయుచున్నది

**మూడు సంఖ్య** - మానవ శరీరము - స్థూల - సూక్ష్మ - కారణములుగా, అవస్థలు జాగ్రత్త - స్వప్న - సుషుప్తులుగాను, గుణములు సత్వ, రజస్సు, తమస్సులుగాను (త్రిపుటిగా) నున్నట్లు ప్రసిద్ధము దేవాలయమునకు వెళ్ళు సాధకుడు మూడు గోపురములను చూచిన వెంటనే త్రిపుటి కలితమైనది పరబ్రహ్మమని గుర్తించవలెను మూడు సంఖ్య ప్రబోధమిది

**ఐదు సంఖ్య** - మానవ శరీర నిర్మాణమునకు ఐదు సంఖ్యతో అధిక సంబంధము కలదు పంచేంద్రియములు - పంచ భూతములు - పంచకోశాలు మొదలగునవి దీనిని బట్టి పంచ సంఖ్యా కలితమైన మహత్తర శక్తియే పరబ్రహ్మమని ఐదు గోపురాలు సూచించు చున్నవి

| పంచ భూతములు | - | పంచ కోశములు |
|---|---|---|
| పృథివి | - | గంధము |
| అగ్ని | - | రసము |
| తేజము | - | రూపము |
| వాయువు | - | స్పర్శ |
| ఆకాశము | - | శబ్దము |

**ఏడు సంఖ్య**- మానవ శరీరము సప్తధాతువులతో కూడినది అంతేగాక, షట్చక్రములు దాటి సహస్రారమును చేరుటను ముక్తి మార్గమందురు ఈ విషయమును సప్త ద్వారములు సూచించు చున్నవి

**తొమ్మిది సంఖ్య** - ప్రకృతి యంతయు నవావరణతో నిబిడమైనదని కొందరి మతము రెండవ విషయము సాధకుడు ముక్తి పొందవలెనన్న పంచేంద్రియములను - మనో బుద్ధ్యహంకార చిత్తములను దాటిన (అనగా మొత్తము 9) (5+4) గాని పరబ్రహ్మను సంధానము గాదు ఈ విషయమును నవ ద్వారములు సూచించుచున్నవి అందుకే లోకమునకు 9 సంఖ్యకు ప్రాధాన్యత హెచ్చి దేవతాపూజలతో నవరాత్ర్యుత్సవాలు ప్రారంభమైనవి అనే కాలయాలలో దసరాకు నవరాత్రులు, వినాయక చవితికి నవరాత్రులు, శ్రీరామనవమికి నవరాత్రులు, (నూతనాంధ్ర సంవత్సరాది) ఇట్లు ఆయా దేవతామూర్తులు గల ఆలయాలలో అవసరమును బట్టి వాటిని నేడు నిర్వహించుచున్నారు

**ధ్వజస్తంభము:**- ఆలయ చరిత్రలో 'ధ్వజస్తంభ' మత్యంత ప్రధానమైనది వేదస్వరూపమైన చతురస్రాకారపు టరుగు మధ్య భాగమున నిర్ణీతమైన యెత్తులో ధ్వజస్తంభ నిర్మాణము జరుగును ధ్వజ స్తంభము లేని గుడికి విలువ లేదని ఆగమశాస్త్రము వక్కాణించుచున్నది ఇది భగవంతునికి, భక్తునికి అనుసంధానము గల్గించు దివ్య ప్రతీక శరీరము నందు ఆత్మ సాక్షాత్కారమునకు సుషుమ్ననాడి వికాస మెంత యవసరమో ఆలయ దర్శనములో ధ్వజస్తంభమంత యవసరమైనది ధ్వజమును చూచిన వెంటనే గోపుర పరిజ్ఞానమును పొందిన సాధకుడు ఆత్మదర్శనమునకు ముందడుగు వేయవలెనని సూచన

ధ్వజమును నిర్మించిన గర్భాలయము వైపు కళ్ళు, గంటలు, మానవుని శరీర నిర్మాణమును సూచించుచు, ఆత్మోద్ధరణ కుపకరించు చున్నవి

స్తంభమునకు మరొక యర్థము సైతము ప్రసిద్ధముగా కనిపించుచున్నది

ఇంటి కప్పును మోయు ఆధార స్తంభము అద నేలలో ధృడముగ నాటుకొని యుండును అదే దాని బలము ఆ బలముతోనే ఆది భవనము నాశ్రయించు వారందరిని రక్షించుచుండును అట్లే పరబ్రహ్మము సర్వమున కాధారమైన ఆత్మనిష్ఠలో దైవభక్తిలో నాటుకొని యుండును అనగా దైవభక్తి రూపమైన ఆత్మ నిష్ఠవలన దైవము సైతము తమనాశ్రయించిన వారిని రక్షించును

స్తంభమువలె పరబ్రహ్మరూపమును భక్తులు తగురీతిని సేవింప వలెను చతుర్విధ పురుషార్థాలను సాధించుకొనుటకు సర్వ జీవులకు ఆశ్రయము, అవకాశము నైన ఈ జగత్తు అను దేవాలయమునకు ఆధారమైన మూలస్తంభమే సకల విశ్వ రూపుడైన దేవుడు అందుచేత అట్టి మహనీయుని ఇస్లాం పరిభాషలో కుతుబ్ - అని సైతమందురు జగత్తు అను శరీరము మూలాధారము నుండి సహస్రారము వరకున్న వెన్నెముక అనెడి స్తంభము మీద ఆధారపడి యుండును

అన్ని ఆధ్యాత్మికస్థితులను తనలో నిమిడ్చుకొన్న పరబ్రహ్మకు స్తంభము సంకేతము  నిరంతరము దైవమును సేవించిన వారికి అప్రయత్నముగా ఆ మార్గము (స్తంభము) ద్వారా యోగవిద్య (ముక్తి) సిద్ధించును

ఇట్లు స్తంభమునకు - ధ్వజస్తంభమునకు పూర్వ ఋషులు చక్కని పరమార్థమును భావించి, ఆధ్యాత్మిక గమ్యమును భావి తరములకు సుగమము చేసిరి

**బలి పీఠము**- ఆగమ శాస్త్రానుసారము ధ్వజస్తంభము దాటిన వెంటనే బలిపీఠము దర్శనమిచ్చును  అవగాహన లేని సామాజికులు దానిని జంతుబలికి పీఠముగా భావింతురు  కాని, యది పొరపాటు

ఆర్ష సందేశము ప్రకారము మానవ జీవిత పరమార్థమున కాటంకము కలిగించు కామ - క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్యములను అరి షడ్వర్గమనెడి జంతువులను సాధనా పద్ధతిలో క్రమముగా బలియిచ్చి, నిర్మల మనస్సును పొందవలెననియే యుద్దేశ్యము

పూర్వ వాసనలను బలియిచ్చుట బలిపీఠములోని యుద్దేశ్యమనియు చెప్పవచ్చును  పూర్వము మునులు తపస్సు చేయు మఠాలు, దేవాలయాలలో నుండెడివి  పండరి పురములో నిత్తి బల్యాన్నమును 'అయుతుడు' అను కప్ప ఆరగించినట్లు పాండురంగ మాహాత్మ్యము నందు కలదు  అక్కడ మునులు తమ పూర్వ వాసనలను బలియిచ్చుట జరిగెడిది  అనగా వాసనా జయ మన్నమాట

**అర్ధ మండపము**- ఇందు అధిష్ఠానమూర్తులకు సంబంధించిన వాహన మూర్తులు ప్రతిష్ఠింపబడి యుండును  సాధారణముగా ఈ వాహనములన్నియు పశుపక్ష్యాది మృగసంతతికి చెందినవే  ఈ వాహన మూర్తులన్నియు ఏకాగ్రదృష్టితో గర్భాలయము నందున్న అధిష్ఠానమూర్తిని సేవించుచుండును  సాధకునకు ఈ వాహనమూర్తులు మా వలెనే మీరు సైతము నిరంతరము, భగవంతుని యందు మనస్సు నుంచి, భగవంతుని మోయుడు, జన్మలను సార్థకము చేసి కొండని సూచించు చున్నవి

విష్ణువునకు వాహనమైన గరుత్మంతుడు చరించు స్వభావము గల వాడు  అతడు నిశ్చల భావముతో విష్ణువును దర్శించుచు, వాహనముగా సేవించు చున్నాడు  శ్రీరామునకు వాహనము హనుమంతుడు  కపి సంతతికి చెంది, చపల స్వభావముగల హనుమంతుడు రామునకు వాహనమై, గురువును మించిన శిష్యుని వలె- భగవంతునికి తగ్గని భక్తుడై- భక్తులచే విశేషముగా ఆరాధింప బడుచున్నాడు  ఇది సాధకులకు ఆలయ దర్శనములో మార్గ దర్శకము గాదా?

అమ్మవారికి క్రూరజంతువైన సింహము సైతము వాహన మూర్తియై శాంత చిత్తముతో స్వామిని సేవించి, భక్తులకు మార్గదర్శకమగుచున్నది అట్లే మూషికము సూక్ష్మజీవియైన ఎలుక జ్ఞాన స్వరూపము అది భారీ స్వరూపమగు వినాయకుని మోయుచు, లోకులచే ఆరాధింప బడుచున్నది

**ముఖమండపము**:- ముఖమండపమున సత్కథా కాలక్షేపములు, శాస్త్ర చర్చలు వేద మంత్ర పారాయణములు పూజా కార్యక్రమ విశేషములు జరుపుచు, అతిసమీపమున గల గర్భాలయములోని భగవంతునిపై మనస్సు లగ్నమగుటకు ప్రయత్నము జరుగును భగవంతునకు సర్వతోముఖుడనిపేరు గీతాదు లీ విషయమును రూఢిగా చెప్పినవి పైగా ఈ సమస్తము భగవంతునకు ముఖమేనని 'ఈశావాస్యోపనిషత్తు' చెప్పుచున్నది ముఖమునకు ఉత్తమాంగమని పేరు దేవాలయాలలోని ముఖ మండపము భగవంతుని ఉత్తమాంగమన్న మాట!

**అంతరాళము**:- ఇది భగవంతునికి భక్తునికి మధ్య గల భాగము (తెర) ఇక్కడ అర్చకుడు నిలుచుండి, భగవంతునికి భక్తుని కను సంధానము గలిగించును దీనిని గురుస్థాన మనియు నందురు

**గర్భాలయము**:- జన వ్యవహారమున దీనిని 'గర్భగుడి' యని యందురు ఇక్కడ అధిష్ఠాన మూర్తి ప్రతిష్ఠింపబడి యుండును మానవ శరీరమున గుండె యెంత ప్రాధాన్యమో, ఆలయమునకు గర్భాలయమట్టిది గుండెలో సూక్ష్మరూపమైన చైతన్య మున్నట్లే గర్భాలయములో సర్వాంతర్యామి యైన పరబ్రహ్మము ప్రతీకగా విష్ణు రామ, శివ, కృష్ణాది విగ్రహములు ప్రతిష్ఠింపఁడి యున్నవి ఈ పరబ్రహ్మ ప్రతీకలగు విగ్రహములు అర్చకుడు వెలిగించిన నేతి దీపారాధన కాంతిలో సర్వాంగ సుందరముగా రమణీయాలంకారములతో కనులకు గోచరించి, ఆనందమును గలిగించును ఆ మనోహరమైన విగ్రహమును చూచినంతనే సాధకుడు (భక్తుడు) లౌకిక విషయాలను విస్మరించి, తన్మయత్వము చెంది కనులు మూసికొని, దైవదర్శనము చేయును

కనులు మూసికొనుటలో పరమార్థమున్నది బాహ్య జగత్తులో దీపపు వెలుతురులో కనిపించు దైవ స్వరూపమే తనలో సైతము గలదని గ్రహించి, భక్తుడు పరబ్రహ్మను చూచిన వెంటనే గురువు - అను దీపము సహాయముగా నిన్ను నీవు తెలిసికొమ్మని బోధించుటలోని అంతరార్థము

**ఆలయ ప్రదక్షిణ కావించుటలోని పరమార్థము**:-

ప్రదక్షిణ యనునది గర్భాలయములోని అధిష్ఠాన మూర్తిని దర్శించిన తర్వాతగాని, ముందుగాని చేయు భక్తి పూరిత ప్రక్రియ ఇది సాధారణముగా

మూడు మారులు చేయవలెను కొందరు వారి వారి యభీష్ట కామ్యార్థమై **5-9-11-21-108** మారులు చేయుటయు కలదు కాని మూడు మారులు చేయవలెనని కారణాగమము చెప్పుచున్నది

ఎట్లనగా

'ప్రథమం లోకరక్షార్థం,
ద్వితీయం గ్రామరక్షార్థం,
తృతీయం భూత రక్షార్థం,
త్రివారం త్రి ప్రదక్షిణం '

అనగా మొదటి ప్రదక్షణము లోకమును రక్షింపు మనియు, రెండవది తాను వసించు గ్రామమును రక్షింపు మనియు, మూడవ ప్రదక్షిణము తన చుట్టున్న ప్రాణికోటిని రక్షింపు మనియు అర్థము అనగా పూర్తిగా స్వార్థబుద్ధి లేక మూడు ప్రదక్షిణలు చేసి, జీవితమును ధన్యము చేసికొమ్మని కారణాగమము చెప్పుచున్నది

అంతేగాక -

'ప్రథమం దేహరక్షార్థం,
ద్వితీయం ఆత్మ శోధనం
తృతీయం కామ్య సిద్ధ్యర్థం,
త్రి వారం త్రి ప్రదక్షిణమ్'

అని మరొక పద్ధతియు కలదు మొదటిది శరీర రక్షణ కొఱకు రెండవది ఆత్మ శోధన కొఱకు, మూడవది కోరికలను నెరవేర్చుట కొఱకు ఇట్లుచేయు పద్ధతి స్వార్థ బుద్ధులది

ఈ ప్రదక్షిణ మెట్లుండవలెనో ఆగమసార సంగ్రహ మిట్లు వర్ణించినది
'ఆసన్న ప్రసవా నారీ, తైల పూర్ణం యథాఘటమ్
దహన్తీ శనకైర్యాతి, తథాకుర్యాత్ ప్రదక్షిణమ్'

అనగా నవ మాసములు నిండిన స్త్రీ మెల్లమెల్లగా నడచినట్లుగాను, నూనె కుండను తలపై నుంచుకొన్న వారివలెను, ఎట్లు మందగమనముతో నడవవలెనో అట్లు ప్రదక్షిణ కావింపవలెనని యర్థము

అట్లు ప్రదక్షిణ సాగించి, నిర్మలమైన మనస్సుతో ఆలయ ప్రాంగణమునకు వచ్చి, గర్భాలయముపై నున్న శిఖరమును దర్శింపవలెను

శిఖరపు టంచు గోపుర ప్రాకారాది మండపములతో నిర్మించబడిన దేవాలయ భాగాల కన్నిటి కంటె ప్రధానమైనది ఆ శిఖరపు టంచులేనిది

(కలశపుకొన) ఎంత దేవాలయమైనను ప్రయోజనము లేదు అనగా సూక్ష్మమైన పరబ్రహ్మము నుండి స్థూల ప్రపంచ ముద్భవించు చున్నదనియు, ఈ స్థూలమంతయు చివరకా సూక్ష్మములోనే లయించి పోవు చున్నదనియు, గొప్ప అంతరార్థమును సాధకుడు గ్రహించవలెను ఇట్టి అంతరార్థమును సాధకుడు ఆలయ దర్శనముతో నవగాహన చేసికొని స్థూలమైన ప్రపంచమునకు ప్రాధాన్యమీయక, సూక్ష్మమైన పరబ్రహ్మయందు మనస్సును లగ్నము చేసి, జీవిత పరమార్థమును పొందవలెనను ప్రస్థాన త్రయ సందేశమును ఆలయ నిర్మాణమందు పొందు పరచిన మన ఆర్షసంస్కృతి యెంత పవిత్రమైనదో యూహించుట సత్యదూరము కాదు

దైవ దర్శనము కావించిన తర్వాత ఆలయ సంస్కృతిలోని విశిష్టతను మనసులో నింపుకొనుటకై ఆలయ ప్రాంగణమున కొలదిసేపు కూర్చొనవలెనని పెద్దలు సూచించినారు ఈ వైశిష్ట్యములను సదా జీవితములో కూడ నిలుపుకొనవలెను దేవాలయము, ప్రపంచము వేరు కాదు కనుక జ్ఞాని కంతయు దేవాలయమే ఆంజనేయాలయాలు దక్షిణ ముఖమున నుండుటకు కారణములు

**ఆంజనేయాలయాలు దక్షిణ ముఖమున నుండుటకు కారణములు:-**

1 ఆంజనేయ స్వామి ఆలయాలు అధిక శాతము దక్షిణ ముఖముననే యున్నవి శ్రీరామ కార్యార్థమై సీతాన్వేషణకై హనుమంతుడు దక్షిణ ముఖముగా వెళ్ళెను దక్షిణ దిక్కు నందున్న ద్వీపము లంకానగరమున సీతా దర్శనము చేసి కొన్నాడు స్వామి సంకల్పము నెరవేర్చి, సీతామతల్లి యొసంగిన శిరోరత్నమును తెచ్చి, శ్రీరామునకిచ్చి, స్వామి సమ్మోదకారియైనాడు ఎప్పుడో తానొనర్చిన స్వామి కార్య పరాయణత్వమును స్మృతిపథమున నుంచుకొనుటకోయన్నట్లు దక్షిణ ముఖమున హనుమంతు డున్నాడని పెద్దలందురు

2 దక్షిణ దిక్కు జ్ఞానమునకు స్థావరము పారలౌకిక జ్ఞానము నార్జించువారు ఆ వైపు కూర్చొనవలెనని పెద్దల మాట సంసార సాగరమును తరించి, జ్ఞాన రత్నమును వెలికి తీయుమని ఇది సూచించును దక్షిణమున హిందూ మహాసముద్ర ముండుట ప్రసిద్ధమే! నిష్కామ్యుడైన హనుమంతుడందుకే దక్షిణ ముఖముగా నుండుట అతడు జ్ఞానులకు సైతము గురువే [2]

దక్షిణ దిక్కు తలనుంచి, పరుండవని పెద్దలు చెప్పుటలోని యంతరార్థము జ్ఞానము తలకెక్కవలెననియే ఉత్తరము తలాపు నిషిద్ధమైనదందుకే

'మన ఏవ మనుష్యాణాం
కారణం బంధ మోక్షయోః' - అని ఆర్యోక్తి మానవుని బంధ

మోక్షములకు మనస్సు కారణము మనస్సున సంకల్ప వికల్పములు కలుగుటకు ప్రేరణ నిచ్చునవి పంచేంద్రియములు కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము - పంచేంద్రియములు ఇవి సాధారణముగా విషయములవైపు పరుగిడుచుండును మనస్సు వీటితోఁ బాటు పరుగులిడును తద్వారా జీవున కశాంతి కలుగును కావున ఇంద్రియములు మనసును ప్రేరేచిన కారణముగా అశాంతి కలుగును ఇంద్రియములు వానిపని అవి చేసికొన్నను, మనస్సు కదలక యున్నచో శాంతి కలుగును

మనస్సు చలించకుండ, పరబ్రహ్మలో లీనమగుటయే మోక్షము దానినే 'జీవన్ముక్తి' యని యందురు అట్టి జీవన్ముక్తి కలుగకుండ పంచేంద్రియాలు లౌకిక దృశ్యములపై పరుగులెత్తి, ఐదు గుఱ్ఱాల వలె పరిపరి విధముల పరిభ్రమించి, మనస్సును సంకల్ప వికల్పముల చేత కలుషితముచేసి, జీవితము నశాంతికి గురి చేయుచున్నవి

**ఘంటానాదము** - అట్టి పంచేంద్రియ తత్త్వమును నిగ్రహించి, మనస్సు నేకాగ్రము చేయుటకు చెవులకు గంట వేద మంత్రముల చేత బాహ్య శబ్దములను నిరోధించుటకు అవకాశమేర్పడుచున్నది అంతేగాక ఘంటానాదమును వినగానే యెట్టి వారికైనను భగవంతుని వైపు మనస్సు మరలును దేహములో నొకరకమైన అవ్యక్త నాదమున్నది అదే ప్రణవనాదము దానిని విన్న చాలును ఆలయము నందలి ఈ ఘంటా నాదము దేహము నందలి ఓంకార నాదమునకు ప్రేరేపకమే ఇది పరబ్రహ్మ నాద స్వరూపుడను విషయమును తెలియజేయును

'ఆగమార్థంతు దేవానాం, గమనార్థంతు రాక్షసాం

దేవతాహ్వాన లాంఛనం' - అను మంత్రమును బట్టి దేవతల నాహ్వానించుట - అనగా మంచి భావములను కలుగజేసికొనుట, రాక్షసుల నుద్వాసన యనగా దుర్గుణములను పారద్రోలుట యని యొక యర్థము కలదు

**శఠకోపము** - విష్ణు పాద స్పర్శకు ప్రతీక శఠకోపము శివాలయములో శివలింగమును స్పృశించుట కవకాశము కలదు కాని విష్ణ్వాలయమున నట్టి యవకాశము లేకుండుటచే శఠకోపము కలదు విష్ణు పాద స్పర్శా ఫలితము శఠకోపము స్పర్శచే భక్తునకు లభించును కనుక, విష్ణ్వాలయములలో శఠకోపమునకు ప్రాధాన్యత కలదు శఠ - అనగా పాపము, కోపము - అనగా తొలగజేయునది కనుక పాపములను తొలగ జేయునది శఠకోపమనుట

**విష్ణు పరివార దేవతలు**:- శ్రీ మహా విష్ణువునకు పరివారదేవతలు, విష్వక్సేనుడు, గరుత్మంతుడు, హనుమంతుడు, జయ విజయులు మొదలగు వారు

**విష్వక్సేనుడు** - దేవతలకు సైన్యాధిపతి విష్వక్సేను వైష్ణవాలయాలలో ముందుగా విష్వక్సేనునకు పూజచేసి, యా పిదప విష్ణువునకు పూజచేయవలెను విష్ణుమూర్తి కడ నున్న నిర్మాల్యమును విష్వక్సేనున కుంచ వలెననియు ఆగమ శాస్త్రము చెప్పుచున్నది

**గరుత్మంతుడు** - పక్షులకధి నాయకుడతడు విష్ణువునకు వాహనము అధిక శక్తివంతుడు గమనవేగము గలవాడతడు విష్ణ్వాలయములలో చేయు తిరునాళ్లలో గరుడ వాహన సేవకు అత్యంత ప్రాధాన్యమీయబడినది ఎన్ని వాహన సేవలున్నను, విష్ణువున కితడు ప్రీతి పాత్రుడనుట చంచలమైన వాడు స్థిరముగా నిలిచిన శుభములు పొంద వచ్చునని గరుత్మంతుడు నిరూపించు చున్నాడు

**హనుమంతుడు** - రామకార్య నిర్వహణ దక్షుడితడు స్వామిని మించిన ఖ్యాతినార్జించి, మహా భక్తుడు, మహా దేవుడుగా ప్రజలచే పూజింపబడు చున్నాడు కనుక హనుమ ద్వాహనము కూడ బ్రహ్మోత్సవాలలో చేర్చబడినది

గరుత్మంతుని, విష్వక్సేనుని, హనుమంతుని ముక్తాత్ములుగా భావింప వలసియున్నది వారు విష్ణు సేవకులు ఈ యంశము విశిష్టాద్వైతము కూడ వివరించినది

**జయవిజయులు** - వైకుంఠమున విష్ణునివాసమున ద్వార పాలకులు వీరు విష్ణువును నమ్మిన వారికి జయ విజయములు లభించును జయమనగా లౌకిక జయము, విజయమనగా పార లౌకిక విజయము అనుట సంకేతములు విష్ణువును నమ్మిన వారికి, సేవించిన వారికి జయ విజయములు సిద్ధించుననుట వీరిని చూచి, సాధకులు నేర్చుకొనవలెను వీరు తర్వాత విష్ణ్వాజ్ఞ మేరకు వైర భక్తులై తరించిరి మిత్రులై తరించుట గొప్ప కాదు

**టెంకాయ** - టెంకాయ చిప్ప వెనుక రంధ్రాలు భూత భవిష్యద్వర్తమానములు బొప్పె - పీచు - టెంక మూడును త్రిగుణములైన సత్వ రజస్తమోగుణములు కొబ్బెర తెలుపు స్వచ్ఛతకు, నిర్మలత్వమునకు జ్ఞానమునకు ప్రతీక టెంకాయలోని నీరు చంచలమైన మనస్సుకు ప్రతీక కర్మ సిద్ధాన్తము ప్రకారము టెంకాయ పూజాద్రవ్యము శరీరమే అది

**తీర్థము**- తీర్థమనగా భగవత్కైంకర్యమైన పిదప భక్తులకు మంత్ర పూరితముగ నిచ్చు విశిష్టమైన జలము ఇది సుగంధ భరితమై, నాలుకను సోకిన వెంటనే అనిర్వచనీయానందమును కలుగ జేయును దీనిలో చందనముగాని కర్పూరముగాని, తులసి దళములుగాని మిశ్రితమై యుండును 'తత్తుమిచ్ఛతి

తీర్థమ్' జీవుని తరింపజేయుట కుపకరించు పవిత్ర జలము తీర్థము తీర్థము నిచ్చునపుడు అర్చకుడు -

'అకాల మృత్యుహరణం, సర్వవ్యాధి నివారణం,

సమస్త పాపహరణం - విష్ణుపాదోదకం ఘనమ్' - అని మంత్రము నుచ్చరించును

అనగా అకాల మృత్యువు - సకల వ్యాధులు - సకల పాపములు పోగొట్టి, జీవునకు జన్మరాహిత్యమును కల్గించునది తీర్థమని యర్థము

తీర్థముగా నారికేళ నీరము (టెంకాయ నీరు) ను ఉపయోగింపరాదు ఎందుకనగా నారికేళము మానవ శరీరమునకు ప్రతీక అందలి నీరేమో చంచల మానసమునకు ప్రతీక చంచలమైన మనస్సును భగవదర్పణము చేయవలెను కనుక ఆ నీరమును తీర్థమునకు వినియోగింపరాదు ఆ తీర్థమునే తీసికొన్నచో చంచల మనస్సును తిరిగి తీర్థ రూపమున తీసికొన్నట్లేయగును

**ప్రసాద పరమార్థము**:- ప్రసాదమనగా ప్రకృష్టమైన సాధన వల్ల వచ్చిన ఫలితమును పొందుట యని యర్థము దానికి మారుగ ఈనాడు దేవాలయాలలో లౌకికముగా పులిహోర - దధ్యోధనము ఇత్యాదులు ప్రసాదముగా పెట్టుచున్నారు పరమాత్మ జ్ఞాన సంపాదనయే ప్రసాదముగా తీసికొనవలెను 'నేను భగవత్స్వరూప' మను తత్వమును గ్రహించుటయే ప్రసాదమనుట అలౌకికార్థము

నిజమునకు ప్రసాదమనగా భగవదనుగ్రహము భక్తుని యెడల దేవుడు ప్రసన్నుడగుట కిదొక సంకేతము

స్వామికి నివేదనగా నుంచిన పదార్థమును అర్చకులు ప్రసాదముగా నిచ్చుట కలదు లౌకికమైన ఆ ప్రసాదమును గ్రహించి, అలౌకికమైన జ్ఞానమును గ్రహించుటకు సాధకుడు ప్రయత్నించవలెను ఫలములు - పరిపూర్ణతకు నిదర్శనము మనసును ఫలము వలె పండించుకొనవలెనని యర్థము పరమార్థ తత్వము చిత్రమైన దనుటకు చిత్రాన్నమును స్వామికి నైవేద్యముగా సమర్పించు చున్నారు

**భక్ష్యపరమార్థము**:- శనగబేడలు - చప్పని పదార్థము జీవునికి, బెల్లము - తీపి పదార్థము దేవునికి సంకేతము ఈ రెండింటి కలయికయే పూర్ణ స్వరూపము ఇట్లు పూర్ణము తయారగును పైనున్న పొరను 'ఉల్లె' యందురు అనగా పొట్టు - లేనిది అని యర్థము ఇట ఈ పదార్థములో పూర్ణమునకే

ప్రాధాన్యమనుట 'ఈశావాస్యమిదం సర్వం, తేన త్యక్తేన భుంజీథా' అను ఈశావాస్యోపనిషత్తు మంత్రమున కిది యన్వయము కుదురును ప్రపంచము ఈశ్వరమయము పై నున్న ప్రపంచమును తీసివేసి, లోపల నున్న పరబ్రహ్మమును గ్రహించుమను పై శ్లోకము పాదమును (మంత్రమును) భక్ష్యమునకు సంకేతముగా గ్రహింపవచ్చును పరమాత్మ పరిమళ భరితముగా నుండుననుటకే భక్ష్యములో సుగంధ ద్రవ్యములు వేసికొందురు

ఇది కూడ ప్రసాద వినియోగము లోనికి చెందుచున్నది నిజమునకు భక్తుడు దైవోచ్ఛిష్టమునే భుజింపవలెను భక్ష్యాదులను నైవేద్యము చేసిన పిమ్మట తదితరులకు పంచవలెను సమస్త ప్రపంచము నందంతటను ఈశ్వరుడే వ్యాపించియున్నాడు అతనిని విడిచి యెట్టి పదార్థమును సైతము తినరాదు అట్లు తినిన వానిని గీతాకారుడు కృష్ణమూర్తి 'అఘాయువు' అనెను దొంగ యనియు తిట్టినాడు కనుక భగవంతుని సర్వ వ్యాపకత్వమును చక్కగా భావించుచు, ఆలయమునందే గాక - అనుదిన జీవితము నందు కూడ తాను తినబోవు ముందు తత్పదార్థమును దైవార్పితము చేసి, అటుపై తదుచ్ఛిష్టమునే తినవలసినదిగా వేదాంత శాస్త్రములన్నియు వక్కాణించుచున్నవి

**హారతి పరమార్థము** - భగవంతుని పూజా కార్యక్రమములో చివరిది హారతి నిచ్చుట అనగా 'హారతీతి హారతి' - ప్రారబ్ధవశమున సంక్రమించిన సంచితాది పాపములను కర్పూరము వలె త్వరగా హరింపజేసి, భగవత్ సాయుజ్యమును కల్పించుమని భగవంతుని కోరుటయే హారతిలోని పరమార్థము

కర్పూరము పాపమునకు సంకేతము త్వరగ నశించునది కర్పూరము కనుక మూడు పర్యాయములలో దైవ విగ్రహము చుట్టు త్రిప్పు లోపల నశించుటకై కర్పూరము నుపయోగింతురు కర్పూరము వలె త్వరితముగా పాపములను నశింప జేయుమని భగవంతుని ప్రార్థించుటకై హారతి పలకలో కర్పూరము నుపయోగింతురని పెద్దల మాట

**కొవ్వొత్తుల పరమార్థము** - దీనిని ధూపమందురు ఇది సుగంధ మిశ్రితమై యుండును లౌకికార్థమును పరిశీలించిన వివిధ ప్రాపంచిక వాసనలను అనుభవించిన నాసిక కు ఈ ధూప వాసనతో భగవంతుని వైపు మనసును మరలించునట్లు చేయును (లౌకికము) 'చిదగ్ని స్వరూపః ధూపః' అను ఆత్మోపనిషత్తు వాక్యమును బట్టి భగవంతుడు తేజోరూపుడు (అగ్ని) ఆ తేజోరూపమే స్థూల సూక్ష్మ కారణములను తెలియ జేయుటకు మూడు మారులు కొది బత్తిని భగవంతుని చుట్టు త్రిప్పి పూజింతురు అనగా చిదగ్ని స్వరూపమే

పరమాత్మయని తెలిసికొనుట కూడ బిక్షుల నుపయోగింతురు (పారలౌకికము) ఇది పరమాత్మ జ్యోతి స్వరూపమని తెలిసికొనుటకే చిత్ అనగా చైతన్యము సకాలమున కదిలించువాడు పరమాత్మ అనుట చైతన్యము స్వామి సకలాంతర్యామి యనియు అర్థము

ఈ సమస్తము ఒకానొక నాటికి బూడిదయై పోవునను పరమార్థము ఈదలో దాగియున్నది అందుచేత భక్తుడు వైరాగ్యమును పెంచుకొవలెను అధ్యాత్మిక రంగములో ఈ విరాగమే మొదటి యర్హత.

**విష్ణువునకు అంకిత శిల్పాలు - ఆయుధాలు [illegible]:-**

మనసును నిగ్రహించుటకుపకరించునది విగ్రహము మనస్సు పరి పరి విధములుగా భ్రమించును అందుకొరకు విగ్రహ ప్రతిష్ఠాపనలో వారి వారి మనస్సులు నిగ్రహింపబడుటకు విగ్రహ రూపములు పలురకములుగా నున్నవి అందులకే శిల్పాలు వివిధాలయములలో వివిధ రకముల విగ్రహములను తయారు చేసి తమ ప్రతిభను చాటుకొనిరి. ఫలితముగా చతుర్భుజములు గల విగ్రహములు మూడు తలలు అంతే కాక అనేకాయుధ ధారణగల విగ్రహములు ప్రతిష్ఠించుటకు కారణము లైనవి

అట్లే భగవంతుడు సహస్ర శీర పురుషః, సహస్రాక్షః సహస్రపాత్ అను పురుష సూక్తము ననుసరించి భగవంతుడు సర్వవ్యాపకుడని అనేక శిరాలు అనేక పాదాలు అనేక హస్తాలు అతులు గలవాడని తెలియుచున్నది అందు కనుగుణముగనే శిల్పులు స్వామినట్లు తయారు చేసిరి దుష్టశిక్షణకై అనేక హస్తములతో వివిధాయుధములతో స్వామి దర్శన మిచ్చు చున్నాడనియు సమన్వయించు కొనవచ్చును భగవంతుడు బహురూపధారి అతని యిచ్ఛమేరకు ఈ సమస్తము జరుగుచున్నది అన్ని రూపములతనివే అన్ని కదలిక లతనివే ఇట్టి స్థితిలో స్థానికుల మనోభిప్రాయాల కనుగుణముగా విగ్రహము లేర్పడు చుండును

**ప్రస్థానిక ప్రభావము:** ప్రత్యక్షమైన స్థానము ప్రభావముగా గలది ప్రస్థానిక ప్రభావము గల క్షేత్రము పూర్వము ఆ స్థలములలో ఋషులు తపస్సు చేసి, ప్రశస్తి పొందిన ప్రదేశమది యగుటచే తర్వాత కొంత కాలమునకు ఇతర ప్రాంతముల నుండి వచ్చి, విగ్రహమును స్థాపించుట జరుగును అదే ప్రస్థానిక క్షేత్రము అనంతపురం జిల్లా కసాపుర క్షేత్రమట్టిది

కర్నూలు జిల్లా మిడుతూరు మండలము మునేసుల గ్రామములో వెలసిన రామాలయము సైతము ప్రస్థానిక క్షేత్రమునకు నిదర్శనమే చాల

కాలము నుండి అశ్వత్థ వృక్షము లున్న చోట నేడు రామాలయము వెలసినది ఆశీర్వాదమును గావించినది కంచి పీఠాధిపతులు జయేంద్ర సరస్వతి, విజయేంద్ర సరస్వతి యంత్రము లిచ్చినది వేణ్వానందగిరి శిష్యులు శివానందగిరి (కర్ణాటక) వారి ప్రేరణతో నేడచట ప్రస్థానిక ప్రభావముగా ఆలయము వెలసినది వాల్మీకి సహిత సీతాసమేత అష్టార్థ రామాలయమది

**బొట్టు పరమార్థము:** భారతీయ సంస్కృతిలో బొట్టు అత్యంత ప్రధానమైనది బొట్టును చూచిన వెంటనే ఈతడు ఆర సంస్కృతికి సంబంధించిన వాడనునది స్పష్టమగును భ్రూ మధ్య భాగమున ఆజ్ఞా చక్రము గలదు అనేక నాడుల సమ్మేళనముతో ఈ ఆజ్ఞా చక్రస్థానము అతి పవిత్రమైనదిగా చెప్పబడినది ఇది కుమార స్వామి నివాస స్థానమని ప్రతీతి అందుచే అక్కడ బొట్టును తిలకమును విభూతిని ధరించుట సంప్రదాయము

మరొక విధముగా ముఖ సౌందర్యము నిది యినుమడింప జేయగలదు నాడుల కలయికచే వేడెక్కిన భ్రూమధ్యమున గంధముతో కూడిన బొట్టు నుంచుకొనుటవలన నరముల యుద్రిక్తత తగ్గి శరీరారోగ్య స్థితి సమస్థాయిలో నుండునని శాస్త్రవేత్తలు గూడ సమ్మతించిరి. ఆజ్ఞా చక్రము భగవత్ స్థానము అత్యంత ప్రాధాన్యము గలది సహస్రారము కంటె ముందున్న చక్రమిది ఇంత వరకు నాడులను పూరించు ప్రక్రియ యుండును ఇది నాడుల కూడలి।

**తులసి పరమార్థము:** (తులసి విశిష్టత) తులసి శబ్దమునకు పెద్దలు చెప్పిన వ్యుత్పత్తిని బట్టి దాని విశిష్టత పరమార్థము గోచరించును

తుచ్ఛీకరోతి సంసారం లాతిముక్తిం అభీప్సితామ్
సినాతి భక్తిం నృహరేః తులసీ తేన కీర్తితా

సంసార భావనను తుచ్ఛముగా భావింపజేసి, కోరిన ముక్తిని కలిగించి, అందు కవసరమైన భగవద్భక్తిని కలిగించునదిగా తులసి కీర్తింపబడినదని పై శ్లోకార్థము

విష్ణువు నర్చించుటకు తులసికి ప్రాధాన్యమీయబడినది తులసీ రహిత విష్ణ్వర్చనా నిష్ఫలా అను వాక్య మిందుకు దోహదమిచ్చును తులసి లేకుండ విష్ణువు నర్చించిన పూజ సత్ఫలిత మీయదట।

సర్వవిధ పుష్పార్చనాపేక్షయా పద్మార్చనే ఫలం శతగుణం
పద్మార్చనాత్ కోటిగుణం ఫలం తులస్యర్చనే.

తులసీ విష్ణు ప్రీతి కరీ భవతి అనియు తులసీ గ్రహణమ్ అను శీర్షికలో చెప్పబడినది సాధారణ పుష్పాల కంటె పద్మములతో విష్ణువు నర్చించిన నూరంతల ఫలిత మిచ్చును పద్మార్చన కంటె తులసిచే పూజించిన కోటి గుణ

ఫలితమిచ్చును అని తులసి పూజకు ప్రాధాన్య మిచ్చుచునే, తులసి విష్ణువునకు ప్రీతి పాత్రమనియు వివరింపబడినది

తులసిచే పూజించుటకు వీలు లేక పోయినను తులసి నామోచ్చరణము సైతము విష్ణువునకు ప్రీతి కరమగునని క్రింది శ్లోక పాదము సాక్ష్యమిచ్చును
తదభావే తులసీ నామ స్మరణంచ శ్రీ మహా విష్ణోః ప్రీతికరం భవతి

తులసీ నామ స్మరణ చేత విష్ణువు సంతోషించును కనుక తులసిని స్మరించినను విష్ణువును స్మరించినను ఫలితమొకటే

**ఉపసంహారము:**- ఇట్లు వైష్ణవాలయ విగ్రహ నిర్మాణాదులలో చెప్పదగిన పరమార్థము దాగియున్నది భక్తులు శ్రద్ధగా ఆచరించుట కంటె సత్యాంశము నెరిగి, ఆచరించి నప్పుడే సత్ఫలితము కలుగును కొన్ని గుడులు కొన్ని దిక్కులకే యుండుట కూడ పరమార్థమునే సూచించుచున్నది. చాలా వరకు పలుగుడులు తూర్పు దిక్కునకు ముఖమై యున్నవి ఎందుకనగా విష్ణువునకు సూర్యునకు అభేదము

ఇంత అపురూపమైన వాస్తువైభవ మంతయు దేవాలయములు మూలముననే లభించుననుట చారిత్రక సత్యము అలనాటి రాజర్షులు విజృంభించి గుడులను కట్టించిరి. ఇవి వారి ఆధ్యాత్మికాసక్తికి నిదర్శనము అనంతమైన శిల్ప ప్రగతి ఇంద్రియములను దమింపజేయుమని హెచ్చరించు చిత్ర జగతి ఒకటేమిటి? సృష్టి వైవిధ్యమంతయు ఆలయము మీదనే అలరారు చున్నదనుటలో సందేహము లేదు ఈనాటికి అనాటి దేవాలయాలు చెక్కు చెదరక యుండుటలో నాటి వాస్తు పురోగతి, శిల్ప ప్రగతి కనిపించుచున్నది.

వైష్ణవాలయాలలో దక్షిణకు కూడా కొంత పరమార్థము లేకపోలేదు రిక్త హస్తేన నో పేయాత్ రాజానం దైవతం గురుం అన్నది వేదము రాజ దర్శనమునకు గాని దైవ దర్శనమునకు గాని గురు దర్శనమునకు గాని వట్టి చేతులతో పోరాదట! అంతేగాక ననిష్కాణ వినా పూజ ఫలభోగాయ కల్పతే ఫలమూలంతు నిష్కామశ్నాత్, అనిష్కం నిష్ఫలంతు తత్ ఇది సైతము వేద ప్రమాణమే అనగా దక్షిణగా నాణెములు సమర్పింపనిచో అధిక ఫలిత ముండదని భావము అసలు దక్షిణ లేని పూజ ఫలించదని వేద మిచ్చిన తీర్పు సృష్టిలో సమస్తము భగవంతునిదే. మనకు సర్వము అయాచితముగా ప్రసాదించిన దానికి కృతజ్ఞతతో దైవమునకు సమర్పించు చున్నామని గుర్తించుటయే దక్షిణలోని పరమార్థము

ఇట్టి కృతజ్ఞత వల్లనే మనము తరింతుము కృతజ్ఞత లేకున్నచో సంసార సాగరమును దాటలేమని యర్థము అంతేగాక త్యాగేనైకే అమృతత్వమానశుః అను ఉపనిషద్వాక్యమును బట్టి ఒక త్యాగము వలననే ముక్తి లభించు నన్నమాట। దక్షిణాలో ఈ త్యాగ గుణము సైతము దాగియున్నది. వివేక వైరాగ్యాల సంపుటి దక్షిణాలో కల గలిసియున్నది

వైష్ణవాలయాలలోని ఆచార సంప్రదాయాలను వాని పరమార్థమును పరిశీలించి చూచినచో మానవుని మనోమాలిన్యము నవి క్షాళితము చేయుచున్నవని తెలియుచున్నది మనో నైర్మల్యమే ముక్తి కనుక దేవాలయములు ప్రధానముగా భక్తులకు సాధన నిమిత్తమేర్పడిన వనియు ఆ తర్వాత నైష్కర్మ్య స్థితి కివి దోహదము చేయుననియు చెప్పవచ్చును

## చతుర్థాధ్యాయము - ఆధారసూచికలు

1 ఆంధ్ర మహాభాగవతము ప్రథమస్కంధము 228 ప బమ్మెరపోతన
2 హనుమాన్ చాలీసా తులసీదాసు (శ్రీగురు చరణ సరోజ నిజమన ముకుర సుధారి)
3 శ్రీ నృసింహదేశికాహ్నికము అకర సూచి 81 పే భాగవతం లక్ష్మీనరసింహాచార్యులు
4 శ్రీ నృసింహదేశికాహ్నికము పే 32 భాగవతం లక్ష్మీనరసింహాచార్యులు
5 శ్రీ నృసింహదేశికాహ్నికము పే 32- భాగవతం లక్ష్మీనరసింహాచార్యులు

# పంచమాధ్యాయము

## శ్రీవైష్ణవ క్షేత్ర సాహిత్యము - సామాజిక రసదృష్టులు

### సామాజిక స్పృహ

**ఉపోద్ఘాతము:**

నిన్న మొన్నటి వరకు మానవ సమాజము అనాగరికముగాను అల్లకల్లోలముగాను సతమతమై పోయినట్లు గత చరిత్ర సాక్ష్యమిచ్చుచున్నది రాను రాను వివేకము వృద్ధిచెంది కొంతకు కొంత సంస్కరింపబడినది ఒకప్పుడు మానవ జాతిలో చెప్పతోదగిన విభజనలు లేవు. క్రమముగా అనేక వివాదము లేర్పడినవి కుల పరమైన విభజన మతపరమైన విభజన ప్రాంతీయమైన విభజన స్త్రీ పురుష విభజన ఎల్లలు పెద్దల విభజన లేర్పడినవి మానవులంద రొక్కటను చాటు మహా సిద్ధాంతమునకు క్రమముగా ప్రచారము తగ్గిపోయినది తత్ఫలితముగ నెవరికి వారు స్వార్థపరులై సమాజమునకు చీడపురుగులైనారు

ఇట్టి దుర్భర సమయమున అధ్యాత్మిక చైతన్యము తనవంతు కర్తవ్యమును నిర్వహించినది అది కలుషిత సమాజమును సంస్కరించును చీలిన మానవులను ఏకీకరింప జేయును ఏకాత్మక భావమును ప్రోద్బలంప జేయును ఇట్లు సమాజమునకు మతమునకు అనాది నుండియు చక్కని అవినాభావ సంబంధమున్నది. అధ్యాత్మిక రంగమునకు దైవ మాధారము దైవము ద్వార భక్తి భక్తి ద్వార పవిత్రత ఇట్లు అంచెలంచెలుగా మానవులలో నొక సనాతన సంస్కృతికి బీజములేర్పడును వాని ద్వార మానవ సమాజమును మృగదశ నుండి అచ్చమైన మానవ తత్వమునకు అటు పైకి దైవత్వమునకు పరిణమింప జేయునదే అధ్యాత్మిక మతము

హిందూదేశము భిన్నమతాలకు కూడలి విభిన్న సంస్కృతులకు ఆకరము పేరొంది । భిన్నత్వము లో నేకత్వమే హైందవ తత్త్వము వీనిని మనసులో నుంచుకొని భూమి పై మానవులు దేవాలయములను నిర్మించు కొన్నారు వాని యర్థము భగవంతుడు దేవాలయములో మాత్ర ముండునని కాదు నిజమున కతడు సర్వ వ్యాపి ఇవన్నియు మనసున కెక్కుటకు దేవాలయములు పకరించును అటు తర్వాత అనగా భక్తి పరి పక్వత కల్గిన మీదట సర్వాత్మ లక్షణము కల్గును ఈ లక్షణమునకు సోపానముల వంటివి దేవాలయములు కనుక వానిని మనుజులు సద్వినియోగము చేసికొనవలెను మనుష్యులు దైవ భక్తులు కావలెను భక్తులు జ్ఞానులు కావలెను జ్ఞాని స్వయముగా

దైవమే కావలెను ఇట్లు ఉత్తరోత్తర ప్రగతి కుపయోగపడునవే దేవాలయములు

మరొక్క రీతిగా పరిశీలించిన సమాజ మంతయు దేవాలయమే యగును ఈ విశాల భావము కల్గినపుడు మనుష్యులలో హెచ్చుతగ్గు లుండరాదు ఈ భావము కలగనంతవరకు అరమరిక లుండును ఒకనాడు శూద్రులకు దేవాలయ ప్రవేశ యోగ్యత లేదు మరి ఈనాడు ప్రవేశమున్నది కొన్ని దేవాలయాలలో శూద్రులే యర్చకులని యీ యధ్యాయములో మునుముందు చెప్పబడును శూద్రులే గాక స్త్రీలు సైతము అర్చకు రాండ్రుగా నుండుట మరొక శుభపరిణామము

శ్రీ వైష్ణవములో ప్రాణులందరు విష్ణు శరీరములే సమాజ మంతయు దేవాలయమైనచో ప్రాణి సముదాయమే విష్ణువు అతడే సర్వాంతర్యామి కావున మనుష్యులలో హెచ్చు తగ్గులుండ కూడదని అందరు విష్ణుస్వరూపములే యని శ్రీ వైష్ణవము పేర్కొనుచున్నది అటువంటపుడు మానవులలో నొకరెక్కువ మరొకరు తక్కువేమి? మానవులే కాదు సమస్త జీవరాశియు విష్ణు స్వరూపమే దేవాలయ నిర్మాణములోనే సమిష్టి కృషి కనిపించును అక్కడ ఐక్యత సదుద్దేశ్యము కలదు సామాజిక పరిధిలోనికి ఆధ్యాత్మిక ప్రవేశము జరిగి పోవును క్షేత్ర ప్రశస్తి యంతయు ఆలయ నిర్మాణ విధానము లోనే కనిపించును క్షేత్రమంతయు ఆహ్లాదకరముగా నున్న అక్కడి ప్రజలంత ఆనందముగ భక్తి సమన్వితముగా దేవుని సేవింతురు

ఆలయ కార్యక్రమములో సైతము మానవుల ఉత్సాహ మతి ప్రశంసనీయముగా కనిపించును సమాజములోని సకల వర్గముల ప్రజలు సైతము ఈ కార్యక్రమములో భాగ స్వాములగుదురు అది కూడ దైవ ప్రేరణయే కుల మతాది విభేదములు లేకుండ ఆలయ ప్రాంగణాలలో పంక్తి భోజనాల మయి జరుగుట మానవుల సామరస్యమునకు చక్కని నిదర్శనము అసలిట్టి అన్న సంతర్పణలు జరగవలెనన్న కొందరు ధాన్య సేకరణ కొందరు ధనసేకరణ చేయవలెను కొందరు పాకము చేయగా కొందరు నీరు తేవలెను కొందరు వడ్డించు చుండగా కొందరారగింతురు దేవాలయమును సమ్మార్జనము చేయువారు తోమాలిక సేవ చేయువారు పల్లకీని నలంకరించు వారు విష్ణు దేవునకభిషేకము చేయువారు నైవేద్యమిచ్చు వారు గ్రామోత్సవ ... చేయు వారు కీర్తించు వారు అట్లు తరించు వారు ఎందరో మరెందరో! ఇట్లు సమాజమంతయు నొక ఆధ్యాత్మిక క్షేత్రముగా దర్శన మిచ్చును దీనిని బట్టి సమాజమునకు ఆధ్యాత్మిక రంగమునకు విడదీయ

రాని అనుబంధమున్న దనుట సత్యము ఇదంతయు కలిసి యొక సామూహిక సాధనగా కనిపించును

ఇట్లు దైవకైంకర్య కార్యక్రమములలో ప్రజలు చిత్త శుద్ధితో అనగా దైవార్పిత బుద్ధితో పాలొనుట కనిపించును ఇట్లు శ్రీ వైష్ణవ మతములో భక్తియే ప్రధానము కాని మానవుల పట్ల భేదాభిప్రాయము లుండవు. దేశమెంత విశాలమో కర్నూలు జిల్లా ప్రాంతము సైతమంత విశాలముగా కనిపించును అందులకు కారణము అడుగడుగున విష్ణుదేవుని ఆలయము లావిర్భవించి సంఘమున అధ్యాత్మిక పరిమళమును పంచి పెట్టు చున్నవి ఇదియే కర్నూలు జిల్లా శ్రీవైష్ణవ క్షేత్ర ప్రశస్తిగా భావింపబడుచున్నది

ప్రస్తుత వ్యాసములో ఈ విషయము పరిశీలనార్హమై యున్నది

భక్తుడు కులమతవయో లింగాతీతుడు

భక్తి సామ్రాజ్యములో నొకనాడు కులమత ప్రాంతీయ భేదాల కవకాశముండెడిది శ్రీవైష్ణవములో సైతము కొన్ని శాఖలలో ఈ పట్టింపు లుండెడివి రానురాను వివేక మభివృద్ధి చెంది, భక్తి కే ప్రాధాన్య మీయబడినది. భగవద్గీత ప్రకారము నిజమైన భక్తునకు సముదర్శన మవసరము అందుచేత శ్రీవైష్ణవ దేవాలయములో భక్తికే ప్రముఖ స్థాన మీయబడినది ఇచట కులమత ప్రాంతీయ విభేదాలు పొడసూపవు అట్లు పొడసూపిన భక్తి కుంటుపడి మానవుడు తరించు సదవకాశమును జార విడుచుకొనును

అదృష్టవశాత్తు కర్నూలు జిల్లాలోని శ్రీ వైష్ణవ క్షేత్రాలలో కులమత ప్రాంతీయ విభేదాలు క్రమముగా సన్నగిల్లినవి. భక్తులలో దైవగంధ వాతావరణమే పుష్కలముగా సేర్పడుట కర్నూలు ప్రాంతము చేసికొన్న సుకృతము. కులమతాల ప్రమేయాలు లేకుండ అందరు అనగా విప్రులైనను శూద్రులైనను - తదితరులైనను స్త్రీలైనను పురుషులైనను కొండొకచో తిర్యక్కులైనను భగవంతుని సేవించి తరించ వచ్చును ఎందుకనగా సమస్త ప్రాణులు దైవాంశ సంభూతములే ఈ విషయమునే గీతాకారుడు మమైవాంశో జీవలోకే జీవ భూత స్సనాతనః అన్నాడు కనుక భక్తి పరిధిలో అధ్యాత్మిక రంగములో మానవుల చేత కల్పించబడిన కులమతాలకు లవ లేశము కూడ అవకాశ ముండరాదు

ఇందుకు కర్నూలు జిల్లా ఆలయసాహిత్యము నుండి కొన్ని విదర్శనములు:-

1 ఉప్పుల పిచ్చయ్య శాస్త్రి రచించిన శ్రీ కర్నూరి రంగ నాయక శతకము లో

ఉ॥ జంతు సమూహమందు నరజన్మము దుర్లభ మందు పుంస్త్వ మ
త్యంత ఘనమ్ము, విప్రుడగుటంతకు శ్లాఘ్యము వాని కన్న వే
దాంత విదుండు పెద్ద పరతత్త్వ మనందగు నీ పదద్వయీ
చింతనుడంత కంటె కడు శ్రేష్ఠుడు తర్తూరి రంగనాయకా॥ (48)

అని చెప్పిన పద్యము రమణీయము సమస్త జీవ కోటిలో మానవ జన్మము గొప్పది కారణము జంతు సమూహమునకు లేని జ్ఞానము మానవున కుండుటయే అట్టి మానవులలో కూడ విప్రజన్మ శ్రేష్ఠము ఇక్కడ విప్ర జన్మమనగా ఆధ్యాత్మిక లేక దైవగంధాన్విత మైన జన్మయని యర్థము అంత కంటెను వేదాంత విదునిది మరింత గొప్ప జన్మ ఇతడే జ్ఞాని యనబడును ఈ వాక్యములను బట్టి యెవ్వరైనను జ్ఞాని దశకు చేరుకొన వచ్చునని తెలియుచున్నది వారు వారాచరించిన సత్కర్మలను బట్టి క్షుద్ర జన్మ నుండి నరజన్మకు అక్కడ నుండి విప్రజన్మకు అక్కడ నుండి జ్ఞాని దశకు అంచెలంచెలుగా చేరవలెను ఇక జ్ఞానికి భగవంతునికి భేదమే లేదు కనుక, ఆధ్యాత్మిక రంగములో సదాచరణ భక్తి ముఖ్యమను విషయమును శ్రీ తర్తూరి రంగ నాయక శతకమున ఉప్పల పిచ్చయ్య శాస్త్రి చెప్పుట మెచ్చుకొనదగినది.

2 డోన్ రామచంద్ర రావు రచించిన కౌలుట్ల చెన్నకేశవ స్వామి శతకములోని భక్తుడు కౌలుట్ల యాదవ బాలుడు అతడక్కడి దైవమైన చెన్నకేశవ స్వామిని మనసార సేవించి, తరించినట్లు ఈ శతకము చెప్పుచున్నది

కం॥ బహోయె నీలా లీనము
గోపాలకుడైన యెఱ్ఱగొల్లడు కౌలు
ట్లే పడసెను మోక్షంబును
కాపాడుము మమ్ము శౌరి! కౌలుట్ల హరీ! (81 వ పద్యము)

పై పద్యము ద్విజులే గాక పదితరులును వయో వృద్ధులే గాక బాలుడైనను భక్త్యతిశయమును బట్టి ప్రాగ్జన్మ సంస్కారమును బట్టి జీవిత పరమావధిని పొందునను సామాజికాంశము వివరింపబడినది.

3 మార్కాపురము చెన్నకేశవ స్వామి ఆలయములోను సామాజికత కనిపించును మారిక పాలు పెరుగునమ్ము యాదవ వనిత ఆమెకు కలలో కనిపించిన స్వామి ఆదేశము మేరకు పుట్టలో నున్న స్వామికి ప్రతి రోజూ పాలు పోసెడిది భర్త యత్త మామల వేధింపు తర్వాత స్వామి కలలో కనిపించి, చెప్పినట్లు ఆమె దాటి వెళ్ళు కుండి కానదిలోని ఎడికెడు ఇసుకను ధాన్యపు గాదెలో వేయు చుండగా అది యొకనాడు సువర్ణముగా మారినది. ఆ

బంగారముతో స్వామి గర్భాలయము అంతరాలయము నిర్మింపబడినది తత్ఫలితముగా ఆమె మూలవిరాట్టు స్థాన మాక్రమించినది సూక్ష్మముగా పరిశీలించిన నేటి గ్రామములలో వెలసిన క్షుద్ర దేవత వంటిదే యీ మహిళ కనుకనే, ఆమెకు ఆమె భర్తకు అనగా మారికా మారకులకు చెన్నకేశవ స్వామి మూల విరాట్టులో పాదాల కెడమవైపున స్థానము కల్పించ బడినది

ఒక శూద్రకాంత మూల విరాట్టు స్థానము నాక్రమించుట వలననే భక్తికి, కులమునకు ముడిలేదని తెలియుచున్నది అంతేగాక జీవుని యార్తియే ముఖ్యమని తక్కిన కట్టుబాటు లేవైన నున్న నవి భక్తిని వృద్ధి చేయవలెనే గాని కుంఠింపజేయునవిగా నుండరాదని తెలియుచున్నది మారికను బట్టి ఆమె భర్త మారకుడు సైతము స్వామిలో నైక్యమై పోవుటయే గాక, స్వామి మూల విరాట్టులో స్థాన మాక్రమించుట వల్ల స్వామి అనుగ్రహ సంపాదనకు శూద్ర కులస్థులు సైతము దూరము కాబోరనుట గ్రాహ్యము

4 నృసింహ పురాణము నందు వర్ణింపబడిన ప్రహ్లాదుడు విష్ణువును ద్వేషించు తండ్రిని సైతము వ్యతిరేకించిన బాల భక్తుడు రాక్షస వంశము నందు జన్మించినను జన్మతః విష్ణుభక్తి కలవాడై ప్రత్యక్షమైన నరసింహ స్వామిని కీర్తించి తదనుగ్రహము పొందిన భాగ్యశాలి అనవరత దానశీలియైన బలిచక్రవర్తి జన్మకు పూర్వీకుడీతడు

## అర్చకులు

సాధారణముగా ఆలయార్చకులుగా బ్రాహ్మణులే యుండుట కనిపించును మరికొన్నిచోట్ల చాత్తాద శ్రీవైష్ణవులున్నారు భగవంతునికి భక్తునికి అనుసంధానమైన వ్యక్తి యే అర్చకుడు అతని ద్వార దైవ వాతావరణము భక్తునిలో ప్రవేశించి తదను భూతి పొందు అవకాశము కల్గవలెను రాను రాను అర్చకత్వ మనునది యొక వృత్తిగా మారినది అందుచే ఆస్తికులైనను నాస్తికులైనను ఇటీవల దేవాలయాలలో అర్చకత్వము నొక వృత్తిగా జీవనోపాధిగా స్వీకరించినారు ఇది హర్షణీయము కాదు కొన్ని ఆలయాలలో మహిళలు సైతమర్చకురాండ్రుగా కనిపించుచున్నారు ఇట్టి పరిణామాల వల్ల కర్నూలు జిల్లాలోనే కొన్ని విష్ణ్వాలయాలలో వారసత్వ అవారసత్వ అర్చకులు నేడు కన్పించు చున్నారు ఎక్కువ భాగము వారసత్వార్చకులే అర్చక వృత్తిని నిర్వహించు చున్నారు. ఇది రెండు విధాలుగా ఆలోచింప వచ్చును

1 భక్తి సంస్కార మనునది హఠాత్తుగా వచ్చి యూడి పడునది కాదు ఒక భక్తుని తల్లియో తండ్రియో మహాభక్తులై యున్న తప్ప తత్సంతతి భక్తి సంస్కారమునకు నోచుకొనలేదు

2 దీని కపవాదముగా ఇతరేతర । అవారసత్వ విధాల లోను భక్తులుండవచ్చు కాని వీరి సంఖ్య తక్కువ వారసత్వపు సంఖ్య యధికము ఆలయ స్వరూప స్వభావములను కుణ్ణముగా తెలిసికొను అవకాశము వారసత్వార్చకుల కుండును అంతేగాక బాల్యము నుండి మంత్రోచ్చారణా భ్యాసవశము చేత తచ్ఛక్తి ప్రకాశిత మగును ఇతరేతరులకు ఈ విద్య అంత సులభముగా లభింపదు

కర్నూలు జిల్లా లోని తర్తూరు గ్రామములో వెలసిన రంగస్వామి ఆలయములో అవారసత్వపు అర్చకులు కనిపించు చున్నారు వారందరు కాపుకులస్థులు వారికి మంత్రోచ్చారణ తెలియదు ఆలయ సంప్రదాయ విధానాలు సైతము వారికంతగా తెలియవు ఈ ఆలయ చరిత్ర యంతయు రెండు వందల యేండ్లకు మించి లేదట।

తర్తూరులో జాతరలు ఊరేగింపులు కొంతవరకు రంగస్వామి ప్రభావమును సూచించుచున్నవి నిజమున కు ఆ స్వామి గుడి యొకప్పటి కాపుకుల స్థుల గృహము ఆ గృహమునే గుడిగా మలచి, గృహస్థులే యర్చకులైన విధానమిది సుమారు 7 8 తరాల నుండి ఈ ఆలయములోని అర్చకులు కాపుకులస్థులే ఇదొక గొప్ప పరిణామము ఈ నిదర్శనము వల్ల వైష్ణవ భక్తిలో భక్తియే ముఖ్యమని తెలియుచున్నది (ఈ అర్చకత్వము క్రీ శ 2000 సం॥ ముందు వరకు మాత్రముండెను )

కర్నూలు జిల్లాలోని కడమలకాల్వ అను గ్రామమందలి శ్రీ వెంకటేశ్వరాలయములోని అర్చకుడు కూడ సాలెకులస్థుడే అతడర్చకత్వము నొకరముగా వృత్తిగా మరొకరకముగా భక్తిగాను స్వీకరించినట్లు తెలియుచున్నది. బహుశః ఆ ప్రాంతములో ద్విజులు లేకపోవుటయో మరేయితర కారణము వల్లనో ద్విజేతరులైన కులస్థులు అర్చకులుగా నుండుట కనిపించును ఏమైనను సమాజములో అన్ని కులాల వారికి అర్చకత్వములో కూడ సమాన ప్రాతినిధ్యముండవలెనను విషయమిప్పట్టున ఋజువైనది ఇటీవల నిర్మింపబడిన ఆలయాలలో నిట్టి ద్విజేతరులైన పూజారులుండుట కనిపించు చున్నది నంద్యాల సమీపములోని కానాల ( పింగళి సూరన స్వగ్రామము) గ్రామములో నిటీవల నిర్మించిన రామాలయములో అబ్రాహ్మణుడైన అర్చకుడున్నాడు. అందుచేత మంత్రోచ్చారణాదులు గాని తీర్థాచమనాదులు గాని సంప్రోక్షణాదులు గాని దాదాపు ఇక్కడ లేకపోవచ్చు ఏమైనను బీహారు రాష్ట్రమునందలి నిక్కడ సైతము ఒక శూద్రుడర్చకుడుగా వ్యవహరించుట చెప్పదగిన పరిణామము ఒకప్పుడు దేవాలయ ప్రవేశ యోగ్యత లేని శూద్రులీనాడు దేవాలయార్చకులుగా నుండుట యొక్క శుభపరిణామము

ఇట్లు శ్రీవైష్ణవ క్షేత్రాలలో కులమతాల పట్టింపు లేక పోవుటచే భక్తికి ధాన్యమిచ్చినట్లు స్పష్టము అగుచున్నది. అవారసత్వార్చకులు సైతము భక్తి ఱత్తులను వృద్ధి పొందించుటకొని భక్తులకు సైతము భక్తి పరిమళమును నకల్గిన, అది శుభోదర్కమే

కొలిమిగుండ్ల మండలము నందిపాడు గ్రామములోని ముకుంద .మి (చెన్నకేశవ స్వామి) గుడిలో భక్తురాలు శేషమాంబ చెలువలొసగిన ద్యమును స్వామియే గ్రహించుననె శబరిని యిట్లు గుర్తుచేసినది

చెలువ లొసంగిన వాటిని
నలమనమున సమ్మతింప వనియెద వేమో!
చెలువ యగు శబరి యొసగిన
ఫలములు గొనలేదె నంది పాటిముకుందా! (నంది పాటి ముకుంద శతకము)

స్త్రీలు నైవేద్యమొసంగినను అర్చకత్వము గావించినను స్వామి కరించును స్వామికి స్వచ్ఛమైన భక్తి కావలెను ఇదే దృఢ భక్తి పన్నిదారా రులలో నొకరైన గోదాదేవి ( అండాళ్) మీరాబాయి శబరి స్త్రీలు గారా! మాంబ అట్టిదే! కనుక భక్తి విధానములో స్త్రీ పురుష విభేదము కానరాదు ౦క అర్చకురాండ్రుగ వారుండుట విష్ణుప్రీతి కరమే

శ్రీ వైష్ణవ ఆలయములో విశేషముగానున్న వారసత్వ విధానములో చిత్యముగానున్న అవారసత్వ విధానములో శ్రేష్ఠమేదియో చెప్పలేము భక్తికి ట అగ్రతాంబూల మీయబడినది. ఒకవిధముగా పాంచరాత్ర పద్ధతి యీ నమును సమర్థించు చున్నది.

పాంచరాత్ర మనగానే బ్రహ్మనాయుడు స్ఫురించును అతడు ప్రవేశ ౦న చాపకూడు సిద్ధాంతము కుల మతాలకతీతముగను సర్వమానవ రానత్వము గాను పరిగణింప వలసి వచ్చును శైవ మతములో వీరశైవ మెట్టిదో శ్రీవైష్ణవ మతములో పాంచరాత్ర మట్టిది

నాటి అర్చకులలో వారసత్వమే ప్రముఖముగా గోచరించును వమనాది విధులన్నియు అనగా వేదోక్త విధులన్నియు పాంచరాత్రములో టింతురు ఎదప దైవము పట్ల యేకాగ్రత పవిత్రత భక్తులకు కల్గను గవంతునికి భక్తునికి వారధి వంటివాడు అర్చకుడను విధానవమును ంచరాత్రములో నున్నది. కర్నూలు జిల్లాలో గల అర్చకత్వ విధానత్రయము గారసత్వ అవారసత్వములు (స్త్రీ) ఈ శుభ పరిణామమును తెలియ యుచున్నది

**స్థానిక చరిత్రలు** సాధారణముగా ప్రతి మతము లోను వెలసిన దైవ ప్రతిష్ఠల వెనుక కొంత స్థానిక కథ దాగి యుండును ఆకథలో కొంత చారిత్రక సత్యము కూడ నిక్షిప్తమై యుండవచ్చు శైవము గాని వైష్ణవముగాని తక్కిన యే మతమైనను సరే కొద్ది గానో గొప్పగానో అక్కడక్కడ యీస్థానిక కథలకు సమీపముగా నుండును స్థానిక కథ (స్థానిక చరిత్ర) యనగా ఒకానొక ప్రత్యేక స్థలములో కొన్ని ప్రత్యేకతలను బట్టి దైవము క్షేత్రము వెలసియుండుట యన్నమాట నిజమునకు పరబ్రహ్మ సమస్త జగత్తు లోను అంతట సమానముగా వ్యాపించి యుండునని భగవద్గీత చెప్పుచున్నది ఐనప్పటికి కొన్ని కొన్ని ప్రత్యేక స్థలములలో దైవము విశేషముగా కూడ ప్రస్ఫుటమగును అట్టి స్థలములే సాధారణముగా స్థానిక కథలకు నోచుకొని యుండును

ఒక విధముగా ఈ స్థానిక కథలు జానపదుల విశ్వాసమును సూచించును సంఘములో ఆహార వస్త్ర నివాసములు స్నానశయ్యా గృహములు వ్యవసాయము ఆభరణాలు వినోదవ్యాపారములు భక్తి వంటి వ్యవహారాలతో బాటుగా ఆప్రజల విశ్వాసాలు సైతము పరిశీల నార్హములే

సాధారణ కార్యాలకే విశ్వాస మాధారము కాగా దైవ విషయమున చెప్పనేల! నాగరుల కంటె జానపదులలో ఈ విశ్వాసము హెచ్చు భక్తికి సైతము విశ్వాసమే ప్రజలాధారము శక్తివంతమైన సాముహిక విశ్వాసము నాసరాగా చేసికొని ఆయా స్థానిక కథలు రూఢికెక్కును ఒక్కొక్క మారు స్థానిక కథలలోనే సామాజికతతో బాటు చారిత్రకత కూడ ప్రకటమగును దైవ ప్రతిష్ఠల వైవిధ్యమునకును ఈ స్థానిక కథలే యధారములు శ్రీవైష్ణవములో స్థానిక కథలకు ప్రాధాన్య మెక్కువ కర్నూలు జిల్లాలో వెలసిన గొప్ప గొప్ప వైష్ణవాలయాలకు అక్కడక్కడ కొంత స్థానిక చరిత్ర కనిపించుచున్నది వానిలోని సత్యాసత్య విషయాల నటుంచిన తద్వారా ప్రజలలో భక్తి భావము పుష్కలముగా పెంపొందినదనుట సత్యము

**కోవెలకుంట్ల పాండురంగాలయము:**

13 వ శతాబ్దములో కాకతీయుల పరిపాలనా కాలమున రాజానుగ్రహ పాత్రురాలైన కోయిల అను నాట్యకత్తెయుండెడిది ఆ భక్తురాలికి కలలో పాండురంగస్వామి కనిపించెను ద్వాపరయుగములో పాండువులరణ్యవాసము చేయుచు కోవెలకుంట్లకు వచ్చినపుడు కి కి మీ దూరమున నున్న పెద్ద కోనేటిని చూచి, ధర్మరాజు పరిసర ప్రశాంత వాతావరణమునకు ముగ్ధుడై అక్కడి ప్రజలకు సాలగ్రామును బహూకరించి నాడు అనాడు ప్రజలు

సాలగ్రామమును ప్రతిష్ఠించి భక్తితో పూజించినారు కలియుగ ప్రారంభములో నచటి ప్రజలు నిర్లక్ష్యముతో సాలగ్రామమును కుంటలో వేసినారు ఆ సాలగ్రామమును కుంట నుండి తీసి పునః ప్రతిష్ఠకావింపు మని కోయిలకు పాండురంగస్వామి కలలో కనిపించి చెప్పినాడు ఆ కోయిల ఆ పుణ్యకార్యమును నిర్వహించినది

పై స్థానిక చరిత్ర భక్తజనుల హృదయాలలో భక్తిప్రపత్తులను వృద్ధి కావించుచున్నది

**కొలిమిగుండ్ల నరసింహ స్వామి ఆలయం:**

16 వ శతాబ్దములో శ్రీ కృష్ణదేవరాయ సువిశాల సామ్రాజ్యములో అపుడు హనుమంత గుండము లో సామంతరాజులుండెడి వారు హనుమంత గుండము పరిపాలించు నాయక రాజునకు విష్ణువు కలలో కనిపించి తాను కొలిమిగుండ్ల కొండ పై నరసింహస్వామిగా నవతరించు చున్నట్లు తెలుపగా నాయక రాజు స్వామికి కొండపైననే గుడిని నిర్మించినాడు బోయదొర శ్రీ రాజునాయుడు ఈ గుడి నిర్మాణమును పూర్తి చేసినాడు ఈ ఆలయ నిర్మాణములో శ్రీ కృష్ణదేవరాయులు సైతము ప్రధానభూమిక వహించెననుటకు గర్భాలయమునానుకొని యున్న దక్షిణపు గోడకు తిరుమల చిన్నా దేవులతో కూడిన కృష్ణరాయల శిల్పములే నిదర్శనము ఈ స్థానిక కథనము చిహ్నము ప్రజలకు స్వామిపై భక్తిశయమును కలిగించు చున్నది.

**కొలుట్ల చెన్నకేశవాలయము:** ఐదు వేల సంవత్సరాల పూర్వము పాండవ రాజు జనమేజయుడు సర్పయాగానంతరము దక్షిణ దేశయాత్ర చేయుచు కౌండిన్యాశ్రమమునకు వచ్చెను అచట విశ్రమించిన రాజునకు స్వప్నమున చెన్నకేశవ స్వామి ప్రత్యక్షమై తనకకు దేవాలయమును నిర్మింపుమని కోరెను అటు రాజు చెన్నకేశవ విగ్రహ ప్రతిష్ఠగావించి, ఆలయ నిర్మాణము గావించెను

అనాటి ఆ ఆలయము శిథిలము కాగా తర్వాత గొల్లపల్లెలోని కొలుట్ల యను యాదవుడు తాను కాయు ఆల మందలోని ఒక యావు క్షీర మీయక పోవుట గమనించెను అది తన పాలను ఆలయ సమీపములోని పుట్టలోనికి ఎండుచుండెను ఆ పుట్ట నుండి ఓంకారము వచ్చుటను గమనించెను అచట రాత్రి వసించిన కొలుట్లకు రాత్రి శ్రీ చెన్నకేశవ స్వామి సాక్షాత్కరించి శిథిలాలయమును పునర్నిర్మించమని కోరెను ఆ ఎదప కొన్నాళ్లకు కొలుట్ల చెన్నకేశవునిలో ఐక్యమయ్యెను నాటి నుండి స్వామి కొలుట్ల చెన్నకేశవ స్వామిగా పేరొందెను

ఈ ఆలయ ప్రాచీనత కౌలుట్ల ప్రస్తావన గలపై వృత్తాంతములు భక్తుల ఆధ్యాత్మికౌన్నత్యమునకు మిక్కిలి దోహదము చేయుచున్నవి కుల వయో భేదములు స్వామి సేవకు అవరోధము గావను విషయమును పై కౌలుట్ల వృత్తాంతము తెలుపు చున్నది

ఇట్లు కర్నూలు జిల్లాలోని వైష్ణవాలయములకు గల స్థానిక కథలన్నియు సమాజములోనికి నిరంతరము ప్రసరించుచు ప్రజలను ఆధ్యాత్మిక రంగము వైపు మరలించు చున్నవి ప్రజలెప్పుడు అధ్యాత్మిక సంచారులగుదురో అప్పుడు నిజమైన ఏకాత్మతా భావ మేర్పడును తద్వారా సమాజము చక్కబడును లేకున్నచో కల్లోలములకు గురియగును దీనిని బట్టి అధ్యాత్మిక రంగము సామాజిక శ్రేయస్సునకు మూలకారణము అని తెలియుచున్నది

**ఉత్సవాలు - ఊరేగింపులు - తిరునాళ్ళు మొ॥**

దాదాపు అన్ని మతముల లోను ఉత్సవాలు ఊరేగింపులు తిరునాళ్ళ కనిపించును ప్రత్యేక సందర్భాలలో ఊరేగింపులు మున్నగునవి అనేకా లయాలలో కనబడగా కొన్ని ప్రదేశాలలో ననుదినము ఉత్సవాలు నిర్వహింప బడుచున్నవి గర్భాలయములోని మూల విరాట్టు గాక తత్ప్రతి రూపముగా ఉత్సవ విగ్రహము మరొకటి యుండును ఆ యుత్సవ విగ్రహమును శుభ సందర్భాలలో గ్రామము పట్టణ మంతము పల్లకిలో నూరేగింతురు కొన్ని ఆలయాలలో పూర్వము ప్రతిదినము సాయంత్రము దేవగణికలు నర్తించు చుండగా నుత్సవ విగ్రహాల నూరేగించెడి వారు ఏమైనను ఈ ఉత్సవాల సందర్భముగా భక్తులలో భక్త్యుత్సాహములు ఉరకలు వేయును ఆనందమునకు సామరస్యమున కివి సందర్భములు తార్కాణములు

భక్తులు తమ అధ్యాత్మిక చైతన్యమును పారాయణ, నామజపములు ధ్యానము వంటి వ్యక్తిగత సాధనలకు తోడు ఉత్సవాలు ఊరేగింపులు తిరునాళ్ల మొ॥ సామూహిక సాధనలు కూడ మధించి పరమ శ్రేయస్సును పొందవలెను దీనినే సత్సంగము అనియు నందురు నిజమునకు సమాజ మంతయు ఒక సత్సంగమే దీనిని వ్యక్తిగతముగా గాక సమిష్టిగా తోటవలె పెంచుకోవలెను ఇట్లు ఆధ్యాత్మిక రంగములో సమున్నత స్థాయి నందు కొనుటకు విష్ణు దేవుని పేరు మీదుగా జరుగు ఉత్సవాలు ఊరేగింపులు తిరునాళ్ల మొ॥ సందర్భములన్నియు నూతనోత్తేజము నిచ్చును

కర్నూలు జిల్లాలో అనేక వైష్ణవ క్షేత్రాలలోను యుత్సవాలు నిర్వహింపబడి, చక్కని ఆధ్యాత్మిక చైతన్యమును సమాజములో కల్గించుచున్నది.

1 కర్నూలు జిల్లాలోనే గాక ఆంధ్రప్రదేశ్ లోనే ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమైన అహోబిలములో ఫాల్గుణ మాసమున జరుగు తిరునాళ్లకు వేల సంఖ్యలో భక్తులరు దెంతురు ఎగువ దిగువ అహోబిలములలో జరుగు గరుడోత్సవమునకు స్వామి వారి కళ్యాణమునకు భక్తులు విశేషముగా పాల్గొందురు రథోత్సవమున కల్లే భక్తులు హాజరై రథస్థిత స్వామిని గాంచి తమ జన్మ ధన్యమైనట్లు తన్మయులగుదురు వైకుంఠ ఏకాదశి పర్వదినము నందు ఉత్తర ద్వార దర్శనము ప్రత్యేకమైనది. ఆరోజు ప్రాతః కాలము 4½ గంటల నుండి భక్తులు ఉత్తర ద్వార దర్శనమున వేంచేసిన నరసింహ స్వామి దర్శనమును భక్తి పారవశ్యముతో చేసికొందురు ఆ తర్వాత జరుగు గరుడోత్సవము నందశేషముగా భక్తులు పాల్గొందురు నృసింహ జయంతి సందర్భమునను భక్తులు విశేషముగా స్వామిని దర్శింతురు కనుము పండుగ రోజు (జనవరి 15 వ తేది) స్వామి వారి పారువేట జరుగును ఆనాడు మొదలుకొని స్వామి వారి ఉత్సవ విగ్రహాలు (నరసింహ స్వామి ఉగ్రనరసింహస్వామి) పరిమిత గ్రామములో సంచరించునపుడు ఆయా గ్రామములో జరుగు తిరునాళ్లలో పండుగ వాతావరణము నెలకొని ప్రజలపరిమిత సంఖ్యలో స్వామి వారిని దర్శించి, సంతోషింతురు

2 అస్పరిలోని జరుగు జనార్ధన స్వామి ఉత్సవము –

ప్రత్యేకముగా చెప్పదగినది అక్కడ తెలుగు సంవత్సరాది పండుగ ఉగాది నాడు ప్రభలాగుదురు నాలుగు చక్రాలతో ఉత్సవము చేయునది రథోత్సవము రెండు చక్రాలతో నుత్సవము చేయునది ప్రభోత్సవము మధ్యలో తాత్కాలికముగా వెదురు దబ్బలతో నున్నతముగా చేయునది ప్రభ పల్లకిలో స్వామి విగ్రహము నూరేగించుట యందు పై ప్రభోత్సవము నందు అన్ని కులాల వారు కలిసి కట్టుగా పాల్గొను చున్నారు ఇట్లు అస్పరిలోని జనార్ధన స్వామి ఉత్సవాలు చక్కగా నిర్వహింపబడి, తదితర ప్రాంతాలకు కూడ వ్యాపించి, అధ్యాత్మిక చైతన్యమును కలుగ జేయుచున్నవి

3 కోవెలకుంట్ల పాండురంగ స్వామికి వైశాఖ శుద్ధ దశమి మొదలుకొని 11 రోజులు పాటు జరుగు తిరునాళ్లలో అశేష జన సమూహము పాల్గొందురు అట్లే రథోత్సవము నందును పాల్గొందురు

4 గోరంట్ల మాధవ స్వామి ఆలయమున ఫాల్గుణ బహుళ షష్ఠినాడు జరుగు రథోత్సవమునకు కొన్ని వేల మంది హాజరై ఆనంద పారవశ్యముతో రథము

నందున్న మాధవ స్వామిని దర్శించి, రథపు తాళ్ళను లాగి సంతసింతురు ఈ యుత్సవము పరిసర గ్రామ జన హృదయమును పునీతము గావించు చున్నది

5 కొలుట్ల చెన్నకేశవ స్వామి ఆలయ ప్రాంగణములో మాఘశుద్ధ పౌర్ణమి నాటి రథోత్సవమునకు శుద్ధ త్రయోదశి తెల్లవారు జామున జరుగు స్వామి కళ్యాణోత్సవమునకు అశేష జన సమూహము హాజరగుదురు ఈ యుత్సవాలు పరిసర ప్రాంతాలను గూడ ఆకర్షించుచున్నవి

6 తర్తూరు రంగస్వామి తిరునాళ్ల సందర్భమున స్వామి దర్శనము మాత్రమే గాక రైతులు తమకు కావలసిన వ్యవసాయ సామాగ్రి, ఎడ్లు కంబళ్ళు మొ॥ కూడ అమ్మకాలు కొనుగోళ్ళు సైతము చేసికొనుచున్నారు రైతుల కిట్టి సదుపాయము గోరంట్లలో కూడ లభించును

7 సుద్దమల్ల కంబగిరి స్వామి ఆలయములో ఉగాది రోజు మాత్రమే జరుగు తిరునాళ్లలో ప్రజలు భక్తి భావముతో విశేషముగా పాల్గొంటారు

సాల గ్రామము మూల విరాట్టుగా గల దేవస్థానములు కర్నూలు జిల్లా యందు కోవెల కుంట్లలో పాండురంగ స్వామి పెరవలిలో రంగనాథ స్వామి కనిపింతురు వీనికిట్లు ప్రత్యేక గుర్తింపు కలదు తిరునాళ్లను మాట స్వచ్ఛమైన శ్రీవైష్ణవ పదము తిరు అనగా శ్రీ యని యర్థము శ్రీ అనగా లక్ష్మీదేవి విష్ణుదేవుని తలంపజేయు పదమిది ఇట్టి యుత్సవాదులలో భక్తులు విశేష పూజలు జరుపుదురు వయోభేదములు లింగభేదములు కులమత ప్రాంతీయ విభేదాలిచట గోచరింపవు. ఇచట పరివ్యాప్తమైన విష్ణుభక్తి ప్రజలకు పట్టుగొమ్మ. ఇట్లు విష్ణ్వాలయాలలో ఉత్సవాదులు జరపబడి సమాజమును సామరస్యము గను సముత్తేజముగను చక్కదిద్దు చున్నవి

**పంక్తి భోజనాదులు -**

విశ్వములో సకల దానము కంటె నన్నదానమే శ్రేష్ఠమైనదని శాస్త్రము అతిథికి భోజన మిడునతని కొదవు పుణ్యమహాము యంభోజభవుడైన నెఱుగడు అని అనంతామాత్యుని భోజరాజీయము నందు అన్నదాన మహిమ గురించి చెప్పబడినది అతిథికి భోజనము పెట్టు గృహస్థునకు గలుగు పుణ్యమును బ్రహ్మయైనను తెలుపలేడని పై వాక్యార్థము సమయమునకు వచ్చిన అతిథి అభ్యాగతుడు విష్ణుసమానుడే యని పెద్దల వాక్కు.

శ్రీ వైష్ణవములో పంక్తి భోజనములను మాట తక్కువ గాను సంతర్పణమను మాట యెక్కువగాను వినిపించును సంతర్పణ విధానము

మానవ జన్మ ఇక కొందరు దైవ జన్మ ప్రారంభములో మనుష్యులు మృగత్వము నుండి మానవత్వమునకు, మానవ ప్రయత్నము చేయవలె అటుపై మానవత్వము నుండి దైవత్వము వరకు పెరుగు ప్రయత్నము చేయవలె ఇట్లు పెంచునదే భక్తి కనుక సర్వులకిది అవలంబనీయము ఇట్లు శ్రీ వైష్ణవ క్షేత్ర మాహాత్మ్యము మానవ సమాజమును ఆధ్యాత్మికముగా సముద్ధరించి ముందుకు నడిపించు ననుటలో సంశయమేమియు లేదు

# రస ధ్వని

**ఉపోద్ఘాతము:**

రసము స్థాయి విశేషము స్థాయి సమస్త ప్రాణిగతము సహృదయులలోని స్థాయి భావమును విభావాను భావాదులు ఉద్దీపింప జేయును సంచారి భావములు రసపర్యంతము సహకరించు చుండును అప్పుడు పొందు ఆనంద విశేషము పేరు రస మనబడును భరత మహర్షి అష్టరసాలుగా పేర్కొన్న శృంగార హాస్య వీరాద్భుత భయానక బీభత్స రౌద్ర కరుణము (శాంతము) లన్నియు కలిసి యొక రసానుభూతిని కలుగజేయును వీటినన్నిటిని ఖండిత రసములని చెప్పవచ్చును రసానుభూతి యొక్కటి

ఇది యిట్లుండగా భక్తి రసమగునా! కాదా! యని కొందరు ఆలంకారికులు వాదోపవాదములు చేసినారు శ్రీ కృష్ణ చైతన్య స్వామి దయానంద సరస్వతి, కవికర్ణపూరగోస్వామి రూపగోస్వామి మొదలగు వారందరు భక్తి కూడ రసమేనని దానికి గూడ విభావాను భావాదు లున్నవని సోపపత్తికముగా నిరూపించినారు.

మధుసూదన సరస్వతి యను మహానుభావుడు భక్తి యనెడి రస మింకొకటి యున్నదనియు దానికి భగవంతుడే ఆలంబన మనియు భగవత్సాక్షాత్కారమునకై భక్తుడు చేయు సాధన యందు కలుగు సుఖదుఃఖ కంఠాహర్ష నిర్వేదాదులు వ్యభిచారి భావములనియు ఇవి పరమానంద స్వరూపమగు భగవద్రతిగా పరిణమించుటకు సాధనములనియు నిర్దేశించి, భక్తికి రసత్వమును నిరూపింప బూనుకొనెను

జనప్పటికి, వాత్సల్యాదుల వలె భక్తి కూడ భావమే యనియు రసత్వ దశ దానికి లేదనియు మరి కొంద రాలంకారికులు వాదించిరి మునుపే చెప్పినట్లు సకల రసాల పరమావధి ఆనంద విశేషమే దీనినే రసమన్నారు భక్తి వలన ఇదే కలుగును కనుక ఆలంకారికులు నిర్ణయించిన అష్ట / నవ రసములలో ఈ భక్తి యిమడక పోయినను ఆనందాను భవమునకు దీని నొక

ప్రతీకాత్మకముగా చెప్పవచ్చు. అంతేగాక భగవన్మూర్తిని భక్తుడు చూచినప్పుడు కలుగు అష్ట సాత్త్విక భావము లన్నియు రసాను భవమునకు నిదర్శనములే భగవంతుడే ఆలంబనము తత్పరిసరములే ఉద్దీపనము భక్తుడు పొందు భావాలే అనుభవాలు ఇట్లు శృంగారాది రసాలకు కావలసిన సామగ్రి యంతయు భక్తి రసమునకు గూడ పుష్కలముగా కనిపించును కావున భక్తినొక ప్రత్యేకముగా కాకపోయినప్పటికిని శాంతరస పర్యవసాయిగా పరిగణింపవచ్చు తత్ఫలితముగా దైవాను భూతిని పొందవచ్చును

భక్తి రచనలో కూడ సత్కృత్తుగా కొన్ని శృంగార వర్ణనల వంటివి గోచరించును అలనాటి ఆముక్త మాల్యద పాండురంగ మాహాత్మ్యము ఇంతమేల? శ్రీ మహాభాగవతము ఈ నాటి చిటి పొటి రచనలు వీటన్నిటిలో శృంగారాదులు కనిపించుచున్నవి అంత మాత్రము చేత వీనిలో శృంగార మున్నదని చెప్పలేము

శృంగారాది వర్ణనలు సైతము భక్తి రస పోషకములని చెప్పవలసి యున్నది. అంతే గాక ప్రత్యేకముగా భక్తి శృంగారము కూడ ప్రసిద్ధము గానే కనిపించును

కర్నూలు జిల్లాలోని వైష్ణవ క్షేత్ర మాహాత్మ్యమును ఈ దృష్టిచేతనే పరిశీలించుట జరిగినది సాధ్యమైనంత వరకు భక్తిరస సందర్భాలను పరిశీలించితిని అటనట నిక్షిప్తమైన సామాజిక స్పృహను రస స్పృహను లభించిన లఘుకృతుల మేరకు ఆవిష్కరించితిని

ఇట్లు శ్రీవైష్ణవ క్షేత్ర మాహాత్మ్యమును భక్తిరస శాంతరస గమ్యముగా మరలింపజేయుప్రయత్నము చేసితిని అందుచేత నేటి వైష్ణవ మాహాత్మ్యము భావితరాల వారికి స్ఫూర్తి దాయకము కాగలదనుటలో అతిశయోక్తి లేదు నృసింహపురాణము రసదృష్టి, కర్నూలు జిల్లాలోని అహోబల వైష్ణవ క్షేత్రమునకు అత్యంతపురాతన చరిత్ర కలదు స్వయముగా భగవంతుడు అక్కడ నెలకొన్నట్లు శ్రీ నృసింహ పురాణము అను ఎఱ్ఱాప్రగడ కృతి సాక్ష్యమిచ్చు చున్నది వైభవమక్కడ స్వయం వ్యక్తము పరమ భక్తితో దీనిని రచించిన ఎఱ్ఱన అహోబలమును అపర వైకుంఠసీమగా నభినుతించెను ఇట్టి ఘట్టములు పఠించునప్పుడు సహృదయులలో భక్తి, భావ మాత్రముగానే గాక, రస పరిణామ దశకు కూడ పోవును ఉదాహరణకు

శ్రీహరి మందిరము నిట్లు కవి వర్ణించినాడు

ఉ॥ చుట్టును కల్పవృక్షములు, చుట్టును పుష్పలతావితానముల్
చుట్టును గేలి శైలములు చుట్టును సిద్ధరసాంబువాహానుల్

చుట్టును ఖార్జదీర్ఘికలు చుట్టును గోకిల కీరనాదముల్
చుట్టును హంసి కాగతులు సొంపెసగున్ హరిమందిరంబునన్ 1

ఇక్కడ శ్రీహరి మందిరము శాంతరసాల వాలమై యున్నది అక్కడి కల్ప వృక్షములు కేళి శైలములు ప్రవాహ తీరాలు చిగురు బావులు కోకిలలు రాచిలుకలు సన్నాయి నాదాలు రాజహంస యొయ్యారాలు ఓహో! ఒకటేమిటి! సమస్త సుర సీమయు సంతోష తరంగితమై యున్నది ఇట్టి దృశ్యములను పఠించునపుడు పాఠకుని మనసు మృదువుగా మారి పోవును శ్రీహరి మందిర ప్రశాంతత పాఠకుని మనసులో అవహించును క్రమముగా శ్రీహరిని భావన చేయు కొలది భక్తి రసము పాఠకునిలో పెల్లుబుకును

అట్లే గంధ మాదన పర్వత వర్ణన:-

ఉ॥ ఎందును పుష్పసౌరభము యెందును మందమదాళిఝుంకృతుల్
ఎందును సాంద్ర పల్లవము లెందును గోకిల కంఠ కూజితం,
బెందును విస్ఫుర త్ఫలము లెందును గోముల కీరభాషితం
బందము లయ్యె మంద మరుదంచిత చారు వనాంతరంబులన్ 2

ఇంద్రుని వీడ్కొని చని ఇందువదనలు గంధ మాదనములో విహరించు నప్పటి వర్ణనమది. అప్పుడే వసంతము సైతము ప్రవేశించినది ఆ పర్వత మంతయు ఎక్కడ చూచినను సువాసనయే తుమ్మెదల ఝుంకారాలే గంధ మాదన మనగా నొక యర్థము తుమ్మెద చిగురు గుబురులు కోకిల నాదాలు రసవత్ఫలాలు రాచిలుకల రాగాలు మలయ పవన వీచికలు; ఇది ఆ పర్వత దృశ్యము ఇవన్నియు చదువు నప్పటికి మనస్సు హాయిగా తేలిపోయి గంధ మాదనములో విహరించును నిజమున కిదంతయు శాంతరసము భక్తి సైతము శాంతరస పర్యవసాయియే అభినవ గుప్తుడు చెప్పినట్లుగా సమస్త రసాలకు శాంత రసమే ప్రకృతి రసము తక్కినవన్నియు వికృతులే భక్తి తత్పరిధిని దాటి శాంత స్థానమును చేరు కొనుచున్న స్థితి యిది ఇట్టి పర్వతాలన్నియు దేవతల విహార స్థలముగా భావింపవలెను అప్పుడే దైవ గంధ యుతమైన వాతావరణము కలుగు నవకాశముండును అట్లు కలుగకున్న రసాను భవము సాధ్యము కాదు

నారసింహ కపుని శ్రీహరి తన వాడి గోళ్ల చేత చీల్చిన తర్వాత సమస్త దేవతలతో పాటు ఆ దేవుని రూపమును ప్రహ్లాదుడు కూడ చూచినాడు అంతవరకు మనోనేత్రముతో చూచిన ప్రహ్లాదుడు ఇప్పుడు చర్మ చక్షువులతో గాంచు చున్నాడు శ్రీహరి దేవుడు; ప్రహ్లాదుడు పరమ భక్తుడు అందునను సత్త్వగుణ సంపన్నుడు కనుకనే పరవశించి, శ్రీ హరిని స్తుతించినాడు

ఈ వన రాసులీశుల మహీధర సప్తక మీరవిందుతా
రావిభ వంబులీ గగన మూ దిశలుండెడు నంతకాలమున్
గోవిద కీర్తనోల్లసిత ఘోషణమై భవదాత్మ భక్తి స
ద్భావ వివేక పాక జనితంబగు పేర్మి ప్రసిద్ధి నొందెడున్ 8

ఈ సముద్రములు ఈ సప్త పర్వతాలు సూర్యచంద్ర మండలాలు గగనము దిక్కులు ఇవన్నియు నీ మూలముగనే ప్రసిద్ధి నొంది, పండితుల చేత కీర్తింప బడుచున్నవి అని అర్థము ప్రహ్లాదుడీ పద్యములో శ్రీ మహా విష్ణువు సర్వ వ్యాపకత్వమును చెప్పుచున్నాడు అందులో భాగముగనే సముద్రాలు కుల పర్వతాలు మొదలైనవి మహా భాగవతములో చెప్పిన ట్లు ఇందుగలడందు సందేహము దేవుని యునికి పట్ల యుండరాదు అట్లున్న భక్తి పరిపక్వము కానట్లే అంతట వ్యాపించి యున్నాడని తెలిసికొని సేవించుటయే పూర్ణ భక్తికి తార్కాణము ప్రహ్లాదుడు పై పద్యములో చెప్పినట్లుగా దిగంతముల వరకు విష్ణు వ్యాప్తిని దర్శించినాడు అట్లు దర్శించుటకు మిక్కిలి యోగ్యత కావలెను అదే విష్ణుభక్తికి తాత్పర్యము విష్ణువనగా సర్వ వ్యాపకుడని యర్థము ఈ పద్యములో పేర్కొన బడిన వస్తువులే గాక ఈ సమస్త జగమంతయు విష్ణు దేవుని యునికి వల్లనే మనగలుగు చున్నదని యర్థము ఇట్లు ప్రహ్లాదుడు తన భక్తి భావమును చాటు కొనుచున్నాడు

శ్రీ మదహోబిలములో నరసింహస్వామి స్వయం వ్యక్తమై యున్నాడనుట సత్యము అప్పుడక్కడి వైభవమును

సీ॥ కిన్నెర గంధర్వ గీతనాదంబులు
వింత చందంబున విస్తరిల్లె
దివ్య దోః ప్రహత వాదిత్ర ఘోషంబులు
చిత్ర రూఢంబులై చెన్నుమీఱె
నమర కాంతల లసదభిన యోల్లాసంబు
లభినవ న్యాసంబు లమరఁ జేర్చె
గల్ప భూరుహ పుష్ప కమనీయ వృష్టి య
పూర్వ సౌరభములఁ, బొల్పుమిగిలె
గీ॥ ప్రమదములు నిండె భావన ప్రతిభసెఱగె
నఖిల కళ్యాణ భంగులు నతిశయిల్లెఁ

గరుణ నరసింహ దేవుండు చిరతరముగ
దగిలి శ్రీ మదహోబిల స్థాయి య్యైన [4]

అను పద్యము లో ఎఱ్ఱన పరమాద్భుతముగా వర్ణించినాడు గంధర్వ గీతాలు పలు గీతాలు - పలు వాద్యాలు దేవ కాంతల నాట్యాలు కల్ప వృక్ష కుసుమ వృష్ట వాని సౌరభాలు అహోబిలములో విస్తరిల్లినవి ఆనంద మతిశయించినది పవిత్ర కాంతులు నిండుకొన్నవి ఎక్కడ చూచినను శుభకరమైన వాతావరణమే యతిశయించినది

అహోబిలములో శ్రీ నరసింహదేవుడు శాశ్వతముగా నెలకొనుట వలననే ఇట్టి పరిణామములు జరిగినవి

ఒకరకముగా నిది దేవలోక వాతావరణము కాకున్న దేవకాంతల ప్రస్తావన యెందుకు వచ్చును ? అట్లే గంధర్వ గీతా లెందుకు వినిపించును ? కల్పవృక్షాల ప్రస్తావన కూడ యెందుకు వచ్చును కారణము నరసింహదేవుడు వచ్చుట వల్ల ఇవన్నియు వచ్చెనని యర్థము కావున నరలోకము సురలోక మగుట యన్న నిట్టిదే

ఇటుల ఎఱ్ఱాప్రగడ రచించిన నృసింహ పురాణము ఒక భక్తిరస క్షేత్రముగా చెప్పవచ్చును అదే అహోబిలము కర్నూలు జిల్లాలో నిప్పటికి మరెప్పటికి వన్నె వాసి తరగని వైష్ణవ క్షేత్ర రాజముగా అహోబిలము కీర్తింపబడుచున్నది. నృసింహ పురాణమును చదివిన అహోబిలమును తిలకించిన కల్గునది భక్తి రసానందమే కనుక రసమన్నది విడిగా గాక తదను భవములో నుండును భక్తి సైతము ఒక దివ్యాను భవము గనుక రసస్థాయినే చేరుకొనును ఈ విషయములో నెవరి యనుభవము వారికి ప్రమాణము

శ్రీ కర్తారి రంగనాయక శతకము రసదృష్టి

ఉ॥ రంగదనంతగ ప్రభు తరంగ, రమా హృదయార వింద సా
రంగ శరాహతాన్యత కు రంగ సరోజ భవాండ కేళికా
రంగ దయా సుధారస తరంగ మనోజ్ఞనివాస భూత శ్రీ
రంగ నినున్ భజింతు దనరంగను కర్తురి రంగనాయకా ! [5]

అని ఉప్పల ఎచ్చయ్య శాస్త్రి కర్తారి రంగనాయక శతకములో శ్రీ రంగనాయకుని తనివి తీర వర్ణించినాడు శ్రీ రంగనాయకుడనగా శ్రీ విష్ణువని యర్థము. పురాణములలో పేర్కొను విశేషణాలతోనే స్వామిని సంబోధించుచు, తనకు గల భక్తి ప్రపత్తులను చాటుకొన్నాడు కవి.

గరుడ వాహనుని, రమాహృదయారవిందుని సంబోధించుటలో శ్రీ మహా విష్ణువునకు గల గరుడ వాహన రంగ ద్వేగము లక్ష్మీదేవి తోడి తనకు గల అనురాగము ప్రకట మగుచున్నది ఈ సమస్త బ్రహ్మాండ మంతయు శ్రీ విష్ణువునకొక కేళీ రంగ మనుట అద్భుతముగా నున్నది నిజమునకు శ్రీరంగము వంటి వైష్ణవ క్షేత్రాలు ఈ యర్థముతోనే వెలసియున్నవి శ్రీ విష్ణువునకు రంగస్థలమని యర్థము ఒక శ్రీరంగమే గాక యీ సమస్త జగత్తు శ్రీ విష్ణువున కొక కేళీ రంగ మట! ఇదొక చక్కని వేదాంత భావన! దయా సుధారస తరంగమని సంబోధించుటలో తన మనః కమలము వికసించినదని చెప్పుట వల్ల తత్ప్రశస్తి ప్రకట మగుచున్నది. ఇవన్నియు కేవల సంబోధనలు గాక భక్తి పార వశ్యముతో పలికిన పలుకులు

ఆముక్త మాల్యదలోను మను చరిత్రములోను దశావతార స్తోత్రము లున్నవి అక్కడ రఘుకుల స్వామి! రమా వల్లభా! అని రెండు సంబోధనలున్నవి ఈ సంబోధనలలో భక్తి పారవశ్యము స్పష్టముగా కనిపించు చున్నది స్వామీ! లోని దైర్ఘ్య మిందుకు తార్కాణము రమా వల్లభా! అను సంబుద్ధి తరచు శ్రీ వైష్ణవములో వాడబడునదే అట్లే యిచ్చట సైతము రమా దేవిని విడిచి యుండలేని విష్ణు వైఖరి పై పద్యములలో కనిపించును ఇట్లు శ్రీ తర్పూరి రంగనాయక శతకములోని పద్యము లన్నియు భక్తిరస పరి పూరితములై యలరారు చున్నవి

తరచు శృంగార రసస్ఫోరకమైన సంబుద్ధులుండుట వల్ల అవన్నియు శృంగార రసమునకు సంబంధించిన వనరాదు అవి సైతము భక్తి శృంగారములోనే పర్యవ సించును

**దైవంబున్న వేంకటేశ్వర శతకములో రసపద్ధతి -**

ఉ॥ మల్లెలు మొల్ల లబ్జములు మాదగు పల్లెల లేవు భక్తి సం
ఫుల్లము నుల్ల మిత్తుము సముల్ల సితాత్మకమున్ సుదాముపై c
జల్లిన సత్కృపా మృతము జల్లగ మాపయి గొంత జల్లుము
దుల్లలి తాత్మ! యో వరద! దైవము దిన్నియ వేంకటేశ్వరా ॥

సృష్టిలో సమస్తము భగవంతునిదే. ఆయనకు ప్రత్యేకముగా మన మీయ దగిన వస్తువేదియు వాస్తవమునకు లేదు అందుచేతనే శివానందలహరిలో భౌతిక పుష్పాలను భగవంతునికి సమర్పించుట వెఱ్ఱిగా చెప్పబడినది నిజమునకు సమర్పింప వలసినది హృదయ పుష్ప మట! దానితో బాటు అహింస యొక పుష్పము సత్యమొక పుష్పము శౌచమొక పుష్పము ఇట్టి వాయనకు మనము నిజముగా సమర్పింప వలసిన పుష్పాలు అంతేకాని భౌతిక పుష్పాలు కావు

దైవందిన్నె వేంకటేశ్వర శతకములో సైతము ఆ విధానము కొంతవరకు 'చరించును ఒక విధముగ నిది ఆత్మార్పణ భక్తికి సంబంధించినది తిన్నడే లిచ్చినాడు ? అట్లే యీ కవి సైతము పల్లెటూరైన దైవం దిన్నెలో మల్లె పూలు ని, మొల్ల పూలు గాని కమలాలు గాని అవేవి యిక లేవట। హృదయ పద్మమునే మర్పింతురట। అందుకు సుదాముని కథను ఉపబలకముగా తీసికొన్నాడు కవి ుదాముడు దండకుట్టి ద్వారకలో కృష్ణునికి సమర్పించినాడు తర్వాత అతనిని నుగ్రహించినాడాయన అట్టి పూలు లేని కారణమున హృదయ పద్మము క్తుననెను కవి సుదాముడు పేదవాడు దైవం దిన్నె ప్రజలు కూడ పేదలు న్ని రకాల పూలు లభింపవు అన్నిటిని మించిన హృదయ పుష్పమే శ్రేష్ఠమని వన

ఇదొక చక్కని ఆత్మార్పణ భక్తికి తార్కాణముగా చెప్పదగినది అన్ని కాల భౌతిక పుష్పాలు హృదయ పుష్పసమర్పణకే సహాయ పడును హృదయ ష్పమే సిద్ధముగా నుండ తక్కిన వానితో పని లేదని మిక్కిలి మధురముగా క్తిరస బంధురముగా చెప్పుట జరిగినది అంతేగాక భగవంతునికి కావలసినది పార్థము కాదు దాని వెనుకనున్న హృదయమే

అలనాడు దుర్యోధను ని ఆహ్వానమును మన్నింపక విదురు నింటిలో ష్ణుడు విందు కుడిచిన ఘట్ట మీ సందర్భమున స్ఫురణకు రాక మానదు ంత్తము పై దైవము దిన్నె వెంకటేశ్వర శతకములో అనేక పదాలు భక్తి రసాల లములై యలరారు చున్నవి

**ముద్దుల పల్లి వారి సత్యనారాయణ సుప్రభాతము లోని రసదృష్టి**

శాఖాబాహులి రంజలీకృత దళ శ్రేణీ కర శ్రేణి భిః
నానాసూన సుగన్ధ బన్ధుర సుమా న్యాదాయ వల్లీద్రుమాః
పూజార్థం తవ కల్పయన్తి భగవం శ్రీ సత్యనారాయణ
స్వామిన్। జాగృహి జాగృహీహ రజనీ నిర్యాత్యుషో భ్యేతిచ ⁷

ఇదొక వైతాళిక శ్లోకము ప్రకృతి యంతయు సుగంధ పూరితమైన గావులతో ఆకులతో ప్రాతః కాల మలరారు చున్నది ఇదంతయు ద్రించుచున్న సత్యనారాయణ స్వామిని స్వాగతించు చున్నట్లున్నవి అని ప్పుటలో కవిలోని రసహృదయము కనిపించును ప్రకృతి నొక స్వాగత ధనముగా చెప్పుట విశేషము కొమ్మలను బాహువులుగా చెప్పుట కూడ గున్నది వీటి యన్నింటి కంటె ముద్దుల పల్లి కవి వారి

నమామి తే దివ్య పదాంబుజ ద్వయం
పిబామి తే నామకథా సుధారసమ్,

స్మరామి తే దివ్య చరిత్ర చిత్రణం
సమాదరా త్కృత్య విభో! ప్రసీదమే - [5]

అను శ్లోకములో భావ మత్యద్భుతముగా నున్నది స్వామి పాద పద్మాలకు నమస్కరించు చున్నాననియు ఆయన నామామృత సుధారస పానము చేయుచున్నాననియు స్వామి చరిత్రను స్మరించు చున్నాననియు కవి పలికినాడు అట్లు చెప్పుచు స్వామి తనకు ప్రసన్నుడు కావలెనని వేడుకొను చున్నాడు ఇది సైతము చక్కని భక్తి పార వశ్యమునకు మచ్చుతునక నిజమైన భక్తుడు ఆయననే కీర్తించును ఆయనను గురించియే చింతించును ఆయన నామమునే జపించును దీనినే యుక్త చేతస్సు అని యందురు కవియే చెప్పినట్లు ఆ దేవుని నామసుధారస పానము చేయు చున్నట్లు తెలియుచున్నది

అంతయు కలిసి భగవత్పరమైన భావయే కనుక శాంతరస పర్యవసాయియై విలసిల్లు చున్నది. శాంతములో నిమిడి పోని రసము లేదు అదే మోక్ష ధామమునకు గూడ దోహదము చేయు చున్నదని అభినవ గుప్తుని సిద్ధాంతము భక్తిరసములో నిందుకు సందేహమే లేదు పై శ్లోకాలలోని భక్తి పారవశ్య మిట్టి మోక్షాను భూతిని కలిగింపజేయుచున్నది

డోన్ రామచంద్రరావు కౌలుట్ల చెన్నకేశవ శతకము ను ద్రోణాద్రి మరున్నందన శతకము ను రచించెను రెండు శతకములు కంద పద్యాత్మక ములేయైనను కవిలోని భక్తి భావ వేగమునకు ఈ ఛందము బాగుగా నుపకరించినది కౌలుట్ల చెన్నకేశవ స్వామి శతకములో యాదవ బాలుని సంఘటన వంటి వాని నుదహరించి, అటు సామాజికతను ఇటు భక్తి రసమును పోషించినాడు కవి. ఇట్లు దాదాపు ఈ రెండు శతక పద్యములు భక్తి రస గుళికలు గానే కనిపించును

అట్లే శ్రీ మద్దులేటి నృసింహ తారావళి లో రచయిత మద్దిలేటి ఆంధ్రనాయక శతకమును స్ఫురింప జేయు సీస పద్యాలను రచించినాడు నృసింహ స్వామిని రూప వర్ణన చేయుట - ఆయన దివ్య గాథల నాలపించుటకు సీస పద్యాలు బాగుగా తోడ్పడినవి భగవల్లీలాను భూతులనిట్లు గానము చేయుట స్ఫురించుట నుతించుట వంటి సాధనాల ద్వారా ముక్తి నవలీలగా పొందవచ్చు. బ్రహ్మావిత్ బ్రహ్మైవ భవతి అన్నట్లు భక్తిమయ సాధన ద్వార జీవుడు దేవుడగును ప్రస్తుత తారావళి (27 పద్యాలు) లోని సీస పద్యాలు అట్టి సాధనా విశేషములని చెప్పుటలో సందేహము లేదు

**ఉపసంహారము**

కర్నూలు జిల్లాలోని వైష్ణవ క్షేత్రాలకు సంబంధించిన సాహిత్యము చెప్పుకోదగినదిగా నున్నది. ప్రాచీన సాహిత్యములో నృసింహ పురాణ మిందుకు తలమానికముగా నున్నది ఇటీవల వెలసిన శ్రీ కస్తూరి రంగనాయక శతకము, దైవం దిన్నె వేంకటేశ్వర శతకము శ్రీ సత్యనారాయణ సుప్రభాతము కొలుట్ల శ్రీ చెన్నకేశవ శతకము శ్రీ మద్దులేటి నృసింహ తారావళి ఇంక ఎన్నో చిరు రచనలు వెలసిన ఆయా స్థల విశేషాలలో కొలువై యున్న స్వామి మహిమలను వేనోళ్ళ చాటు చున్నవి పాఠకులు వాని నన్నిటిని భక్తి సంస్కారముతో చదివి తద్గతమైన భగవదను భూతిని పొందవలసి యున్నది.

భక్తి భావ మాత్రముగనే గాక రసదశకు గూడ చేరునని భక్తి రసవాదు లందురు చెప్పిరి ఐనను దీనిని ( భక్తిని) శాంతరస పర్యవసాయిగా నంగీక రించుటకు వెనుకంజ వేయ నక్కరలేదు మోక్షమనునది ఆకాశములో గాని పాతాళములో గాని వీపు వెనుక గాని ఇట్లు ఎక్కడో యున్నది కాదు మోక్ష మనగా మనో నైర్మల్యము మోక్షో హా చేతో విమలం అని ఆర్యోక్తి ఇది సులభముగా నబ్బించునది కాదు మాలిన్యమును కడిగి వేయునది భక్తి మాత్రమే కనుక భక్తి సాధనల ద్వార భగవదను భూతిని పొందుట యనగా మోక్షానుభూతిని పొందుటయే దానినే శాంత రసమందురు మొత్తముపై శాంతరస మహా ప్రవాహమునకు భక్తిరస మొక పాయ వంటిదని చెప్పవచ్చు.

ఇట్లు కర్నూలు జిల్లాలోని శ్రీ వైష్ణవ క్షేత్ర సాహిత్యములో భక్తిరస మయమైన నాటి నేటి కృతులు విలసిల్లి తత్సాహితీ ప్రశస్తిని చాటుచున్నవి

## అధస్సూచికలు

1 శ్రీ నృసింహ పురాణము ఎఱ్ఱన 1వ ఆశ్వా 59 పద్యము
2 శ్రీ నృసింహ పురాణము ఎఱ్ఱన 2వ ఆశ్వా 62 పద్యము
3 శ్రీ నృసింహ పురాణము ఎఱ్ఱన 5వ ఆశ్వా 121 పద్యము
4 శ్రీ నృసింహ పురాణము ఎఱ్ఱన 5వ ఆశ్వా 131 పద్యము
5 శ్రీ కస్తూరి రంగనాయక శతకము 22వ పద్యము కవి: ఉప్పల పిచ్చయ్య
6 దైవందిన్నె వేంకటేశ్వరశతకము 30 వ పద్యము కవి: చెన్నారెడ్డి
7 సత్యనారాయణస్వామి సుప్రభాతము కవి: మద్దులపల్లి సుబ్రమణ్య శాస్త్రి. శ్లో సెం 9
8 సత్యనారాయణస్వామి సుప్రభాతము కవి: మద్దులపల్లి సుబ్రమణ్య శాస్త్రి. శ్లో సెం. 43

## ఉపయుక్త గ్రంథసూచి


1 అన్నమయ్య వ్యాసావళి  రచయిత  చిత్రాజు గోవిందరాజు
ముద్రణ సత్యసాయి ప్రింటర్స్ తిరుపతి. సం॥ 1988

2 అన్నమాచార్యుల అమృత వర్షిణి  వ్యాఖ్యాత  బి వి సుబ్బారావు
అన్నమాచార్య ట్రస్టు హైదరాబాదు సం॥ 1987

3 అభినందన బృందావని మరియు అభినందన సుప్రభాతం
కలుగోట్ల విజయాత్రేయ

4 ఆచార్య సూక్తి ముక్తావళి  పరిశీలనము  తిరునగరి శ్రీనివాస్
పద్మావతి ప్రింటర్స్, హైదరాబాదు సం॥ 1995

5 అవతార తత్త్వ వివేచన  కొత్తపల్లి వీరభద్రరావు
శివాజీ ప్రెస్, సికిందరాబాదు సం॥ 1998

6 ఆళ్వారుల దివ్యవైభవము  తిరువాయిపాటి రాఘవయ్య
తిరుపతి తిరుమల దేవస్థాన ప్రచురణ, తిరుపతి  1980

7 ఆముక్త మాల్యదా సౌందర్యము  డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు
మలయకూట ప్రచురణలు, ఫ్రీడమ్ ప్రెస్, మద్రాసు 21 సం॥ 1971

8 కొలిమిగుండ్ల లక్ష్మీనారసింహశతకము  శ్రీమతి నందిపాటి శేషమ్మ
రంగాప్రింటర్స్, ఆళ్లగడ్డ సం॥ లేదు

9 తెలుగులో వైష్ణవ క్షేత్ర మహాత్మ్యకావ్యములు  డా వి కళావతి.

10 దేవాలయములు  తత్త్వవేత్తలు  వి టి శేషాచార్యులు
తిరుమల తిరుపతి దేవస్థానములు  1985

11 నృసింహపురాణము  ఎఱ్ఱాప్రెగ్గడ

12 నుతభారతి  బోలూరి రామకృష్ణయ్య సం॥ 1970

13 నందవరీకప్రశంస  జిరాక్స్ ప్రతి సంపాదకుడు
వైద్యం వేంకటేశ్వరాచార్యులు

14 నాటి శిల్పకళా వైభవం నేటి కర్నూలు వైభవం
వార్త ప్రత్యేక అనుబంధం ఏప్రిల్ 1999

15 భుజబండ చెన్నకేశవ శతకము  లిఖిత ప్రతి
వైద్యం వేంకటేశ్వరాచార్యులు

16 భారతీయ దేవాలయములు  డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

17 భాగవత నవనీతము  డా॥ శలాక రఘునాథ శర్మ
ఏలూరు 1996  1997

18 భీమన రసాద్వైతం శ్రీ కృష్ణదేవరాయ విశ్వ విద్యాలయమునకు
డాక్టరేట్ నిమిత్తమై సమర్పితము డా॥ గోపాల్
19 భోజ రాజీయము అనంతామాత్యుడు
ఆంధ్రప్రదేశ్ అకాడమి ప్రచురణ సం॥ 1969
20 మందార మకరందాలు ప్రథమ ప్రచురణ డా॥ సి నారాయణరెడ్డి
21 మారికాపురి శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామి చరిత్ర
ఓరుగంటి వేంకట రమణయ్య సప్తగిరి ప్రెస్, మార్కాపురం. సం॥ 1990
22 ముండకోపనిషత్తు రామకృష్ణ మఠము మద్రాసు
క్రాంతిప్రెస్, మద్రాసు సం॥ 1982
23 రససిద్ధాంతము ఆంధ్రుల పరిషత్తు డా॥ టి రామకృష్ణమూర్తి
రామచంద్రా ప్రింటర్స్ గుంటూరు 3 సం॥ 1981
24 రాయల సీమ దేవాలయాలు విద్వాన్ ఆవ్వారి నారాయణ
25 విజ్ఞాన సర్వస్వము తెలుగు సంస్కృతి 4 వ సంపుటి
తెలుగు భాషా సమితి. సం॥ 1961
26 విజ్ఞాన సర్వస్వము దర్శనములు మతములు 7వ సంపుటి
తెలుగు భాషా సమితి 1962
27 విశ్వ విజ్ఞాన దర్శిని జె నరేంద్ర దేవ్ (సంపాదకుడు)
ఫోనిక్ పబ్లికేషన్స్ మారుతీనగర్ విజయవాడ సం॥ 1987
28 శకున సాస్త్రము శిఖినరసింహ శతకము
వావిళ్ల ప్రెస్ మద్రాసు 1927
29 శ్రీ పాంచరాత్ర అర్చక రక్ష శ్రీదిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు
జిరాక్స్ ప్రతి లభ్యము
30 శ్రీకేశవశతకము మాదరాజు లక్ష్మీనారాయణశర్మ. సం॥ 1979
31 శ్రీ కేశవశతము మాదిరాజు లక్ష్మి నారాయణశర్మ
చెన్నకేశవ దేవస్థానం, మిడుతూరు 1970
32 శ్రీ తిమ్మగురు లీల ప్రచురణకర్త రంగయ్య
సంపాదకత్వము వైద్యం వేంకటేశ్వరాచార్యులు
గాయత్రి ప్రచురణలు కర్నూలు సం ॥ 1998
33 శ్రీ నృసింహప్రియ మాసపత్రిక
ఫిబ్రవరి 1991 అహోబిలదేవస్థానము
అహోబిల క్షేత్ర ప్రత్యేక సంచిక

34 శ్రీ వేంకటేశ్వరుని పొరువేట  మద్దూరి రామమూర్తి
రాఘవేంద్ర ప్రెస్ ఆలూరు సం॥ 1987
35 శ్రీద్రోణాద్రి పవనకుమార శతకము – డోన్ రామచంద్రారావు
36 శ్రీ నందిపాటి ముకుంద శతకము  నందిపాటి శేషమ్మ
సత్యకీర్తి ప్రింటర్స్ అనంతపురం సం॥ లేదు
37 శ్రీశ్రీశ్రీ మద్దిలేటి లక్ష్మీనృసింహక్షేత్ర మాహాత్మ్యము
కలుగోట్ల విజయాత్రేయ రామగోపాల్ ప్రింటర్స్, నంద్యాల సం॥ లేదు
38 శ్రీమద్దిలేటి నృసింహ తారావళి  మద్దిలేటి
39 శ్రీ కౌలుట్ల చెన్నకేశవ శతకము  డోన్ రామచంద్రరావు
40 శ్రీ కౌలుట్ల చెన్నకేశవ మహాత్మ్యము – ధరణి రామచంద్రరావు
41 శ్రీ నెమలిగుండ్ల రంగనాయక మాహాత్మ్యము
పత్తి ఓబులయ్య మహేశ్వరి ప్రెస్  కర్నూలు 1988
42 శ్రీ నెమలిగుండ్ల రంగనాయక మాహాత్మ్యము
గోవిందరాజులు (అముద్రితము)
43 శ్రీమదహోబిల మాహాత్మ్యము  వీరరాఘవ సుబ్బరామకవులు
చంద్రమౌళీశ్వర ప్రెస్, కర్నూలు 1920
44 శ్రీ వేంకటేశ్వర స్తోత్రము మరియు సుప్రభాతము- రోహిణీకుమార్
45 శ్రీమదాంధ్ర మహాభాగవతము–బమ్మెరపోతన రామాటీకో ఏలూరు. సం.లేదు.
46 శ్రీసూర్యనారాయణ స్వామి దేవాలయవిశేషాలు
జె మల్లికార్జునరావు
47 శ్రీ కర్నూరి రంగనాయక శతకము  ఉప్పల పిచ్చయ్య శాస్త్రి,
పంతంగి రామకృష్ణయ్యచే ప్రచురితము 1985
48 శ్రీనిర్వచన మహాభక్త విజయాను శీలనము
డా వి డి వేంకటరమణమూర్తి యస్.కె యూనివర్సిటీకి
ఎమ్ ఫిల్ నిమిత్తమై సమర్పితము
49 శ్రీమాధవ శతకము  పేడవరం చెన్నకేశవ శాస్త్రి, జీరాక్స్ ప్రతి
50 శ్రీ వేణుగోపాల శతకము  డా॥ వేంకటరమణమూర్తి  లిఖిత ప్రతి
51 శ్రీవేంకటేశ్వర శతకము  డా॥ వేంకటరమణమూర్తి
పద్మశ్రీ ప్రింటర్స్ ఆళ్లగడ్డ 1994
52 శ్రీ రంగనాథ స్వామి వారి పెరవలి క్షేత్రపురాణము
సేపూరి యల్లమందయ్య
53 మాధవ గానామృతము – మధుసూదనాచార్యులు
ప్రచురణ, రచయిత గోరంట్ల 1992

54 శ్రీ అహోబిల మాహాత్మ్యము -
వేణుగోపాలాచార్యులు అహోబిలం.
56 శ్రీ చెన్నకేశవ స్వామి స్తుతి- మాచిరాజు శివరామరాజు లిఖిత ప్రతి.
57 సాహిత్య శిల్ప సమీక్ష - ఎంగలి లక్ష్మీకాంతం
క్వాలిటీ ప్రింటర్స్, విజయవాడ 1981
58 సూక్తి ప్రసూనాలు - తెలకపల్లి రమణమణి శర్మలు
59 సుద్దమల్ల కంబగిరి లక్ష్మీనరసింహ శతకము (గేయాలు) -
వైద్యం వేంకటేశ్వరాచార్యులు, లిఖిత ప్రతి.
60 సాహిత్య సోపానాలు డా॥ దివాకర్ల వేంకటావధాని,
పద్మావతీ ప్రింటర్స్ హైదరాబాదు 1981
61 హనుమద్వైభవము దేవులపల్లి చెంచు సుబ్బయ్య, అముద్రితము.
62. వాందూ సుతము - జటావల్లభుల పురుషోత్తం, టి టి డి- 1991
63 186 వసంతాల కర్నూలు జిల్లా ఈనాడు పత్రిక ప్రత్యేక సంచిక,
ఇంకను అనేకము ఈనాడు వార్త భూమి పత్రికల కాగితాలు

**English Books**

1 Ahobilam and Navanarasimha Shrine
Vasantha & Rama Gopal
2 The Telugu Manuscripts VII Sathakas

# అనుబంధము

అర్చకులు వైష్ణవక్షేత్రములలో వైష్ణవభక్తులు గృహములలో
ఉపయోగింపదగిన మంగళారతులు

## ఆంజనేయస్వామి మంగళాష్టకం

శ్లో॥ వైశాఖే కృష్ణ పక్షే వై - దశమీ మందవాసరే।
పూర్వాభాద్ర ప్రసూతాయ - మంగళం శ్రీహనూమతే॥

శ్లో॥ కరుణారస పూర్ణాయ ఫలపుష్ప ప్రియాయచ
నానామాణిక్య హారాయ మంగళం శ్రీహనుమతే॥

శ్లో॥ సువర్చలా కళత్రాయ చతుర్భుజ ధరాయచ।
ఉష్ట్రారూఢాయ వీరాయ మంగళం శ్రీహనుమతే॥

శ్లో॥ దివ్యమంగళ దేహాయ పీతాంబరధరాయచ।
తప్త కాంచన వర్ణాయ మంగళం శ్రీహనుమతే॥

శ్లో॥ భక్తరక్షణ శీలాయ జానకీ శోక హారిణే।
జ్వల త్పావక నేత్రాయ మంగళం శ్రీహనుమతే॥

శ్లో॥ పంపాతీర విహారాయ సౌమిత్రి ప్రాణదాయినే
సృష్టి కారణభూతాయ మంగళం శ్రీహనుమతే॥

శ్లో॥ రంభావన విహారాయ గంధమాదన వాసినే
సర్వలోకైక నాథాయ మంగళం శ్రీహనూమతే॥

శ్లో॥ పంచాననాయ భీమాయ కాలనేమి హరాయచ
కౌండిన్య గోత్ర జాతాయ మంగళం శ్రీహనూమతే॥



శ్రియః కాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్

లక్ష్మీ సవిభ్ర మాలోక సుభ్రూ విభ్రమ చక్షుషే
చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళమ్

శ్రీ వేంకటాద్రి శృంగాగ్ర మంగళాభరణాంఘ్రయే
మంగళానాం నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్

సర్వావయవ సౌందర్య సంపదా సర్వ చేతసామ్
సదా సమ్మోహనా యాస్తు వేంకటేశాయ మంగళమ్

నిత్యాయ నిరవద్యాయ సత్యానంద చిదాత్మనే
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్

స్వత స్సర్వవిదే సర్వశక్తయే సర్వ శేషిణే
సులభాయ సుశీలాయ వేంకటేశాయ మంగళమ్

పరస్మై బ్రహ్మణే పూర్ణ కామాయ పరమాత్మనే
ప్రయుంజే పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్

అకాలతత్త్వ మశ్రాంత మాత్మనా మనుపశ్యతామ్
అతృప్త్యమృతరూపాయ వేంకటేశాయ మంగళమ్

ప్రాయ స్స్వచరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా
కృపయా దిశతే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్

దయామృత తరంగిణ్యా స్తరంగై రివ శీతలైః
అపాంగై స్సించతే విశ్వం వేంకటేశాయ మంగళమ్.

స్రగ్భూషాంబర హేతీనాం సుషమావహ మూర్తయే
సర్వార్తి శమనా యాస్తు వేంకటేశాయ మంగళమ్

శ్రీవైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరిణీ తటే
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్

శ్రీమత్సుందర జామాతృ మునిమానస వాసినే
సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్

మంగళాశాసనపరై ర్మదాచార్య పురోగమైః
సర్వైశ్చపూర్వై రాచార్త్యై స్సత్కృతా యాస్తు మంగళమ్

ఇతి శ్రీ వేంకటేశాయ మంగళా శాసనమ్

## మద్దులపల్లి వారి
## శ్రీ సత్యనారాయణ స్వామి మంగళాశాసనము

దేవానా మాది దేవాయ సచ్చిదానందమూర్తయే
మంగళానాం మంగళాయ సత్యదేవాయ మంగళమ్

సాధుత్రాణవిదారాయ దుష్ట శిక్షణ కారిణే,
ధర్మసంస్థాపనార్థాయ సత్యదేవాయ మంగళమ్

సర్వ భూత స్వరూపాయ సర్వ భూతాంతరాత్మనే
సర్వేశ్వరాయ సత్యాయ సత్యదేవాయ మంగళమ్

శయనీకృత శేషాయ నేత్రీ కృతరవీందవే
పుత్రీ కృతవిరించాయ సత్యదేవాయ మంగళమ్

కర్మిణాం కర్మరూపాయ జ్ఞానినాం జ్ఞానరూపిణే,
స్వరాపవర్గరూపాయ సత్యదేవాయ మంగళమ్

బ్రహ్మణ్యాయ బ్రహ్మవిదాం శరణ్యా యాశయార్థినామ్
వరేణ్యాయ వరిష్ఠానాం సత్యదేవాయ మంగళమ్

నిర్మోహాయ నిరీహాయ నిర్గుణాయ గుణాత్మనే,
నిత్యాయ నిరవద్యాయ సత్యదేవాయ మంగళమ్

అస్తుతే మంగళం సత్యనారాయణ। స్వస్తితే పాదుకాసన్నిధౌ సన్నిధౌ
నిస్తులప్రస్తుతాప్రాకృతాకార స ద్వైభవ ప్రాభవా యాస్తుతే మంగళమ్
సత్యనారాయణ స్వామినే మంగళం మంగళం శ్రీరామాభామినీ స్వామినే,
భక్తరక్షాకృతే స్వీకృతాకారిణే మంగళం మంగళం నిత్యసన్మంగళమ్



# గ్రంథకర్త పరిచయము

## డా॥ వి.డి. వేంకటరమణమూర్తి

జననము 12-11-1952

| | |
|---|---|
| జననీ జనకులు | శ్రీమతి శేషమ్మ కీ.శే॥ డా॥ వైష్ణవ శేషయ్య |
| జనన ప్రదేశము | ఎంబాయి గ్రామము బేతంచెర్ల మం॥ కర్నూలుజిల్లా |
| విద్య | బి విద్వాన్ ఓరియంటల్ కళాశాల, తిరుపతి<br>M A శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి |
| పరిశోధన | M Phil శ్రీ నిర్వచన మహాభక్త విజయానుశీలనముపై<br>శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము, అనంతపురం<br>P hd శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము, అనంతపురం |
| వృత్తి | ద్వితీయ శ్రేణి ఆంధ్ర పండితుడుగా ZP హైస్కూలులో<br>1977-89 ప్రభుత్వ జూనియర్ కళాశాల,<br>ఎల్లగుంట్లలో తెలుగు అధ్యాపకుడిగా 1989నుండి ..... |
| ప్రవృత్తి | అష్టావధాన - శతావధాన - సహస్రావధానములలో<br>పృచ్ఛక పాత్ర వహించుట<br>TT దేవస్థానము వారు నిర్వహించు ధర్మ<br>ప్రచార పరిషత్ వారి భక్తి ఉపన్యాసములలో<br>వక్తగా పాల్గొనుట వివిధ కవి సమ్మేళనములలో<br>కవితా పఠనము చేయుట మిత్రుల కోర్కెలపై<br>ఆయా వ్యక్తులపై పద్య రచనలు వ్రాసిఇచ్చుట<br>ప్రాచీనాధునిక సాహితీ, భక్తి, వేదాంత గ్రంథ<br>పఠనము చేయుట |
| రచనలు | 1 శ్రీ వేంకటేశ్వర శతకము 2. కీర్తిశేషునికి నృత్యంజలి<br>3. నేపథ్యం (కవితా సంపుటి) |
| అముద్రితములు | శ్రీ వేణుగోపాల శతకము, అవధూత<br>శ్రీశ్రీశ్రీ కాశిరెడ్డినాయన చరిత్ర |

చాత్తాద శ్రీ వైష్ణవ మాస పత్రిక - "విపంచి"కి సీరియల్ వ్రాయుట

— వైద్యం వేంకటేశ్వరాచార్యులు